# భక్తిసుధ

## సుధాతరంగిణ్యాఖ్య
## ఆంధ్రవివరణము
## తృతీయ భాగము

మూలము :

అనంత శ్రీవిభూషిత యతిచక్రచూడామణి

శ్రీ కరపాత్రీస్వామిశ్రీచరణులు

సుధాతరంగిణి :

జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రకాశకులు :

ఆర్షభారతి - తెనాలి.

BHAKTI SUDHA TARANGINI PART-III

ప్రథమ ముద్రణము : 1997

కాపీలు : 1000



మూల్యము : 80/-

ప్రాప్తిస్థానము :

1. జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి
C/o సిహెచ్. వి. ఆర్. కె. మూర్తి,
యమ్.ఐ.జి. - 2 ఆప్లిక్ కాలనీ,
కుషయ్‌గూడ, హైదరాబాద్ - 500 062

2. ఆకెళ్ళ శివరామ బ్రహ్మంగారు, సెక్రటరీ
శ్రీ రామకృష్ణాశ్రమము
3-6-664 మేడపైన
వీధి నెం. 9 హిమాయత్‌నగర్
హైదరాబాదు - 500 029

3. హరి వేంకటేశ్వరశర్మ
శోధన్ పెయింట్స్ మేడపైన,
ఇంటి నెం. 22-4-15
కొత్తపేట, తెనాలి - 522 201

ముద్రణ :
వాణీ ఆర్టు ప్రింటర్స్,
షరాఫ్‌బజార్, తెనాలి.
ఫోన్ : 2 4 0 1 9

THIS BOOK IS PUBLISHED
WITH THE FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
UNDER THEIR SCHEME
"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

## ACKNOWLEDGEMENT

I acknowledge the permission accorded to me to translate into Telugu and publish the following books.

1. BHAKTAI SUDHA
2. BHAGAVATA SUDHA
3. RADHA SUDHA

and offer my thanks to Sri H. P. Dhanuka, Radha Krishna Dhanuka Prakasan Samsathan, Bombay, Original Publishers of the above books.

J. SUBRAHMANYA SASTRY

# సమర్పణము

ధర్మసమ్రాట్

అనంత శ్రీవిభూషిత యతిచక్రచూడామణి

శ్రీ కరపాత్రీస్వామి

నామ విశ్రుతులు

బ్రహ్మీభూత

శ్రీశ్రీశ్రీ హరిహరానంద సరస్వతీస్వామి

శ్రీచరణారవిందములకు

ఈ గ్రంథము

భక్తిశ్రద్ధాపరిప్లుత హృదయముతో

సమర్పితము.

—రచయిత



ధర్మ సమ్రాట్

అనంత శ్రీ విభూషిత యతిచక్రచూడామణి

శ్రీ కరపాత్రిస్వామి శ్రీచరణులు

# విషయానుక్రమణిక

శ్రీః

# ప్రవేశిక

''మన్దారపుష్పవాసిత మన్దానిలసేవితం పరానన్దమ్।
మన్దాకినీయుతపదం నమత మహానన్దదం మహాపురుషమ్॥''

''కటాక్షకిరణాచాన్త నమన్మోహాబ్ధయే నమః।
అనన్తానన్దకృష్ణాయ జగన్మంగళమూర్తయే॥''

ఈ 'భక్తిసుధ' శ్రీకరపాత్రీస్వామిహృదయ వినిఃసృతమైన సుధామంజూష. ఈ భక్తిసుధాతరంగిణిలో మునకలిడిన కర్మిష్ఠులు, భక్తులు, జిజ్ఞాసువులైన ముముక్షువులు, వారివారి అధికారము ననుసరించి అభిలషణీయములైన ఫలములను పొందగలరు. ఇంతియేకాక, శ్రవణ, మననాదినిష్ఠులై పరమప్రాప్యమైన నిఃశ్రేయసమును గూడా పొందగలరు. ఇదొక పవిత్ర త్రివేణీసంగమము. కర్మ, భక్తి,జ్ఞానరూపములైన గంగా, యమునా, సరస్వతీ స్రోతస్వినులు సరసనమన్వయసమన్వితములై జాలువారుచు, పండితహృదయములను, జిజ్ఞాసు పాఠకుల హృదయకేదారములను సుధాప్లావితము చేసి, అచింత్యానంద సంధాయకములై విలసిల్లుచుండును. ఏతత్సుధాపానముచేసిన భావుకహృదయులు అధికారిభేదమును అనుసరించి, వైదిక కర్మానుష్ఠాననిరతు లగుదురు, భక్తిపరాయణులై ఈశ్వరారాధనాసక్తు లగుదురు, జ్ఞాననిష్ఠులై బ్రహ్మాత్మైక్యానుభూతిని పొందుదురు.

మన భారతభూమి అనాది, అపౌరుషేయ,స్వతః ప్రమాణ వేదరాశికిఆవాసభూమి. వేదార్థోపబృంహకములైన పురాణేతిహాసములకు, శ్రుత్యర్థానుప్రాణితములైన స్మృతులకు ఆలయము. ఈ పవిత్ర భారతావనియందు పరమేశ్వరుడు అచింత్య స్వీయమాయాశక్తిచేత మాయామానుష విగ్రహధారియై, లీలామానుష విగ్రహధారియై రామ, కృష్ణాదిరూపములతో అవతరించెను. వసిష్ఠ, వ్యాస

శుకాది మునీంద్రులు ఈ భారతభూమియందు అవతరించి, వైదిక ధర్మరక్షణముచేసిన మహాత్ములు.

అనంతకాల ప్రవాహములో ప్రకృతిప్రభావముచేత ధర్మమునకు గ్లాని, అధర్మమునకు అభ్యుత్థానము కలుగుట సహజము. అట్టితరి, భగవత్సంకల్పము చేత వైదికధర్మోద్ధరణమునకై శ్రీశంకర భగవత్పాద, శ్రీవిద్యారణ్యాది బ్రహ్మజ్ఞాననిష్ఠులు భగవద్విభూతి సంపన్నులై అవతరించి భాష్యరచనలు గావించిరి, శ్రుతిప్రతిపాదితములైన కర్మ, బ్రహ్మలకు సరస సమన్వయముచేసి, వైదిక మార్గమును తీర్చిదిద్దిరి. శ్రీ శంకర భగవత్పాదులు సర్వ శ్రుతి సమన్వయ పూర్వకముగా అద్వైత సిద్ధాంతమందే వేదములకు పరమ తాత్పర్యమని సిద్ధాంతీకరించిరి. వారు వైదిక కర్మానుష్ఠానమును త్రోసి రాజనలేదు. సగుణభక్తిని నిరాకరించలేదు. ఇవి దురితక్షయమునకై, చిత్తశుద్ధికై, చిత్తైకాగ్ర్యమునకై అవశ్యము ఆదరణీయములే అని ప్రతిపాదించిరి. ఇవి, అన్య ఉత్తమలోక ప్రాపకములే గాని, కైవల్యప్రదములు కావు అని ముక్తకంఠముతో చాటిరి. "జ్ఞానాదేవ తు కైవల్యమ్" అనునది పరమ సిద్ధాంతమని శాస్త్ర, యుక్తి, అనుభవ పురఃసరముగా శ్రీశంకరులు ప్రస్థానత్రయ భాష్యములందును, ప్రకరణ గ్రంథములందును ప్రతిపాదించిరి.

కాశీక్షేత్రమందు అద్వైత వేదాంత సంప్రదాయమునకు చెందిన అద్వయ బ్రహ్మాత్మైక్యనిష్ఠులైన యతీశ్వరులయ్యు భక్తిశిరోమణులైన నలుగురు మహాత్ములు జన్మించిరి. వీరిలో ఒకరు, శ్రీధరస్వామి 14వ శతాబ్ది పూర్వార్ధమందు (1300-1350) ఉండెడివారు. ఈయన నృసింహోపాసకులు. శ్రీధరస్వామి 'భావార్థదీపిక' అను నామముతో శ్రీమద్భాగవతమునకు ప్రసన్నగంభీరమైన వ్యాఖ్యను రచించిన మహామనీషి. ఏతద్వ్యాఖ్య, శ్రీమద్భాగవత రహస్యార్థాభివ్యంజకమైనది. భాగవతాంతర్గతమైన గంభీరార్థమును

సరళము, సుబోధము చేయునట్టి వ్యాఖ్యారాజము ఇది. ఇంతియే కాక, శ్రీమద్భగవద్గీతకు ఈయన, 'సుబోధిని' అను టీకను గూడా రచించియున్నారు.

17వ శతాబ్దిలో గల శ్రీమధుసూదన సరస్వతీస్వామి, కేవల జ్ఞానమార్గానుయాయి అయిన ఆచార్యుడుమాత్రమే కారు. విశేషించి భక్తిరసవ్యాఖ్యాత, భక్తిస్నిగ్ధ హృదయులను అయిన మహనీయ సాధకులు. వీరు బృందావనమందు అయిదు పర్యాయములు 'శ్రీగోపాలసహస్రనామస్తోత్ర'పురశ్చరణముచేసి,శ్రీకృష్ణపరమాత్మ దర్శనమును పొందిన భక్తిశిఖరాయమాణులు. ఈ మధుసూదన సరస్వతీస్వామిచరణులు శ్రీమద్భగవద్గీతకు 'గూఢార్థదీపిక' అను నామముతో విశ్రుతమైన టీకను రచించిరి. 'అద్వైతసిద్ధి' వంటి అద్వైత సిద్ధాంత ప్రతిపాదకములైన శాస్త్రీయ గ్రంథరాజముల ప్రణయన మొనర్చిన మహాప్రతిభా వైదుష్యసంపన్నులు. ఇంతియే కాక, 'భక్తిరసాయనము' వంటి రచనలుచేసి భక్తిరసమునకు శాస్త్రీయ ప్రామాణ్యమును సమకూర్చిపెట్టిన విద్వన్మూర్ధన్యులు. వీరు వారణాసిలో 'చౌసట్టీఘాటు'లో గల తమ మఠమునందు నివసించెడివారు.

శ్రీనారాయణతీర్థస్వామివారు 18వ శతాబ్దిలో శ్రీవిశ్వనాథ క్షేత్రమందు నివసించిన అద్వైత సిద్ధాంతానుయాయి అయిన యతీశ్వరులు. ఈయన, వేదాంతశాస్త్రమందు మూర్ధన్య గ్రంథ ప్రణయనముకావించిన యతిశేఖరులు. వీరుశాండిల్యభక్తిసూత్రము లకు 'భక్తిచంద్రికా' వ్యాఖ్యను రచించి, భక్తితత్త్వమును, భక్తి ప్రకారములను, భక్తిసాధనాభ్యాసరీతిని శ్రుతిప్రతిపాదిత మంత్ర ములను ప్రమాణముగా చూపుచు సుప్రతిష్ఠిత మొనర్చిన భక్తిరస సిద్ధాంత నిష్ణాతులు.

ఈ శతాబ్దిలో శ్రీకరపాత్రీస్వామి శ్రీచరణులు కాశీక్షేత్రమును ప్రధాన కేంద్రముగాచేసికొని, భక్తిరసాప్లుతమైన అద్వైతబ్రహ్మ

నిష్ఠయందు నిరంతరము నిమజ్జితులైన భక్తిమార్గానుయాయులు అద్వైత యతిశ్రేష్ఠుల పరంపరలో శిరోరత్నముగా భాసిల్లిన యతి చక్రచూడామణులు. ఈ మహనీయుడు శ్రీమధుసూదనసరస్వతీ సంప్రదాయానుయాయులై 'భక్తిరసార్ణవము' అను భక్తిశాస్త్ర గ్రంథమును గీర్వాణభాషలో రచించిన మహాత్ములు.

ఈవిధముగా, ఈ మహాత్ములు నలువురును అసమాన ప్రతిభా వైదుష్యసంపన్నులై గ్రంథప్రణయనము చేయుటయేకాక, శ్రీవిశ్వనాథుని సన్నిధిలో 'మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అను సిద్ధాంతమును అనుసరించి భక్తి, జ్ఞాననిష్ఠులై జీవితములను సార్థక మొనర్చుకొనిన పవిత్రాత్ములు, తాదృశ మహాత్ముల స్మరణమే భవతారకము.

శ్రీకరపాత్రీస్వామిచరణులు సార్థక నామధేయులు. వీరు జన్మనా, సహజ విరాగులు. శ్రీచరణులు 'నరవర' నివాసులైన 'షడ్దర్శనాచార్య' శ్రీవిశ్వేశ్వరాశ్రముల సన్నిధిలో యథావిధిగా గురూపసదనము చేసి, సర్వదర్శనములను అధ్యయనము చేసిరి. అనంతరము, వీతరాగులై గంగాతటమున, వృక్షచ్ఛాయలలో తపోనిష్ఠానిమగ్నులైరి. ఆ కాలమున శ్రీచరణులు కేవల కౌపీన మాత్రధారులై ఉండెడివారు. కేవలము గంగాజలమును మాత్రమే గైకొనుచు బాహ్యవిషయసంస్పర్శ లేక, ఆత్మారాములై ఉండెడి వారు. ఎపుడైనను, అయాచితముగా లభ్యమైన భిక్షను పవిత్ర గృహములందు కరతలభిక్షగా స్వీకరించుచుండెడివారు. కావున వారు 'కరపాత్రీ' యని అన్వర్థనామముతో విశ్రుతులైరి. వారు నిరీహులు, నిస్పృహులును అయి, నిరంతరము మనన, నిదిధ్యాసన నిష్ఠులై ఉండెడివారు. తరువాత, కొంతకాలమునకు శ్రీ బ్రహ్మానంద సరస్వతీ స్వామిచరణులనుండి శాస్త్రోక్తవిధిగా తురీయాశ్రమమును స్వీకరించి, 'శ్రీహరిహరానంద సరస్వతీ' అను నామముతో విరాజిల్లిరి. అయినను, శ్రీకరపాత్రీస్వామినామముతోనే ప్రసిద్ధినొందిరి.

శ్రీ కరపాత్రీస్వామివారు వర్తమాన శతాబ్దియందు అసమాన ప్రతిభావైదుష్యసంపన్నులై విద్వల్లోకమున ప్రచండభాస్కరునివలె వెలుగొందిన మహామనిషి. వివిధ దర్శనములను అపోశనముపట్టిన అపూర్వ మేధాప్రజ్ఞావిలసిత మతులు. శ్రీస్వామిచరణులు ఎంత అద్వైత బ్రహ్మనిష్ఠులో, అంత మహాసాధకవరిష్ఠులు, అంత భక్తి నిష్ఠాగరిష్ఠులు, ఉపాసక శ్రేష్ఠులు.

శ్రీ కరపాత్రీస్వామివారు పూర్వోత్తర మీమాంసలయందు అసమాన శేముషీధురంధరులు. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగాది దర్శనములందు నాన్యతోదర్శనీయములైన పాండితీప్రతిభలు కలవారు. ఆయనగారిచే అచుంబితమైన తంత్రశాస్త్రముగాని, భక్తి శాస్త్రము గాని, రససిద్ధాంతముగాని లేదనుట అతిశయోక్తి కాదు. వారి హృదయము వైదికధర్మనిష్ఠము. వారి చిత్తము సామాజిక, రాజనైతిక చైతన్యవిలసితము.

ఏవంవిధమైన శ్రీకరపాత్రీ శ్రీచరణుల వ్యక్తిత్వము సర్వతో విలక్షణముగా పరిఢవిల్లినది. ఇది ఈశ్వరసంకల్పము. ఇది, ఆస్తిక వర్యులైన భారతీయుల సౌభాగ్యము. నా పురాకృత సుకృత విశేషాతిశయమువలన 40 సంవత్సరములకు పూర్వము అమరావతిలో జరిగిన మహాసభలలో ఈ మహాత్ముని దర్శించు భాగ్యము నాకు కలిగినది. వీరి ప్రవచనసుధను ఆస్వాదించునట్టి అదృష్టము కలిగినది. ఆ సభలు, శ్రీకరపాత్రీ శ్రీచరణులతోపాటు, ఆంధ్రదేశ మందలి విద్వన్మూర్ధన్యులతో హృదయరంజకముగా జరిగినవి. ఆంధ్రదేశమందలి పండితవర్యులతో శ్రీస్వామిచరణులుచేసిన శాస్త్ర గోష్ఠులు నేటికిని, నా హృదయ కుహరమునందు ముఖరితములగు చుండును. ఆ సన్నివేశమును తలంచుకొనినపుడు నా హృదయమందు ఆనందవీచికలు వీచును. ఆనందోద్రేకముతో నా నేత్రములు అశ్రుసిక్తములగును. అవిస్మరణీయమైన ఈ సదవకాశము,

గురుదేవతానుగ్రహము వలనను, మా పితృపాదుల అనుకంపా విశేషముచేతను నా జీవితములో సంభవించినది. ఇది ఈశ్వరానుగ్రహమే అని భావింతును.

శ్రీకరపాత్రీస్వామివారు గీర్వాణ, హిందీభాషలలో సహస్రాధిక ప్రవచనములు గావించిన మహాత్ములు, అనేక గ్రంథములను రచించిన ప్రతిభావైదుష్య సంపన్నులు. శ్రీచరణుల శైలి ఎంత ప్రఖరమో, ఎంత సునిశితమో, భావప్రవణశైలి అంత సరసము, అంత హృదయావర్జకము. ఆ మహానుభావుని వ్యక్తిత్వము నిశితమైన బౌద్ధికతతోపాటు, భక్తివిగలితమైన సరసభావముతో, భక్తినిర్భరమైన తన్మయతతో విలసిల్లుచుండును. శ్రీచరణుల ప్రవచనములందును. రచనలందును వారి నాన్యతోలభ్యమగు అలౌకిక వ్యక్తిత్వము ప్రస్ఫుటితమగుచుండును. గాఢమైన వైదిక కర్మపరత, తపోబల సముపార్జితమైన జ్ఞానము, సాత్త్విక హృదయమందు ఉద్వేలితమగు పరమానందముచేత పరిప్లావితమగు భక్తి, వీని మధుమయ సామంజస్యము వారి వ్యక్తిత్వమందు భాసమానమగుచుండును. శాస్త్రీయ సత్యములను విశ్లేషించు సమయమున, శ్రీచరణులవాణి, ఎంత తర్కనిష్ఠముగా, ఎంత యుక్తిప్రవణముగా ఉండునో, భక్తిరస వివరణమందు ఆ వాణి, అంత మధురము, సరసము, సరళము, సుబోధమునయి ఉండును.

శ్రీకరపాత్రీస్వామి చరణులచే ప్రణీతములైన గ్రంథములు కొన్ని ఇవి....

భక్తిరసార్ణవః...

ఈ గ్రంథము శ్రీమధుసూదన సరస్వతీ ప్రణీత 'భక్తిరసాయన' శైలిలో రచించబడినది. ఇందు, భక్తిరస స్వరూప వివేచనము గంభీరశాస్త్రీయశైలిలోచేయబడినది. భక్తిరసముయొక్క విస్తృత, గంభీర వివేచనము చేయుట ఈ గ్రంథము యొక్క

ముఖ్య ఉద్దేశ్యము. శ్రీ స్వామిచరణులచేత ఈ గ్రంథమందు భగవత్స్వరూప వివేచనము, భగవన్నామ, రూప, లీలా, ధామాది వివేచనము అత్యంత గంభీరముగా భక్తిశాస్త్ర నిర్ణీత సిద్ధాంతశైలిలో చేయబడిన భక్తిరస సిద్ధాంత గ్రంథము. శ్రీకరపాత్రీస్వామివారు 'భక్తిర్ముక్తిశతాధికా' అను సిద్ధాంతమును వేద, శాస్త్ర, యుక్తి పురస్సరముగా, ప్రతిభావైదుష్యస్ఫోరకముగా ఈ 'భక్తిరసార్ణవ' మందు ప్రతిపాదించిరి. ఇంతియేకాక, శ్రీ రాధాకృష్ణుల తత్త్వము, వేద, శాస్త్ర ప్రతిపాదితమైన భజనీయ తత్త్వముగా శ్రీస్వామి చరణులు ఈ గ్రంథమందు ప్రతిపాదించిరి. ఇందు శ్రుతిప్రతిపాదిత తత్త్వమును ఎడనెడ మహావైదుష్యముతో ప్రతిపాదించిరి. శ్రీస్వామి చరణులు ఇందు పురుషసూక్త, దేవీ సూక్తాదుల పరమ తాత్పర్య మును ప్రతిపాదించుటలో అద్భుతమైన ప్రతిభను ప్రదర్శించిరి. ఈ భక్తిరసార్ణవము 'భక్తిరసాయన' శైలిలో రచించబడినను, అనేక నవీనవిషయ సంవలితమై, ఇది తద్విలక్షణముగా భాసిల్లుచుండును.

వేదార్థ పారిజాతః :-

ఈ గ్రంథము శ్రీకరపాత్రీస్వామి చరణుల వేదవిజ్ఞానమునకు దర్పణము పట్టుచుండును. ఇది వైదిక వాఙ్మయమందలి అసాధా రణమైన విశ్వకోశమని చెప్పవచ్చును. ఈ గ్రంథమున, ప్రమా, ప్రమాణ,ఖ్యాతి, దేవతాస్వరూపములు సశాస్త్రీయముగా నిర్ధారణము చేయబడినవి. ఇందు వేదముల అపౌరుషేయత్వము, బ్రాహ్మణ ముల వేదత్వము సంప్రదాయానుగుణముగా ప్రతిపాదించబడినది. ఇందు వేదముల విషయమై పాశ్చాత్యులు, తదనుయాయులు చేసిన పూర్వపక్షములు సశాస్త్రీయముగా నిరాకరించబడినవి. ఈ గ్రంథము సాయణాది పూర్వాచార్యుల సిద్ధాంతానుసారముగా రచించబడినది. ఇది శ్రీకరపాత్రీస్వామి ప్రణీతమైన వేద భాష్యము

నకు భూమికా భాగము. ఈ గ్రంథమునకు ఉత్తర ప్రదేశ్ సంస్కృత అకాడమీవారు లక్ష రూప్యముల బహుమతి నొసగిరి. ఇది, రెండు భాగములుగా (2314 పేజీలలో) ప్రకాశితమైన బృహద్గ్రంథము.

శుక్లయజుర్వేద వాజసనేయ సంహితాభాష్యమ్ :-

శ్రీకరపాత్రీస్వామిచరణులు ఉవ్వట,మహీధరాదిఆచార్యుల శైలిలో రచించిన శుక్లయజుర్వేద మాధ్యందినశాఖాభాష్యము. దీని యందు ఆధునిక విద్వాంసులచేత చేయబడిన దోషారోపములను దక్షతాపూర్వకముగా ఖండించిరి. ఇందు ప్రతి, మంత్రమునకు భగవత్పరకము, ఆధ్యాత్మికము, అధిదైవికములైన అర్థములను హృదయాహ్లాదకరముగా ప్రతిపాదించిరి. ఈ భాష్యమందు ఇంత వరకు రెండు అధ్యాయములుమాత్రమే ప్రకాశితములైనవి.

శ్రీవిద్యారత్నాకరః :-

ఈ గ్రంథము శ్రీకరపాత్రీస్వామిచరణులకు మంత్రశాస్త్ర మందు గల అపార విజ్ఞానమునకు పరిచాయకమైన గ్రంథరాజము. ఈ గ్రంథము శ్రీసపర్యా, మంత్రభాష్య, వాంఛాకల్పలతా, లక్షార్చన, పూర్ణాభిషేక, మహాయాగక్రమాది వివిధ విధివిధాన విలసితమైన మంత్రశాస్త్రగ్రంథము. కులార్ణవ, తంత్రరాజ, కల్పసూత్ర, శ్రీవిద్యార్ణవ, త్రిపురారహస్య, నిత్యోత్సవాది వివిధ తంత్రగ్రంథములను నిశితముగా పరిశీలించి ఉపాసకుల శ్రేయస్సు నకై రచింపబడిన మంత్రశాస్త్ర గ్రంథరాజము.

శ్రీరామాయణమీమాంస :-

ఈ గ్రంథము హింధీభాషలో రచించబడినది. ఇది ఒక బృహద్గ్రంథము. శ్రీమద్రామాయణము అవైదికుల వలన దేశ, విదేశభాషలలో ఎంత వికృతరూపముదాల్చినదో ఇందు శ్రీస్వామి చరణులు వివేచనాత్మకముగా ప్రదర్శించిరి. 'బుల్కె'మహాశయుల వంటివారు చేసిన కువిమర్శలను వేద, శాస్త్ర, యుక్తిపురఃసరముగా

ఖండించి శ్రీచరణులు రామాయణ యథార్థ స్వరూపమును మహా ప్రతిభాస్ఫోరకముగా ప్రదర్శించిరి.

భాగవత సుధ :-

ఈ 'భాగవత సుధా' గ్రంథమును శ్రీకరపాత్రీస్వామివారు భక్తిప్లావితమైన హృదయముతో హిందీభాషలో రచించిరి. నిగమ కల్పతరుగలిత ఫలమైన శ్రీమద్భాగవతము భగవంతుని వాఙ్మయ విగ్రహము. ఈ గ్రంథము 8 అధ్యాయములుగా వెలువడినది. శ్రీమద్భాగవతమందలి అంతరంగ రస రహస్యములను అసాధారణ మైన ప్రతిభతో శ్రీస్వామివారు సరళముగా, సుబోధముగా వివరించిరి. ఈ గ్రంథము శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీకరపాత్రీ స్వామి ముఖారవిందమునుండి వినిఃసృతమైన వచనామృతము. ఇందలి విషయ విశ్లేషణము నాన్యత్రలభ్యము.

శ్రీరాధాసుధ :-

ఈగ్రంథము హిందీభాషలో 12 అధ్యాయములుగా ప్రకాశిత మైనది. శ్రీరాధాకృష్ణులయందు శ్రీస్వామిచరణులకు గల అపార భక్తిశ్రద్ధలకే కాక, తద్రసానుభూతిపరవశతకు ఈ గ్రంథము సూచకము. ఇందు శ్రీరాధాకృష్ణ యుగళతత్త్వము పరమ ప్రామాణికముగా లలితమైనభాషలో అభివ్యక్తము చేయబడినది. ప్రేమాత్మకము, ప్రకాశాత్మకము నయిన యుగళతత్త్వముయొక్క విలాసమే ఈ సమస్త విశ్వము అని ఇందు అపూర్వ ప్రతిభా సమున్మేషముతో ప్రదర్శించబడినది.

మార్క్సువాదము - రామరాజ్యము :-

ఈగ్రంథమందు శ్రీకరపాత్రీచరణులు ప్రాచ్య, పాశ్చాత్య దర్శనములనన్నిటిని సమగ్రముగా, తులనాత్మకముగా అనుశీల నము చేసి, రామరాజ్యముయొక్క సార్థకతను, మార్క్సువాదము యొక్క వైయర్థ్యమును ప్రతిభాసముల్లసితముగా ప్రతిపాదించిరి.

భక్తిసుధ :-

'భక్తిసుధ' శ్రీకరపాత్రీస్వామివారిచే రచించబడిన అపూర్వ గ్రంథరాజము. ఇది ఒక బృహదారణ్యకము, ఒక బృందారణ్యకము ఈగ్రంథము 'భక్తిరసార్ణవము'నకు పరిపూరకము. ఈ రెండు గ్రంథములకునుమధ్య సంబంధము కలదు, పార్థక్యమును కలదు. 'భక్తిరసార్ణవము' భక్తి సిద్ధాంతమును ప్రతిపాదించు గ్రంథము. ఈ'భక్తిసుధ' భక్తియొక్క వ్యావహారిక దర్శనమును నిర్దేశించును. ఈ రెండు గ్రంథములమధ్య ఉపకార్య, ఉపకారక భావముకలదు. ఇందు వర్ణితములైన సర్వ విషయములు మనోహరులు, విచారోత్తేజకములు. వేణుగీత, చీరహరణ, వేదాంతరససార, శ్రీరాసలీలా రహస్యాది విషయములందు వర్ణించబడిన తత్త్వము అత్యంత హృదయావర్జకము, భక్తిరసాన్వితము, పరమానంద సంధాయకము. ఈగ్రంథము నిగమాగమసార సర్వస్వము. ఈ భక్తిసుధయందు శ్రీకరపాత్రీ శ్రీచరణులు ఆధ్యాత్మిక తత్త్వమును లౌకిక ఉదాహరణములద్వారా హృదయరంజకముగా ప్రదర్శించియున్నారు. ఈ గ్రంథములే కాక, శ్రీకరపాత్రీస్వామివారిచే ప్రణీతములైన గ్రంథములు అనేకములు అముద్రితములుగానే ఉండిపోయినవని చెప్పుదురు. వారు గీర్వాణ, హిందీభాషలలో చేసిన ప్రవచనములు లిపిబద్ధములుకాక, అటులనే ఉండిపోయినవని చెప్పుదురు. కాలమహిమ ఇది. ఏమి చేయుగలము ! ఏమి చెప్పగలము !

శ్రీకరపాత్రీస్వామిచరణుల సమన్వయసరణి అపూర్వము, అసదృశ్యము. వారికి సనాతన ధర్మమందుగల ఆస్థా, శ్రద్ధలు నాన్యతోదర్శనీయములు. శ్రీచరణుల వచోవిన్యాసము ప్రసన్నగంభీరము. వారుచేయు సమన్వయసరణి వేదశాస్త్ర ప్రమాణసిద్ధమై ప్రభావోత్పాదకమై ప్రతివాదులను నిరుత్తరులను చేయును.

ఒకమారు, జ్ఞాని జీవితములో కామ, క్రోధాది దోషములు ఉండునా, ఉండవా? అను ప్రశ్న పండితులు, సాధువులు, సాధకులైన భక్తులమధ్య ఉత్పన్నమైనది. అంత,ఒకరు జ్ఞానిజీవితములో గూడా కామ, క్రోధాది వికారములు ఉన్నచో, దుఃఖము ఉండును. తత్త్వజ్ఞానము వలన దుఃఖనివృత్తి కాకపోయినచో తత్త్వజ్ఞాన ప్రాప్తికై ఎవరు ప్రయత్నింతురు? అనిరి. తత్త్వజ్ఞానము కలిగినను అవిద్యాలేశము ఉండును, దానివలన కామ, క్రోధాది వికారములు కలుగవచ్చును అని మఱొకరు అనిరి. తత్త్వజ్ఞానము కలిగిన తరువాత అవిద్య ఉండదు, అవిద్యాలేశము సైతము ఉండదని మఱొక మహాత్ముడు వచించెను.

అంత, శ్రీంరపాత్రీ స్వామివారు గంభీరవాణితో ఇట్లనిరి - ఔపనిషద మహావాక్య శ్రవణముచేత అఖండార్థ సాక్షాత్కారము కలుగును, అపుడు అవిద్య నివృత్తమగును అనుమాట యుక్తమే. కాని, శరీరము ఉన్నంతవఱకు దానికి జరా, రోగాదులు ఉండును, స్వప్న, సుషుప్త్యాదులు ఉండును. సాక్షియొక్క బ్రహ్మత్వము జ్ఞాతమైనపుడు అంతఃకరణ భానమందు గాని, విషయభానమందు గాని, ఏమియును భేదము ఉండదు. బ్రహ్మవిద్య, భ్రమను మాత్రమే నివర్తింపజేయును గాని, భాసమానమగు ప్రపంచమును నివర్తింపజేయజాలదు. కావుననే సాక్షిభాస్యమైన అంతఃకరణమందు తత్త్వజ్ఞానోదయము కలిగిన తరువాతగూడా అంతఃకరణమందు వికారములు జనించినను, ముక్తికి ఏ విధమైన నిరోధము ఉండదు. ఏలయన, ఆత్మ, నిత్య ముక్త స్వరూపుడు. అవిద్యానివృత్తి, కేవలము ఉపలక్షణముమాత్రమే. కావున,తత్త్వజ్ఞానిజీవితములో గూడా వికారములు సంభవమే. శ్రీచరణుల సమన్వయ రీతి ఇది.

మఱొక ప్రసంగమున 'క్లీం' బీజముయొక్క తత్త్వమును ఇట్లు ప్రతిపాదించిరి-'క్లీం' బీజము కామరాజబీజము. ఈ బీజాక్షరమందు "క్, ల్, ఈ, ం" అను అక్షరములు కలవు. శ్రీకృష్ణ

చంద్రుడు. పరమానందకందము, మదనమోహనుడు అయిన వ్రజేంద్రనందనుడు 'క్' అను అక్షరమునకు అర్థము. వృషభాను నందిని, రాజేశ్వరి అయిన రాధారాణి 'ల్' అను అక్షరమునకు అర్థము, ఈ అక్షరమును తంత్రశాస్త్రమందు 'కా మ క ళ' అని అందురు. బిందువు (ం)నకు అర్థము రసోద్రేకము. కాగా, 'క్లీం' బీజముచేత అచింత్య పరమానంద సుధాసింధువైన శ్రీకృష్ణుడు, సుధాసింధువునందలి మాధుర్యసార సర్వస్వమునకు అధిష్ఠాత్రి అయిన రాధ, రాధాకృష్ణుల పరస్పర ప్రేమ, అనగా రాధాకృష్ణుల పరస్పర సమ్మిలనముచేత ప్రాదుర్భవించిన లోకోత్తరరసోద్రేకము ప్రతిపాదించబడును. ఈ వివేచన ఎంత భావుకతాస్ఫోరకము! ఎంత వైదుష్య సముల్లసితము! ఈ భావన, నాన్యతోదర్శనీయమై ఉపాసకలోక హృదయావర్జకముగా ఉన్నదనుట అనుభవైక వేద్యము.

ఇట్టి మహాగంభీరము, భక్తిరసాభివ్యంజకము, అద్వైతబ్రహ్మ తత్త్వ ప్రతిపాదకమును అయిన గ్రంథమును నా బోటివాడు ఆంధ్రీకరింపబూనుట సాహసకార్యమే. అయినను, నాహృదయము శ్రీ కరపాత్రీస్వామిచరణారవిందామరంజితమైనది. ఆ మహనీయుని ప్రతిభావైదుష్యములే కాక, ఆయన తపోనిష్ఠ, అద్వైత జ్ఞాననిష్ఠ, ఈశ్వరోపాసన మొదలగు మహావిషయములు నా హృదయమును చిరకాలమునుండి ఆకట్టుకొనియున్నవి. ఆ మహనీయుని విజ్ఞానమును ఆంధ్రభాషలో జిజ్ఞాసువులైన పాఠకులకు అందించవలయు నను ఉత్కటమైన ఆకాంక్ష, నాహృదయములో చిరకాలమునుండి

నెలకొనియున్నది. ఏదియో ఒక తపన, ఏదియో ఒక వేదన ఈ జీవుని వెన్నాడుచు వచ్చినది. గురుదేవతానుగ్రహము వలన, ఏతద్రచనావ్యాసంగమునకు పూనుకొంటిని. నా చేత ఈ పని చేయించుట ఈశ్వరసంకల్పము కాబోలు! కానిచో, ఆమహనీయుని గ్రంథములు ఇంతదనుక ఆంధ్రభాషలో ప్రకాశితములు కాకపోవుట ఏమి? గురుదేవతానుగ్రహము వలన ఈ గ్రంథమును విజ్ఞులైన ఆంధ్రపాఠకులకు అందించుట నా భాగ్యముగా భావించుచున్నాను.

అనువాదకులు :

జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీః

నమో భగవతే శ్రీ దక్షిణామూర్తయే

# భక్తిసుధ

## సుధాతరంగిణ్యాఖ్య

### ఆంధ్రవివరణ సహితము

### తృతీయ భాగము

# బృందావనము-వర్షర్తు శరదృతువులు

### సుధాతరంగిణి

చిద్ఘనాయ ప్రసన్నాయ ప్రశాత్మాకాశవిహారిణే ।
అద్వైతామృతవర్షాయ శంకరాయ నమో నమః ॥

చిద్ఘనైకరసపూర్ణభారతీం
శాంత సూనృతపదాం సరస్వతీమ్ ।
కామకోటిమహితా మిడాం భజే
చంద్రశేఖర యతీంద్రరూపిణీమ్ ॥

సహస్రారః పుష్పగిరిః అద్వైతామృతనిర్ఝరః ।
తదమృత తరంగిణ్యాఽఽప్లావితః అభవోఽస్మ్యహమ్ ॥

శ్రీ పుష్పగిరిపీఠస్థాం నారసింహస్వరూపిణీమ్ ।
విద్యా మభినవోద్దండాం ప్రణమామి హి భారతీమ్ ॥

శ్రీవిద్యారస మాపీయ సర్వశాస్త్రవిశారదః ।
శ్రీమద్భాగవతం తత్త్వం లోకానుగ్రహకాంక్షయా ॥

బ్రహ్మాత్మభావ మాపన్నః తన్మయేన స్వచేతసా ।
విభావ్య తేనే లోకేఽస్మిన్ శ్రీమద్భక్తిసుధాం ముదా ॥

కరపాత్రీతి విఖ్యాతః యతిచూడామణిః స్వయమ్ ।
వందే హరిహరానంద యతిచంద్రం శివం సదా ॥

పాతంజలే విమల శాంకరదర్శనే చ
పారంగతః నియత ధర్మ పథే రతశ్చ ।
యోఽధ్యాపయన్ పరమయా చ ముదా వినేయాన్
శ్రీ వేంకటేశ్వరగురుం పితరం నతోఽస్మి ॥

నిర్మమం నిరహంకారం అద్వైతార్థ ప్రబోధకమ్ ।
రామకోటిగురుం వందే సర్వశాస్త్రార్థపారగమ్ ॥
తపోనిష్ఠాగరిష్ఠశ్చ కరపాత్రీ యతీశ్వరః ।
చిదానందస్య కృష్ణస్య తత్త్వం భక్తిసుధామయమ్ ॥
శ్రీవిద్యాపరమం గుహ్యం వేదాన్త ప్రతిపాదితమ్ ।
భక్తానాం సుఖబోధాయ బహుధా ప్రత్యపాదయత్ ॥
తదిదం పరమం తత్త్వం ఆన్ధ్రాస్యం విప్రియతే మయా ।
గురుప్రసాదయుక్తేన వినీత మతినాఽధునా ॥

శ్రీమద్భాగవత దశమస్కంధమునందలి ఇరువదవ అధ్యాయమున, వర్షర్తు, శరదృతువుల అత్యంత సుందర వర్ణనము కలదు. శ్రీ బృందారణ్యధామమునందు గూడా ప్రాణులను ఉద్భ్రాంత మొనర్చు వర్షర్తువు ప్రకటమయ్యెను. మేఘగర్జనలతో మెఱుపులతో గూడిన సాంద్రమైన నీలాంబుదము చేత, నభోమండలము అచ్ఛన్న మయ్యెను. సూర్య, చంద్ర, నక్షత్రాది జ్యోతులు గూడా స్పష్టముగా గోచరించుటలేదు. నిర్గుణ బ్రహ్మ స్వరూపుడైన జీవుడు సత్త్వ, రజస్, తమోగుణములచేత అచ్ఛన్నుడైనట్లు, తత్స్వరూపభూతమైన జ్యోతి, అనుభూతము కానట్లు ఆ స్థితి ఉన్నది. అథవా, నిరభ్రమైన (మేఘము లేని) జ్యోతిర్మయమైన ఆకాశము గర్జన, విద్యుత్, నీలాంబుదాదులచేత అచ్ఛన్నమై నిష్ప్రపంచ, జ్యోతిర్మయ బ్రహ్మ సత్త్వ, రజస్తమస్సుల

ప్రపంచముచేత ఆవృతమై అస్పష్టమైన జ్యోతివలె అయిన రీతిగా, అస్పష్ట జ్యోతి అయ్యెను. అథవా, ఆకాశము మేఘాదులచే ఆవృతమై, నిర్గుణ బ్రహ్మ సగుణ, సాకార శ్రీకృష్ణరూపములో శోభించినట్లు శోభించసాగెను. చిక్కణ, సజల, జలద, నీలాంబుదము వంటి శ్రీకృష్ణావయవములు వ్యక్తములైనట్లు, విద్యుత్తువంటి పీతాంబరము, మందగర్జన సదృశమైన వేణునాదము వ్యక్తమైనట్లు ఉండెను. ఆకాశమందలి సూర్యాది జ్యోతిస్సులు స్పష్టముగా గన్పడని విధముగానే శ్రీకృష్ణుని స్వరూపము వసన, భూషణముల చేతను, వ్రజాంగనల చేతను ఆవృత మగుట వలన స్పష్టముగా గన్పించుటలేదు.

భాస్కరుడు, ఎనిమిది మాసములు తన తిగ్మరశ్మల (తీక్ష్ణ కిరణముల) ద్వారా భూమినుండి గ్రహించిన జలమును తగిన సమయమున వదలిపెట్టుట ఆరంభించెను. రాజు, ప్రజలనుండి పన్ను గ్రహించి యథాసమయమున, పునః ఆ ధనము నిచ్చునట్లు సూర్యుడు జలమును ఇయ్యసాగెను. కృపాళువులైనవారు బాధా తప్తులైన ప్రాణులను జూచి, దయార్ద్రచిత్తులై వారి రక్షణము కొఱకు, వారి ఆప్యాయనము కొఱకు తమ జీవితమును సైతము, త్యాగము చేయుదురు. అట్లే, దామినీయుక్తములై గర్జనలతో గూడిన పెద్ద పెద్ద మేఘములు తటిద్రూపములైన తమ నేత్రము లతో నిదాఘతప్తమైన విశ్వమును గాంచి, వాయువనెడి దయవలన కంపితములై విశ్వము యొక్క ఆప్యాయనమునకై జీవనమును (జలమును) వర్షించసాగెను.

గ్రీష్మతప్త, కృశ, దుర్బల భూమి, సకామనయా తపస్సు చేయునట్టి తపస్విశరీరము కామనా ప్రాప్తి వలన పరిపుష్టమైన చందముగా పుష్టమయ్యెను. సాయంకాలమందు అంధకారము వలన ఖద్యోతముల (మిణుగురుపురుగుల) ప్రకాశము సాగెను.

కాని, కలియుగమందు పాపము వలన పాఖండములు (వేద విరుద్ధములైన ఆగమములు) విస్తరించినట్లు, వేదములు విస్మృతములు కానట్లు, చంద్ర, శుక్రాది గ్రహములు ప్రకాశించుటలేదు. మేఘగర్జనములను విని, నిత్యధ్యాన, జపాదుల నియమము తరువాత, ఆచార్యుని నాదమును విని, శిష్యులు వేదాధ్యయనమును ఆరంభించినట్లు, మొదట నిద్రించిన మండూకములు అరుపులను ఆరంభించెను. చిన్న నదులు, పొంగినపుడు ఉత్పథగాములగును, లేక ఎండిపోవును, సన్మార్గములను అనుసరించవు. ఇంద్రియపరతంత్రుడు, లేక నిరంకుశుడును అయిన ప్రాణి యొక్క దేహము, ద్రవ్యము, సంపదలు ఉచ్ఛృంఖలముగా అపాత్రగాము లగును. అథవా, నశించిపోవును, అట్లే,చిన్న నదులు అయ్యెను. భూమి, 'హరిత తృణములతోను, ఇంద్రగోపకీటములతోను (ఎఱ్ఱని పురుగులతోను) శోణ వర్ణము గల శిలీంధ్రముల (కుక్కగొడుగుల) ఛాయవలన పీతవర్ణము కలవై, రాజుయొక్క సేనాసంపత్తి సుశోభితమైనట్లు ఉండెను. ఎడతెరపి లేక వర్షము కురియుటవలన, క్షేత్రములు సస్యసంపన్నములై 'అంతయు దైవాధీనము' అని ఎఱుంగని ధనికులయిన కర్షకులకు సుఖము కలిగించును, వర్షము లేనపుడు శుష్కించుచు, అనుతాపమును గలిగించును. నూతన జలనిషేవణము వలన, జలమందు, భూమిపైన నివసించు జీవులు, పరమ ధర్మమయుడు, సుఖమయుడునయిన శ్రీహరిసేవ వలన, అందఱును వెంటనే పరమ రుచిరులైనరీతిగా, రుచిరరూపమును ధరించిరి. కామవాసనాయుక్తుడు, అపక్వచిత్తుడును అయిన యోగియొక్క చిత్తము విషయసంబంధము వలన చంచలమైనట్లు, నదీసంపర్కము గల వాతోద్ఘాతములైన తరంగములచేత సముద్రము క్షుబ్ధమయ్యెను. భగవద్భక్తులు భగవంతుని ధ్యానమందు తల్లీనమైన చిత్తము కలవారయిన

కారణమున, వివిధ వ్యసనములచేత (దుఃఖములచేత) అభిభూతు లయినను,చంచలులు కానిరీతిగా వర్షాధారాహతము లగుచు గూడా పర్వతములు, నదులు విచలితము లగుటలేదు.

బ్రాహ్మణులచే అభ్యాసము చేయుబడకపోవుటచేత కలికాల ప్రభావము వలన, శ్రుతులు హతము లయినవానివలె ఉన్నట్లు, తృణాచ్ఛన్నములు, అసంస్కృతములు నగుటవలన, మార్గములు సందిగ్ధములయ్యెను. బ్రాహ్మణులు పౌనఃపున్యముగా ఆవృత్తి చేయుకపోవుట వలన, కొలది కాలమునకే శ్రుతులు విస్మృతము లైనట్లు,వర్షాకాలమందు పథికుల గమనాగమనములు ఆగిపోవుట వలన, తృణాచ్ఛన్నములగుటవలన మార్గములందు సందేహము కలుగసాగెను. గుణవంతులైన పురుషులందు గూడా కామిని, స్థిరమైన ప్రేమను చూపనట్లు, సర్వ ప్రాణులకు జీవనభూతమైన జలమును ఒసగునవి, మహోపకారకములు, లోకబంధువులును అయిన మేఘములందు విద్యుత్సౌందర్యము స్థిరముగా లేదు. గుణమిశ్రణమయమైన వ్యక్త ప్రపంచమున నిర్గుణ పురుషుడు శోభితుడైనట్లు, నిర్గుణమైన (జ్యారూపగుణరహితమైన) ఇంద్రధనుస్సు గుణసంపన్నమైన(గర్జనశబ్దరూప గుణసహితమైన) ఆకాశమందు శోభితమగుచున్నది. ఆత్మజ్యోతిచేతనే భాసితమగు 'అహం విద్వాన్', 'అహం శూరః' 'అహం దాతా' ఇత్యాది అహంమతిచేత ఆచ్ఛన్నుడైన పురుషుడు, సర్వపృథక్ రూపముతో స్పష్టముగా ప్రకాశితుడు కానిరీతిగా తన జ్యోత్స్నచేతనే ప్రకాశితములగు మేఘములచేత ఆచ్ఛాదితుడై చంద్రుడు పృథక్‌రూపముతో స్పష్టముగా ప్రతీయమాను డగుటలేదు.

"న రరాజోడుపశ్ఛన్నః స్వజ్యోత్స్నారాజితైర్ఘనైః ।
అహంమత్యా భాసితయా స్వభాసా పురుషో యథా ॥"

తప్తుడు, విరక్తచిత్తుడు, అచ్యుతుడును అయిన భక్తుని అగమనము వలన గృహమునందు ప్రసన్నులైనట్లు, మేఘము యొక్క ఆగమోత్సవమునందు మయూరములు ప్రసన్నము లయ్యెను-

"మేఘాగమోత్సవా హృష్టాః ప్రత్యనందన్ శిఖండినః।
గృహేషు తప్తా నిర్విణ్ణా యథాఽచ్యుత జనాగమే॥"

పూర్వము చేసిన తపస్సుచేత దుర్బలుడైన తపస్వి, కామములను సేవించుటవలన అనేక రూపములు గల దేహములు కలవాడైనట్లు పంక, కంటకాది యుక్తమైన సరోవరములందు గూడా సారస, చక్రవాకాది పక్షులు ఉన్నట్లును వర్షర్తువునందు వృక్షములు పాదములతో (వేళ్ళతో) జలపానము చేసి అనేక రూపములు గల శాఖలు, పల్లవములు, పుష్పములు, ఫలములు మున్నగువానితో సమన్వితములై ఉండెను.

అశాంత, ఉల్బణ (విపుల) కర్మలు గల గృహములందు గూడా వైషయిక సుఖలేశముయొక్క ఆశతో కుటుంబీకులు స్థిరముగా ఉన్న రీతిగా కలియుగమునందు పాఖండుల అసద్వాద ములచేత వేదమార్గములు, వర్ణాశ్రమ ధర్మములు భిన్నభిన్నము లయినట్లు మేఘుని వర్షమునందు జలప్రవాహములచేత ఆనకట్టలు భిన్నభిన్నములైనవి, బ్రాహ్మణుల ప్రేరణచేత రాజులు యాచకులకు అభీష్టమైన అర్థము (ధనము) నొసగునట్లు వాయు ప్రేరణచేత మేఘములు ప్రాణులకు అమృతమయమైన జలము నొసంగుచున్నవి.

పునః, శరదృతు ప్రభావము వలన కమలముల ఉత్పత్తిచేత, భ్రష్టులైనవారి చిత్తము యోగసేవ వలన పునః స్వస్థము,శాంతము అయినట్లు జలము స్వచ్ఛము, ప్రకృతిస్థము అయ్యెను. శ్రీకృష్ణ భక్తి, నాలుగు ఆశ్రమములందు ఉన్నవారి అశుభములను

హరించినట్లు శరదృతువు ఆకాశ, భూత, పృథ్వీ, జలముల మేఘముల, శబలతను (సాంకర్యమును), పంకమును (మాలిన్యమును) హరించివేసెకు. సర్వేషణలనుండీ వినిర్ముక్తులై ముక్తకిల్బిషులైన మునులు శాంతచిత్తులైనట్లు, మేఘములు తమ సర్వస్వభూతమైన జలమును వీడీ, నిర్మలతేజోయుక్తములై శోభితములగును.

"సర్వస్వం జలదా హిత్వా విరేజుః శుభ్రవర్చసః ।
యథా త్యక్తైషణాః శాన్తా మునయో ముక్తకిల్బిషాః ॥"

జ్ఞానులు యథాసమయమున, జ్ఞానామృతము నొసగుదురు, అథవా, ఒసగరు. అట్లే, పర్వతములు ఒకచోట, నిర్మలమైన జలము, నొసగుచుండును, మరొకచోట జలము నొసగవు.

"గిరయో ముముచుః తోయం క్వచిత్ న ముముచుః శివమ్ ।
యథా జ్ఞానామృతం కాలే జ్ఞానినో దదతే న వా ॥"

లోతు లేని జలమునందు ఉండునట్టి మీనాదులు,కుటుంబీకులు ప్రతిదినము క్షయమునొందుచున్న ఆయువును ఎఱుంగనట్లు. క్షీయమాణమగు (తరిగిపోవుచున్న) జలము నెఱుంగవు. దరిద్రుడు, కృపణుడు, అజితేంద్రియుడు నయిన గృహస్థు, క్షుదాది (ఆకలి మొదలగు) ప్రయుక్త తాపములచే తప్తుడయినట్లు, అల్పజలమందున్న మీనములు శరదృతువునందలి సూర్యతాపము వలన తాపము నొందసాగెను. ధీర పురుషుడు శరీరాది అనాత్మలందు మెల్లమెల్లగా అహంకార, మమకారములను వదలివేసినట్లు, భూమి మెల్లమెల్లగా పంకమును వీరుధముల (వృక్షాదుల) అపక్వతను విడిచిపెట్టసాగెను. మనస్సు ఉపరమము చెందినపుడు (శాంతమైనపుడు) ముని, ఆగమముల అభ్యాసమునుండి ఉపరతుడై తూష్ణింభూతుడైనట్లు, శరదాగమమునందు సముద్రజలము నిశ్చలమయ్యెను.

ఇంద్రియములను నిరోధించి మునులైనవారు ఆ ఇంద్రియముల ద్వారా ప్రవహించుచున్న జ్ఞానమును నిరోధించునట్లు,కర్షకులు

దృఢమైన గట్టులను వేసి జలమును పొలములందు ప్రవహించకుండు నట్లుగా నిరోధించిరి. జ్ఞానము ప్రాణుల దేహాభిమానము హరించినట్లు, రాత్రియందు ఉదయించిన చంద్రుడు ప్రాణుల సూర్యతాపమును హరించుచుండెను. అథవా, ముకుందుడు వ్రజాంగనల తాపమును హరించినట్లు, చంద్రుడు సూర్యతాపమును హరించుచుండెను. శబ్ద బ్రహ్మ యొక్క అర్థమును ప్రకాశింపజేయుచున్న సత్త్వయుక్తమైన చిత్తము శోభించుచున్నట్లు, శరదృతువునందు నిర్మలమైన నక్షత్ర యుక్తమైన, మేఘరహితమైన ఆకాశము శోభించసాగెను. వృష్ణి చక్రము (యాదవ మండలము)తో అవృతుడైన యదుపతి కృష్ణుడు శోభిల్లుచున్నట్లు, ఆకాశమునందు నక్షత్రగణముతోగూడి చంద్రుడు అఖండ మండలము గలవాడై శోభించుచుండెను. సమ శీతోష్ణమైన పుష్ప వన మారుతములను ఆలింగనము చేసికొని అందఱును, తాపమును వీడిరి. కాని, కృష్ణునిచేత అపహరించబడిన వ్రజాంగనలు తాపము గలవారయియే ఉండిరి. గోవులు, పక్షులు, మృగములు (లేళ్ళ), స్త్రీలు శరదృతుసంబంధముచేత పుష్పిణులై తమ వృషభముల(పతుల)చే అన్వీయమానలు అయిరి. ఈశ్వరుని సమస్త క్రియలు ఫలయుక్తములైనట్లు గో, ఖగ, మృగాదులు సంతానవతులయ్యెను. యోగ్యుడైన రాజువలన చోరుడు దక్క, అందఱును నిర్భయులైనట్లు, సూర్యోదయము వలన కుముదము (కలువ) దక్క, కమలము లన్నియు వికసించినవి. అసిద్ధులైన, అనగా ముక్తిని పొందని జీవులు ప్రళయానంతరము సృష్టికాలమున పూర్వార్జితమైన స్వీయ కర్మానుసారముగా శరీరములను పొందు నట్లు, వణిజులు (వ్యాపారస్తులు), మునులు, నృపులు, స్నాతకులు అందఱును వర్షఋతువు వలన ఆగిపోవుదురు. శరదృతువు వచ్చి నపుడు, వారు తమ తమ అర్థములను పొందుదురు.

"వణిఙ్ ముని నృప స్నాతా నిర్గమ్యార్థాన్ ప్రపేదిరే।
వర్షరుద్ధా యథా సిద్ధాః స్వపిండాన్ కాల ఆగతే॥"

# 2. వేణురవము

## సుధాతరంగిణి

వేణురవమందే శ్రీకృష్ణచంద్ర పరమానందకందస్వరూపము తన్మంగళమయ లీల ఉన్నది. కావున, వేణురవ వర్ణనము నందు ప్రభువైన శ్రీకృష్ణుని వర్ణనము కలదు. ప్రధానముగా శ్రీకృష్ణుడే రసామృతమూర్తి. ఆయనయందు గూడా సాధనత, సాధ్యత-రెండును గలవు. శ్రీహస్త, శ్రీచరణారవిందాది అన్యాన్య అవయవములందు సాధ్యత్వము, సాధనత్వము గూడా కలదు. కాని, ఆనందము కేవల సాధ్యము మాత్రమే. సమస్తము ఆ ఆనందము కొఱకే అయి ఉన్నది. కాని, ఆ ఆనందము మఱి ఎవరి కొఱకును కాదు. ఇదియే బ్రహ్మలక్షణము గూడ. కావున, రెండును, ఒకటియే. శబ్దాది సమస్త పదార్థములు ఆనందనిమిత్తమే అయినట్లుగానే ఆత్మనిమిత్తములై ఉండును.

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి।"

ఆనందము నిరతిశయము, నిరుపాధికము, పరమప్రేమాస్పదము. అట్లే ఆత్మ గూడా నిరతిశయము, నిరుపాధికము, పరమ ప్రేమాస్పదము. ఎవరియందు ఒకప్పుడు ప్రేమ ఉండుట, మఱొకప్పుడు లేకపోవుట ఉండునో, అతడు అపర ప్రేమాస్పదుడు. అట్లుగాక, నిరంతరము ప్రేమ కలవారు పరప్రేమాస్పదులు. ఔపాధికమైన ప్రేమ అపరము, స్వాభావికమైన ప్రేమ పరము. ఔపాధికమైన ప్రేమ ఉపాధివశమై ఉండును. స్వాభావికమైన ప్రేమ, ఉపాధ్యధీనమై ఉండదు. అది, నశించదు. ప్రపంచమునందలి సమస్త ప్రేమలు ఔపాధికములు. ఉదాహరణగా స్త్రీ, పుత్రాది ప్రేమలను గ్రహింపవచ్చును. ఇంతియే కాదు, ప్రపంచమునందు దేవతపై గల ప్రేమ గూడా ఆ దేవత అనుకూలుడుగా ఉన్నపుడే

కలుగును. మంత్రములందు గూడా కొన్ని శత్రు మంత్రములు, మరికొన్ని మధ్యమ మంత్రములు ఉండును. ఏ మంత్రము చేత అనుకూలమైన ఫలము కలుగదో, అది శత్రుమంత్రమగును. ఈ అభిప్రాయముతో సమానతత్త్వము, సమానసాధకుడు లభించినపుడు మంత్రసిద్ధి సరిగా కలుగునని చెప్పబడినది. సారాంశమేమనిన, దేవతలు సైతము, ఆత్మానుకూలురు అయినపుడే, వారలయందు ప్రేమ కలుగును. శైవులు వైష్ణవులను, వైష్ణవులు శైవులను ద్వేషించుట చూచుచున్నాము. వాస్తవమునకు, పూర్ణతముడు, పురుషోత్తముడు నయినప్రభువు ఒకడే. కాని,వ్యర్థముగా ఆయనయందు ద్వేషాస్పదత్వమును, రాగాస్పదత్వమును కల్పన చేయుదురు. రామభక్తులకు రామాయణమునందు ఏ మాధుర్యము గోచరమగునో, ఆ మాధుర్యమే అన్యగ్రంథములందు కలుగదు. బృందావనమునందైనచో, కృష్ణునియందు కలుగదు. బృందావనమునందైనచో, కృష్ణునియందు గూడా భేదమును భావింతురు. ఒకరు ఎడమవైపున ముకుటము ధరించిన శ్రీకృష్ణుని, మరొకరు కుడివైపునకు ముకుటము ధరించిన శ్రీకృష్ణుని భావింతురు. వాస్తమునకు కుడి, ఎడమలయందు గూడా కొంత రహస్యము కలదు. కొంత భావము అవశ్యము కలదు. వేణుగీత ప్రసంగమునందు ఎడమవైపున ముకుటము కలవాడే శ్రీకృష్ణుడు.

"వామబాహుకృత వామకపోలః ।"

భగవంతుని లలితమైన మూర్తియందు ముకుటము ఎడమవైపునకే ఒంగియుండును. వామాంగమునందు వృషభానునందిని విరాజమానయై ఉండును. అచట, శ్యామ సుందరుడైన శ్రీకృష్ణ పరమానందరూపుడు వామాంగమువైపునకే ఒంగియుండును. కావుననే ఆ పరిస్థితిలో ముకుటము ఎడమవైపునకు ఒంగియుండుట స్వాభావికము. శ్రీకృష్ణ, బలరాములు ఉన్నచోట, కుడిభాగము వైపునకు

కిరీటము ఒంగియుండును. నందుడు దక్షిణపార్శ్వమున, నంద రాణియైన యశోద వామపార్శ్వమునందును, మధ్యభాగమున బలరాముడు నందుని సమీపమున, శ్రీకృష్ణుడు యశోదాసమీప మున, ఉన్నప్పుడు ముకుటము కుడిభాగమున, బలరాముని వైపునకు ఒంగి యుండును. వాస్తవమునకు ఇదియే రహస్యము.

పైన చెప్పినదాని సారాంశ మేమనిన, ఆనందము నిరతి శయము, నిరుపాధికము, పరప్రేమాస్పదము. అన్యవిషయా నందము ఔపాధికము, సాతిశయము. ఆనందము, ఆత్మ ఒకే వస్తువు. ఆనందముతో ఎన్నడును, శత్రుత్వము కలుగనట్లే ఆత్మతోగూడా ఎన్నడును శత్రుత్వము కలుగదు. సర్వద్రోహము కలుగవచ్చుగాని, ఆత్మద్రోహము అన్నది ఉండదు. శ్రీకృష్ణుడు నిఖిల రసామృతమూర్తి, ఆనందసార సర్వస్వము. ఆయన, సాధ్య స్వరూపుడే గాని, సాధనము కాడు. కావున, పరప్రేమాస్పదుడు. కొందఱు భావుకులు ఈయనయందు గూడా తారతమ్యమును భావింతురు. ఆయనయందు గూడా అమృతమయ ముఖచంద్ర సుధ, సాధ్యమే గాని, దేనికిని సాధనము కాదని చెప్పుదురు కాని, భావుకులు, దానియందు గూడా దేవభోగ్యమైన అధరసుధ, భగవ ద్భోగ్యమైన అధరసుధకు సాధనమనియు, అది గూడా సర్వభోగ్య మైన అధరసుధకు సాధన మనియు చెప్పుదురు. పరస్పర భావా పన్నమైన, సర్వభోగ్యమైన ఆ అధరసుధ, కేవల సాధ్యము మాత్రమే గాని, దేనికిని, సాధనము కాదు. ఆ అధరసుధ వేణు రవముచేత అభివ్యక్తమగును. కావున, ప్రధానముగా ఇచట, వేణురవ వర్ణనము చేయబడినది.

ఆ రవమునందు, శ్రీకృష్ణచంద్ర పరమానంద కందము ఆయన లీల గూడా నిహితములు. కావున, భాగవతమునందు శ్రీశుక దేవుడు ఇట్లు అందురు.

"ఇతి వేణురవం రాజన్ ! సర్వభూతమనోహరమ్ ।
శ్రుత్వా వ్రజస్త్రియః సర్వా వర్ణయన్త్యోఽభిరేభిరే ॥"

ఈ వేణురవమునందు అమృతత్వము ఉపలబ్ధమగును. ఆ రవముచేత బ్రహ్మ, ఇంద్ర, సనకాదులు గూడా మోహితులగుదురు–

"శక్ర శర్వ పరమేష్ఠి పురోగాః కశ్మలం యయు
రనిశ్చిత తత్త్వాః ।"

ఆ రవము చేత పూర్ణతముడు, పురుషోత్తముడు నయిన ప్రభువు ప్రకటమగును. కావుననే, ఆ రవమునకు ప్రాధాన్యము. సాధారణముగా ప్రభువు సర్వత్ర, ఉండనే ఉన్నాడు. కాని, తదభివ్యంజకము లేనపుడు ఏమగును ? కావున, భావుకుడైన వ్యక్తి, భగవంతుని, అధికముగా వ్యంజితము చేయునామమును భగవంతుని కంటె గూడా అధిక మహనీయమని భావించును. కోట్లకొలది సంపద, ఇంటిలో నిండి పడియుండవచ్చును. కాని, అది ఉన్నదని తెలియకపోయిన, దాని ఉపయోగమేమి ? గృహస్థు, నాగలి దున్నుకొనుచునే ఉండును. నామము, నిధికి– ఖజానాకు బీజరము. పూర్ణబ్రహ్మ, పురుషోత్తమ ప్రభువు నిధి, నామము తద్బీజకము. గోస్వామి తులసీదాసుగూడా ఈ విషయమునే– నామముద్వారా ప్రయత్నించినపుడు, భగవంతుడు అభివ్యక్తమగును, బ్రహ్మ కంటె, నామమే శ్రేష్ఠ మనియు నామము మూల చికిత్స అనియు, రామచంద్రుడు పల్లవ చికిత్స అనియు చెప్పెను.

శ్రీరామచంద్రుడు, ఎలుగుబంట్లను, కోతులను సహాయముగా తీసికొని ప్రాకృతము, శతయోజనవిస్తీర్ణమునయిన సముద్రమును దాటెను. కాని, నామస్మరరణమువలన అపారమైన భవసాగరము శోషించును. కావున, నామము సర్వశ్రేష్ఠము. మహావాక్య శ్రవణము వలన, తత్త్వసాక్షాత్కార మగునని వేదాంతములు చెప్పుచున్నవి.

భగవత్సాక్షాత్కారమునకు మూలము శ్రవణ మనియే భక్తులు గూడా అంగీకరింతురు. నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారమునందు గూడా శ్రవణము అపేక్షితమే అగును.

వ్రజాంగనలకు గూడా ఉద్బుద్ధ ఉభయవిధ (సంయోగ, వియోగాత్మక) శృంగార రసాత్మమైన శ్రీకృష్ణుని కొఱకై వేణు రవమే అపేక్షితమైనది. కావున, ఆ వ్రజాంగనలు మూలమైన వేణురవమునే పట్టుకొందురు. దానివలననే శ్రీకృష్ణచంద్ర పరమా నందకందము అభివ్యక్త మగునని ఆ గోపాంగనలు మూల వేణు రవమునే పట్టుకొందురు. హృదయమునందు మొదటినుండియు, విరాజమానమగు నిర్గుణ పరబ్రహ్మ తత్త్వ సాక్షాత్కారము శ్రవణ, మనన, నిదిధ్యాసనముల ద్వారా మహావాక్యముల వలననే కలుగును. ఆవిధముగానే సగుణ, సాకార, సచ్చిదానంద పరబ్రహ్మ సాక్షాత్కారము గూడా తచ్చరిత్ర శ్రవణము, గుణ గణముల శ్రవణము చేతనే కలుగును. చరిత్ర శ్రవణము వలన, మొదట, చరిత్రనాయకుడైన భగవంతుని మానస రూపము ప్రకట మగును. ఆ మానసమైన భగవదీయ ధ్యానము చేయగా చేయుగా, భగవంతుని, ఆవరించియున్న మాయాయవనికాపసరణము చేత (మాయ అను తెర తొలగిపోవుటచేత) భగవంతుని దివ్యరూపము అభివ్యక్త మగును. ఈవిధముగా శబ్దముచేతనే భగవంతుని అభివ్యక్తి జరుగును. భగవంతుని చరిత్రల వలన, భగవన్నామము వలన భగవంతుడు అభివ్యక్తమైనపుడు, సాక్షాత్తుగా భగవదీయ ముఖ చంద్రునినుండి వినిర్గతమైన వేణుగీత పీయూషపానమువలన భగవంతుడు ప్రకట మగుట స్వాభావికమే. శబ్దము ప్రకాశకము, అర్థము ప్రకాశ్యము అగును. కావున, శబ్దబ్రహ్మ రూపములో వ్యక్తమైన భగవదధరసుధారము వలన భగవంతుడు అభివ్యక్త మగుట స్వాభావికము. ప్రవాహములన్నియు, తమవలన సంసృష్ట

మైన పదార్థము గంతవ్యస్థలము వైపునకు గొనిపోవును. కాని, వేణుధ్వనియొక్క విలక్షణ ప్రవాహము తనయందు సంస్పృష్టమైన తత్త్వమును తన ఉద్గమ స్థానమైన శ్రీకృష్ణునివైపునకే తీసికొని పోవును—

"సర్వః ప్రవాహః సర్వత్ర స్వానుకూల్యేన కర్షకః ।
వేణుధ్వనిప్రవాహస్తు ప్రాతికూల్యేన కర్షతి ॥"

ఆశ్చర్యముగా అందఱి ఆకర్షణము ఆ వైపునకే ఉండును. అట్టి స్థితిలో, స్వయముగా మాధవుడే ఆ వేణుధ్వనియందు ఆకర్షితుడగుచున్నప్పుడు, ఇతరుల విషయము చెప్పనేల ?

ఆ వేణురవమునే వర్ణించుచు, పరస్పరము అభిరమణము చేయుచుందురు. ఈ రవము ద్వారా పరమానందరూపము గూడా హృదయమునందు వ్యక్తమగును. 'కృష్ణ'పదముయొక్క అర్థమే, ఆనందము.

"కృషి ర్భూవాచకః శబ్దః ణశ్చ నిర్వృతివాచకః ।
తయోరైక్యం పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే ॥"

'కృష్'ధాతువుయొక్క అర్థము, భూ— సత్త, 'ణ' యొక్క అర్థము, నిర్వృతి—ఆనందము. అట్లు కాగా సత్త, ఆనందములు 'కృష్ణ'పదమునకు అర్థము. దీని అర్థము, ఒకానొక తమాల శ్యామల త్విట్, యశోదాస్తనంధయుడు నయిన శ్రీకృష్ణుడే అని చెప్పుననుటలో గూడా ఏమియును విరోధము లేదు. ఆయన యందు గూడా సత్తానందములు రెంటికిని ఐక్యము కలదు. స్వయం ప్రకాశ సత్తారూపమైన ఆనందము, ఆనందరూపమైన సత్త— రెండును ఒకే వస్తువు. సత్తారూపిణి వృషభానునందిని (రాధ), ఆనందరూపుడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణచంద్ర పరమానంద కందము, వృషభానునందిని-ఇరువురును, సత్తానందములు అభిన్నములైనట్లే, అభిన్నస్వరూపులు. ఆనందమునందు సత్త లేనిచో, సత్తా

రహితమైన ఆనందము అసద్రూపమగును. ఆ రీతిగానే ఆనంద విముక్తమైన శుద్ధసత్తగూడా ఉండదు. జడ పదార్థముల సత్త దూషితము, సవిశేషము, సప్రపంచము. కాని, శుద్ధ సత్త నిరుపద్రవము, నిర్విశేషమును అయిన ఆనందరూపమే. ఇతర సత్తలన్నియు వినశ్వరములు. విషయానందము వినశ్వరమే. కావున, అది సదానందము అగుట అసంభవము. ఇచట, ఆనందము, సత్త ఈ రెండును పరస్పర విశేషణములు. ఆ ఆనందము అబాధ్యము, జగదానందము బాధ్యము. శ్రీకృష్ణుని స్వరూపము వాస్తవికమైన సద్రూపము, ఆనందరూపము. అత్యంత అబాధ్యము, నిత్యము, స్వప్రకాశము నయిన వస్తువుతో 'సత్' కలిసినపుడు, దానియందు సాంసారికమైనదానికంటె విలక్షణత్వము, నిత్యత్వము వచ్చును. సద్వస్తువునందు ఆనందము కలియకపోయినచో, ప్రాపంచిక సత్త వచ్చును. కావున, సత్, ఆనందములు–రెంటిని కలిపితిమి. సత్, ఆనందములు ఎన్నడును పరస్పరము విముక్తములు కావు. కావుననే, వృషభానునందిని, శ్రీకృష్ణుడు–ఇరువురును పరస్పరము అంతరాత్మలు. ఒకటియే. మనినజలమునందు తరంగము లున్నట్లు, పరమ రసామృతమూర్తియైన శ్రీకృష్ణునియందు వ్రజాంగనలు ఉన్నారు. చంద్రునితో చంద్రికకు, సూర్యునితో కాంతికి అవిఘటితమైన సంబంధము ఉన్నట్లే, వ్రజాంగనలకు శ్రీకృష్ణునితో అవిఘటితమైన (విడదీయరాని) సంబంధము ఉన్నది. కాని, ఇంతకంటె, గూఢా అంతరంగసంబంధము కలదు. అమృతము ఉన్నచోట, మధురిమ ఉండును. అట్లే పరమ రసామృతమూర్తియైన శ్రీకృష్ణుడు ఉన్నచోట, ఆయనయొక్క మాధుర్యాధిష్ఠాత్రియైన వృషభానునందిని ఉండును. అమృతమునుండి మాధుర్యమును వేఱు చేసినచో అపుడు, అమృతత్వమే ఎక్కడిది? వేదాంతులు గుణ–గుణుల తాదాత్మ్యమును అంగీకరింతురు. కాన, సత్త, ఆనందరూపులైన

వృషభానునందిని, శ్రీకృష్ణుడు_ఇరువురును ఒకరే ఒకే సదానందే రూపుడైన భగవంతుడు గౌరతేజోరూపమున, శ్యామతేజోరూపమున రాధామాధవ ఉభయరూపమున అభివ్యక్తుడయ్యెను.

ఈ దృష్టితోనే, శ్రీకృష్ణుని అంతరమైన స్వరూపము వృషభాను నందిని అని, బాహ్యస్వరూపము పురుషుడనియు, వృషభానునందిని యొక్క అంతర స్వరూపము పురుషస్వరూపమని, బాహ్యస్వరూపము వృషభానునందిని యనియు చెప్పుదురు.

'హితహరివంశసంప్రదాయము'నందు తెల్లని, నీలమైన సీసాలలో శ్యామ, గౌర ద్రవము నిండియున్నట్లు వీరిరువురును ఉన్నారని చెప్పుదురు. రెండు సీసాలు ఒకే జాతికి జెందినవి. తెల్లని సీసా శ్యామహృదయమునకు సంబంధించిన వస్తువు. తెల్లని వర్ణము గల సీసాలో నీల ద్రవము, నీలవర్ణము గల సీసాలో గౌర ద్రవము నిండియున్నది. ఈ విధముగా శ్రీకృష్ణుడు, వృషభాను నందిని పరస్పరహృదయగత వస్తువులు. ఇరువురియందును పరమ అంతరంగత్వము కలదు. కావున, 'ఉభయులు ఉభయభావాత్మలు'. ఈవిధముగా ఆ పరమ తత్త్వము సంపూర్ణముగా వేణురవముద్వారా వ్యక్తమగును. పరమానందకందమైన శ్రీకృష్ణముఖ చంద్రుని అధరముతో సంశ్లిష్టమైన వేణువుయొక్క సౌభాగ్యమును జూచి, వృషభానునందిని, స్వయముగా ఇట్లనును_హేసఖి! నేను వంశ (వేణు) జన్మను యాచించుచున్నాను, కులవధువును కావలయునని కోరుటలేదు. ఏలయనగా వంశజన్మయందు శ్రీకృష్ణుడు స్వయము గానే, ఆసక్తితో నిరంతరము కలిసియుండును. కాని, కులవధువు అగుటయందైనచో ఆయన కలియుట దుర్లభ మగును_

యాచేఽహం వంశదేహం న తు కులజ వధూదేహ
మాద్యే హి కృష్ణః।
తృష్ణాభావేన సజ్జన్ బహురుచి విహరన్ దుర్లభః
స్యాత్ పరత్ర ॥"

ఇట్టి పరిస్థితిలో ఇటువంటి వేణురవమును విని ఎవరికి పరమ కళ్యాణము కలుగదు!

# 3. కిరాతాంగనల స్మరరోగము

"పూర్ణాః పుళింద్య ఉరుగాయ పదాబ్జరాగశ్రీ కుంకుమేన
దయితా స్తనమండితేన ।
తద్దర్శన స్మరరజ స్తృణరూషితేన లింపంత్య
ఆననకుచేషు జహు స్తదాధిమ్ ॥

శ్రీమద్భాగవతము నందలి వేణుగీతము నందు ఈ ప్రసంగము కలదు. ఒకమారు బృందావనధామవాసినులైన కిరాతాంగనలు అచట గల హరిత ఘాసాంకుర, దూర్వా,గుల్మాదుల యందు సంలగ్నమైన కుంకుమమును చూచిరి. ఆ కుంకుమ, భగవచ్చరణాంబుజముల స్పర్శచేత తృణగుల్మాదులయందు అంటుకొనెను. తద్దర్శన, స్పర్శన సౌగంధ్యములచేత కిరాతస్త్రీల మనస్సునందు స్మరరూపరోగము ఉదయించెను. 'స్మర' శబ్దమునకు కామము, లేక ఉత్కంఠతో గూడిన స్మరణము అని అర్థము. భావుకుల మతానుసారముగా బాహ్యరమణమునందు కామము అపేక్షితమగును, ఆంతరమైన రమణమునందు తాపము యొక్క అపేక్ష ఉండును. భగవద్విషయకమైన కామము ఆధిదైవిక దివ్య కామమన్నది అన్య విషయము. సువర్ణాంగుళీయకమునందు దివ్య రత్నసంబంధము కొఱకై ఎక్క, అపేక్షితమైనట్లుగానే వ్రజాంగనలకు, శ్రీకృష్ణసంబంధనిమిత్తమై కామము అపేక్షితమై ఉండెను. ఇది భూషణమే గాని, దోషము కాదు. ఏలయన, ఇతరుల విషయములో కామము నింద్యము. కాని, భగవచరణారవిందముల విషయమున, ఆ కామమే భూషణము. సాధారణముగా, ఒకానొక విరక్తునికి జాగతికమైన వైషయికమైన ఇచ్ఛ, లేక తృష్ణ ఉండుట

నింద్యము. పరమార్థమునందు ఇవన్నియు, లేకపోవుటయే ఉత్తమమని భావించబడును.

"తృష్ణాక్షయః స్వర్గపదం కిమస్తి ।"

తృష్ణ నశించుట సుఖమునకు మూలము. కాని, ఎచటైననూ ఈ సంతోషమే దూషణము గూడా అగును. ఎవరికైనను, భగవచ్చరిత్ర శ్రవణము, తద్దర్శనము మున్నగువానియందు సంతృప్తి కలిగినచో అది దోషముగా భావించబడదా? ఇచట ఎంత ఎక్కువగా అసంతృప్తి, లోభము, చంచలత్వము మున్నగునవి ఉండునో, అంత ఎక్కువ మంచిది. ఒక మహానుభావుడు ఇట్లు చెప్పెను –

"కృష్ణభావ రసభావితా మతిః క్రీయతాం
యది కుతోఽపి లభ్యతే ।
తత్ర మూల్యమవ లౌల్యమేకలం జన్మకోటి
సుకృతైర్న లభ్యతే ॥

కల్పకల్పాంతరముల, జన్మజన్మాంతరముల పుణ్య పరిపాకముచేత శ్రీకృష్ణవిషయకమైన అనురాగము కలుగును. కాని, ఆ అనురాగము పరిమితము కానప్పుడే దాని మహత్త్వము, దాని పూర్ణత్వము. శ్యామసుందరుడైన వ్రజేంద్రనందనుని కోటి కోటి కందర్పదళన పటీయసి అయిన మనోహర కాంతిని చూచుటకై సమస్త ప్రపంచమును మఱచిపోయినను, వ్యాకులపాటు పెరగుచున్నను, మనస్సు దడదడ కొట్టుకొనుచున్నను, అస్వాస్థ్యము కలిగినను, ధైర్యము జారిపోయినను, అపుడే, దాని మహత్త్వము, దాని సాఫల్యము. నెమ్మదినెమ్మదిగా చేయుచు వెళ్ళుము, ధైర్యము వహించి ఉండుమన్న సంతృప్తి ఎచటైనను, కలిగినచో, అది అనుచితము. భగవద్విషయమునందు ఎంత ఎక్కువగా వ్యాకులత, వ్యగ్రత పెరుగునో, అంత ఎక్కువగా అనురాగము

ఉత్కృష్టమగును. అందఱును, అత్యధిక వ్యాకులతకు లోనగుటయే ఆ బుద్ధి యొక్క మూల్యము. పుత్ర, ధన, దారా, గృహములు, స్నేహితులు లభించకపోవుటవలన అందఱకును, అధైర్యము కలుగును. అట్లు అధైర్యము కలుగుట స్వాభావికము. కాని, భగవంతునికొఱకై అధైర్యము, వ్యాకులత్వము, అస్వాస్థ్యము కలుగుట మహోన్నతమైన విషయము. కావున, లోకమునందు ఏది దోషమో, అదియే భగవద్విషయమున, భూషణము.

భగవత్సంబంధము వలన తృష్ణ, కామము, లోభము అన్నియును భూషణములు. భగవచ్చరణ సరోరుహ సంమిలనమునకై భక్తుని మనోమిళిందము (మనస్సు అను భ్రమరము) విలవిల తన్నుకొనినను, తచ్చరణ సరోరుహము యొక్క లోకోత్తర మాధుర్యమునందు లాంపట్యము చూపినను, ఇది, భక్తునికి మహా భూషణము. ఏ వృత్తివిశేషముచేత కామినీసంయోగమునకై కాముకుడైన వ్యక్తి, ఉత్కంఠితుడు, వ్యాకులితుడగునో, అదియే స్మరము (కామము). ఇటువంటి వృత్తివిశేషముచేతనే, వ్రజాంగనలకు శ్రీకృష్ణపరమాత్మ సంమిళనమునకై ఉత్కటమైన ఉత్కంఠ, వ్యాకులత కలదు. అదియే, స్మరము, లోకోత్తరప్రణయము. కాని, విషయ మేమనిన, ఏ వస్తుమహత్త్వమైనను, తత్స్వరూప, తద్విషయ, తదాశ్రయముల మహత్త్వము వలన కలుగును.

శ్రీకృష్ణుని చౌర్యము ఆశ్రయ మహత్త్వమువలన ఉత్తమము కావచ్చును. కాని, అది, స్వరూపముచేత నింద్యము. ఆశ్రయమునందలి సరసత్వము వలన, ఆశ్రిత వస్తువునందు సరసత్వము, ఉత్తమత్వము కలుగును. క్షారసాగర తరంగము క్షారముగా ఉండును, కాని, క్షీరసాగరతరంగములు క్షీరమయములై మధురములుగా ఉండును. ఈ విధముగానే భగవదాశ్రితమైన

వస్తువు, తదాత్మకమగును. ఇచట గల చౌర్యమహత్త్వము, ఆశ్రయమహత్త్వమువలన కలిగినది. కావుననే భక్తులచేత ఎక్కువగా సంకీర్తింపబడినది. సామాన్య వ్యక్తులు చేసిన చౌర్యము సంకీర్తింపబడకపోవుటయే కాక, ఎవరైనను చేసిన చౌర్యము తెలిసినపుడు, అతనితో సర్వవిధమైన సంబంధము త్యజించబడును. చౌర్యముతో అసత్యము కూడా సంబద్ధమై ఉండును. అసత్యము లేక, చోరకర్మయే జరుగజాలదు.

ఒకమారు, బాలకృష్ణుడు మన్ను తినెను. బాలసఖులు వ్రజేంద్రగేహినియైన యశోదతో దోషారోపము చేసిరి - 'అమ్మా! ఈ వేళ, కృష్ణుడు మృద్భక్షణము చేసెను.' బాలలీలోత్సవముచేత ముగ్ధురాలైన, పరమ సౌభాగ్యవతి అయిన యశోద కృత్రిమ కోపమును నటించుచు, శ్యామసుందరుడైన నందనందనుని చిన్న చిన్న సుకోమల హస్తములను రెంటిని తన చేతిలోనికి తీసికొనెను, రెండవ చేతిలోనికి బెత్తము తీసికొని 'లాలా! నేడు నీవు ఏల మన్ను తింటివి?' అని, అడిగెను. భగవంతుడు భయపడిపోయెను. 'ఇప్పుడు దెబ్బ పడును, కావున ఒక అసత్యము, చెప్పెదను' అని ఆలోచించెను. అంత, తల్లితో ఇట్లనెను -

"నాహం భక్షితవానంబ!" -

'నేను మన్ను తినలేదు.' యశోద బెదరించి ఇట్లనెను - 'నీ ఈ చెలికాండ్రు చెప్పుచున్నారే?' అపుడు, బాలకృష్ణుడు ఇట్లనెను -

"సర్వే మిథ్యాభిశంసినః"

'వీరు అసత్యము చెప్పుచున్నారు.' భగవంతుడు యశోదకు విశ్వాసము కలిగించుటకై, తన నిర్దోషిత్వమును ప్రదర్శించుటకై ఇట్లనెను - "నీకు విశ్వాసము లేనిచో, వీరంతా సమక్షములో నా నోరు చూడుము."

"సమక్షం పశ్య మే ముఖమ్"

ఇట్లు చెప్పుటవలన, తల్లికి విశ్వాసము కలుగుననియు, ఆమె నోరు తెరిపించి చూడదనియు భగవంతుడు ఆలోచించెను. యశోద గంభీరమైన వ్యక్తి.

"తర్హివ్యాదేహి"

'అట్లయినచో, నోరు తెరవుము' అని యశోద అనెను. ఇపుడు, భగవంతుడు చిక్కులో పడెను. అగతికముగా, వ్యాధుని వలన భయపడిన పక్షివలె, నోరు తెరచెను.

"వ్యాదత్తావ్యాహతైశ్వర్యః।"

నోరు తెరచినంతనే, దానిలో సాగర, భూధర, వనాదులు కన్పడినవి. యశుమతి భయపడెను. ఆమె చేతిలోనుండి బెత్తము జారిపోయెను. ఆమె, మూర్ఛితురాలయ్యెను.

కొందఱు టీకాకారులు భగవంతుని వచనములను సత్యములనియే ఋజువు చేయుచున్న కారణమున,

"నాహం భక్షితవాన్"

అను వాక్యమును ఇట్లు వ్యాఖ్యానింతురు –

"నాహం కించిత్ బాహ్యం భక్షితవాన్, కిన్తు సర్వం
మదన్తఃస్థమేవ।"

అనగా, నేను బాహ్యమైన పదార్థమును భక్షించలేదు; సర్వము నాలో ఉదరమునందే కలదని భావము. కాని, శ్రీ జీవగోస్వామి ప్రభృతులు 'భగవంతుడు అసత్యమునే పలికెననియు, అసత్యమునే పలుకవలయుననియు చెప్పెదురు. ఇచట, గల విషయమిది – భగవంతునికి రెండు శక్తులు కలవు – ఒకటి, మాధుర్యాధిష్ఠాత్రియైన మహాశక్తి, రెండు, ఐశ్వర్యాధిష్ఠాత్రియైన మహాశక్తి.

ఆ సమయమున, వ్రజనగరియందు మాధుర్యాధిష్ఠాత్రియైన మహాశక్తియొక్క సామ్రాజ్యమే ఉండెను. భగవంతుడు నందరాణి ఒడిలో లాలింపబడుచుండెను. ఐశ్వర్యాధిష్ఠాత్రియైన మహాశక్తి అపుడు ప్రవేశింపరానిదై ఉండెను. ఆ ఐశ్వర్యాధిష్ఠాత్రిశక్తి భగవంతుని సేవకై అవకాశమును అన్వేషించుచుండెను. చేతిలో బెత్తము తీసికొని, యశోద ఇపుడు, నా ప్రభువును, నా ప్రాణధనమును తాడనము చేయక ఉండదని ఆ ఐశ్వర్యాధిష్ఠాత్రిశక్తి చూచినది. అపుడు తన కౌశలముతో, భగవద్రక్షణకై ప్రయత్నించెను. యశోదకు భగవంతుని ముఖమునందు అనంత బ్రహ్మాండములు కన్పడెను. భావుకుల భావన ఎంతవఱకు గలదనిన, ప్రభువు, యశోదనుండి తనను రక్షించుకొనుటకై

"సమక్షం పశ్యమే ముఖమ్"

అని మాత్రము చెప్పివేసెను. వాస్తవమునకు ఆయన, తన ముఖమును తెరచి చూపించవలయునని తలంచలేదు. ఏలయన, బాలకృష్ణుడు మన్ను తినినాడు కదా! అయిన, ముఖము ఎట్లు తెరచుకొనెను? అనిన, మాతృకోపరవిరశ్మిద్వారా ఆ భగవంతుని ముఖకమలము తనంతట తానే వికసించెను.

తాత్పర్యమేమనిన, లీలారసమును పోషించునట్టి ఏతాదృశ అసత్యము దోషముగా పరిగణింపబడదు, గుణముగానే పరిగణింపబడును. భాగవతమునందు ఈ భావమును సూచించునట్టి కుంతీదేవి స్తుతి కలదు –

"గోప్యాదదే త్వయి కృతాగపి దామ తావత్,
యా తే దశాఽశ్రుకలిలాంజన సంభ్రమాక్షమ్,"

హే వ్రజేంద్రనందన హే శ్యామసుందర! అఘటిత ఘటనాపటీయసియైన నీ మాయచేత ముగ్ధురాలైన యశోద, త్రాడు తీసికొని, బంధింపసాగినపుడు

"వక్త్రం నినీయ భయభావనయా స్థితస్య"

తల క్రిందికి దించుకొనెను. నేత్రములు అశ్రుపూర్ణములయ్యెను, కాటుకతో కలిసిన కన్నీళ్ళు చంపలపైన జారినవి. ఆ కన్నీరు నీల కమలముయొక్క కోశమునందు హిమబిందులు లేక ముక్తా బిందువులు విరాజిల్లుచున్నవా అన్నట్లు ఉన్నవి.

"సా మాం విమోహయతి భీరపి యద్బిభేతి ।"

ఎవరివలన కాలముకూడా భయభీతమగునో, అతడు యశోదవలన భయపడుట నన్ను ముగ్ధురాలను చేయుచున్నది.

ఇది అంతయు అప్రాకృత తత్త్వమునందు ప్రాకృతము వంటి ప్రతీతి, అలౌకికతయొక్క భావము,

"నృణాం నిఃశ్రేయసార్థాయ వ్యక్తి ర్భగవతః ప్రభోః।"

ఆ అచింత్య, అనంత, అగ్రాహ్య, అలక్షణ, అవ్యపదేశ్య తత్త్వము సగుణ, సాకార, విగ్రహరూపములో ప్రకటమగుట, ఏ భావముతో నైనను, జనులకు ఆయనయందు ప్రేమ కలుగుట కొఱకును, వారి కళ్యాణముకొఱకు నయియే ఉన్నది. సహజమైన భావము రాగానుగాప్రీతి. రాగమువలన ప్రాప్తించినదానియందు విధి ఉండదు. ఆ విధి, అత్యంతము అప్రాప్తమైన దానియందే ఉండును, కాంతకు తన కాంతునియందు స్వాభావికమైన రాగము ఉండును. దేవతయందు విధిచే ప్రాప్తమైన రాగము ఉండును. సర్వేశ్వరుడు, సర్వశక్తిమంతుడు నయిన ప్రభువు ఈ ఆశయము తోనే, సహజమైన భావముతో ఉపాస్యుడగుటకై ప్రాకృతుడగును.

కామియైనవానికి కామినియందు రాగము జనించును, లోభి యైనవానికి ధనమునందు రాగము కలుగును. ఆ రాగమే సర్వ శాసకుడైన ప్రభువుపట్ల సహజము కావలయును. తల్లియొక్క

అనురాగము తన బాలకునిపట్ల కలుగును. అతడు ఎంత మలినముగా ఉన్నను, ఎంత దివ్య భవ్య రూపములో ఉన్నను, అనురాగము కలుగును. అటులనే సహజభావము ప్రభువుపట్ల కలుగవలయును. వ్రజేంద్రగేహినికి స్వాభావికమైన ఈ వాత్సల్యభావమే మన్మోహనుడైన శ్యామసుందరునిపైన ఉండెను.

కావుననే, శ్రీకృష్ణుని మృద్భక్షణలీలయందు బెత్తము తీసికొని కొట్టునట్టి మాధుర్యభావము కలదు. ఈ మాధుర్యభావ ప్రసంగమునందు భావవిహారి అయిన ప్రభువుయొక్క అసత్యభాషణమును ప్రకారాంతరముగా సత్యమని చెప్పుట మాధుర్యభావ పోషకుల దృష్టిలో వాస్తవమును తలక్రిందులు చేయుటయే అగును. ప్రకృతమున, ఈ అసత్యము, ఇదేవిధముగా చౌర్యము గూడా శ్రీకృష్ణుని ఆశ్రయమహత్త్వము చేత మహత్త్వసంపన్నమై ఉన్నది. క్షీరసముద్రము, లేక మధురసముద్రముయొక్క తరంగము మధురముగా ఉండునట్లే ఆనందసుధాసింధువైన ప్రభువుయొక్క లీలలన్నియు, మధురములు –

"మధురాధిపతే రఖిలం మధురం।"

వ్రజాంగనల 'కామము' విషయమహాత్మ్యముచేత పవిత్రమైనది. వారి కామము ఎవరియందు ఉండెను? అను విషయము ఇచట చూడవలసి ఉండును. ఆ కామము ఆ పూర్ణబ్రహ్మ, పురుషోత్తముడు నయిన శ్రీ శ్యామసుందరునియందే ఉండెను. శుద్ధమైన వివేచనమువలన, 'రసో వై సః' అను వచనము ననుసరించి అతడే – పరబ్రహ్మ అయిన శ్రీకృష్ణుడే – రసస్వరూపుడు. తద్వికృతరూపములే నవరసములు.

"సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్।"

అను శ్రుతివచనానుసారము సత్తు, ఒకటియే అని, శుభములు

అశుభములు సమస్తము ఆ సత్తయొక్క పరిణామములే అని తెలియవలయును. ఆ సత్త పుణ్యరూపముతో వివర్తితమై ఉపాదేయమగును. పాపరూపముచేత వివర్తమునొంది అనుపాదేయమగును. ఆ సత్తయే సమస్త విశేషాతీతమై శుద్ధసత్తయై ఉన్నది. 'శృంగారము' గూడా, తద్రసస్వరూపమైన సత్తయొక్క వివర్తమే. ఆలంబనము, లేక ఆశ్రయముయొక్క పవిత్రతవలన, లేక అపవిత్రతవలన దానియందు పవిత్రత, లేక అపవిత్రత ఆరోపించబడును. స్వతః, రసము, నిర్విశేషము, ప్రాకృత కామినీ కాముకులు ఆ రసమునకు ఆశ్రయములైనచోట, అది దోషమగును. కావుననే వారి శృంగారము దోషదుష్టము. అనేక సహస్రదినములు చేసిన బ్రహ్మవిషయకమైన మననము వలన గూడా అనేక జన్మల మలిన సంస్కారములవలన క్షణికమైన కాంతాదర్శనము, స్మరణము, చింతనమువలన ఎంత భావము కలుగునో, అంత భావము కలుగదు. స్థాపితములైన అనేక భావములు లుప్తములైపోవును. కాని, ఈ స్థితి అవలంబనము, లేక ఆశ్రయము దోషయుక్తమైనపుడే ఉండును. వ్రజాంగనలకు 'స్మరము' ఉన్నమాట నిజమే. కాని, ఎవరియందు కలదు ?

"నృణాం నిఃశ్రేయసార్థాయ వ్యక్తిర్భగవతః ప్రభోః।"

అను వచనము ననుసరించి మానవులకు కళ్యాణ మొనగూర్చుటకై సాకారరూపములో అభివ్యక్తమైన బ్రహ్మయందు స్మరభావము కలిగినది. ఆ బ్రహ్మయందు ఏవిధముగానయినను, జీవులకు ప్రవృత్తి కలుగుట వలన వారికి కళ్యాణమే కలుగును. ప్రేమతో గాని, భక్తితోగాని, కామ, క్రోధ, భయ, స్నేహాదులచేతగాని, భగవచ్చింతనము జరుగుటవలన కళ్యాణము కలుగును –

"కామం క్రోధం భయం స్నేహ మైక్యం సౌహృదమేవ చ।
నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే॥"

కంసునికి భయముచేత, శిశుపాలునికి ద్వేషముచేత, గోపాంగనలకు స్నేహముచేత, పూర్ణతమ పురుషోత్తముడైన పరబ్రహ్మ, కళ్యాణగుణగణనిలయుడు కళ్యాణదాయకుడునయిన శ్రీకృష్ణభగవానునియందు ఏకాంత (కేవల) దృఢనిష్ఠ కలిగెను. వేనమహారాజు గూడా భగవద్ద్వేషియే కదా! వానికి భగవద్విషయక మైన ఏకాంత దృఢనిష్ఠ ఏల కలుగలేదు? ఎవరు శ్రీకృష్ణభగవానుని లెక్కించి శత దూషణములు చేసెనో, ఆ శిశుపాలునికి ఏకాంత దృఢనిష్ఠ ఎట్లు కలిగెను? అని ప్రశ్నించవచ్చును. అందఱును, చూచుచుండగానే, వానినుండి ఒక జ్యోతి బయల్వెడలి, శ్రీకృష్ణుని ముఖమునందు లీనమయ్యెను. దీనికి కారణము స్పష్టమే. శిశుపాలునికి భగవంతుని అస్తిత్వమునందు దృఢ నిశ్చయము ఉండెను. వేనుడు ఈశ్వరుని అంగీకరించనే యంగీకరింపలేదు. అతడు తననే సర్వేశ్వరుడని ప్రఖ్యాత మొనర్చుకొనుచుండెను. ప్రాణి, భయము చేత, లేక కామముచేత ఎంత ఎక్కువ తన్మయత్వమును పొందునో, అంత తన్మయత్వము మఱొకవిధముగా పొందడని చెప్పబడినది –

"యథా కామాత్ భయాద్వాఽపి మర్త్యః
తన్మయతా మియాత్।"

శిశుపాలుని స్థితి, కంసుని స్థితి గూడా ఇదియే. కూర్చున్నను, నిద్రించుచున్నను, నడుచుచున్నను, తినుచున్నను, తిరుగుచున్నను, వారికి సర్వత్ర కృష్ణుడే కన్పించుచుండెను, వారికి సమస్త ప్రపంచము కృష్ణమయమై ఉండెను –

"ఆసీనః సంవిశం స్తిష్ఠన్ భుంజానః పర్యటన్ మహీమ్।
చింతయానో హృషీకేశ మపశ్యత్ తన్మయం జగత్॥

భ్రమరకీట న్యాయానుసారముగా జీవునియందు తల్లీనత ఉండవలయును. దృఢమైన అభినివేశముచేత అది లేనిచోట గూడా అది ప్రతీతము కావలయును.

"అస్తీత్యేవోపలబ్ధవ్యమ్ ।"

అనియే సిద్ధాంతము గూడా. కాని, వేనునికి ఈ నిశ్చయము లేదు. ఈ ప్రసంగమునందు గోపాంగనల కామము శిశుపాలుని ద్వేషము కంటె ఎంతయో అధికమైనది. వీరి నిష్ఠ అత్యంతము ఉన్నత మైనది. ఈవిధముగా వీరి కామము విషయమహిమ, లేక ఆలంబన మహిమకంటె మహామహిమోపేతము. కావున, ఏ వస్తు మహాత్మ్య మైనను, విషయమహత్త్వమువలన మహత్త్వ సంపన్నమగును.

ఈ ప్రసంగమున, ఒక గొప్ప సుందరమైన సూక్తి కలదు –

"ప్రథయతి నవనీత చోరతాం తే,
వ్రజయువతీజనజారతాం జనో యో ।
వితరసి నిజభావ మీశ తస్మై
స్వకృతధియో పరిగోపనాయ నూనమ్ ॥"

అనగా, హే ప్రభో! నీవు చేసిన వెన్నదొంగతనము, గోపికలతోటి నీ జారభావమును ఎవడు ప్రఖ్యాపనము చేయునో, నిన్ను 'జార చోరశిఖామణి' అను పేరుతో అపకీర్తిపాలు చేయునో, వానికి నీవు నిజభావమును – నీ రూపమును ఒసంగుదువు, నీలో విలీనము చేసికొందువు, ముక్తునిజేయుదువు. నీవు వానియందు దయతో గాక, అతడు వేఱుగా ఉండి నిన్ను నిందించుచు దిరుగుచుండునని అట్లు చేయుదువు. వానిని నీలో విలీనము చేసికొనినపుడు, అతడు గూడా నీవంటివాడే అగును గదా! అపుడు అతడు ఎవరిని నిందించును? ఇది, భక్త కవియొక్క నీ ప్రసాధనము – లీలా విశేషముపైన మధుర వ్యంగ్యవర్షము. దీని భావ మేమనిన, ఆ

విశుద్ధ పూర్ణతమ తత్త్వచింతనము చోర, జారరూపములో చేయ బడుటవలన గూడా పూర్ణ పదము లభించును. భగవంతుడైన శ్రీకృష్ణుడు వ్రజయువతీజనజారుడని చెప్పబడెను. ఈ జారుడు లౌకికజారుడు కాడు.

"జరయతి ఆత్మవిజ్ఞానం నిఃశ్రేయసమ్"

అను వచనముచేత ప్రఖ్యాతుడు, అనగా, నిఃశ్రేయసరూపమైన ఆత్మవిజ్ఞానమును జీర్ణింపజేయువాడు. అలౌకిక జారుడు. గోపికా జారుడు అలౌకిక పురుషుడు. ఇతడు,

"జరయతి అవిద్యా తత్కార్యాత్మకం ప్రపంచం
యః స జారః"

అనగా, అవిద్యను, తత్కార్యాత్మక ప్రపంచమును జీర్ణింపజేయు వాడని భావము.

"జరయత్యాశు యా కోశం నిగీర్ణ మనలో యథా ।"
"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున ।"

అను వచనముల ననుసరించి, ఇతడు (శ్రీకృష్ణుడు) అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయరూప పంచ కోశములను దగ్ధము చేయునట్టి జారుడు. ఉత్తప్తమైన, వియోగాగ్నిచేత సమస్త పాపతాపములను దగ్ధము చేయునట్టి జారుడు. ఇచట,

"వాతపతనుః న తదా మోఽశ్నుతే దివమ్ ।"

అనురీతిగా పరిపక్వమయ్యే విషయమే ఉండదు. కాని, నిర్నిమిత్త భావముతో భక్తి ఉన్నపుడే ఉండును.

"అనిమిత్తా భగవతీ భక్తిః సిద్ధేర్గరీయసీ ।"

అని చెప్పబడినది. చింతామణియందు దీపమను బుద్ధితో ప్రవర్తించినను, చింతామణియే లభించును. అరీతిగానే నిత్య,

శుద్ధ, బుద్ధ ముక్తస్వభావుడైన, పూర్ణతమ పురుషోత్తమునియందు జారబుద్ధితో ప్రవృత్తమైనను, అఖండ, అనంత, అచింత్య, అవ్యక్త కూటస్థ, సాక్షిభాస్యమైన తత్త్వమే లభించును. గోపికలకు వారి ఏకాంత దృఢనిష్ఠ వలన, ఆ తత్త్వమే లభించెను. ఈవిధముగా గోపికల కామము విషయమహత్త్వముచేత మహత్త్వసంపన్న మయ్యెను.

శ్రీకృష్ణవియోగతాపమును ప్రశమింపజేయుటకై కుంకుమ లిప్త వ్రజాంగనల వక్షోజములచేత శ్రీకృష్ణపాదపద్మములందు సంలగ్నమైన కుంకుమయే ఆయన గోచారణార్థమై (ఆవులను మేపుటకై) అడవిలోనికి వచ్చుటవలన తృణములకు అంటుకొనెను. దానిని చూచుటవలన, పుళిందునులకు - శబరకాంతలకు కామరూప రోగము జనించెను. అథవా,

''స్మరో వావ ఆశయా ఘాయాన్''

అను వచనానుసారము 'స్మర' శబ్దమునకు అర్థము ఉత్కటమైన ఉత్కంఠ. అపుడు, ఆ కుంకుమదర్శనముచేత ఆ కిరాతాంగన లకు సాక్షాత్తు, శ్రీకృష్ణుని దివ్యసౌందర్య, మాధుర్య, సౌందర్యోపేత మైన లావణ్యామృతమూర్తియొక్క తీవ్ర దర్శనాభిలాష కలిగెనని అర్థము వచ్చును. ఆ కోరిక పూర్తి కాకపోవుటవలన హృదయము నందు శ్రీకృష్ణవియోగతాపము తీవ్రముగా ఉదయించెను. ఆ తాపమును ప్రశమితము చేసికొనుటకై తృణములందు సంలగ్న మైన ఆ కుంకుమమునే అందఱు తమ ముఖములకు, వక్షఃస్థలము లకు పులుముకొనిరి.

''లింపన్త్య ఆననకుచేషు జహు స్తదాధిమ్ ।''

కాని, దీనిచేత గూడా వారి వ్యాకులత, వ్యగ్రత ప్రశమనము పొంద లేదు, విశేషించి, వృద్ధినొందసాగెను. అపుడు, ఈ కుంకుమము,

తమ ఆధికి – మానసికవ్యథకు కారణము కాదుగదా ? అని వారికి సంశయము ఉదయించెను. వెంటనే, వారికి ఆ నిశ్చయమే కలిగెను. వారు ఆ కుంకుమమును,

"ఆధిం మత్వా జహుః"

అనగా, మానసవ్యథకు కారణమని భావించి త్యజించివేసిరి. ఈ విషయమును గుఱించి శ్రీకృష్ణప్రణయప్రమత్తలైన గోపికలు తమ అవయవములందు సంలిప్తమైన కుంకుమము వ్రజేంద్రనందనుడైన శ్యామసుందరుని సుకోమల శ్రీచరణములయందు సంలగ్నమయ్యెను. దానిని చూచినంతమాత్రముచేతనే, ఈ పుళిందినులకు స్మరరోగము ఉత్పన్నమయ్యెను. సహించరాని మానసిక వ్యథ కలిగెను. కావుననే వారు దీనిని త్యజించిరి. ఓ సఖీ ! మనము మహా హతభాగ్యులము. మన ప్రియతముని అవయవములయందు సంలగ్నమైన వస్తువును చూచుటవలన గూడా జనులకు రోగము కలుగును అని అనుకొనుచుందురు. అథవా,

"తద్దర్శనస్మరరుజః"

అను వాక్యమునకు అర్థము ఆ భిల్లకాంతలు శ్రీకృష్ణచరణములందు సంలగ్నమైన ఆ కుంకుమమును చూచిరి, ఆఘ్రాణించిరి, స్పృశించిరి. దీనివలన, వారందఱును తమ మనోవ్యథల నన్నిటిని త్యజించిరి. అనగా, వారు భగవద్భావాపన్నలైరి అని భావము, ఇచట, జరిగిన విషయ మేమనిన, విలక్షణము, ఆకర్షకమునయిన తత్కుంకుమదర్శనాదులచేతనే ఆ కిరాతకామినులకు శ్రీకృష్ణదర్శన విషయకమైన తీవ్ర ఉత్కంఠ కలిగెను. శ్రీకృష్ణదర్శనము కలుగక పోవుటవలన వారికి తీవ్రాతితీవ్రమైన తాపము కలిగెను. ఉత్కటమైన ఉత్కంఠచేత తీవ్రతాపము కలిగినపుడే శ్రీకృష్ణపరబ్రహ్మదర్శనము లభ్యమగును. లేనిచో, కల్పకల్పాంతరములనుండి

యుగయుగాంతరములనుండి జీవుడు భగవద్విముఖుడైనపుడు వానికి తీవ్ర తాప మేల కలుగుటలేదు? కావున, ఉత్కటమైన ఉత్కంఠయే మొదట అపేక్షితము. దానికి మూలము గూడా ఆ కుంకుమయే. ఆ కుంకుమము సాధారణమైన కుంకుమము కాదు. విశేషించి, మొదట ఆ కుంకుమము వృషభానునందినియొక్క ఉరోజములందు సంలగ్నమై ఉండెను. తరువాత, అచటనుండియే శ్రీ వ్రజేంద్రనందనుడైన శ్రీకృష్ణుని శ్రీచరణములందు సంపృక్త మయ్యెను. తద్దర్శనముచేతనే పుళిందస్త్రీలకు శ్రీకృష్ణదర్శన సంబంధమైన తీవ్ర ఉత్సుకత కలిగెను. అది, పూర్తి కానందున, ఉత్పన్నమైన తీవ్రాతితీవ్రతాపమువలన వారి హృదయములందు అధికమైన దుఃఖము ఆవిర్భవించెను. ఆ దుఃఖమునందు అనేక కల్పముల దుఃఖములు ఇమిడిపోయి ఉన్నవి, దగ్ధమైపోయినవి. ఇంతియేకాక, కుంకుమపరంపరచేత పూర్ణతమ పురుషోత్తముని శ్రీచరణసంపర్కము చేత అధిక అనంతానంత గుణితమైన ఆనందము లభించెను. ఆ ఆనందము చేత వారు పరిపూర్ణలైరి, కృతకృత్యలైరి. శ్రీ వల్లభాచార్యుడు ఇట్లందురు - ఆ కుంకుమ దర్శనముచేత, తద్విలేపనముచేత ఈ భిల్లాంగనలయందు శ్రీరాధాస్వరూపము, లేక లక్ష్మీస్వరూపము ప్రవేశించెను. ఇది, ఒక విలక్షణతత్త్వము; వ్యాపకమైన వస్తువు. శ్యామసముద్రము నందు రాధాదేవి, మాధుర్యాధిష్ఠాత్రి అయిన మహాశక్తి. తత్త్వ జ్ఞానులు గూడా ఆత్మారాములైనపుడు, పూర్ణతమ పురుషోత్తముని రమణము బాహ్యవస్తువునందు ఎట్లు సంభవించును? అయిన, తన యందే రమణము నొందును. జానకీరమణులవలె, రాధారమణుల వలె, వాగర్థములవలె, జలతరంగములవలె అభిన్నులని శ్రీగోస్వామీ తులసీదాసు చెప్పుదురు. మహాకవి కాళిదాసు గూడా-

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ ॥"

అనుచు, శ్రీపార్వతీపరమేశ్వరులు, వాగర్థములవలె, అభిన్నులని చెప్పెను.

జానకీదేవి, రాధాదేవి, పార్వతీదేవి మున్నగువారు ఆ అఖండ, అనంత, అచింత్య, అవ్యక్త, ఆనందసాగరుడైన పరబ్రహ్మయొక్క తరంగాదులవంటి స్వీయ అభిన్న వస్తువులు. ఇంతకంటె గూడా అంతరంగమైన భావము జలమునకు, తన్మాధుర్యమునకు గల అభేదము. ఈ విధముగ ఆ పరమ తత్త్వమునకు తనయందే రమణము సంభవము. ఈ కిరాతాంగనలలో కుంకుమసంబంధముచేత శ్రీరాధారూపము ఉదయించెను. దాని వలన వారియందు ఆ అంతరంగతయే వచ్చెను. వారికి ఆ దివ్య తత్త్వరమణము అనుభవమయ్యెను. కావున, వారు "అధిం జహుః" – మానసికవ్యథను త్యజించిరి, పరిపూర్ణలయిరి. రాధకు శ్రీకృష్ణప్రభువు లభించినట్లే, కిరాంతాంగనలకు గూడా లభించెను. ఏలన,

"జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్యాధిష్ఠితమ్।"

అను వచనానుసారము ఆ పూర్ణతమ తత్త్వము సర్వత్ర అవ్యాహతముగా ఉన్నది. కావున, దీన హీనస్థితిలో గూడా నిరాశులు కావలసిన అవశ్యకత లేదు. ఉత్కటమైన ఉత్కంఠతో ప్రభుస్మరణము చేయుట, ప్రభువుతోటి సంబంధమును స్థాపించుకొనుట అవశ్యకము. అపుడు, కిరాతాంగనలవలెనే సర్వులును పరిపూర్ణులు కాగలుగుదురు.

శ్రీగోపీజనవల్లభః ప్రీయతామ్ ।

---

# 4. వ్రజభూమి

శ్రీ వ్రజరాజకిశోరుని ప్రేమయందు పరవశులైన భావుక భక్తుల సర్వస్వమైన శ్రీవ్రజతత్త్వము అపారము. మహామహిమోపేతము, వైభవసంపన్నము, ప్రకృతి–పాకృత ప్రపంచాతీతము. సాక్షాత్తుగా, శ్రీకృష్ణచంద్ర పరమానందకందమైన బృందావన చంద్రుని ధ్వజ, వజ్ర, అంకుశాదియుక్తము పరమ పావనము. యోగీంద్ర, మునీంద్ర, బ్రహ్మ, రుద్ర, ఇంద్రాదివంద్యమును అయిన పాదారవిందాంకితమైన వ్రజతత్త్వ సంబంధముచేత భూమి, తనను పరమ సౌభాగ్యశాలినిగా భావించెను. అహో ! ఎవరి కృపాకటాక్షమునకై బ్రహ్మ, ఇంద్రాది దేవాధిదేవులుసైతము ప్రతీక్షించుచుందురో, వైకుంఠాధిష్ఠాత్రి, సర్వసేవ్య అయిన ఆ మహాలక్ష్మియే ఎచట సేవకురాలై ఉండుటకు ఉవ్విళ్లూరుచుండనో, సర్వోన్నతముగా విరాజమానమగుచున్న ఆ వైభవమును ఎవరు వర్ణింపగలుగుదురు !

పరమారాధ్యచరణలైన వ్రజపురంధ్రీమణులు బృందావనమునకు నవయువరాజైన నందనందనుని ప్రాదుర్భావము వలన, వ్రజభూమికి సర్వాధిక విజయమని చెప్పిరి –

> "జయతి తేఽధికం జన్మనా వ్రజః శ్రయత ఇందిరా
> శశ్వదత్ర హి ॥"

లోకముకంటె, వేదముకంటె అతీతమైన దివ్యప్రేమ గల వ్రజయువతీజనము అచట, ప్రాణమును పణముగా పెట్టి, తమ ప్రాణనాథుడు, ప్రియతముడు నయిన పరమ ప్రేమాస్పదుని అన్వేషణములో, ప్రేమోన్మాదముచే ఉన్మత్తలై ఇటునటు ఊగుచుందురు.

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి ।"

అనగా, ప్రపంచమునందు అంతట గల సమస్త పదార్థములును, స్వాత్మసంబంధముచేతనే ప్రేమాస్పదము లగునని లోకము నందును, వేదమునందును ప్రసిద్ధమే. స్వదేహ, స్వపుత్ర, స్వకళత్రాదులు, స్వగృహ, గ్రామ, నగర, రాష్ట్రములు, చివఱకు ఇష్టదేవత గూడా స్వాత్మసంబంధులయియే ప్రియములగును. పరమాత్మ యొక్క స్వరూపాంతరములందు సైతము, స్వాత్మ సంబంధియైన ఇష్టదైవమునందు ఉన్నంత ప్రేమ ఉండదు. శర్కరాది మధుర, పదార్థసంబంధము వలన మాధుర్యములేని చూర్ణాదులు (శనగపిండి మొదలైన పిండిపదార్థములు) గూడా మధురము లనిపించును. అపుడు శర్కరాదులు స్వయముగా నిరతిశయ మాధుర్యసంపన్నములై ఉండుట నిర్వివాదసిద్ధము. అట్లే, ఏ స్వాత్మతత్త్వసంబంధము వలన, అనాత్మ గూడా ప్రేమాస్పదమగునో, ఆ స్వాత్మతత్త్వము, స్వయముగా నిరతిశయ, నిరుపాధిక ప్రేమాస్పదమన్న విషయముగూడా నిర్వివాదము. కాని, ఈ వ్రజసీమంతినులైనచో, తమ జీవనధనుడు, అశేష శిఖరాయమాణుడును అయిన నటచతురుని కొఱకే తమ ఆత్మను గూడా ప్రేమింతురు.

వారి భావమేమనిన, 'హే దయిత! ఓ చపలుడా! నీ సుఖము కొఱకే, మేము ఈ ప్రాణములను ధరించుచున్నాము. హే హృదయేశ్వర! ఈ దేహ, ప్రాణ, ఆత్మాదులు నీకు ఉపయోగించక పోయినచో, ఇవి నిష్ప్రయోజనములు. మేమందఱము, నీకొఱకే ఈ సౌందర్య, మాధుర్య, సౌగంధ్య, సౌకుమార్యాదులను రక్షించు కొనుచున్నాము. హే ప్రాణవల్లభ! నందప్రియపుత్ర! సమస్త సౌఖ్యజాతము, తచ్ఛేషి అయిన ఆత్మ - ఇవన్నియు, నీ లోకోత్తర, మనోహర, మందహాసమాధుర్య సుధాసింధువునకు

దిగదుడుపులే. అథవా, పాదారవిందగతమైన నఖమణిజ్యోత్స్నకు అత్యల్పవస్తువులవలె నగణ్యములే.

ఇటువంటి వ్రజరాజకుమారప్రేయసులైన వ్రజాంగనల పాదపద్మములచే సమలంకృతమైన మంగళమయ వ్రజధామము ధన్యము. ఆ వ్రజధామమందు నయనాభిరాముడు, ఘన శ్యాముడునయిన మన్మోహనుని మధుర మురళీనాదముచేత లోక త్రయమునందలి చరాచర ప్రాణులు చకితులగుచుండును. శ్రీకృష్ణ చంద్రుని ముఖపంకజమునుండి వినిర్గతమైన వేణుగీతపీయూషము వలన, పాషాణములు సైతము ద్రవించినవి. ప్రేమార్ద్రయై కళింద నందిని (కాళింది) మహేంద్రనీలమణివలె ఘనీభూతమయ్యెను. ఆ వ్రజభూమియందు గోవులు, ఛవిధాముడైన ఘనశ్యాముని పరమ కమనీయ మాధుర్యమును రెప్పపాటులేని (అనిమీలిత) నయన పుటములతో అధైర్యముతో ఆస్వాదించుచున్నవి. అచట, ప్రేమ పరవశములైన లేగదూడలు సుతవత్సలలైన జననియొక్క ప్రేమ ప్రసృత స్తన్యామృతపానమునకై ప్రవృత్తములయ్యెను గాని, వంశీ (వేణు) నినాదమంత్రముచేత ముగ్ధములయ్యెను. ఆ లేగ దూడల ముఖమునుండి పాలు బయటికి స్రవించుచున్నవి. లోపలికి ఆ పాలను తీసికొనవలయునన్న విషయము మఱచిపోయినవి. ఆ వ్రజభూమియందు మృగ, విహంగములుగూడా, అనేకవిధములైన ఉపచారములతో, ప్రియతముని ప్రసన్నతకై వ్యగ్రములై ఉన్నవి.

ఏ పరమ పావనధామమందు తరు, లతా, గుల్మాదులు గూడా వేణురంధ్రములనుండి బయల్వెడలిన శబ్దబ్రహ్మగా పరిణత మైన భగవదీయ అధరసుధాపాన మొనర్చి, కుట్మల, పుష్ప స్తబకాదిరూపమైన రోమాంచోద్గమఛద్మముతో మధుధారారూపమైన

హర్షాశ్రువిమోకముతో తమ దురంత భావమును వ్యక్తీకరించు చున్నవో, ఆ బృందావనధామమందు ప్రేమాతిశయము వలన ప్రభుపాదపద్మాంకితము, వ్రజభూమిగతము, బ్రహ్మాదివంద్యము నయిన రజస్సు (ధూళి) యొక్క స్పర్శకై నేడు గూడా, సమస్త తరులతలు వినమ్రము లగుచుండును. అథవా, మనోహరుడొసగిన నిర్భర ప్రేమభారము చేతనే వినమ్రము లగుచుండును. ఆ వ్రజ భూమియందలి ప్రతి వస్తువు, ప్రతి పరమాణువు, బలాత్కార ముగా జీవనధనుని జ్ఞప్తికి తెచ్చి, ప్రియతమునితోటి సంమిళనము నకు సంబంధించిన ఉత్కంఠను ఉత్తేజితమొనర్చును. ఆ వ్రజ భూమియందు నివసించునట్టి సౌభాగ్యశాలులయిన మహాపురుష ధౌరేయులకు అనంతకోటి బ్రహ్మాండనాయకుడు గూడా ఋణపడ వలసివచ్చెను. అట్టి వ్రజభూమి మహత్త్వమును ఏ శబ్దములలో, ఏ లేఖినిద్వారా వ్యక్తము చేయగలము ?

సత్యలోకప్రభువైన బ్రహ్మ, ఇట్లనెను - "హే నాథ! లోకోత్తర సౌభాగ్యశాలులైన ఈ వ్రజవాసులకు ఏమి ఒసగి, వారి నుండి ఋణవిముక్తుడవు కాగలవు ? అను విషయమును ఆలో చించుము, నా మనస్సు, నిశ్చయించుటకు అసమర్థమై, వ్యామోహిత మగుచున్నది."

శ్రీకృష్ణప్రభువు ఇట్లు సమాధానము చెప్పెను - "హే బ్రహ్మన్! నేను అనంతకోటి బ్రహ్మాండనాయకుడను. నాయొద్ద దివ్యాతిదివ్యములైన అనంత వస్తువులు కలవు. వానినొసగి వీరి ఋణమునుండి విముక్తుడను కాగలను. ఇక, నీకు ఇట్టి వ్యామోహ మేల ?

అంత, బ్రహ్మ ఇట్లనెను - "ప్రభో! ఈ అనంతానంత దివ్యవస్తుప్రదానముచేత నీవు ఈ ఘోషనివాసుల (బృందావన

వాసుల) నుండి ఉఋణుడవు (ఋణవిముక్తుడవు) కాజాలవు. ఏలన, అనంతకోటి బ్రహ్మాండాంతర్గతములైన దివ్యాతిదివ్య తత్త్వము లన్నియు, కేవల సుఖాభివ్యంజకములు. ఆ కారణము చేతనే ఉపాదేయములు కావచ్చును. కాని, ఆ అనంతకోటి బ్రహ్మాండగతములైన వ్యక్తసౌఖ్యబంధువుల పరమ ఉద్గమస్థానము, అచింత్య, అనంత సౌఖ్యసింధువు నీవే కదా! అపుడు, ఎవరి ప్రాంగణములో సాక్షాత్తుగా అనంత పరమానందసుధాసింధువే కందర్పకామితుడై, కాంతిమయమైన మూర్తి కలవాడై ధూళిధూసరితుడై విహరించుచుండునో, రసికేంద్రవర్గము నందప్రాంగణమందు ఏ అప్రమేయ, సబాహ్యాంభ్యంతరము నయిన తత్త్వమును ఉలూఖల నిబద్ధమని, దారుయంత్రము వంటిదని, వ్రజసీమంతినీ విధేయమని చెప్పెదురో, తుషారబందుస్థానీయ సౌఖ్యాభివ్యంజకమైన వస్తువు నొసగి, వారిని నీవు ఎట్లు ప్రసన్నులను చేయగలవు? కృతసంజ్ఞకమైన చతురంకద్యూతమును ఓడిపోయినపుడు, త్ర్యంక, ద్వ్యంక, ఏకాంకద్యూతములు గూడా తదంతర్భూతములే అగును. అథవా, సర్వతః, సంప్లుతోదకస్థానీయమైన మహాసముద్రమును పొందినపుడు, వాపీ, కూప, తటాకాదిగత జాలాపేక్ష ఉండదు. అట్లే, సౌఖ్యసుధానిధి, సర్వఫలాత్మస్వరూపుడైన ప్రభువు స్వాయత్తుడైనపుడు, ఫల్గు (రసహీన) ఫలములను ఏ వివేకి అపేక్షించును? కావున, హే గోపాలచూడామణే! నీవు, వ్రజనివాసివర్గముయొక్క ఋణమునుండి ఎట్లు ఉన్ముక్తుడవు కాగలవు?

చతురచూడామణి, బృందావన నవయువరాజు ఇట్లు పలికెను – "బ్రహ్మన్! అయినను, నేను స్వాత్మసమర్పణము ద్వారా వీరి ఋణమునుండి ఉఋణుడను అగుదును. నేనే సర్వఫలాత్మను అయినప్పుడు, నేను స్వాత్మసమర్పణముచేత గూడా వీరిని ప్రసన్నులను జేయగలుగుదును."

అంత, బ్రహ్మదేవుడిట్లనెను - "హే నాథ! ఆ స్వాత్మ సమర్పణమందువా, సర్వఫలసమర్పణీయమైన శ్రీచరణములను చంపవలయు ననెడి ఇచ్ఛతో (జిఘాంసతో) విషలిప్తస్తన్యపాన మును ఒసగునట్టి ద్వేషిణి అయిన ఆ పూతనకు స్వాత్మసమర్పణము చేసితివి. నీవు కుల, కుటుంబసమేతముగా వ్రజవాసులకు స్వాత్మ సమర్పణము చేసి, ఋణవిముక్తుడను కాగలని చెప్పినను, అదియు, సంగతము కాదు. ఏలన, పూతన గూడా కుల, కుటుంబ సమేతముగా నిన్ను పొందుటలో ఏమియును, వంచితురాలు కాలేదు. నీ స్వాత్మసమర్పణమందువా, బాలఘ్నియైన పూతనకు సైతము నీవు స్వాత్మప్రదానము చేయునంతటి మూల్యవిహీనమైనపుడు, భూమి, ధన, గృహ, మిత్ర, ప్రియ, సుతులను, ఆత్మను గూడా, నీ పాదారవిందమాధుర్యమునకు వ్రజవాసులైనవారు సమస్తమును సమర్పించుకొనుచుందురు. స్వాత్మసమర్పణమాత్రముచేత అట్టి వ్రజవాసులనుండి నీవు ఋణవిముక్తుడవు ఎట్లు కాగలవు ? మహాయోగులకుసైతము దుర్లభమైన స్వాత్మసమర్పణము, వారికి పర్యాప్తమని (చాలునని) చెప్పవచ్చును. కాని, విజ్ఞజనుల దృష్టిలో వ్రజధామవాసుల పదవి యోగీంద్రులకు సైతము దుర్లభము. ఎందుచేతననగా, యమ, ప్రాణాయామ, ప్రత్యా హారాదుల ద్వారా, బాహ్యవిషయములనుండి మనస్సును సంయత మొనర్చి, యోగీంద్రులు, అనుక్షణము ఏ తత్త్వాను సంధానమునకై ప్రయత్నము చేయుదురో, ఆ తత్త్వమందే, ఈ వ్రజవాసులకు స్వారసికమైన ప్రీతి కలదు. రాగము, ప్రాణుల అపార స్వాత్మసుఖమును అపహరించును. అందువలన, శత్రువు వలె రాగము పరిహరింపదగినది. కాని, సౌభాగ్యశాలులైన ఈ ఘోష (వ్రేపల్లె) వాసులకు ప్రియతముడవు, పరమప్రేమా స్పదుడవును అయిన నీ మంగళమయ స్వరూపమందే రాగము

కలదు. మోహము గూడా ప్రాణుల సహజస్వాతంత్ర్యమును అపహరించున దగుటచేత, సాక్షాత్తుగా శృంఖలా (గొలుసు) రూపము. కాని, వీరి మోహమందువా, నీయందే కలదు, వీరి రాగ మోహాది దోషములు సైతము భూషణరూపములే. కారణమేమనిన, భగవత్తత్త్వాతిరిక్తమైన ప్రాపంచిక విషయకములైన రాగాదులే త్యాజ్యములు. భగవద్విషయకమైన రాగాదిప్రేప్స (రాగాదులను పొందవలయునన్న కోరిక) ప్రతి ఒక ప్రేక్షావంతునకు అవశ్యము ఉండును. అతికష్టముమీద, వైరాగ్యమువలన గూడా విరాగము కలుగవచ్చును. గాని, ప్రేమమయుడైన భగవంతుని విషయమున, విరాగము కలుగదు. తాత్పర్యమేమనిన, సర్వ విషయములకు సంబంధించిన రాగత్యాగము వలన యద్విషయకమైన రాగముయొక్క ఉత్కట ప్రేప్స సంపాదింపబడునో, తద్విషయకమైన ఉత్కట రాగముతో గూడిన, ఈ ఘోషనివాసుల మహాత్మ్యముయొక్క ఒక కళతో నయినను, ఎవరు సామ్యమును పొందగలరు ?''

''ఏషాం ఘోషనివాసినా ముత భవాన్ కిం దేవరాతేతి న
శ్చేతో విశ్వఫలాత్ ఫలం త్వదవరం కుత్రాప్యయుం
ముహ్యతి ।
సద్వేషావివ పూతనాఽపి సకులా త్వామేవ దేవాఽఽపితా
యద్ధామార్థ సుహృత్ప్రియాత్మతనయ ప్రాణాశయా
స్త్వత్కృతే ॥

తావద్రాగాదయః స్తేనా స్తావత్ కారాగృహం గృహమ్ ।
తావన్మోహోఽంఘ్రినిగడో యావత్ కృష్ణ న తే జనాః ॥

ప్రభో! అనంతకోటి బ్రహ్మాండనాయకుడవైన నీవు స్వయముగా ఎవరికి ఋణపడియున్నావో, ఆ ఘోషనివాసుల మహిమను ఎవరు

వర్ణింపగలరు ? సత్యలోకాధిపతి, జగత్పితామహుడును అయిన బ్రహ్మకూడా, వ్రజభూమియందలి రజఃస్పర్శలాభార్థమైన వ్రజ బృందాటవియందు తృణ, గుల్మాదులుగా జన్మించునట్టి సౌభాగ్యమును అభిలషించును. ఇచట గల తృణ, గుల్మాదు లగుటకంటె గూడా వ్రజవాసుల చరణధూళియొక్క అభిషేకము లభించును గదా ! అని ఆ బ్రహ్మదేవుని ఆశ. ఆ వ్రజభూమియందు అంతర్గతములైన భగవంతునికి సంబంధించిన అనేక లీలాభూములు కలవు. అవి, శ్రీకృష్ణచంద్రవిషయకమైన ప్రీతిని ఉద్దీపింపజేయునట్టివి. యమునాపులినము, గోవర్ధనగిరి, కారడవి, కదంబవనము, నందగ్రామము, వర్షపాతము, ఉద్ధవకేదారము, చరణాద్రి మున్నగు మనోహర స్థానములు కలవు. అచటి ప్రతి పరమాణువు నందును, శ్రీకృష్ణప్రీతిని సంచరింపజేయునట్టి అద్భుతశక్తి దృష్టి గోచరమగును. వ్రజసదృశమైన కఠోర చిత్తముకూడా అచట, అకస్మాత్తుగా ద్రవీభవించును.''

శ్రీబృంధావనధామమైనచో, వ్రజభూమియొక్క సర్వస్వము, వ్రజభక్తుల పాదపంకజ రజస్సంస్పర్శలోభముచేత

''నోద్ధవోఽణ్వపి మన్న్యూనః''

అను వచనానుసారము, సాక్షాత్ శ్రీకృష్ణునికంటె గూడా అన్యూన (తక్కువకాని) మహాభాగవతుడైన ఉద్ధవుడు గూడా బృందావన ధామమునందు తృణ, గుల్మాదులు కావలయునన్న స్పృహను (కోరికను) ప్రకటించును –

''ఆసా మహో చరణరేణుజుషా మహం స్యాం,
బృందావనే కిమపి గుల్మ లతౌషధీనామ్ ।''

శ్రీమత్ప్రబోధానంద సరస్వతీప్రభృతులైన మహానుభావులు బృందావనధామముతకు బహిర్భూనములైన అనంత చింతామణు

లనే కాక, శ్రీహరిని గూడా, ఉపేక్షింపుడని సూచన చేయుచున్నారు.

"మిలన్తు చిన్తామణికోటికోటయః,
స్వయం హరిర్ద్వార ముపైతు సత్వరః।"

వేదాంతవేద్యుడు, పరిపూర్ణుడు, సచ్చిదానందఘనుడు నయిన పరబ్రహ్మ, నిరతిశయుడయిన కారణమున, తారతమ్యము లేనివాడయినను, బృందావనధామమునందు, ఎంత మధురముగా అనుభూయమానుడగునో, అంత, అన్యస్థలములందు కాడు. కావుననే భావుకులైన భక్తులు

"వ్రజే వనే నికుంజేచ శైశ్రీష్ట్య మత్రోత్తరోత్తరమ్।

అను వచనానుసారము ద్వారకయందుగల, మధురయందు గల శ్రీకృష్ణునికంటె అతిరిక్తుడైన శ్రీకృష్ణునియందు గూడా వ్రజస్థ, బృందావనస్థ, నికుంజస్థ భేదముతో తారతమ్యమును అంగీకరించిరి.

దీని అభిప్రాయమేమనిన, ఒకేవిధమైన స్వాతిచినుకు స్థల వైచిత్ర్యముచేత విచిత్రమైన పరిణామము కలదగును. స్వాతి చినుకు శుక్తికయందు పడి ముత్యముగాను, వెదురుచెట్టుమీదపడి వంశలోచనముగాను, గోవుయొక్క కర్ణమునందు పడి, గోరోచనము గాను, గజపర్ణమునందు పడి గజముక్తారూపముగాను పరిణ మించును. అట్లే, వేదాంతవేద్యమైనతత్త్వము ఏకరూపమయి గూడా అభివ్యంజకమైన స్థలముయొక్క స్వచ్ఛత్వ తారతమ్యము వలన, అభివ్యక్తి తారతమ్యము ఉండుటవలన తారతమ్యో పేతమై ఉంచును.

సూర్యతత్త్వము నిర్మలజలము, గాజు మొదలగువాని యందు అభివ్యక్తమైనట్లు, కాష్ఠము, కుడ్యము మొదలగు అస్వచ్ఛ

పదార్థములందు, అభివ్యక్తము కాదు. ఆ రీతిగానే బ్రహ్మతత్త్వాభివ్యక్తి నిర్మలము, విశుద్ధములైన స్థలములందు అభివ్యక్తమైనట్లు రాజస, తామస స్థలములందు అభివ్యక్తము కాదు.

ఈ నిర్మలత్వము భౌతిక ప్రపంచమందు స్పష్టముగా అనుభూయమానమగునట్లుగానే త్రిగుణాత్మక ప్రపంచమందు, గుణవిమర్ద వైచిత్ర్యము వలన, ఒకచోటున, ప్రత్యక్ష, అనుమాన ప్రమాణముల చేతను, మఱొకచోటున, ఆగమముల చేతను, శ్రుతార్థాపత్తి చేతను తారతమ్యోపేతమై జ్ఞాతమగును. కావుననే, ఒకచోటికి పోవుట వలన అచట అకస్మాత్తుగా చిత్తప్రసాదము మఱొక స్థలమున చిత్త క్షోభము మున్నగు చిహ్నముల ద్వారా గూడా స్థలవైచిత్ర్యాను భూతి కలుగును. వ్రజ వన, నికుంజములందు క్రమముగా ఒక దానికంటె మఱొకదానియందు వైచిత్ర్యము కలదు. అచట, పూర్ణ, పూర్ణతర, పూర్ణతమ రూపముతో ఒకే శ్రీకృష్ణచంద్ర పరమానంద కందము అభివ్యక్తమగును.

తీర్థములందు ఈ విశేషము ప్రత్యక్షసిద్ధము. ఏ తీర్థమందు ఎంత సాత్త్వికత, ఎంతశక్తి ఉండునో, అచట, అంత సరళముగా ప్రభువుయొక్క విశేషానుభూతి కలుగును. కాని, కామినీ రూపము కాముకులపైననే ప్రభావము కలిగించును. సర్ప, వ్యాఘ్రాదులను చూచుటవలన భీరువైన వ్యక్తికే అధికమైన ఉద్వేగము కలుగును. అటులనే, సాత్వికపురుషుని, భగవత్పరాయణుడైన వ్యక్తిని తీర్థగతములైన విలక్షణశక్తులు ప్రభావాన్వితుని చేయును. ఆవిధమైన ప్రభావము కొద్దియో, గొప్పయో, సర్వ విధములైన వ్యక్తులకు కలుగును. అయినను, అది వ్యక్తము కాదు. కాని, శ్రుతార్థాపత్తిద్వారా తీర్థస్థానములందు శక్తి వైలక్షణ్యము అవశ్యము జ్ఞాతమగును.

భక్తులు, వ్రజతత్త్వమును హితతమము, వేదవేద్యము నయిన ప్రేమతత్త్వస్వరూపమే శరీరమే అని భావించిరి. ప్రేమతత్త్వముయొక్క వ్రజధామస్వరూపమైన దేహమునందు వ్రజనవయువతీజనము ఇంద్రియరూపిణిలు. మనఃస్వరూపము రసికేంద్రవర్గ మూర్ధన్యమణియైన వ్రజరాజకిశోరము (శ్రీకృష్ణుడు) ప్రాణరూపమైన ప్రజ్ఞాస్థానమునందు శ్రీవ్రజనవయువతీకదంబముకుటమణి, కీర్తికుమారియునయిన రాధాదేవి కలదు. ఇచట –

"ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః॥

అను శ్రుతిననుసరించి, దేహము ఇంద్రియములకు, ఇంద్రియములు మనస్సునకు, మనస్సు ప్రాణరూపమైన ప్రజ్ఞకు పరతంత్రములై ఉండును. (ఇచట, "యో వై ప్రాణః సా ప్రజ్ఞా" అను శ్రుతి వాక్యానుసారము క్రియాశక్తిప్రధానమై ప్రాణమునకు, జ్ఞానశక్తి ప్రధానమైన ప్రజ్ఞకు ఐక్యము వివక్షితము,) పూర్వపూర్వ వస్తువునకు ఉత్తరోత్తర వస్తువునందే సమ్మిళనము కలుగుట వలన తద్రూపత్వమే కలుగును. ఆవిధముగానే వ్రజభూమి, శ్రీకృష్ణప్రేయసులైన వ్రజాంగనలచేత విభూషితమైన వారికి అధీనమై ఉండును. వ్రజవనితాజనమునకు జీవనము శ్రీవ్రజేంద్రకుమారుడు. శ్రీకృష్ణ హృదయమునకు అధీశ్వరి, ప్రాణాధిక రాధిక. ఆ రాధిక కేవలము ప్రేమసుధాజలనిధియందే పర్యవసితయగును.

ప్రేమమయమైన వ్రజభూమి, ప్రేమోద్రేకమందు వ్రజాంగనారూపమే అగును. వ్రజాంగనలు.

"అసావహం త్విత్యబలా స్తదాత్మికాః।"
"కృష్ణోఽహం పశ్యత రతిమ్।"

ఇత్యాది వచనముల ననుసరించి శ్రీకృష్ణభావరసభరితయై నంద నందనస్వరూపిణి అగును. రసిక శిరోమణియైన శ్రీకృష్ణుడు ప్రేమోన్మాదమందు నిజ ప్రేయసియైన వృషభానునందినీ స్వరూపుడగును. శ్రీరాధిక, సాక్షాత్తుగా తన ప్రియతమునితో ప్రేమస్వరూపమునందే నిమగ్నురాలగును.

ఈవిధముగా సాక్షాత్తు వేదాంతవేద్యమైన పరమ రసాత్మక సుధాజలనిధికి సంబంధించినదియే అయిన దివ్యవికాస ప్రేమ మయ తత్త్వము దానియందే పర్యవసిత మగును. ఈ విధముగానే అనాది, అనంత రససాగరమందు రసమయులైన ప్రేయసీప్రియ తములు, వారి పరికరమునకు సంబంధించిన రసమయ లీలాధామ మైన అప్రాకృత వ్రజభూమిగూడా రసమయమే అయి ఉన్నది.

వ్రజభూమియందు మాధుర్యశక్తియొక్క ప్రాధాన్యము ఉన్నను, ఒకప్పుడు ఐశ్వర్యశక్తియొక్క వికాసముగూడా, తప్పక జరుగును. ఏలన, మాధుర్యశక్తికే అధికమైన ఆదరము ఉన్నను, ఐశ్వర్యశక్తి రూపుదాల్చి ప్రభుసేవ చేయునవకాశమునకై ప్రతీ క్షించుచుండును. ప్రభువు గూడా ఆ ఐశ్వర్యశక్తిని పూర్తిగా తిరస్కరించడు. ఈ కారణముచేతనే మృద్భక్షణాది లీలలయందు ముఖాంతర్గతమైన బ్రహ్మాండప్రదర్శనాదులైన ఐశ్వర్యశక్తి కార్యములు చూచుదుము. కావున, విశుద్ధమైన మాధుర్యాభావాభి వ్యక్తి, బృందావనధామమునందే అంగీకరించబడును.

అనంతకోటి బ్రహ్మాండాంతర్గతములైన సౌఖ్యబిందువుల పరమ ఉద్గమస్థానమైన ఏ అనంత సౌఖ్యసుధాసింధువు కలదో, దానిని మథించినపుడు సారాతిసారభూతము, నవనీతస్థానీయము నయిన ఏ తత్త్వము కలదో, దానిని గూడా మరల వేయిమార్లు, కోటిపర్యాయములు మథించినపుడు ఏ పరమ దివ్యతత్త్వము

వినిఃసృతమగునో, అదియే, బృందావనధామ స్వరూపము. కారణ రూపమైన అక్షర బ్రహ్మయే సర్వవ్యాపకమైన వైకుంఠము, బృందావనము.

కార్యకారణాతీతము, వేదాంత పరమ తాత్పర్యమునకు విషయభూతము, పరమతత్త్వమునయిన శ్రీకృష్ణుని అభివ్యక్తి స్థలము కారణాత్మ అయిన అక్షరమే అయి ఉన్నది.

''పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి।''

''విష్టభ్యాహ మిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ।''

ఇత్యాది శ్రుతి స్మృతి వచనముల ననుసరించి మాయావిశిష్టమైన కారణబ్రహ్మ ఏకపాద్విభూతి. దానిపైన త్రిపాద్విభూతి అయిన అమృతము కలదు.

వేదాంతవేద్యము, కార్యకారణాతీతమునయిన పరమ తత్త్వమునే బృందావనమని భావించునట్టి మహానుభావుల సిద్ధాంత మందు అచట ఉన్న కృష్ణతత్త్వము అవైదికమే అగును. ఇంత మాత్రముచెప్పిన చాలును. ఏలయనగా, ఒకే వస్తువునందు ఆశ్రయాశ్రయిత్వము అసంభవము.

''అవ్యాకృత మనన్తాఖ్య మాసనం యదధిష్ఠితమ్ ।''

అను వచనము ననుసరించియు, 'అనంత' అను పేరు గల అవ్యాకృతమే, భగవంతుని ఆసనము. ఆదిశేషువు గూడా, ఆ అవ్యాకృతముయొక్క నామమే.

''శిష్యతే అవశిష్యతే ఇతి శేషః''

అనగా అవశిష్టమై ఉన్నదే 'శేష' శబ్దవాక్యము. కార్యముయొక్క ప్రళయానంతరము కారణమే శేషించి ఉండును. ఆ కారణము

ప్రళయ మొందుటకు దానికి మఱొక కారణాంతరము లేదు. కారణము సప్రపంచము, నిష్ప్రపంచము నయిన బ్రహ్మకు అదియే, నివాసస్థానము.

"బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమ్"

అను భగవద్వచనానుసారము సగుణ కారణబ్రహ్మయొక్క, ఏక పాదస్థానీయముయొక్క ప్రతిష్ఠ

"త్రిపాదూర్ధ్వ ఉదైత్"

ఊర్ధ్వము, అనగా కార్యకారణములందు అంతర్యామితుడు కాని, బ్రహ్మ, పరమాత్మయే.

కొందఱు మహానుభావుల సిద్ధాంతమందు వ్యక్తమైన ఈ బృందావనమే అక్షరబ్రహ్మవ్యాపియైన వైకుంఠము. కాని, దాని ఆ స్వరూపము అభావితమైన, అనగా భావింపబడని అంతఃకరణము గల వ్యక్తికి ఉపలబ్ధము కాదు. అద్వైతసిద్ధాంతమందు సమస్త ప్రపంచము బ్రహ్మస్వరూపమే. కాని, శాస్త్ర, ఆచార్య ఉపదేశ జన్యములైన సంస్కారములచేత సంస్కృతమైన అంతఃకరణము గల పురుషధౌరేయులకే అది ఉపలబ్ధమగును. కావుననే, అద్వైత సిద్ధాంతమందు పరినిష్ఠితులైన ప్రబోధానందసరస్వతీస్వామి బృందావనమును సచ్చిదానందమయమని చెప్పుచునే ఇట్లనిరి -

"యత్ర ప్రవిష్టః సకలోఽపి జంతుః ఆనందసచ్చిత్
ఘనతా ముపైతి ।"

బృందావనమందు ప్రవేశించినంతనే కీటపతంగాదులు గూడా ఆనందమందు సచ్చిద్ఘనస్వరూపము కలవగునని భావము. కాని, తాదృశమైన ప్రతీతి. ప్రాకృతసంసర్గము పూర్తిగా లుప్తము కానంతవఱకు కలుగదు.

జీవుడు, స్వభావముచేతనే చేతనుడు, అమరుడు, సహజ సుఖరాశి. కాని, అవిద్యకమైన అనాత్మసంసర్గముచేత అనేకానేక అనర్థపరిప్లుతుడై ప్రతిభాసించుచుండును. విద్యచేత అవిద్య తొలగి పోయినపుడు ఆ జీవునికి స్వాభావికమైన స్వరూపము వ్యక్త మగును. కావుననే భగవంతుని అభివక్తి స్థలమే బృందావనమని చెప్పుదురు.

భగవదాకారాకారితమైన వృత్తియందు భగవత్తత్త్వము అభి వ్యక్తమగును. దానిని గూడా 'బృందావన'మని అందురు. ఈ విధముగా సాభాసమైన అవ్యాకృతమును, సాభాసచరమవృత్తిని గూడా బృందావనమని అందురు. కావుననే, ఏ మహానుభావులు బృందావనమును ఉపాసించువారై కూడా, ప్రసిద్ధమైన బృందా వనమందు ప్రారబ్ధవశమున, ఉండజాలరో, వారు గూడా వ్యాపి యైన వైకుంఠము, కారణతత్త్వస్వరూపమైన బ్రహ్మ, వ్యాపక మగుటచేత తత్స్వరూపమైన బృందావన ప్రాకట్యమును శక్తి బలముచేత ఎచటైనను ఉండియు సంపాదింతురు. భావుకులైన భక్తుల దృష్టిలో నిత్యనికుంజము, బృందావనముకంటె గూడా అంతరంగమని భావింపబడును. నిత్యనికుంజమందు. వృషభాను నందినీస్వరూప మహాభావముచే పరివేష్టితుడు. శృంగారరస స్వరూపుడు నయిన శ్రీకృష్ణచంద్ర పరమానందకందము నిత్యము రసాక్రాంతుడై ఉండును. ఇచట, ప్రియా, ప్రియతముల సర్వ దిగ్గతమైన, సర్వాంగిణమైన సంప్రయోగభావము కూడా నిరంతరము ఉండును. సన్నిపాతజ్వరాక్రాంతుడైన వ్యక్తి, శీతల ,మధుర జలమును త్రాగినపుడే పూర్ణమైన పిపాసను (విపరీత మైన దప్పికను) గూడా అనుభవించును. ఆరీతిగానే నిత్యము నికుంజధామమందు, ప్రేయసీప్రియులు పారస్పరిక పరిరంభణ

జన్యమైన రసమందు నిమగ్నులగుదురో, ఆ సమయముననే తీవ్రాతితీవ్ర వియోగజన్యమైన తాపమును అనుభవింతురు.

సారసపత్నియైన లక్ష్మణ, కేవల సంప్రయోగకాలరసమునే (ఆనందమునే) అనుభవించును. చక్రవాకి, విప్రయోగ(వియోగ) జన్యమైన తీవ్ర తాపానంతరము, సహృదయైకవేద్యము, సంప్రయోగజన్యము నయిన అనుపమ రసమును ఆస్వాదించును. కాని, అది గూడా విప్రయోగకాలమందు సంప్రయోగజన్యమైన రసాస్వాదనమునుండి వంచితయై ఉండును. కాని, నిత్యనికుంజమందు నికుంజేశ్వరికి, తన ప్రియతముడు, పరమప్రేమాద్పదుడు నయిన శ్రీవ్రజరాజకిశోరునితో, సారసపత్నియైన లక్ష్మణకంటె, శతకోటి గుణితమైన దివ్యసంప్రయోగజన్య రసానుభూతి కలుగును. ఇంతియేగాక, చక్రవాకికంటె, శతకోటిగుణితముగా అధిక విప్రయోగజన్య తీవ్రతాపమును అనుభవించిన తరువాత, పునః దివ్యరసానుభూతి కలుగును. 'ఎన్నడును కలియలేదా అనునట్లు కలిసియుండవలె'నని భావుకుల కథనము.

భక్తుల భావనారాజ్యము కల శూన్య నికుంజమందే ప్రియతముడు సంకేతితమైన సమయమునకు వచ్చును. మఱి యొకరి సాన్నిధ్యమందు రాడు. అట్లే వేదాంతుల సాన్నిధ్యమున గూడా భగవంతునికంటె వ్యతిరిక్తములైన సమస్త దృశ్యపదార్థముల సంసర్గము వలన శూన్య, నిర్వృత్తిక, నిర్మల అంతఃకరణమందే, 'తత్' పదార్థము అభివ్యక్తమగును.

సర్వవ్యాపారరహితమైన సంపూర్ణ ప్రతీక్షయే ప్రియతమ సంగమమునకు అసాధారణ హేతువు. అట్లే వేదాంతుల దగ్గర కూడా, పూర్ణ ప్రతీక్ష, అనగా, కాయిక, మానసికాది సర్వచేష్టలు

నిరుద్ధములైనపుడే 'త్వం' పదార్థమునకు, 'తత్' పదార్థముయొక్క సంగమము (ఐక్యము) లభించును. సర్వదృశ్యసంసర్గశూన్యము నిర్వృత్తికము, నిర్మలము నయిన అంతఃకరణమనెడి నికుంజ మందు పూర్ణ ప్రతీక్షాపరాయణము, వ్రజాంగనాభావాపన్నము నయిన 'త్వం' పదార్థము శ్రీకృష్ణస్వరూపమైన 'తత్' పదార్థముతో యథేష్టమైన తాదాత్మ్యసంబంధమును పొందును. సంక్షేపముగా ఇదియే వ్రజధామతత్త్వము, రహస్యము.



# 5. వేణుగీతము

వేణుగీతమందు గోపాంగనల ఆసక్తికి సంబంధించిన వర్ణనము కలదు. వర్షర్తు, శరదృతువుల ప్రభావముచేత బృందా వనభూమి నానావిధ పుష్పసౌరభసంపన్నమయ్యెను. బృందా వనమునుండి వచ్చినట్టి పరమ సౌగంధ్య, సౌరస్యసంపన్నమైన అనేకవిధముల పుష్పములందలి సమశీతోష్ణవాయువును ఆలింగనము చేసికొని, బృందావన, వ్రజములందలి సర్వ జనులు తిగ్మరశ్మి జన్యమైన తాపమును మఱచిపోయిరి.

కాని, గోపాంగనలకు, నిరతిశయుడు, నిరుపాధికుడు, పరమ ప్రేమాస్పదుడు, ప్రియతముడును అయిన శ్రీకృష్ణుని వియోగమువలన కలిగిన తాపము ప్రశమనము పొందలేదు.

"ఆశ్లిష్య సమశీతోష్ణం ప్రసూత వనమారుతమ్ ।
జనా స్తాపం జహు ర్గోప్యో న కృష్ణహృతచేతసః ॥"

శ్రీ శుకమునీంద్రుడు పరీక్షిన్మహారాజుతో ఇట్లనెను – వర్షా కాలము గడచినంతనే శరదృతువు వచ్చెను. అపుడు, బృందా వనమునందలి సరిత్ సరోవరాది జలాశయముల జలముస్వచ్ఛము, నిర్మలమును అయ్యెను. నానావిధములైన కుముద – కుముదినీ, కమల–కమలినీ సముదాయముల మనోహర, సురమ్య సుగంధము చేత సుగంధితమైన మంద, శీతల సమీరముచేత బృందావన ధామము పరమ రమణీయ మయ్యెను. ఆ సమయమునకే పరమా నంద రసామృతమూర్తి, భగవంతుడును అయిన శ్రీకృష్ణుడు గో బృందముతో, గోపాలకబృందముతో శ్రీబృందావనధామమున ప్రవేశించెను –

"ఇత్థం శరత్ స్వచ్ఛజలం పద్మాకరసుగంధినా ।
న్యవిశ ద్వాయునా వాతం సగోగోపాలకోఽచ్యుతః॥"

కొందఱు ఆచార్యుల మతానుసారము, ఈ అధ్యాయమందు గోపాంగనల ఆసక్తినిరోధము వర్ణితము. నిరోధము మూడు విధములుగా ఉండును - 1. ప్రేమనిరోధము, 2. ఆసక్తినిరోధము 3. వ్యసన నిరోధము. మొదట, రాగము కలుగుటవలన, కొంత కాలమువఱకు, ప్రియతమాతిరిక్తమైనది విస్మరించబడును. ఇదియే, 'ప్రేమనిరోధము', లేక 'రాగనిరోధము'. ఐశ్వర్య, మాధుర్యవ్యంజకములైన విభిన్న లీలలచేత ప్రేమనిరోధవర్ణనము చేయబడినది. అత్యధికముగా ప్రియతముని స్మరణమువలన, దానియందు ఆసక్తి జనించి, అన్యవిస్మరణము జరుగును. అదియే 'ఆసక్తినిరోధ'మని చెప్పబడును. ఇచట, గోపాంగనల ఆసక్తినిరోధము వర్ణితము. తరువాత, ఆ ఆసక్తి, అత్యంతగాఢమగుటవలన, అది, వదలుట, అసంభవమగును. కావున, అది వ్యసనరూప మగును. కావుననే అది, 'వ్యసననిరోధ'మని చెప్పబడును, 'రాసపంచాధ్యాయి'లోని యుగళగీతమందు ఇది (వ్యసననిరోధము) వర్ణితము, సర్వవిస్మరణపూర్వకముగా నిరతిశయ, నిరుపాధిక, పరమ ప్రేమాస్పద, ప్రియతమ శ్రీకృష్ణ స్వరూపమందు వ్రజాంగనల తన్మయత్వమే 'ఆసక్తినిరోధము'. ఎంత ఎక్కువగా తన్మయత్వము ఉండునో. అంత ఎక్కువగా విశ్వవిస్మరణము కలుగును.

"అత్ర సర్గో విసర్గశ్చ స్థానం పోషణభూతయః ।
మన్వన్తరేశానుకథా నిరోధో ముక్తిరాశ్రయః ॥"

దశవిధ పురాణలక్షణాంతర్గతమైన ఈ 'నిరోధ' లక్షణము స్వీయ సమస్త శక్తిసహితమైన అఖండ, అనంత ఆత్మస్వరూపుడైన భగవంతుని శయన మని చెప్పబడినది.

"నిరోధోఽస్యానుశయనం ఆత్మనః సహశక్తిభిః।"

ఈ మతమున, మహాప్రళయమే నిరోధము. సృష్టికాలమందు శక్తులు కార్యరూపమున పరిణమించును. ప్రళయకాలమందు సమస్త కార్యప్రపంచము స్వకారణభూతలైన శక్తులందు విలీన మగును. భగవంతుడు, స్వరూపభూతలైన ఆ శక్తులను వెంటనిడికొని, వానిని, స్వస్వరూమందు లీనమొనర్చి, శయనించును. అంకుర, నాళ, స్కంధ, శాఖా, ఉపశాఖా, పత్ర, పుష్ప, ఫల, సౌగంధ్య, సారస్యాదుల ఉత్పాదనమునకు అనుకూలములైన సమస్త శక్తులు బీజమందు నిహితములై ఉండును. ఆ రీతిగానే పరబ్రహ్మ. అఖిల బ్రహ్మండోత్పాదినీ శక్తులను తోడుగా గైకొని, ప్రళయావస్థయందు శయనించును. ఇచట, బ్రహ్మ, శయనించుట వాస్తవము కాక సుప్తశక్తుల కారణమువలన ఔపచారికము. ఏలన, భాగవతమునందే ఒక స్థలమున, బ్రహ్మ

"సుప్తశక్తి రసుప్తదృక్"

అని సంకీర్తింపబడెను.

"సుప్తాః శక్తయో యత్ర అసౌ సుప్తశక్తిః।"

ఈవిధముగా, ప్రళయావస్థయందు శక్తులు విద్యమానలయ్యు, కార్యకరణక్షమములై ఉండవు. బ్రహ్మమైనచో, అఖండ, అనంత, స్వప్రకాశ బోధస్వరూప మగుటచే 'అసుప్తదృక్'. ద్రష్ట, సర్వభాసకుని దృష్టియొక్క స్వరూపభూతమైన అఖండభానముయొక్క లోపము ఎన్నడునుకలుగదని ఉపనిషత్తులు గూడా చెప్పుచున్నవి. భగవంతుడు గూడా మహాప్రళయకాలమున ప్రపంచసర్జనాది వ్యాపారవివర్జితు డగుటవలన, శయనించినవానివలె - నిద్రించుచున్నవానివలె ప్రతీయమానుడగును. ఆ అఖండ, అనంత బోధకు

జ్ఞానమునకు ఉదయాస్తమయములు లేవు. ఆ జ్ఞానము సర్వదా ఏకరసమై ఉండును -

"నాస్తమేతి నచోదేతి ।"

ఘటాదుల ఉత్పత్తికి పూర్వము, తద్జ్ఞానము ఉండును. అపుడు తదనుసారముగా కులాలుడు ఘట, శరావాదులను నిర్మించును.

"ఆసీద్ జ్ఞానమయో హ్యర్థ ఏకమేవావికల్పితమ్ ।"

అనగా, ప్రళయావస్థయందు శుద్ధ జ్ఞానము, ప్రకృతిప్రపంచ రూపమైన అర్థము - రెండును కలసియే ఉండునని భావము. ఇచట 'జ్ఞాన' పదముచేత ఘటాదిజ్ఞానము కాక,

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

అను జ్ఞానము గ్రహింపబడును. ఈవిధముగా సమస్త దార్శనిక సిద్ధాంతానుసారము స్వీయ సమస్త శక్తులతో ఆత్మ, నిద్రించుటయే, నిరోధము. కాని, కొందఱి మతానుసారము అఖిల విశ్వ విస్మరణ పూర్వకముగా, భగవంతునియందు మానసిక తన్మయతయే నిరోధము.

మొదట, ప్రేమాస్పదుని అద్భుత గుణములు, ఆయన యొక్క అద్భుత, అచింత్యమహిమ, ఐశ్వర్యముల జ్ఞానము, సౌగంధ్య, సౌరస్యాదుల అనుభవము వలన, ఆయనయందు రాగోదయ మగును. విష్ణుసహస్రనామ, భగవద్గీతాదులయందు అనురాగము కలుగుటకై మొదట, తన్మాహాత్మ్యసారము విహితము చేయబడినది. కావున, ఇచట గూడా మొదటి అధ్యాయములందు పూతనావధ, గోవర్ధనోద్ధరణాదులచేత, శ్రీకృష్ణభగవానుని యందు రాగము, ప్రేమ జనించుటకై తన్మహత్త్వము చెప్ప

బడినది. ఇచట, 'ఆసక్తినిరోధము' వర్ణితమైనది. 'వ్యసన నిరోధము' రాసలీల తరువాత, యుగళగీతమునందు వర్ణింప బడినది. రాగము, ఆసక్తి. వ్యసనము సాధారణముగా నింద్యములు, త్యాజ్యములే. కాని, అచటచట, ఆలంబనమహత్త్వము వలన, వీని మహత్త్వము అధికమగును. లౌకిక స్త్రీ, పుత్ర, ధనాదులందు రాగము, ఆసక్తి పతనమునకు మూలము. కాని, ఈ రాగమే, ఈ ఆసక్తియే, శ్రీకృష్ణభగవానుని శ్రీచరణముల యందు కలిగినచో, చెప్పవలదేమున్నది! ఒకానొక మహానుభావునికి మాత్రమే ఇటువంటి లోకోత్తర సౌభాగ్యము కలుగును.

వ్యసనసంబంధమై కూడా ఇదియే విషయము, తల్లి, తండ్రి, గురుజనులు, శాస్త్రములచేతను, స్వయముగా తనచేతను సహస్ర విధములుగా ప్రయత్నము చేయబడినను, వదల్చుకొందమనినను, వదలనిదే 'వ్యసన' మనబడును. ఈ వ్యసనమే ప్రాపంచికపదార్థములకు సంబంధించినదైనచో, అది, పతనమునకు మూలమగును. అది నశించుటయే అభిప్రేతమైన విషయము. కాని, భగవత్ప్రేమ రూప వ్యసనము అతికష్టముతో సంపాదింపబడును. ఏతాదృశమైన వ్యసనము సనకాదులయందే, శుకాదులయందే, కాకభుశుండి మున్నగువారియందే దృష్టమగును.

హనుమంతునికిగూడా ఇటువంటి వ్యసనమే కలదు. ఎచటెచట, శ్రీమద్రాఘువేంద్రుడు, భగవంతుడు నయిన శ్రీరామ చంద్రుని మంగళమయము, పరమ పవిత్రము నయిన చరిత్ర సంకీర్తనము జరుగుచుండునో, ఆ యా స్థలములందు అంజలిబద్ధమైన హస్తమును మస్తకముపై ఉంచుకొని, ఆనందాశ్రుపూర్ణ లోచనుడై నిలబడి ఉండును -

"యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృత
మస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత
రాక్షసాన్తకమ్ ॥"

లాంపట్యము అత్యంత నింద్యము. కాని, మనోమిళిందము భగవచ్చరణాంబుజ మకరంద మధులంపటమైనచో, ఎంతసౌభాగ్యమైన విషయము! సాధారణదృష్టితో రాగ, ఆసక్తి, వ్యసనములు అత్యంత నింద్యములు. కాని, సర్వాత్మ, సర్వాధిష్ఠానము, అచింత్య, అనంత ఆనందసుధాజలనిధి అయిన శ్రీకృష్ణునియందు ప్రేమనిరోధాదికములుండుట, ఆయనను వీడి క్షణకాలము కూడా, ఉండజాలకపోవుట ఎంత దుర్లభము! విషయచింతనరహితముగా, స్త్రీ పుత్ర, ధనాదిచింతనరహితముగా ఉండుట కష్టమగుచుండుట నేటి ప్రాపంచిక స్థితి. కాని, ఈ చింతనమును అచటినుండి మరలించి, భగవచ్చరణారవిందచింతనము చేయకపోయినచో, "పునరపి జననం పునరపి మరణమ్" అను రీతిగా జననమరణ రూప సంసారచక్రమునుండి బయల్పడుట దుర్ఘటమగును.

గోపాంగనలకు గల 'ఆసక్తి నిరోధమును' చూపించుటకై శ్రీ శుకదేవుడు ఇట్లనెను - శ్రీకృష్ణభగవానుడు గో, గోవత్స, గోపాల, బలరామాదులతో బృందావనధామమునకు జేరెను -

"ఇత్థం శరత్ స్వచ్ఛజలం పద్మాకరసుగంధినా ।
న్యవిశ ద్వాయునా వాతం సగో గోపాలకోఽచ్యుతః ॥"

జలక్రీడకు స్వచ్ఛమైన, సుగంధితమైన జలము ఉండుట ఆవశ్యకము. కావున, బృందావనము భగవంతుని క్రీడకై ఆనంద సామాగ్రిని సంసిద్ధ మొనర్చెను. శరదృతుసంబంధము వలన యమునా, రాధాకుండాది సరిత్ సరోవరములందలి జలములు అత్యంత స్వచ్ఛములు, నిర్మలములయ్యెను. ఒక పద్మ మేమిటి?

పద్మాకరములే వికసించెను. కుముద – కుముదినుల, కమల – కమలినుల అనంత సముదాయముయొక్క మాదక, మోదక, దివ్య సౌగంధ్యముతో మిశ్రితమైన సమీరము ద్వారా, సమస్త బృందా రణ్యధామము ఆవిష్టమయ్యెను – గుబాళించెను. పద్మపరిమళము అత్యంత అలౌకికమై ఉండును. దాని ఆభోగము (పూర్ణత్వము) పత్ర, పరాగ, మకరందాదులందు గూడా విలక్షణమైన సౌగంధ్య, సౌందర్య, సౌరస్యములు ఉండును. చంపక, కేతకీ పుష్పాదు లందు గూడా ఆభోగ, పరాగ, మధు, సౌగంధ్యాదులు ఉండును. కాని, పద్మమందలి మధుర, మంద, మాదక సౌగంధ్యము కొంత విశేషమైనది. భ్రమరమునకు అన్యాపేక్షయా పద్మము విశేష ముగా ప్రియమైనది. కావుననే కవులు పద్మశోభనే విశేషముగా వర్ణించిరి. కావున, ఇటువంటి దివ్య పరిమళసంపన్నములైన పద్మముల సుగంధముతో మిశ్రితమైన వాయువుతో వ్యాప్తమైన బృందారణ్యమున శ్రీకృష్ణుడు ప్రవేశించెను.

బృందావనధామమునందలి తరు, లతా, తృణ, పల్లవ, ఫల, పుష్ప, సరిత్, సరోవర, భూమ్యాదులన్నింటియందు శ్రీకృష్ణ భగవానుని అంతరంగము ప్రవేశించెను. ఏతావతా, బృందారణ్య ధామము శ్రీకృష్ణమయమయ్యెను. ఏలయనగా, పైన ఉదహ రించిన శ్లోకమున, 'న్యవిశత్' అను పదము ప్రయుక్తమైనది. ఆ పదమునందు గల 'ని' అను ఉపసర్గకు సుతరాం – అత్యంతము అని అర్థము యుక్తమే. ఏలయన, అప్రాకృతుడైన భగవంతుని లీల, ప్రాకృతములైన పదార్థములతో జరుగజాలదు. కావున, నిఖిల రసామృతమూర్తియైన శ్రీకృష్ణుడు బృందావనమందు గల సకల తత్త్వములందు అంతరంగతయా నివిష్టుడై = వానిని రసమయములనుగా ఒనర్చెను. ఇపుడు వానితో శ్రీకృష్ణలీల అత్యంత సముచితముగా జరుగగలదు.

శ్రీవల్లభాచార్యమతమునందు శ్రీకృష్ణుని ఈ బృందావన ధామనివేశము, సరిత్, సరోవర, వనతరువులందు గల ఆధిదైవిక శక్తితో రమణము. భగవంతునితోటి సంమిళనమునకై కేవలము వ్రజాంగనలే కాక, పరా ప్రకృతి, అపరా ప్రకృతి సమస్తము ఉవ్విళ్లూరుచున్నవి. కావున, భగవంతుడు నివేశ, వేణుకూజన రూపమైన ఉద్బోధనముచేత వనదేవతలకు తన రాకను సూచించెను. దానిచేత ఆ వనదేవతలు పరమాత్మరతికై జాగృత ములయిరి. లౌకిక కామినీరమణము ప్రాకృతమై ఉండును. కాని, ఇచట, వనదేవ్యాదులతోటి శ్రీకృష్ణరమణము అప్రాకృత మైన, అంతరమైన రమణము. తద్రమణమునకై వేణుకూజనము ద్వారా వనదేవతలు ఉద్బోధింపబడిరి —

"కుసుమిత వనరాజి శుష్మి భృంగ ద్విజకుల ఘుష్ట
సరఃసరి న్మహీధ్రమ్ ।
మధుపతి రవగాహ్య చారయన్ గాః సహ పశుపాల
బలి శ్చుకూజ వేణుమ్ "॥

బృందారణ్యశోభావర్ణనము ఎంతయని చేయగలము? వికసించిన వనపంక్తిశోభితమగుచున్న మత్తభ్రమరావళియొక్క మధుర ఝుంకారముతోను, పక్షిగణముల మధుర కలవరముతోను బృందావనధామమందలి సరోవరములు, సెలయేళ్లు, వృక్షములు, లతలు, పర్వతములు మున్నగునవి పరమ శోభితములు, నినాదిత ములును అగుచున్నవి. ఒకచోట, కాంచనమయమైన భూమియందు మరకతమణిమయములు, శ్యామలములు నయిన దూర్వలు సుశోభితములై ఉన్నవి. మఱొక స్థలమున, మరకతమణిమయ మైన భూమియందు కాంచనమయములైన దూర్వలు శోభాయ

మానములై ఉన్నవి. ఒకచోట, పద్మరాగమణిమయములైన వృక్షములందు స్ఫటికమణిమయములైన దివ్య లతలు వికసితములై ఉన్నవి. మఱొకచోట, స్ఫటికమణిమయములు, స్వచ్ఛములు నయిన వృక్షములమీద పద్మరాగమణిమయములైన సుందర లతలు విరాజిమానములై యున్నవి. ఒకచోట, మహేంద్రనీల మణిమయమైన భూమిమీద కాంచనమయ దివ్యదూర్వలు సుశోభితములగుచుండగా, మఱొకస్థలమున, కాంచనమయము, దేదీప్యమానము నయిన భూమిమీద మహేంద్రనీలమణిమయములైన దూర్వలు విస్తరించి ఉన్నవి. ఇది, ప్రాకృత కథావర్ణనము కాదు. ఈనాటి సిద్ధాంతము కంటికి కన్పడని వస్తువు లేదనియే చెప్పును. ప్రస్తుతము, బృందావనమందలి లోకోత్తరమైన ఆ శోభ దృష్టి గోచరము కాకపోవుటయేకాక, సర్వత్ర రూక్షత్వము కంటకాకీర్ణములైన వృక్షములే గోచరించుచుండును. ఆవిధముగానే కాశీనగరమునకు సంబంధించిన దివ్య, అలౌకిక శోభావర్ణనము గూడా పురాణముల వలన తెలియుచున్నది. కాని, జనులకు ఇచట గూడా ఇటుకరాళ్ళు, సున్నము, కొండరాళ్ళే కన్పించును.

ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్తలు సమస్త భూమండలముయొక్క జాడ తెలిసికొనిరనియు, వారికి సుమేరుపర్వతము, సప్తద్వీపములు, క్షీరసాగరము మున్నగునవి లభించలేదనియు, ఒకవేళ ఉండియున్నచో, తప్పక కన్పడి ఉండెడివనియు చెప్పబడుచున్నది. కాని, ఉన్న వస్తువు కనిపించని స్థితి గూడా కలదని చెప్పవలసి ఉండును. ప్రతి వస్తువును చూచుటలో కొంత సుఖము, లేక కొంత దుఃఖము కలుగును. కావున, వస్తువు కనిపించుటయందు పాప, పుణ్యరూపమైన అదృష్టము గూడా హేతువని అంగీకరించవలసియుండును. ఒక వస్తువును చూచినపుడు దుఃఖము, ఏవగింపు ఏల కలుగుచున్నది ? ఏ కార్యమైనను,

కారణములేక జరుగదు. సుఖ, దుఃఖములను జూచి, వానికి కారణమైన పుణ్య, పాపములను ఊహింపనగును. కావున, వస్తుదర్శనమందు అదృష్టము హేతువగుట వలన శాస్త్రోక్తములైన కొన్ని వస్తువులు మనకు దృష్టిగోచరములు కావని అంగీకరించవలసి ఉండును. దీనికి కారణము, మనకు తాదృశమైన అదృష్టము లేకపోవుటయే గాని, ఆ వస్తువులు లేకపోవుట కాదు.

'మహాభారత'మందు ఒక కథ కలదు. అలకనందలో కొట్టుకొనివచ్చిన దివ్య సుగంధ, సౌందర్యయుక్తమైన ఒక పుష్పమును ద్రౌపది చూచెను. దానికి తోడైన రెండవ పుష్పమును తీసికొని రావలసినదని ఆమె భీమసేనుని, ఒత్తిడి చేసెను. భీమసేనుడు అలకనందాతటమున పోవుచు పోవుచు అధిక దూరము వెళ్ళెను. అచట మార్గమందు భీమసేనుడు ఒక వృద్ధ వానరమును చూచెను. ఆ వానరము తన తోకతో మార్గమును నిరోధించి, నిద్రించి ఉండెను. భీమసేనుడు, ఆ వానరముతో ఈ తోకను తొలగించుమని చెప్పెను. అంత, ఆ వానరము "నేను మిక్కిలి వృద్ధుడను, ఆకారణముచేత ఆ పుచ్ఛమును తొలగింపగల సామర్థ్యము నాకు లేదు, నీవే, తొలగించుము" అని సమాధానము చెప్పెను. భీముడు మొదట, తనచేతి రెండు వ్రేళ్ళతో ఆ వానర పుచ్ఛమును తొలగింపదలచెను. రెండు వ్రేళ్ళతో తొలగింపజాలక పోయినపుడు, ఒకచేతితో బలముపూని, తొలగింపదలచెను. చివరికి రెండు చేతులందు గల సంపూర్ణశక్తితో ప్రయత్నము చేసినను, ఆ వానరపుచ్ఛము తన స్థానము నుండి నువ్వుగింజంతమాత్రమైనను తొలగకపోగా, భీముడు మూర్ఛిల్లెను. అపుడు, కొంత సమయమునకు తిరిగి స్మృతి వచ్చినపుడు ఆశ్చర్యచకితుడై ఆ భీముడు వానరముతో ఇట్లనెను – "హనుమంతుడన్న పేరుగల ఒక సోదరుడు నాకు కలడని వింటిని. అతడు, అత్యంత బలశాలి

అనియు, అతడు త్రేతాయుగములో లంకావిజయమందు రామచంద్రునికి ఎక్కువ సాయపడెననియు వింటిని. నీవు ఆ హనుమంతుడవు కావు కదా ?''

భీమసేనుని మాటలు విని, ఆ వానరము ''అవును, నేను ఆ హనుమంతుడనే'' అని చెప్పెను. అంత భీమసేనుడు ఆ వానరమునకు ప్రణామము చేసి, ఇట్లనెను – ''నీవు ఏరూపమును ధరించి రాక్షసులను సంహరించితివో, నేను ఆ దివ్య స్వరూపమును చూడ దలచుచున్నాను.''

అంత, హనుమంతుడు '' ఆ రూపమును చూచుటకు సామర్థ్యము నీకు లేదు. దానిని చూడవలయునని పట్టుపట్టకుము.'' కాని, భీముడు, తన పట్టుదలను వీడలేదు. అపుడు, భీముని పట్టుదల చూచి, హనుమంతుడు, తన ఆ కనక భూధరాకారము (మేరుపర్వతాకారము), పరమ తేజోమయము నయిన దివ్యరూపమును ధరింపనారంభించెను. ఇంకను పూర్ణరూపము చూడనేలేదు. ఇంతలో తత్ప్రచండ తేజస్సుచేత భీముని నేత్రములు మూతలు పడిపోయెను. అతడు, మూర్ఛితుడయ్యెను. అపుడు, హనుమంతుడు తన రూపమును ఉపసంహరించుకొని, భీముని జాగృతుని చేసెను. భీమునితో ఇట్లనెను – ''ఇపుడు నీవు, ఇచటి నుండియే వెనుకకు మరలిపొమ్ము. ముందు గల దివ్య, సువర్ణ, రత్నమయభూమి మొదలగువానిని చూడదగు సామర్థ్యముగాని, యోగ్యత గానీ, నీకు లేదు''. ఈవిధముగానే 'ద్విత', 'త్రిత'అను పేరు గల మహర్షులకు ఘోరమైన తపస్సు చేసినతరువాత గూడా శ్వేతద్వీపమున ఏమియును కన్పడలేదు. బహుకాలము తపస్సు చేసిన తరువాత, ఒక వ్యక్తియొక్క దర్శనమయ్యెను. అతడు ఇట్లనెను – ''ఈ జన్మలో మీకు ఇచట మఱి ఏమియు కన్పించదు. రామావతార మందు మీరు భగవద్దర్శనము చేసికొనగలరు.''

తాత్పర్యమేమనిన, ప్రతి వస్తువుయొక్క దర్శనమందు యోగ్యత అపేక్షితమగును. ఆ యోగ్యత, ధర్మాధర్మకృతమే. కావున, భగవంతుడు కన్పించడు గాన, ఆయన లేనే లేడు అని చెప్పుట సంగతము కాదు. ఏలయనగా, ఈనాటి మనుష్యులకు అట్టి యోగ్యత లేకపోవుట చేతను, పుణ్యలోపము చేతను ఆ భగవంతుని దర్శనము కలుగదు.

పోనిండు, బృందావనధామముయొక్క అలౌకిక దివ్య శోభను గుఱించి ఇక, చెప్పునది ఏమి కలదు ? అరవింద, మాలతీ, చంపక, మల్లికాది అనేక విధవికసిత పుష్పముల సౌగంధ్యముచేత మత్తిలిన భృంగములు, హంసలు కారండవములు, చక్రవాకములు, పారావతములు, చిలుకలు, నెమళ్ళు మున్నగు పక్షుల ఆనందోద్రేకములో - ప్రేమోన్మాదములో జనించు కలరవ, ఝుంకారము వలన, ఏ బృందావనధామముయొక్క వనపంక్తులు, సరోవరములు, నదులు, సరస్సులు, సెలయేళ్ళు, పర్వతములు మున్నగునవి ప్రతిధ్వనించుచున్నవో - నినాదితము లగుచున్నవో, అట్టి బృందారణ్యధామమును శ్రీకృష్ణభగవానుడు, బలరాముడు, గోపాలకులతో ఆవులను మేపుచు చేరిరి -

''మధుపతి రవగాహ్య చారయన్ గాః ।''

ఇచట, శ్రీకృష్ణునికి 'మధుపతి' అను శబ్దము ప్రయోగింపబడెను. మధుపతి అనగా, వసంతఋతువునకు అధిపతి అని అర్థము. దీని ఆశయము ఏమనిన, వనమందు మధుసంచారము వలననే, అనగా, వసంతఋతు సంచారమువలననే శోభ అధికమగును. ఇట్టి స్థితిలో సాక్షాత్తుగా మధుపతి - వసంతాధిపతి ప్రవేశించినపుడు, చెప్పునదేమి కలదు ? వీని అన్నింటిచేత ఇచట లీలాభూమి మున్నగు వానిమహిమ చెప్పబడినది. రంగస్థలాలంకరణలేక, నాట్యలీల

జరగనట్లుగానే ఇచట, శ్రీకృష్ణుని అద్భుత, మంగళమయ లీల కొరకై బృందావనాలంకరణము అపేక్షితము. కావుననే ఈ ప్రసంగమునకు పూర్వము బలరామస్తుతి వ్యాజముతో బృందావనాదిస్తుతి చేయబడెను.

శ్రీకృష్ణుడు బలరామునితో ఇట్లనెను - వీరందఱును ముని గణములు, దేవగణములు. వీరు వృక్ష, లతా, తృణ, గుల్మాది రూపముతో మీ పాదస్పర్శకై ఉవ్విళ్లూరుచున్నారు. అథవా, మీ చరణస్పృష్టమైన భూమిని స్పృశించి, వందనము చేయుటకై ఫల పుష్పసహితముగా వినమ్రములై ఆ భూమిని ఆలింగనము చేసికొను చున్నవా, అన్నట్లు ఉన్నవి. అథవా, మహాపురుషుని స్వాగతార్థమై బృందావనము స్వయముగా ఆయనకు ఆతిథ్యమిచ్చుచున్నదా అన్నట్లు ఉన్నది. మంద, సుగంధిత, శీతల వాయువహనముచేత వీవన వీచుచున్నదా అన్నట్లు ఉన్నది. అనేకవిధములైన కుముద-కుముదినీయుక్తములు, వాని మధుర మకరందగంధముచే సురభిళ ములు, ఉద్వేజితములు నయిన నదులతో పాద్య, అర్ఘ్యము లిచ్చు చున్నదా అన్నట్లు ఉన్నది.

శ్రీకృష్ణభగవానుని మధుర, మనోహర వంశీధ్వనిని విని వ్రజమునందలి కామధేనురూపిణులైన గోవులనుండి క్షీరము తమంతట తాము స్రవించసాగును. ఆనందపరవశములగుటచేత దేహభారమును మఱచిపోయి, ఆ గోవులు, అవిరతముగా ప్రవహించు క్షీరధారను ఆపుటకు అసమర్థములగుచున్నవి. స్తన్య పానమునకై ప్రవృత్తములైన గోవత్సములు గూడా తదానంద సాగరమున మగ్నములయిన కారణమున, స్తన్యపానము చేయుట మఱచిపోవుచున్నవి. కావున, సతతము ప్రవహించు క్షీరముతో బృందావనమంతయు, నిండిపోవుచున్నది. ఆ క్షీరమునందు

కొన్ని పుల్లని పండ్ల సంసర్గముచేత, ఆ పాలు తోడుకొని దధి రూపమును దాల్చుచున్నవి. దానియందు ఎటులనో, ప్రబలమైన వాయువుచేత ఆలోడితమైనపుడు, మథింపబడినపుడు హైయంగ వీనము గూడా - నవనీతము గూడా ప్రాదుర్భవించుచున్నది. దానియందు వృక్షములనుండి ప్రవహించు మధుధారల మిశ్రణము వలన విలక్షణమైన ఒక మధుపర్కము ఏర్పడుచున్నది. బృందావనము ఆ మధుపర్కముతో భగవదర్చనము చేయుచున్నది. మధుధారలు, పత్ర, పల్లవ, పుష్ప, ఫలాదిసామాగ్రులచేత నైవేద్యాదులను అర్పించుచున్నవి. ఈవిధముగా సమష్టి వ్యష్టి రూపముతో బృందావనము, దానియందలి సమస్త తత్త్వములు భగవంతునికి ఆతిథ్యమొసగుచున్నవి.

''అహో ! అమీ దేవవరామరార్చితం పాదాంబుజం తే
సుమనఃఫలార్హణమ్ ।
నమన్త్యుపాదాయ శిఖాభిరాత్మన స్తమోపహత్యై
తరుజన్మ యత్కృతమ్ ॥''
''ఏతేఽలిన స్తవ యశోఽఖిలలోకతీర్థం గాయన్త
ఆదిపురుషానుపదం భజన్తే ।
ప్రాయో అమీ మునిగణా భవదీయముఖ్యా గూఢం
వనేఽపి న జహత్యనఘాత్మదైవమ్ ॥''

జడములైన ఈ వృక్షాదులు ఆతిథ్యమును ఎట్లు ఈయ గలవు? అని సందేహము కలుగవచ్చును. కావుననే, ఈ వృక్షాదులు జడములు కావనియు, విశేషించి, భగవంతుని పరమ ప్రియభక్త గణములనియు, యోగీంద్రులు, మునీంద్రులు, దేవగణము లనియు చెప్పబడినది. ఇతరుల జడత్వమును నాశమొందించుటకై జడరూపమును ధరించిరి. ఏతద్దర్శన, శ్రవణ, స్పర్శన ముల వలన జనుల జడత్వము నశించును -

"అన్యేషాం తమోపహత్యై తరుజన్మ యత్కృతమ్ ।"

అథవా, 'తమస్' శబ్దమునకు దుఃఖమని అర్థము. కావున, దుఃఖ నివృత్తికై వారు తరుజన్మను గ్రహించిరి. వీని ఆశయమేమనిన, భగవద్వి ప్రయోగజన్యమైన తమ తీవ్రతాపమును భగవత్సంమిల నముద్వారా పోగొట్టుకొనుటకై తరు, లతా, గుల్మాదులై భగవంతుడు గోచారణమునకై ఇటు వచ్చినపుడు, తత్సంస్పర్శ వలన తమ సంతాపమును పోగొట్టుకొందమని బృందావనమునందు అవతరించిరి. ఆ వృక్షాదులు, తమకంటె, భ్రమరములను అధిక సౌభాగ్యశాలులని భావించును. ఏలయనగా, అవి, స్థావరస్వరూపము కలవగుటవలన ఒకే స్థానమందు స్థిరముగా ఉండును. శ్రీకృష్ణ భగవానుడు దయతో స్వయముగా బృందావనధామమునకు ఏతెంచి నపుడు, తత్సంయోగము లభించవచ్చును. కాని, ఈ భ్రమర ములు, విహంగములు,వాని ప్రియతముడు,ప్రాణధనుడును అయిన శ్రీకృష్ణుడు ఎచట విరాజమానుడై ఉండునో, అచటకు పోయి, తద్దర్శనమును పొంది, తమ సంతాపమును పోగొట్టుకొనును. బృందావనమున గల సమస్త తత్త్వములును, భగవంతుడైన శ్రీకృష్ణుని ఆరాధనమందు తమ సౌభాగ్యమును భావించును. ఎవరి యొద్ద ఏమి ఉండునో. దానితోనే ప్రభువును ఆరాధింపసాగు చున్నవి. ఈవిధముగా తుమ్మెదలు గంభీరమైన ఝుంకారముతో భగవంతుని యశోగానము చేయుచున్నవా అన్నట్లు ఉన్నవి. మయూరములు నృత్యము చేసి, ప్రభువును ప్రసన్నుని చేయ దలంచును. హరిణ, హరిణులు తమ విశాల, విస్తృత నేత్రములతో దర్శించును. కోయిలలు ప్రేమోన్మాదమందు తమ మధుర సూక్తు లతో (కుహుకుహూరావములతో) ప్రభువును స్తుతించుచుండును.

ఇంద్ర, లక్ష్మీ, కుబేరాదులు దివ్యాతిదివ్యములైన సామగ్రు లతో పూజ చేసియు, ఎవరిని సంతోషపెట్టజాలరో, అఖిల బ్రహ్మాండ

నాయకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడును అయిన ఆ భగవంతుని ఆరాధించుటలో సాధారణవ్యక్తి నయిన నేను ఎట్లు చేయగలను? అని ఎవరును భావించరాదు. ఏలయనగా, భగవంతుడు భావప్రియుడు. ఆయన, భావపూర్వకముగా చేసిన అందటి సేవను స్వీకరించును. భావవిహీనమైన అపార పూజా సామగ్రులతో ఆయనను, ప్రసన్నుని చేసికొనజాలము. భావయుక్తముగా, ప్రేమసహితముగా అర్పించిన అతిసాధారణమైన వస్తువుచేతను, ఒక తులసీదళము చేతను, పుడిసిలి జలముతో అభిషేకము చేయుటచేతను భక్తవత్సలుడైన ఆ భగవంతుడు భక్తులకు వశుడగును. (భక్తులచే క్రయము చేయబడును అనగా, భక్తులకు అమ్ముడుపోవునని భావము)

"తులసీదళమాత్రేణ జలస్య చులుకేన చ ।
విక్రీణీతే స్వమాత్మానం భక్తేభ్యో భక్తవత్సలః ॥"

ఇచట, బృందావనధామమందలి వృక్ష, లతా, గుల్మ, తృణాదులు, యోగీంద్రులందఱును భగవంతుని పరమభక్తులగుట చేత భాగవతులలో ముఖ్యులు.

"ప్రాయో ఆమీ మునిగణా భగవదీయముఖ్యాః।"

కావున, భగవంతుడు వారు చేసిన సపర్యను తప్పక స్వీకరించును. ఒక రాజు గుప్తవేషములో ప్రయాణము చేయుచున్నప్పుడు అతని సేవకులు గూడా గుప్తవేషములో ఆ రాజును అనుసరింతురు. అటులనే, ఇచట, అనంత బ్రహ్మాండనాయకుడు, అశబ్ద, అస్పర్శ, అరూప, అవ్యయ, అచిన్త్య, అనంత, అప్రమేయ, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావుడు, నిర్గుణుడు, నిరాకారుడు, కూటస్థుడు, ఏకరసుడు, సచ్చిదానందఘనుడును అయిన పరబ్రహ్మయే తన

ఆ స్వరూపమును గుప్తము చేసికొని, అచిన్త్య, అనంత, అద్భుత, సౌగంధ్య, సౌరస్య, సౌందర్య, మాధుర్య, లావణ్యాది సంపన్నుడై పరమానందసుధాసాగర సార సర్వస్వమై వ్రజేంద్రగృహిణి, నందరాణి అయిన యశోదాదేవియొక్క పరమ మంగళమయమైన అంకమున అవతరించినపుడు, ఆయనకు పరమ అంతరంగభూత మైన భక్తగణము గూడా బృందావనధామమందు తరు, లతా, తృణ, సరిదాది రూపములో అవిర్భవించెను. కావున, వారందఱును భగవదీయులే. ప్రభువు అయిన శ్రీకృష్ణపరమాత్మ, వారు అర్పిం చిన సాధారణమైన పూజాసామాగ్రిని గూడా అత్యంత ప్రేమతో స్వీకరించెను.

ఒక సమయమున, పృథువు, భగవంతునితో ఇట్లనెను – హే భగవాన్! నేను మంగళమయముతైన తమ చరణారవిందములను సేవించుచున్నాను. లక్ష్మీదేవి గూడా ఆ చరణారవిందములనే సమాశ్రయణము చేయుచున్నది. ఇట్టి స్థితిలో లక్ష్మీదేవితో నాకు పోరాటము రాదు కదా? ఇట్లు జరిగినప్పుడు హే నాథ! ఎవరి పక్షము వహింతురు? మీరు ఆప్తకాములు, పూర్ణకాములు, ఆత్మా రాములు, నిష్కాములు. కావున, మీరు లక్ష్మీదేవి పక్షమును వహించక, నాకు తోడుగానే ఉండెదరని నా విశ్వాసము–

"అప్యావయో రేకపతిస్పృధోః కలిర్నస్యాత్ కృత
త్వచ్చరణైకతానయోః ।
జగజ్జనన్యాం జగదీశ వైశసం స్యాదేవ యత్కర్మణి
నః సమీహితమ్ ॥"

భగవంతుడు పృథువుపక్షమునే వహించెను. లక్ష్మీదేవి నివాసము భగవంతుని విశాలవక్షఃస్థలమందు కలదు. భక్తులు అర్పించిన పుష్పమాలను భగవంతుడు శోభాయుక్తమైన తన

కంఠమున ధరించును. భక్తులు అర్పించిన మాలను ఆ భగవంతుడు ఎట్లు త్యజింపగలడు? కావున, పుష్పములు వాడిపోయినను, ప్రభువు తన వక్షఃస్థలముపైనుండి ఆ పుష్పమాలను తీసివేయడు. తత్పుష్పమాల భారముచేత లక్ష్మీదేవి అణగారిపోవుచుండును. ఈ కష్టమునంతను సహించలేకపోయినచో, లక్ష్మీదేవియే ఆ వక్షఃస్థలమును వీడిపోయిన పోవుగాక, భగవంతుడు భక్తుడు అర్పించిన మాలను ఎట్లు ఉపేక్షింపగలడు? ఉపాయాంతరము లేని లక్ష్మీదేవి ఈ కష్టము నంతయు, సహించును. వాడిపోయిన మాల తనపై పడియుండుట జూచి, లక్ష్మీదేవికి, ఇది, అనుచితమని అనిపించును. కాని, దీనివలన, పోవునదేమి? పరమ చంచలయైన లక్ష్మీదేవి, భగవంతుని చరణపంకజములను పొంది పూర్ణముగా నిశ్చల అయ్యెను. సపత్ని (సవతిభార్య)తో గూడా ఉండుట ఆమెకు అంగీకారమే. కాని ప్రభువుయొక్క శ్రీచరణములను వదలి ఆమె పోజాలదు. భగవంతుని శ్రీచరణముల మహత్త్వము ఇటువంటి అద్భుతమైనదే. తులసి, భగవంతుని శ్రీచరణాంబుజములందు విరాజిల్లుచుండును. లక్ష్మీదేవికి భగవంతుని వక్షఃస్థలమందు గౌరవనీయమైన నివాసము లభించినది. అయినను, తులసీరూపయైన సపత్నిచేతను, భృత్యగణములచేతను సేవింపబడు భగవంతుని చరణాంబుజముల మకరందమునే ఆమె పొందవలయునని కోరుకొనును —

"శ్రీః యత్పదాంబుజ రజశ్చకమే తులస్యా లబ్ధ్వాఽపి
వక్షసి పదం కిల భృత్యజుష్టమ్ ।
......యస్యాః స్వవీక్షణకృతేఽన్య సుర ప్రయాసః ॥"

పోనిండు, ఇటువంటి పరమ సుందరమైన బృందారణ్యధామమునందు క్రీడించుటకై శ్యామసుందరుడు, వ్రజేంద్రనంద

నుడునయిన శ్రీకృష్ణుడు అచటకు వచ్చెను. క్రీడ రెండు విధము లుగా ఉండును - జలక్రీడ, స్థలక్రీడ. ఇపుడు బృందావనశోభ రెండువిధములైన క్రీడలకు ఉపయుక్తముగా ఉండెను. స్వచ్ఛ మైన జలముతో నిండిన సరసీ, సరిత్, సరోవరములచేత సుసజ్జితమై ఉన్నకారణముగా జలక్రీడకును, పద్మాకరములు సుగంధిపూర్ణ వాయువుచే వ్యాప్తమై ఉండుటచేత స్థలక్రీడకును ఉపయుక్తమై ఉండెను.

"ఇత్థం శరత్ స్వచ్ఛజలం పద్మాకరసుగంధినా
న్యవిశత్ వాయునా వాతమ్ ।"

ఏతావతా, ఉభయవిధమైన క్రీడాసామగ్రిచేత సజ్జత (అలంకరణ) చెప్పబడినది. కాని, భగవత్సంబంధము లేనంతవఱకు ఆ తత్త్వము రసహీనము, అశోభనము, అమంగళము. హిరణ్మయబ్రహ్మాండము ఉత్పన్నమైనపుడు అది అచేతనమై ఉండెను. దానియందు ప్రవేశించి అగ్ని, వాయు, ఆదిత్యాది దేవతలు దానిని పైకి లేవ నెత్తుటకు తమ శక్తికొలది మహాప్రయత్నము చేసిరి. అయినను ఆ విరాట్ తత్త్వముయొక్క ఉత్థానము జరుగలేదు -

"నోదతిష్ఠత్ తదా విరాట్"

తుదకు, భగవంతుడు ఆ హిరణ్మయ బ్రహ్మాండమందు ప్రవేశించి నపుడు అది పైకి లేవజాలెను.

"చిత్తేన హృదయం ... క్షేత్రజ్ఞః ప్రావిశద్యదా ।
విరాట్ తదైవ పురుషః సలిలా దుదతిష్ఠత్ ॥"

భగవంతుడులేక, ఎచటను శాంతి ఉండదు, శోభ ఉండదు. కావుననే బృందావనమందలి తరు, లతాదులు సమస్తము భగవంతుని సమాగమము కలిగినపుడు తాము కృతార్థత చెందితి

మని భావించును. సర్వత్ర, భగవంతుడు ప్రవేశించినపుడు వాని యందు రసాత్మకత వచ్చును. కావుననే, బృందావనమందు భగవంతుడైన శ్రీకృష్ణుని ప్రవేశము జరిగెను, సచ్చిదానందరూపుడైన భగవంతుడు సర్వాంతరాత్మ అగుటచేత సర్వవ్యాపకుడు. కావున, బృందావనమందలి సమస్త తత్త్వములందు సదంశ, చిదంశ అభివ్యక్తమయ్యెను. కాని, ఆనందాంశ అవ్యక్తముగా ఉండెను. నిఖిల రసామృతమూర్తి, అభివ్యక్తమైన పరమానంద సుధాసింధువు భగవంతుడు నయిన శ్రీకృష్ణుని ప్రవేశము వలన సదంశ, చిదంశలు గౌణములై ఆనందాంశ పూర్ణముగా అభివ్యక్తమయ్యెను; సమస్త బృందావనధామము రసాత్మకమయ్యెను. కావుననే, ఇచట, బృందావనమందు భగవంతుని ఆత్యంతిక ప్రవేశము చెప్పబడెను -

"న్యవిశ ద్వాయునా వాతమ్ ।"
"న్యవిశత్ - నితరామ్ అవిశత్ ।"

పుష్పించిన వనరాజిచేతను ఉన్మత్తములైన భ్రమరముల చేతను, విహంగములచేతను మేల్కాంచిన వనదేవతలు శ్రీకృష్ణ సంయోగమునకై జాగ్రుతములైరి. ఆపుడు మధుపతి రూపముతో, శ్రీకృష్ణుడు బృందావనమందు నివేశ మొనర్చెను. ఇచట, మధుశబ్దమునకు చైత్రమాసమని గూడా అర్థము. ఆ చైత్రమాసమునకు పతి గాన, వసంతఋతువు అని అర్థము. కావున, ఆకు పచ్చని, పసుపుపచ్చని, ఎఱ్ఱని పత్ర పుష్పములచే సుసజ్జితుడైన వసంతునివలె అనేకవిధ వర్ణములతో గూడిన పత్రపుష్పాదులతో సుశోభితము, సుందరమునయిన వనములను ధరించి, శ్రీకృష్ణ భగవానుడు బృందావనధామమున కేతెంచెను. అథవా, 'మధు' శబ్దముచేత వసంతుడనియు తెలియనగును. కావున, తదధిపతియు, వసంతమునందు గూడా అపూర్వ శోభను సంచరింపజేయునట్టి

శ్రీకృష్ణభగవానుడు లోకోత్తరములు, అద్భుతములును అయిన తన సారస్య, సౌగంధ్యాదులతో బృందావనమందు ఉన్నవారిని ఆస్వాదితము చేయుచు బృందావనమున కేతెంచెను. అథవా, సరస శృంగారాధిపతియే మధుపతి. కావున, నిఖిల రసామృత మూర్తి అయినను, విశేషించి, శృంగారరసామృతమూర్తియైన శ్రీకృష్ణుడు బృందారణ్యధామమును ప్రవేశించెను. ఒక రసమందు రసాంతరసంచారము జరుగుటవలన, దాని మహత్త్వము అధిక మగును. శృంగారరసమందు శృంగారము ప్రవేశించినచో, తన్మహత్త్వము వర్ణింప నలవికాదు. ఏతాదృశుడే అయిన శృంగార రసామృతమూర్తి అయిన శ్రీకృష్ణుని నివేశము వలన బృందావన మంతయు, ఆహ్లాదితమయ్యెను. వనమునందు నివిష్టుడై శ్రీకృష్ణుడు వేణునాదము చేసెను. ఇచట, 'చుకూజ' అను శబ్దము ప్రయోగింప బడెను. అనగా కలకలారావము చేసెను. దీని అభిప్రాయ మేమనిన, శ్రీకృష్ణుని ముఖసంస్పర్శ మాత్రముచేతనే వేణువు స్వయముగా గానము చేయసాగెను. జడమైన వేణువు గూడా శృంగారరసస్వరూపుడైన శ్రీకృష్ణుని అధరసుధావిశేషము వలన గానము చేయసాగెను - చేతనకార్యము చేయసాగెను.

శ్రీకృష్ణభగవానుడు సంప్రయోగాత్మక, విప్రయోగాత్మక ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసాత్మ అని ఇంతకు పూర్వము చెప్పబడెను. శృంగారరసము ద్వివిధభేదముతో ఉండును. ఒకటి సంప్రయోగ(సంయోగ) రూపము, రెండు విప్రయోగ(వియోగ) రూపము. శ్రీకృష్ణుని మూర్తి ప్రాకృతులైన పురుషులకు వలె అస్థి, చర్మ, మాంసమయము కాదు. విశేషించి, ఉభయవిధ శృంగార రసమయము. ఆ ఉభయరసములు ఉద్బుద్ధములు, ఉద్వేజిత ములు. పూర్ణముగా అభివ్యక్తములు. సాధారణముగా సంయో గాత్మకశృంగారము అనుభూయమానమైనపుడు, వియోగాత్మక

శృంగారానుభవము కలుగదు. అటులనే విప్రయోగాత్మకమైన శృంగారరసానుభవకాలమున, సంప్రయోగాత్మక శృంగారరసానుభవము కలుగదు. కాని, శ్రీకృష్ణభగవానునియందు గల విశేషమేమనిన, ఇచట, ఉభయవిధ శృంగారరసాభివ్యక్తి ఏకకాలమున గలుగును. రెంటియొక్క అనుభవము ఒకే కాలమున గలుగుచుండును. వనదేవతలకు సంప్రయోగాత్మకమైన శ్రీకృష్ణాభివ్యక్తి, వ్రజాంగనలకు విప్రయోగాత్మకమైన శ్రీకృష్ణాభివ్యక్తి కలుగుచుండును. శ్రీకృష్ణుని దివ్యస్వరూపము వనమున కలదు. దానివలన, వనదేవీగణమునకు, ఆధిదైవిక శక్తులకు రమణము సంపన్నమగును. గోపాంగనలు ఆ సమయమున, వ్రజమునందు ఉన్నను, గోపాలకులతో శ్రీకృష్ణుడు దూరస్థుడై ఉన్నను, వారికే, ఈ ఉద్బుద్ధ సంప్రయోగ శృంగారరసాత్మయైన శ్రీకృష్ణుడు అనుభూయమానుడగును. సర్వవిధమైన క్రియాశక్తిసంచారము గోపాలకులయందును, జ్ఞానశక్తిసంచారము బలభద్రునియందును కలదు.

ఈ స్థితి అంతయు, వ్రజాంగనలకు పూర్తిగా తెలియును. ఇది, ఆసక్తి మహిమ. ఆసక్తి తీవ్రతవలన, దూరస్థుడైన శ్రీకృష్ణుని లీలలన్నియు, వ్రజమునందున్న వ్రజాంగనలకు ప్రత్యక్షముగా అనుభూయమానమగుచున్నవి. విద్య, పంచపర్వయై ఉన్నట్లు, అవిద్య కూడా పంచపర్వాత్మికయై ఉండును. అవిద్యయందలి చిట్టచివరి పర్వము 'ఆసక్తి', విద్యయందలి అంతిమ పర్వము భక్తి. ఈ రెండింటి స్వరూపము తరచుగా ఒకటియే. గోపాంగనలకు గల శ్రీకృష్ణ విషయకమైన ఆసక్తి అత్యంత ఉత్కటమైనది. వారు సాంసారిక సుఖములను, తత్సామగ్రులను అన్నిటిని, తుచ్ఛములని తలంచిరి. శ్యామసుందరుడు, వ్రజేంద్రనందనుడు, మన్మోహనుడు నయిన శ్రీకృష్ణుడే, వారికి జ్ఞేయుడు, ధ్యేయుడు, పరమారాధ్య సర్వస్వము. దూరస్థితుడై

ఉన్నప్పుడు, వ్రజాంగనలకు ఆయన ఆచారవ్యవహారములు, కదలికలు, విలాసములు మున్నగునవి సాక్షాత్తుగా అనుభూయమానములగును. కావున, గోపాంగనలు మహాయోగీంద్రుని స్థితియందు అవస్థితలై ఉండిరి. వారికి, ఆసక్తివశమున, విప్రయోగకాలమందే భగవంతునితో మానస సంయోగము లభించుటవలన, సంప్రయోగాత్మకమైన శృంగారానుభవము కలిగినది.

ఉద్బుద్ధ సంప్రయోగాత్మకము, విప్రయోగాత్మకము, ఉభయవిధము నయిన శృంగారరసాత్మకుడు, ప్రియతముడు, ప్రాణధనుడు నయిన ఆ శ్రీకృష్ణభగవానుని స్వరూపమైన వేణుగీతమును విని, వ్రజాంగనలకు స్మరోదయ మయ్యెను –

"తత్ర్వజస్త్రియ ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్ ।"

ఉత్కంఠాపూర్వకమైన స్మరణమే 'స్మరము'.

"స్మరో వాన ఆకాయా భూయాన్ ।"

అను శ్రుతివచనానుసారము 'స్మర' తాత్పర్యము కామమునందు కాదు. అనగా, వేణుగీతశ్రవణము చేసి, గోపాంగనలకు ఆ వేణుగీతముయొక్క ఉద్గమస్థానమైన శ్రీకృష్ణుని స్మరణము అత్యంత ఉత్కంఠాపూర్వకముగా కలిగెను. వ్రజాంగనల నిరావరణ కర్ణకుహరముల ద్వారా వేణుగీతము వారి అంతఃకరణములందు ప్రవేశించినంత శ్రీకృష్ణస్వరూప ప్రవాహము ప్రవాహితమాయెను. కొందఱు వ్రజాంగనల మనస్సునందు వస్తుతః, కామము గూడా జనించెను.

అథవా, 'స్మరోదయ' శబ్దమునకు అర్థము –

"స్మరేణ స్మరణేన ఉదయో యస్య"

అనియు చెప్పవచ్చును. అనగా, శ్రీకృష్ణుడు బృందావనమునకు

వెళ్లినపుడు, అచట గల పద్మామోదిత వాయుసంస్పర్శను, భృంగ, విహంగముల కలరవమును వినుటవలన, ఆయనకు, వ్రజాంగనల స్మరణము కలిగెను. ఆ స్మరభావవిశేషరూపమైన ఉద్దీపన విభావము చేత వేణుగీతము వినిఃసృతమయ్యెను. భగవంతుడు వేణువాదన వినోదపరాయణుడు. ఆయన, ప్రతి దినము వేణువాదనము చేయును. కాని, నేటి వేణుగీతమందు కొంత వైశిష్ట్యము ఉన్నది. అథవా,

"తాసామేవ స్మరేణ స్మరణేన ఉదయః యస్య,
తం స్మరోదయమ్ ।"

అను విగ్రహవాక్యము చెప్పవచ్చును. అనగా, విచిత్రములైన పికాదుల మధుర నాదమును శ్రవణము చేయుటవలన, వృషభాను నందినియైన రాధ, జ్ఞప్తికి వచ్చెను. ఆ కారణముచేత, వేణుగీతము ఉదయించెను.

సాధారణ భక్తుడు భగవత్సంమిలనమునకై ఉపాయమును ఆలోచించుచుండును. ఉత్కంఠాపూర్వకముగా తద్భగవ త్స్మరణము చేయుచుండును. ఉత్కంఠ, తీవ్రమైనపుడు, ఈ ఉత్కంఠయే భగవంతునియందు కలుగును. భక్తుడు, భగవదిత్సా న్నిధ్యముయొక్క ఉపాయమును ఆలోచించినట్లే ఇపుడు భగవంతుడు, భక్తుని కలియునట్టి ఉపాయమును ఆలోచించును. కాముకుడు, కామినీసంగమునకై ఉత్కంఠితుడై అనేక ఉపాయము లను ఆలోచించును. అరీతిగానే భగవంతుడు, స్వీయ భక్తిరూపిణి యైన అహ్లాదనీశక్తియొక్క, పరమాంతరంగరూపిణీ, మహాధుర్యా ధిష్ఠాత్రి, మహాశక్తిరూపిణియైన వృషభానునందిని మున్నగువారి సంమిలనమునకై ఉత్కంఠితుడగును. వారిని కలియుటకై ఏదియైన

ఉపాయమును కనుగోనవలయునని ఆలోచించును. కాముకుడైన వ్యక్తి, కామినిని తన వశము చేసికొనుటకై ఏదియో మోహన మంత్రమును ప్రయోగించినట్లుగానే శ్రీకృష్ణుడు, రాధ, లలిత, విశాఖ మొదలైన పరమాంతరంగభూతలు, మాధుర్యాధిష్ఠాత్రి యొక్క అంశభూతలు నయిన వ్రజాంగనలను వశము చేసికొనుటకై మోహనమంత్రమును అన్వేషింపసాగెను. అపుడు, ఆయన, వేణువును ఆరాధింప మొదలిడెను.

ఇచట, ఒక ప్రధాన విషయము కలదు. వ్రజాంగనలు, మొదట, శ్రీకృష్ణప్రాప్తికై కాత్యాయనీవ్రతమును ఆచరించిరి. అట్లే భగవంతుడు వంశీ ఆరాధనము చేసెను. వంశి, (వేణువు) సాక్షాత్తు, రుద్రభగవానుడే.

"రుద్రస్తు భగవాన్ వంశః ।"

శివారాధనము చేయక, అభీష్టఫల మెన్నడైనను, లభింపగలదా ? కావున, శ్రీకృష్ణుడు, శ్రీవ్రజాంగనాప్రాప్తికై వంశీరూపుడైన రుద్ర భగవానుని ఆరాధనము ఆరంభించెను. ఆరాధనావిధానము గూడా విచిత్రమై ఉండెను. స్వీయ, సుమధుర, కోమల అధరపల్లవము పైన వంశిని శయనింపజేయును. స్వీయ అనేక దివ్య రసమణి జటితమైన కిరీటమును ఆ వేణువుపైన ఛత్రముగా పట్టును. పరమ దేదీప్యమానములు, సువర్ణమణిమయములు నయిన కుండలము లతో హారతి ఇచ్చును. సుమధురమైన అధరసుధాభోగమును కలిగించును. కోమలములైన తన అంగుళులతో దాని పాద సంవాహనము చేయును. ఈవిధముగా వేణువును ఆరాధించుచు ఆరాధించుచు శ్రీకృష్ణునికి తన ఇష్టదైవము ఇపుడు ప్రసన్ను డయ్యెనా, కాలేదా ? అను విషయమును తెలిసికొనవలయునన్న కోరిక కలిగెను. దానికై వేణుపరీక్ష జరిగెను. ఒకనాడు, వేణురవము చేత యమునానదియొక్క గమనము ఆగిపోయెను. వంశీనాదము

యొక్క ఆ దివ్య ప్రభావమును చూచి, విశ్వాసము అధిక మయ్యెను. శ్రద్ధ పెరిగెను. దీనివలన పూజ గూడా పెరిగెను. ఆరాధన, తన్మయభావముతో జరుగసాగెను. ఒకనాడు, బృందా వనమందలి పాషాణములు వంశీధ్వనిని విని, ద్రవీభవించినవి. పశు, పక్షుల గతి దేవతల విమానాదుల గమనము ఆగిపోయెను. అన్నియు, చేష్టారహితములయ్యెను. ఈవిధముగా సంపూర్ణముగా వంశీపరీక్ష జరిగెను. అపుడు, శ్రీకృష్ణుడు గోపాంగనలకొఱకై పిల్లనగ్రోవిని ఊదెను.

"తద్వ్రజస్త్రియ ఆశ్రుత్వ వేణుగీతం స్మరోదయమ్ ।"

ఆ వేణుగీతమును వ్రజాంగనలు వినినట్లే ఇతరులు గూడా వినిరి. కాని, రసికత లేకపోవుటవలన, ఇతరులపై దాని ప్రభావము కలుగలేదు. ఇది ఉచితమే. అరసికులకు రసనివేదనము నిష్ఫలమే అగును.

"అరసికేషు కవిత్వనివేదనం శిరసి మా లిఖ మా లిఖ
మా లిఖ ॥"

కావున, వ్రజవాసులందఱు వేణుగీతమును వినిరి గాని, రసిక శిరోమణి ప్రభావము కొందఱు వ్రజాంగనలందే అధికముగా వ్యక్త మయ్యెను.

ఇచట, 'ఆశ్రుత్య' పదము ప్రయుక్తమైనది. కావున, ఆ - ఈషత్ - కొంచెముగా, శ్రుత్వా - 'విని' అను అర్థము వచ్చును. అనగా, దూరముగా ఉన్న బృందావనమందు జరిగెను. వ్రజాంగ నలు వ్రజనగరమందు ఉండిరి. కావున, వారు దూరముగా ఉండుట వలన, ఆ వేణునాదమును స్పష్టముగా వినలేకపోయిరి, మెల్లగా వినిరి. వినినంతనే మూర్ఛనొందిరి. కొంతసమయము గడచిన తఱువాత వారు మూర్ఛనుండి తేరుకొనిరి. వ్రజసీమంతినులు వేణు

గీతము వినిరి. అట్లే, ఇతరులు గూడా వేణుకూజనము వినిరి. కూజనమందు అర్థవిహీనమైన కేవల ధ్వనిమాత్రమే ఉండును. కాని, గీతము సార్థకమై, అర్థయుక్తమై ఉండును. కావుననే వేణు గీతమును వినిన వ్రజాంగనల అంతఃకరణమందు వేణుగీతమునకు అర్థమైన శ్రీవ్రజేంద్రకిశోరుడు, మన్మోహనుడు నయిన శ్యామ సుందరుని సుందర స్వరూపము అభివ్యక్తమయ్యెను. కాని, ఇతరులు కూజనము మాత్రమే వినిరి. కావున, వారి హృదయము లందు ఆ మధురమూర్తి ఉదయించలేదు. బ్రహ్మ, రుద్ర, ఇంద్రాదులు గూడా వేణుకూజనము వినిరి. అందఱును ఒక భావ విశేషమందు ముగ్ధులయిరి. కొందరి సమాధి గూడా భంగము అయ్యెను. కాని, కొందఱికి ఆ వేణుకూజన తత్త్వరహస్యము నిశ్చితముగా తెలియలేదు –

> ''శక్ర శర్వ పరమేష్ఠి పురోగాః కశ్మలం యయు
>
> రనిశ్చితతత్త్వాః ॥''

చతుర్దశ భువనములందును వంశీరవము వినిపించెను. అందఱును ముగ్ధులయిరి. ఎవరిపైన విశేష ప్రభావము కలిగెనో, వారు భావా వేశములో, ప్రేమోన్మాదములో మూర్ఛితులయిరి. ఆనాడుగూడా శ్రీకృష్ణుని నిత్యలీలలు జరుగుచున్నవి. వంశీవాదనము జరుగు చుండెను. భగవంతుడు వ్రజాంగనలను ప్రేమించినట్లే, ప్రతి ప్రాణిని ప్రేమించును. ప్రతి ప్రాణికొఱకు ఆ భగవంతుని వేణు గీతము సదా గానము చేయబడుచుండును, సమస్త జనులకు ఆ వేణుగీతము మనోహరమై ఉన్నది.

> ''సర్వభూత మనోహరమ్''

కాని, మహామోహముచేత ఆవృతమైన మనస్సు కలవారగుటవలన జనులకు అటువైపు ప్రవృత్తి కలుగదు.

"కాశ్చిత్ పరోక్షం కృష్ణస్య స్వసఖీభ్యోఽన్వవర్ణయన్ ॥"

ఇచట "కాశ్చిత్" పదము వలన కాంతాభావము కల వ్రజాంగనలకు స్మరోదయ మయ్యెను అని భావము వచ్చెను. కాని, నందగృహిణియైన యశోద, రోహిణి మున్నగు మాననీయ స్త్రీలయందు ఆ వేణుగీత శ్రవణముచేతనే వాత్సల్యభావము ఉదయించెను. కొందఱు వ్రజాంగనలు వేణుగీతకూజనమును విని, మూర్ఛితలయిరి. కొంత సమయము గడచిన తరువాత మఱల స్మృతి వచ్చినపుడు, వారు వేణుగీతము వినిరి. ఆ వేణుగీతతత్త్వమును తెలిసికొని, ప్రేమోన్మాదముతో మఱల మూర్ఛితలయిరి. భగవంతుని అనుగ్రహవిశేషమువలన మఱల సావధానలై తమ సఖులతో ఆ తత్త్వమును వర్ణించుటయందు ప్రవృత్తలయిరి.

"తద్వ్రజస్త్రియ ఆశ్రుత్య వేణుగీతం స్మరోదయమ్ ।
కాశ్చిత్ పరోక్షం కృష్ణస్య స్వసఖీభ్యోఽన్వవర్ణయన్ ॥"

"తద్వర్ణయితు మారబ్ధాః స్మరన్త్యః కృష్ణచేష్టితమ్ ।
నాశకన్ స్మరవేగేన విక్షిప్తమనసో నృప ॥"

శ్రీకృష్ణభగవానుడు వేణుకూజనము చేసినపుడు – వంశీవాదనము చేసినపుడు, శ్రోతలందఱును దానివలన, ప్రభావితులయిరి. ఏలన, శ్రోతలపైన ఏదియో కొంత ప్రభావము తప్పక కలిగించుట కూజనము, లేక ధనియొక్క స్వభావము. విశేషించి, ఈ వేణుకూజన శ్రవణము వలన అందఱిలోను భగవదీయతాభావము ఆవిర్భవించెను. కూజనము, నాదము యొక్క మహిమ ఎట్టిదనిన, ఎవనికి ఆ కూజనముతో, లేక నాదముతో సంబంధము ఉండునో, వానిని భగవదీయునిగా చేయును. ఇచట, కూజనము, రవము, గతి, భిన్నభిన్నములు. ఏలన, ఇవి భగవంతుని అధర సుధాసంవలితములు. భగవంతుని అధరసుధకు అందఱును సమాన

మైన అధికారము కలవారు కారు. కావున, వారి వారి అధికారము ననుసరించి వారిని అధరసుధావితరణము చేయుటకై వేణువాదన మందు గూడా కూజనాది భేదములు ఉండును. అధరసుధ మూడు విధములుగా ఉండును - ఒకటి దేవభోగ్యము, రెండు భగవద్భోగ్యము, మూడు సర్వభోగ్యము. ఈ సుధాత్రయము శ్రీకృష్ణుని ఒకే అధరమందు ఉండును. కాని, యోగ్యులైన అధికారులకు మాత్రమే, ఆ సుధాత్రయము దానము చేయబడును. ఇచట, భక్తుల భావమేమనిన, 'అధర ఏవ లోభః' అను వచనము ననుసరించి భగవంతుని అధరమే సాక్షాత్తుగా మూర్తీభవించిన లోభము. భగవంతుని మనస్సు చంద్రుడు అయినరీతిగా, నేత్రము సూర్యుడు అయినవిధముగా, అధరము రూపుదాల్చిన లోభము. దీని భావమేమనిన, భగవంతుడు తన అధరసుధారూపమైన కోశాగారమునకు లోభమును అధ్యక్షునిగా చేసెను. అధ్యక్షుడయిన కోశాగారాధిపతి కృపణుడై ఉండవలయును. అనగా, లోభియై ఉండవలయును. అతడు ఎవనికి ఏ వస్తువుపైన ఎంత అధికారము కలదని తలంచునో, వానికి ఆ వస్తువును అంత ప్రమాణములోనే ప్రదానము చేయవలయును. కావుననే భగవంతుడు లోభమును తన అధరసుధకు అధ్యక్షునిగా చేసెను. దీనివలన, ఆ లోభము ఒకే అధరమందు ఉండునట్టి మూడు విధములైన సుధను అధికారానుసారముగా ఒసగును. కావున, ఇచట వేణుకూజనమును వ్రజవాసులైన ప్రాణులందఱును వినినను, తద్ద్వారా వితరితమగు అధరసుధాప్రాప్తి వృషభానునందిని, లలిత, విశాఖ మున్నగు అధికారిణులు, అంతరంగభూతలు నయిన వ్రజాంగనలకు మాత్రమే కలిగెను.

వేణుచ్ఛిద్రముద్వారా వినిఃసృతమైన శ్రీకృష్ణభగవానుని అధరసుధాసంబంధముచేత సమస్తము రసాత్మకమయ్యెనని

ఇంతకుముందు చెప్పబడినది. ఈవిధముగా చూచిన, సమస్త విశ్వము ఆనందరూపమే. ఏలయనగా, ఈ చరాచరప్రపంచ మంతయు ఏకము. అఖండము, అనంతము, నిర్వికారము నయిన ఆనందమునుండి ఉత్పన్నమయ్యెను. ఆ ఆనందమందే, అవస్థితమై ఉన్నది. ఆ ఆనందమందే లీనమగుచున్నది. కావున, ఆనంద స్వరూపమే అయి ఉన్నది. ఘట, శరావ, ఉదంచనాది పదార్థ ములు మృత్తికనుండియే ఉత్పన్నమగుచున్నవి, దానియందే విద్య మానములై ఉన్నవి, అంతమున దానియందే లీనమగుచున్నవి. కావున, ఆ పదార్థములన్నియు, మృత్తికాస్వరూపములే. ఆ రీతి గానే నిఖిల చరాచర జగత్తు ఆనందస్వరూపమే అయి ఉన్నది.

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనందేన
జాతాని జీవన్తి ఆనందం ప్రయన్త్యభిసంవిశన్తి ।"

అను శ్రుతివచనానుసారము విశ్వము ఆనందమయమని తెలియు చున్నది. కాని, విశ్వముయొక్క ఆనందరూపత్వము మాయచేత ఆవృతమగుటవలన ఆ ఆనందరూపము అభివ్యక్త మగుటలేదు.

"నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః ।"

కాష్ఠములందు వ్యాపించి ఉండియు, అగ్ని, అవ్యక్తముగా ఉండును, దాహకత్వ, ప్రకాశకత్వరూపములో వ్యక్తము కాదు. కాని, దాహకత్వ, ప్రకాశకత్వవిశిష్టము, సాక్షాత్తుగా వ్యక్తము నయిన అగ్నితో ఆ కాష్ఠాదులకు సంబంధము కలిగినంతనే వాని యందు గూడా అగ్ని, వ్యక్తమగును. అటులనే సమస్త విశ్వము ఆనందరూపము, రసాత్మక మగుచు గూడా దాని రసాత్మకత్వము అభివ్యక్తము కాదు. సాక్షాత్తుగా భగవత్సంబంధముచేత ఎవరి రసాత్మకత వ్యక్తమగునో, అట్టి శుకాది మహాపురుషుల అను

గ్రహము లభించినపుడు దానియొక్క (విశ్వముయొక్క) స్వాభావికమైన రసాత్మకత్వము అభివ్యక్తమగును.

''దేవో భూత్వా దేవం యజేత్ ।''

అనగా, భక్తుడు స్వయముగా భగవద్రూపుడై భగవంతుని పూజింప వలయును. ఈ సిద్ధాంతము ననుసరించి అచింత్యుడు, అనంతుడు, పరమానందమయుడు, నిఖిల రసామృతమూర్తియును అయిన శ్రీకృష్ణభగవానుని అంతరంగరమణము భగవదీయత, రసాత్మకత అభివ్యక్తమైనవారిలోనే సంభవమగును. కావుననే ఎవరి భగవదీయత, రసరూపత పూర్వము వ్యక్తము కాలేదో, వారికి ఆ రస స్వరూపత్వము ఈ వేణువుజనమువలన వగక్తమయ్యెను. మొదటి నుండియే వ్యక్తమైన స్థలమున, స్మరోదయమయ్యెను. అసగా, స్మరణము కలిగెను. నాదమువలన ఉద్దీపనవిధితో గూడా స్మృతి కలుగును. నాదశ్రవణముచేత దాని ఉద్గమస్థాన స్మృతి కలుగుట స్వాభావికము.

ప్రవాహమందు పడిన వస్తువును తన గంతవ్యస్థానమునకు గొనిపోవుట, ప్రపంచమందలి సమస్త ప్రవాహముల స్వభావము. గంగాప్రవాహములో పడిన పుష్పము గంగయొక్క గంతవ్య స్థానము వైపునకు కొట్టుకొనిపోవును. కాని, వేణునాదప్రవాహ స్వభావము దీనికి వ్యతిరేకము. ఆ నాదప్రవాహము తనయందు నిపతితమైన వస్తువును గంతవ్యస్థానమునకు గొనిపోక తన ఉద్గమ స్థానమువైపునకు గొనిపోవును. కావున, శ్రీకృష్ణభగవానుని ముఖ చంద్ర వినిర్గతమైన వేణుగీతముయొక్క అఖండప్రవాహములో నిపతితమైన వ్రజాంగనల మనస్సులు, ఆ ప్రవాహముయొక్క ఉద్గమస్థానము, శ్యామసుందరుడు, వ్రజేంద్రనందనుడును అయిన శ్రీకృష్ణుని వైపునకు కొట్టుకొనిపోయెను. మనస్సులవెంట వారి శరీరములు గూడా ఆ దిశగా కొట్టుకొనిపోయినవి.

ఈ వేణుకూజన ప్రభావమువలన కొందఱు గోపాంగనలకు నిజముగానే స్మరోదయ మయ్యెను. అనగా కామోదయమయ్యెను. ఎలయనగా ఈ కూజననాదము కామదేవుని ముఖ్యదూత –

''మన్మథస్యాగ్రదూతః''

ఈనాదము మోహనమంత్రము. కావున, ఈ నాదమును విని, గోపాంగనలు మూర్ఛితలైరి. ఈ మూర్ఛ, సంచారిభావము. ఇచట, మూర్ఛ అని ఏమిటి? అపస్మారమువఱకు రసమే. ప్రపంచ రాగమందైనచో అందఱును, మూర్ఛితులే. కాని, శ్యామసుందరుడు, మన్మోహనుడు, వజేంద్రనందనుడు నయిన శ్రీకృష్ణుని లోకోత్తర, సుమధుర, అద్భుత, సౌరస్య, సౌగంధ్య, సౌందర్యసంపన్నమైన మాధుర్యమందు మోహితమై మూర్ఛితమగునట్టి విలక్షణ సౌభాగ్యము మాధుర్యాధిష్ఠాత్రి, పరమ అంతరంగభూత, వృషభానునందిని మున్నగు కతిపయ వ్రజసీమంతినులకే కలదు. ఆ పరమ మనోహర మోహనమంత్రమైన వేణుకూజనశ్రవణము చేత మూర్ఛితలైనపుడు, శ్రీకృష్ణానుగ్రహవిశేషము వలన కొందఱికి బాహ్యస్మృతి కలిగెను. అపుడు, సావధానలై, వారు ఆ కూజనము వైపునకు తమ నేత్రములను, మనస్సులను లగ్నము చేసిరి. మొదట, వారిని జాగరూకలను చేసి, వేణుకూజన ప్రయోజనమును సూచించవలసి ఉన్నది. వారు జాగరూకలైనపుడు, శ్రీకృష్ణుడు వేణువాదనముద్వారా గీతమును గానము చేసెను. ఆ గీతము స్పష్టమైన అర్థము కలది. ఆ గీతము భగవదీయ రసనిరూపకము. అనగా, భగవల్లీలావిశిష్టమైన తాత్కాలిక స్వరూపము, ఈ వేణు గీతముచేత స్పష్టముగా నిర్దేశము చేయబడినది. ఆ గీతమును వినిన గోపికల అంతఃకరణములందు భగవత్స్వరూపము అభి వ్యక్తమయ్యెను. ఆయనకు సంబంధించిన వివిధ హావభావాదులు

వ్యక్తము లయ్యెను. వీని అన్నింటివలన, వారు మఱల మూర్ఛిత లైరి. ఏలయన, ఇపుడు గీతార్థము ద్వారా శ్రీకృష్ణుని రసాత్మక స్వరూపము సాక్షాత్తుగా వారికి స్మరణమునకు వచ్చెను. పౌనఃపున్యముగా స్మరణాధిక్యముచేత కొందఱు గోపాంగనలకు, అంతఃకరణములందు ప్రియతముడు, ప్రాణధనుడు నయిన శ్రీకృష్ణుని పరిష్వంగము లభించెను. అపుడు, వారిలోనే ఒకరైన వ్రజాంగన, తన చెలికత్తెలతో తద్వర్ణనము చేయనారంభించెను –

"తద్వర్ణయితు మారబ్ధాః స్మరన్త్యః కృష్ణచేష్టితమ్।
నాశకన్ స్మరవేగేన విక్షిప్తమనసో నృప॥"

కాని, ఆ వేణుగీతము వలన, శ్యామసుందరుడు, మన్మోహనుడు నయిన శ్రీకృష్ణుడు స్మరణమునకు వచ్చెను. కాని, తద్వర్ణనము చేయుటకు స్మరవేగవశలైన ఆ గోపికలు సమర్థులు కాజాలకపోయిరి. మనస్సుతో ఒక్కమారు ఒకే కార్యము జరుగును. వారు అనుభవము నయినను పొందవలయును, లేక స్మరించవలెనను స్మరించవలయును. కాని, అనుభవములేక, స్మరణవర్ణనము తోడు తోడుగా జరుగజాలదు. శివుడు, కాకభుశుండి, సనకుడు, శుకదేవుడు మున్నగువారి అందఱి స్థితి ఇదియే. వారు భగవంతుని పరమ మంగళమయ దివ్య సౌందర్య మాధుర్యాదుల అనుభవ స్మరణమైనను చేయుదురు, లేక వర్ణనమైనను చేయుదురు. ఈ వర్ణనము గూడా బుద్ధిపూర్వకముగా కాక, భావోద్గారమై ఉండును. భావన చేసి చేసి రసము అంతఃకరణ, ప్రాణ, ఇంద్రియము లందు, రోమరోమమున నిండినప్పుడు ఆ రసము, ముఖములోనికి వచ్చి, ఉచ్చరింపబడును. అదియే, దాని ఉద్గారము. వర్ణనము చేయుచున్న సమయమున, శ్రీకృష్ణచేష్టితములు గుర్తుకువచ్చుట వలన, వర్ణనమే జరుగజాలదు. కాని, శ్రీకృష్ణభగవానునికి గోపికల చేత వర్ణనము చేయించుట అభీష్టమై ఉన్నది. ఏలయనగా, అపుడే

ఆ సుధ భగవద్భోగ్యము కాజాలును. భగవంతుని అధరసుధ భగవద్భోగ్యము ఎట్లగును ? భగవంతుడు స్వయముగా తనంతట తానే తన అధరోష్ఠమందు గల సుధాపానముచేయుట విపరీతమైన విషయము. అయిన, ఇది ఎట్లు సంభవము ? ఆఁ, దీనికి ఒకే విధానము ఉన్నది. భగవంతుని అధరపల్లవములతో సంబద్ధమైన వేణువునందు పూర్తిగా నిండి, ఆ వేణురంధ్రములనుండి బయల్వెడలి ఆ సుధ వ్రజకాంతల నిరావరణ కర్ణకుహరములద్వారా వారి అంతఃకరణమందు నివిష్టమై, అచటనుండి వారి అంతఃకరణమందు, ప్రాణములందు, అంతరాత్మయందు, ఇంద్రియములందు, రోమరోమమందు పూర్తిగా నిండి, ముఖములోనికి వచ్చి వారి అధరపల్లవములద్వారా వర్ణితమైనపుడే ఆ సుధ భగవద్భోగ్యమగును.

ఇచట, కొందఱు ఇది అసంగతమని సందేహింతురు. ఏలయనగా, మొదటి శ్లోకమందు 'చుకూజ వేణుమ్'అని వేణుకూజనము చెప్పబడినది. రెండవ శ్లోకములోనే 'ఆశ్రుత్య వేణుగీతమ్' అని వేణుగీతము చెప్పబడినది. ఇది, ఎట్లు సంభవము ! కూజనమైనచో, అర్థసంబంధము లేని ధ్వనిమాత్రమే. కాని, గీతమునకైనచో, కొంత అర్థము ఉండును. ఇటువంటి స్థితిలో మొదటి శ్లోకమందు 'కూజన' మని చెప్పినదానిని రెండవ శ్లోకమందే 'గీతమ్' అని చెప్పుట అసంగతము. కాగా, స్మరవేగము చేత విక్షిప్తమనస్కలైన కారణమున, ఆ గోపాంగనలు వర్ణింపజాలక పోయిరి.

"తద్వర్ణయితు మారబ్ధా నాశకన్ స్మరవేగమ్ ।"

అపుడు మధ్యలో

"బర్హాపీడం నటవరవపుః"

ఇత్యాది వర్ణనములు

"ఇతి వేణుర వంశ్మ త్వా"

అను వచనము ఇవన్నియు ఎట్లు పొసగును ? దీనికి సమాధాన మేమనిన ఇచట మొదటి శ్లోకమందు శ్రీకృష్ణుని బృందావన ప్రవేశము వర్ణితమైనది. రెండవ శ్లోకమందు ఆయన చేసిన వేణు కూజనము వర్ణింపబడినది. ఈ కూజమునముద్వారా అంతఃకరణ మందు శ్రీకృష్ణ స్వరూపమును అనుభవించి ఒకానొక వ్రజాంగన తన చెలికత్తెలతో తన అనుభవమును వర్ణింపసాగినంతనే భావనా జన్యమైన స్మరవేగముచేత మూర్ఛితురాలయ్యెను. మఱల స్మృతి కలిగినపుడు, వర్ణించుటకు ప్రయత్నముచేయగా, తిరిగి శ్రీకృష్ణుడు జ్ఞప్తికి వచ్చెను. ఏలన, వర్ణనము చేయుటకు ముందు తద్వర్ణనీయ తత్త్వము స్మరణమునకు వచ్చుట స్వాభావికము. కాని, తత్స్మరణము కలుగుటచేత పునః మూర్ఛితురాలయ్యెను.

ఈవిధముగా వర్ణించుటకు ప్రయత్నించిన ప్రతి పర్యాయము స్మరవేగమువలన మూర్ఛవచ్చుటచేత వర్ణించుటకు అసమర్థురాలయ్యెను. కాని, శ్రీకృష్ణభగవానునికైనచో, ఆ గోపాంగనలచేత వర్ణనము చేయించుకొనుట ఇష్టమైన విషయము. ఏలన, వ్రజాంగనల ద్వారా తద్వర్ణనము జరిగినపుడే భగవంతుని ఆ అధరసుధ, భగవద్భోగ్యరూపమున అభివ్యక్తమగును. కావున, భగవంతుడు దయతో ఉద్బుద్ధ సంప్రయోగాత్మక, విప్రయో గాత్మక ఉభయవిధమైన తన శృంగారరసాత్మక స్వరూపమును అధరసుధారూపముతో తన అధరపల్లవములపై విరాజిల్లునట్టి వేణువునందు నింపును. అట్లు నింపి, ఆ వేణురంధ్రముల ద్వారా నిర్గతమైన గీతపీయూషరూపముతో వ్రజాంగనల నిరావరణ కర్ణ కుహరముల ద్వారా నిర్మలము, స్వచ్ఛమునయిన వారి అంతః కరణపద్మములందు ప్రవేశించును. అట్లు ప్రవేశించి వారి అంత రాత్మలందు, అంతఃకరణములందు, ప్రాణేంద్రియములందు

రోమరోమమునందును నిండిపోయి, వారి అధరపల్లవములవఱకు పరిపూర్ణమగును. ఇపుడు పరిపూర్ణమైన ఆ అధరసుధ ఆ వ్రజాంగనల ప్రయత్నము లేకయే తనంతట తాను వారి అధర పల్లవములనుండి 'బర్హాపీడం నటవరవపుః' అను గీతరూపమున ఉచ్ఛలితమై అభివ్యక్తమయ్యెను. కావుననే ఇది, అనుభూతమైన తత్త్వోద్గారముగాని, వర్ణనము కాదు. అతి దివ్యమైన ఒక పాత్రయందు సుమధురమైన రసము నిండి ఉన్నదని అను కొనుడు. ఆ మధురరసము నిండియుండుటవలన వాయువు యొక్క తాకిడిచేత ఆ రసము పైకి పొంగి ఆ పాత్రలోనుండి బయటకు పోవును. లేక స్వయముగానే ఆ రసమునందు అలౌకిక మైన ఒకానొకపొంగు వచ్చుటవలన, ఆ రసము స్వయముగా ఉద్వేలితమై తొణికిపోవును. భక్తుల స్థితి ఇటువంటిదే. వారు ఏదేని ఉద్దీపనాది సామగ్రిని చూచినంతనే, తమ ప్రియతముని స్మరణము చేత విహ్వలలై పులకాంచితులగుదురు. దేహభానమును మఱచి పోవుదురు. మాటిమాటికి కలుగు స్మరణజన్య భావనావిశేషముచేత వారి మానస పంకజమునందు విరాజమానము, మూర్తిమంతము నయిన ఆ దివ్యరసము, వారి రోమరోమమున నిండిపోయి, స్వయముగా వారి ముఖమునుండి శబ్దబ్రహ్మరూపమైన కథాసుధ ద్వారా బలాత్కారముగా అభివ్యక్తమగును.

హనుమంతునకుగూడా, భీముని దర్శనముచేత తన ధ్యేయు, జ్ఞేయు, పరమారాధ్యరూపుడు, శ్రీమద్రాఘవేంద్రుడు నయిన శ్రీరామచంద్రుని స్మృతి కలిగెను. ఆరీతిగానే, భావుకులైన భక్తు లకు ఏదేని ఉద్దీపనసామగ్రియొక్క దర్శనమువలన తమ ప్రియతముడు, ప్రాణధనుడు, స్మరణమునకు వచ్చును. చంద్ర దర్శనముచేత సముద్రము ఉద్వేలితమైనట్లే, ఉత్తాల తరంగము లతో పరమ సుందరమైన శ్రీముఖచంద్రుని గాంచి, వృషభాను

నందినియైన రాధయొక్క అంతఃకరణమునందు విరాజమానమగు అనురాగరససార సాగరము ఉద్వేలితమై కథారూపమున వ్యక్త మగును. శ్రీకృష్ణుని స్థితి గూడా, ఇదియే. వృషభానునందిని యొక్క దివ్య సౌందర్యశోభిత ముఖచంద్రుని మనోహర సుషమను అవలోకించి, శ్రీకృష్ణుని మానసపంకజమందు విరాజమానమగు అనురాగ రసామృతసింధువు ఉద్వేలితమై, విక్షుబ్ధమైపోవును. పూర్ణిమాది దినములందే సాగరము అట్టి స్థితి పొందును. ఆవిధము గానే ప్రసంగవిశేషములందే ఈ అనురాగరససార సాగరము ఉద్వేలితమై పొంగిపొరలును.

భగవంతుని సగుణ, నిర్గుణ రూపములు రెండును, కర్ణకుహర ములనుండియే హృదయమున ప్రవేశించును. భగవంతుని మధుర మనోహర సౌందర్యాది గుణగణశ్రవణముచేత నిర్మలము, విశుద్ధము నయిన అఖండ గంగాజలప్రవాహము వలె ద్రవీభూత మైన మానసవృత్తిప్రవాహము భగవంతునిదిశగా ప్రవహించుటయే భక్తి. అథవా, భగవంతుని దివ్యగుణశ్రవణ మాత్రముచేత లక్క వలె అత్యంత ద్రవీభూతము, స్వచ్ఛమునయిన అంతఃకరణ మందు భగవంతుని పరమ మనోహర, మంగళమయమూర్తి దృఢ ముగా అంకిత మగుటయే భక్తి.

“మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే ।
మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ ॥”
“ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహికతాం గతా ।
సర్వేశే సామనోవృత్తి ర్భక్తి రిత్యభిధీయతే ।”

దీనికి మూలము కథాశ్రవణము. అచట (నిర్గుణోపాసన యందు) శబ్దబ్రహ్మ (మహావాక్యరూపము), మూలము. పరమా నంద రసామృతమూర్తియైన భగవంతుడే కథాసుధారూపములో

భావుకులైన భక్తుల నిరావరణ కర్ణకుహరముల ద్వారా, నిర్మల హృదయపంకజమందు ప్రవేశించును. భావనచేత ఉపచయము నొంది, భక్తుని మనస్సునందు, ఇంద్రియములందు, ప్రాణమందు రోమరోమమునందు నిండి, కథాసుధారూపములో పరిణతమగును. దేనిపైన ఎవరైనను, భావకుని హృదయమందు వ్యక్తమైన భగవన్మూర్తి, భావనామయమని చెప్పవచ్చునుకదా? భగవంతుడే స్వయముగా భక్తహృదయమందు అభివ్యక్తమగునని ఎట్లు చెప్పగలరు? అని తర్కించవచ్చును. ఇది, సరి కాదు.

భగవంతునికి యాతాయాతములు ఎచట ఉన్నవి? ఆయన సర్వవ్యాపకుడు, సర్వగతుడు, కేవలము మాయాయవనికచేత ఆవృతుడై ఉన్నాడు. ఆ మాయాయవనికాపసారణమే విలంబము. ఆయన, తన దివ్య మహిమచేత తన్మాయాయవనికాపసారణము ఎచట చేయునో, అచటనే తదభివ్యక్తి జరుగును. ఉత్తరాగర్భస్థుడైన పరీక్షిన్మహారాజుకు భగవద్దర్శనమయ్యెను. అచట, భగవంతుడు ఉత్తరాగర్భమందు, ఎచటనో బయట నుండి వచ్చి ప్రవేశించెనా? ఆయన, సర్వప్రకాశకుడు, సర్వవ్యాపకుడును అగుటచేత అచట గూడా ఉండనే ఉండెను. కేవలము తన పరమ మంగళమయ దివ్యానుగ్రహము వలన, మాయాయవనికను అపసరింపజేసి (తొలగించి) ప్రకటమయ్యెను. ఈ వివేచనము లన్నింటి వలన, నిస్సందేహముగా పరమార్థతత్త్వమే శబ్దబ్రహ్మరూపములో భావకులైన భక్తుల ముఖమునుండి వినిర్గతమగుననియు, ఆ శబ్దబ్రహ్మయే, భక్తుల కర్ణరంధ్రముల ద్వారా హృదయమున ఆవిర్భవించుననియు, ఇది అసాధారణమైన కథాసుధాచర్చ అనియు స్పష్టము,

ఇచట, భగవంతుడు, స్మరతీవ్రతచేత విక్షిప్తమనస్కలైన ఈ వ్రజాంగనలవలన గీతార్థవర్ణనము కుదరజాలదు. కావున, నిఖిల

రసాత్మకమైన స్వీయ మూర్తిని నిరావరణ మొనర్చి, వేణుగీత పీయూషరూపములో కర్ణకుహరముల ద్వారా గోపాంగనల హృదయపంకజమందు చేర్చవలయునని ఆలోచించెను. ఈ గీతము పూర్వకూజనాపేక్షయా, అద్భుతమైనది. భక్తులు శ్రీకృష్ణ భగవానుని, ఫలరూపమని భావించిరిగాని సాధనమని భావించలేదు. సుఖము ఫలరూపమై ఉండును. కావున, స్త్రీపుత్రాదులు తత్సుఖ సాధనములే. సమస్తము ఎవరికొఱకై ఉన్నదో, ఏది, ఇతరులు ఎవరి కొఱకునుకాదో, అదియే ఫలమగును. స్త్రీ, పుత్ర, ధన, ధాన్యాదులు సుఖముకొఱకే అపేక్షితములగును. సుఖము ఎవరి కొఱకు? అని అడిగినచో, సుఖము మఱొకరి కొఱకు కాదు, సుఖము, సుఖముకొఱకే అని చెప్పవలసివచ్చెను. కావున, స్త్రీ, పుత్రాదులందఱును సుఖసాధనములు. సుఖము ఫలాత్మకము. ఈ విధముగానే భగవంతుడు, సుఖమునకు గూడా సుఖ మగుటచేత, పరమ ఫలస్వరూపుడు. ఏలయనగా, ఆయన, పరమానందరస మూర్తి. శర్కరాపుత్తలిక (పంచదారబొమ్మ) యొక్క సర్వావ యవములు శర్కరాసంబంధులే అగును. అట్లే, నిఖిల రసామృత మూర్తియైన శ్రీకృష్ణభగవానుని హస్తారవిందములు, పాదారవింద ములు, ముఖారవిందము, సర్వావయవములు పరమానంద మయములే –

"ఆనందమాత్రం కరపాదముఖోదరాదిః ।"

భగవంతుని ముఖచంద్రుడు పూర్ణానురాగరససారసాగర సముద్భూతుడు. కమలము ప్రాకృత సరోవరమునుండి సము త్పన్నమైనట్లు, భగవంతుని మంగళమయ, మనోహర వదనార విందము పూర్ణానురాగ రససార సముద్భూతము. జలపూర్ణమైన ప్రాకృతసరోవరమందు పంకము మృణ్మయమై ఉండును. ఆ పంకమునుండి ఉత్పన్నమగు పంకజము ఎంత సౌరస్య, సౌగంధ్య

సౌందర్య, సుస్పర్శసంపన్నమై ఉండును? ఇపుడు, క్షీరమయ మైన సరోవరము ఉన్నచో, దానియందలి పంకము గూడా క్షీరసార మైన నవనీత మే అయి ఉండును. ఆ సరోవరమునుండి సముత్పన్న మగునట్టి పంకజసౌందర్య, సౌగంధ్య. సౌరస్యాదులుగూడా అలౌకిక ములే అయి ఉండును. ఇచట, శ్రీకృష్ణముఖపంకజము, పూర్ణాను రాగరససారమైన సరోవరమునుండి సముద్భూతమైనది. కావున, తత్సరోవరపంకముకూడా పూర్ణానురాగరససారసర్వస్వమే అగును, ఆ సరోవరమునుండి సముద్భవించిన శ్రీకృష్ణముఖేందీవర శోభ, సౌందర్యము, మాధుర్యము, సౌగంధ్య, సౌరస్యములు మున్నగువానిని గుఱించి చెప్పనదేమి ఉండును!

శ్రీకృష్ణుని మూర్తి అంతయు, ఫలాత్మకము గాని, సాధనము కాదు. విధినిషేధములు, సాధనమునకే ఉండునుగాని, ఫలమునకు ఉండవు. అఘాసుర హననాదుల సమయమున శ్రీకృష్ణునియందు ఎడనెడ సాధనత్వము గూడా ఉండెను. కాని, ధ్యానకాలమునందైనచో, ఆయన, సుఖమాత్రస్వరూపుడగుటవలన, శుద్ధ ఫలాత్మయే. శ్రీకృష్ణుడు యదాత్మకుడై ఉండునో, తదాత్మకమయియే ఉద్బుద్ధ సంప్రయోగాత్మక, విప్రయోగాత్మక, ఉభయవిధ శృంగారరస స్వరూపము, భగవద్భోగ్యమయిన అధరసుధగూడా కావలయును. అనన్యములైన అవయవములందు సాధనత్వము ప్రవేశించినను, అధరసుధయందు కేవలము ఫలాత్మకతయే కలదు. లౌకికరస ములు అనుభవించగా, అనుభవించగా, విరసములగును. కాని, ఈ రసవిశేష మేమనిన, ఇది ఎన్నడును, విరసము కాకపోవుటయేకాక, ఎంత అత్యధికముగా అనుభూతమగునో, అంత ఎక్కువగా వృద్ధిని పొందును. కామినీ సంప్రయోగాదులయందు ఈ విశేషము లేదు.

అవట అయినచో, కామిని మున్నగువారియందు విరసత్వము జనించును. కాని, ఇచట గల రస మన్నచో, విరసము కానేకాదు.

ఈ రసము, గోపికల అంతరాత్మ, అంతఃకరణము, ప్రాణము, ఇంద్రియములు, రోమరోమములు అంతట పూర్తిగా నిండి వ్రజాంగనల అధరపల్లవముల ద్వారా వేణుగీతపీయూష రూపమున ఉద్వేలితమై అభివ్యక్త మయ్యెను.

"బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనకకపిశం వైజయన్తీం చ మాలామ్ ।
రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్ గోపబృందై
ర్బృందారణ్యం స్వపదరమణం ప్రావిశ ద్గీతకీర్తిః ॥"

'బర్హాపీడ' మన్న ఈ శ్లోకము సాధారణమైన శ్లోకము కాదు. విశేషించి, సాక్షాత్తు భగవద్భోగ్యమైన అధరసుధయే. శ్రీకృష్ణుని అధరమందు ఉండెడి సుధ, ఆయనకే భోగ్యము ఎటుల అగును ? అను విషయము పూర్వము చెప్పబడినది. ఇది రసశాస్త్రమునకు విరుద్ధము. కాని, భగవంతునికి తత్సుధాభోగము ఇష్టము. భగవ ద్భోగ్యమైన ఈ అధరసుధ వ్రజాంగనల అధరపల్లవములందు అభివ్యక్తమైనపుడే తత్సుధాపానము సంభవమగును. అప్పుడే సంప్రయోగాత్మకమైన శృంగారమునందు భగవద్భోగ్యమైన అధరసుధ భగవంతునికి లభించును. కావుననే శ్రీకృష్ణచంద్ర భగవానుడు పరమానందకందము ఆ సుధను వేణువునందు పూరించి దాని ఛిద్రముల (రంధ్రముల) నుండి వ్రజాంగనల కర్ణకుహర ములద్వారా వారి హృదయములందు ప్రవేశింపజేసెను. కాని, అదె, వ్రజాంగనలచేత వర్ణితమై, వారి అధరపల్లవములందు విరాజ మానమైనపుడు, దానియందు భగవద్భోగ్యత కలుగును. గోపికలు విహ్వలలై తద్వర్ణనము చేయుటలో అసమర్థలగుచుండిరి. కాని,

వర్ణనము చేయించుట శ్రీకృష్ణునికి అభీష్టమైన విషయము. కావున, ఆయన, తన కృపావిశేషముచేత వ్రజాంగనల హృదయములందు గల ఆ సుధను భావన ద్వారా పెంపొందించి, వారి ముఖముల ద్వారా వర్ణనవ్యాజముతో అభివ్యక్తము చేసెను. అనగా, భగవద్భోగ్యమైన ఆ అధరసుధ వేణుగీతరూపమున, వ్రజాంగనల ముఖపంకజమును చేరెను. ఆ వర్ణనము ఉద్గార మగుటవలన, ప్రయత్ననిరపేక్షము, బుద్ధినిరపేక్షము గాన, స్వాభావికము. అదియే, 'బర్హాపీడం నటవరవపుః' అనునది, ఇదియే వేణు రవము –

"ఇతి వేణురవం రాజన్ ।"

అనగా. భగవద్భోగ్యమైన ఏ అధరసుధ వ్యక్తమయ్యెనో, అది ఏతత్ శ్లోకాత్మకము.

ఈ శ్లోకమునకు, తత్ప్రతిపాద్యమైన అర్థమునకు అభేదము కలదన్న విషయమును దృష్టిలో ఉంచుకొనవలయును. నామమునకు, నామికి, శబ్దమునకు, అర్థమునకు అభేదము ఉండును. ప్రియతముడు, ప్రాణధనుడు, నిరతిశయుడు, నిరుపాధికుడు, పరమ ప్రేమాస్పదుడు నయిన శ్రీకృష్ణభగవానునికి వ్రజాంగనలతో బాహ్యాంభ్యంతర రమణములు రెండును వివక్షితములు. బాహ్యరమణము ప్రేయసీ, ప్రియుల బాహ్యదేహ సంసర్గముచేత కలుగును. కాని, ఆంతరమైన రమణము బాహ్యదేహసంసర్గనిరపేక్షములైన మనఃప్రాణ అంతరాత్మల సర్వాంగీణ తాదాత్మ్యము వలననే పొసగజాలును. కాని, గోపికలతో శ్రీకృష్ణచంద్ర పరమానందకంద సంబంధియైన అంతర రమణము నిజముగానే శ్రీకృష్ణుడు ఆ గోపికల హృదయమందు విరాజిల్లుచున్నపుడే కలుగును. భావనాతీవ్రతచేత గూడా భావితుని (భావనచేయబడిన

వాని) సాక్షాత్కారము కలుగును. కాని, అచట ఉన్నది భావనామయమూర్తియే. తద్భావనామయమూర్తితో కలుగు సంప్రయోగమును (సంయోగమును) తాత్త్వికమని (వాస్తవికమని) చెప్పుటకు వలనుపడదు. విశేషించి, ఇది భ్రమాత్మకము. ఏలన, అచట అనుభవసంవాదములేదు. స్వరూపమునకు సంబంధించిన వర్ణనము జరుగుటవలన. ఒక దివ్యతేజోమయ తత్త్వము అభివ్యక్తమగును. అదియే మనోమయమూర్తి. ఆ మూర్తియందు గూడా రమణము జరుగును. అది గూడా సాక్షాత్తుగా జరుగునని చెప్పుటకు అవకాశము లేదు. ఇది, భావనామూలకమైన మనోమయవృత్తి. అవును, భగవంతుని మనోమయమూర్తి యొక్క భావన గూడా అనంత మహిమోపేతము అనుటలో సందేహ మేమియును లేదు. విధుర పరిభావిత కామినీసాక్షాత్కారమునకు భగవంతుని మంగళమయ, మనోమయమూర్తుల సౌందర్యమాధుర్య సమాస్వాదనమునకు పెద్ద అంతరము కలదు. మొదటిది, అనర్థమునకు, పతనమునకు మూలము; రెండవది, పరమ కళ్యాణమునకు మూలము.

భగవంతునికి, ధాతుమయ, పాషాణమయ, కాష్ఠమయ ప్రతిమ ఉన్నట్లే మనోమయమైన ప్రతిమ ఉండును. పాషాణాది మూర్తులను ఆలంబనముగా చేసికొని, మెల్లమెల్లగా భగవదభివ్యక్తి కలుగును. ఆరీతిగానే మనోమయమూర్తిచింతనము వలన, భగవత్సాక్షాత్కారము కలుగును. విధురపరిభావిత కామినీసాక్షాత్కారస్థలమున, కామిని లేకపోవుటవలన, అది, కేవలము భావన, భ్రమ. కాని, భగవంతుడు సర్వాంతరాత్మ, సర్వవ్యాపకుడు. భావుక (భక్త) పరిభావితము మనోమయ మయిన భగవన్మూర్తి సంబంధమైన భావనాప్రాచుర్యము (తీవ్రత) వలన కలుగు భగవత్సాక్షాత్కారము తాత్త్వికమైనది. ఏలయన, భావనాభావితమైన భగవత్సాక్షాత్కారము జరుగుచున్న స్థలమున, సర్వాంతరాత్మ

అయిన భగవంతుడు స్వయముగా విరాజమానుడై ఉండును. కావుననే అఘాసురవధప్రసంగమున, శ్రీశుకయోగీంద్రుడు, ద్విజ మాంసరుధిరాశి, మహాపాపాత్ముడు నయిన అఘాసురముఖము నుండి, దివ్యజ్యోతి బహిర్గతమై, శ్రీకృష్ణముఖమున, ప్రవేశించెనని చెప్పినప్పుడు ఈ మాటలు వినిన పరీక్షిన్మహారాజునకు, ఇది యేమి ? గొప్ప గొప్ప యోగీంద్రులకు, మునీంద్రులకు సైతము దుర్లభమైన గతి, దుష్ట దానవుడైన, ఆ అఘాసురనికి ఎట్లు సిద్ధించెను ? అని సందేహము కలిగెనని చెప్పబడినది.

అపుడు, శ్రీశుకయోగీంద్రుడు ఇట్లు చెప్పెను – 'ఏ అఖండ అనంత, స్వప్రకాశ, పరమానందమూర్తియైన భగవంతుని మంగళ మయమూర్తికి సంబంధించిన కేవల మనోమయమైన, భావనామయ మూర్తి ఒకమారు భక్తుని స్వచ్ఛ, సమాహిత అంతఃకరణపంకజ మందు ఆవిర్భూతమై భాగవతగతిని – సాయుజ్యముక్తిని ప్రదానము చేయునో, ఆ సద్ఘన, చిద్ఘన, ఆనందఘన, నిత్య, స్వప్రకాశరూపముతో మాయను, మాయాపరికల్పిత ప్రపంచమును తిరస్కరించునట్టి శ్రీకృష్ణభగవానుడు స్వయముగా ఎవరి హృదయ మందు ప్రవేశించెనో, వాని ముక్తియందు సందేహ మేల ?''

''సకృద్యదంగప్రతిమాన్తరాహితాం మనోమయీం
భాగవతీం దదౌ గతిమ్ ।
స ఏవ నిత్యాత్మసుఖానుభూత్యభివ్యుదస్త
మాయోఽన్తర్గతో హి కిం పునః ॥''

భావుకుని రసిక హృదయము భగవంతుని, సృష్టించును. భక్తుడు ఏ యే మూర్తిని భావన చేయుచుండునో, భగవంతుడు ఆ యా మూర్తులను ధరించవలసివచ్చును.

"యద్యద్ధియాత ఉరుగాయ విభావయన్తి తత్తద్వపుః
ప్రణయసే సదనుగ్రహాయ ।"

సాధారణ మనుష్యుల కల్పన మనోరాజ్యము. కాని, భక్తుని కల్పన ఫలపర్యవసాయియై ఉండును. కావున. భావనా ప్రాచుర్యము - తీవ్రత కలిగినప్పుడు భక్తోపహృతమైన వస్తువు భగవంతునియందు ఉపలబ్ధమగును. చివఱికి ఎంతవఱకు వచ్చె ననిన, ప్రత్యక్ష, అనుమానాదులు ప్రమాణములుగాని, భావన, ప్రమాణకోటిలో పరిగణింపబడదు. కావున, భావనాభివితమైన మనోమయమూర్తి సాక్షాత్కారము, విధురపరిభావిత సాక్షాత్కారమువలె భ్రమాత్మకము అని, ఇట్లు చెప్పజనదు. ఏలయనగా, విధురపరిభావిత కామినీ సాక్షాత్కారస్థలమున, కామిని లేని కారణము చేత ప్రమాణాంతరముతో విసంవాదము కలుగుటవలన, అది భ్రమ కావచ్చును, కాని, నిర్గుణ పరబ్రహ్మ సాక్షాత్కార స్థలమందైనచో, ఉపనిషదాది ప్రమాణాంతరసంవాదము కలదు. అనగా, శబ్ద ప్రమాణభూతమైన ఉపనిషత్తులు, బ్రహ్మకు ఎటువంటి స్వరూపము చెప్పుచున్నవో, అట్లే, ఇక్కడ సాక్షాత్కారము గూడా జరుగుచున్నది. కావున, దీనిని భ్రమ అని చెప్పజనదని పూర్వమే చెప్పియున్నాము. భగవంతుడు సర్వవ్యాపకుడు. కాని, మాయాయవనికచేత సమావృతుడై ఉండుటవలన సర్వులకు ప్రకాశితుడు కాడు.

"నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః ।"

కాని, ఆ భగవంతుడే భక్తుని భావనచేత, లేక స్వానుగ్రహవిశేషము చేత ఆ మాయాయవనికను తొలగించినచోటనే ఆ భగవంతుని అభివ్యక్తి కలుగును. అనగా, భావనామయమైన మూర్తియే ప్రాకృతత్వమును వీడి, అప్రాకృతత్వమును ధరించును. ఇట్లు ధరిం

చుట, ధ్యానమహిమ. ధ్యానము అభివృద్ధి చెందుటవలన అలౌకి కత్వము వచ్చును. ఉత్తరాగర్భములో అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రమునుండి పరిక్షిత్తును రక్షించుటకై ఎచట నుండియో బయటినుండి వచ్చి ప్రవేశించెనా ? ప్రహ్లాదుని రక్షించుటకై స్తంభ మందు ఎచటినుండి వచ్చెను ? సర్వవ్యాపకు డగుటవలన ఆయన మొదటనుండియే అచట ఉండెను. కేవల అనుగ్రహముచేత భక్త రక్షణార్థమై మాయాయవనికను తొలగించి అచట, ప్రకట మయ్యెను. ఈరీతిగానే నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారస్థలమున గూఢా తత్త్వము సర్వవ్యాపక మగుటచే శ్రవణ, మననములచేతనే మాయాయవనిక అపసారితమైనపుడు, ఆ నిర్గుణ పరబ్రహ్మ ఉప లబ్ధమగును. ఏలయనగా, జ్ఞానము, జ్ఞేయము, జ్ఞానగమ్యము సర్వుల హృదయములందు అవస్థితములై ఉన్నవి.

"జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్యాధిష్ఠితమ్ ।"

కాని, ఆ మాయాయవనిక పునః ఆవృతము కారాదు. కావున, ఆ శ్రుత, మత, సాక్షాత్కృత, తత్త్వాకారాకారితమైన విశుద్ధ మానస వృత్తికి ఆదరపూర్వకముగా అఖండప్రవాహరూపమైన నిది ధ్యాసనము అపేక్షితము. ఈవిధముగా నిర్గుణ, సగుణ భగవత్సా క్షాత్కారము భ్రమ కాదు, పరమార్థభూతము.

ప్రకృతమున, ఉద్బుద్ధ సంప్రయోగాత్మక, విప్రయో గాత్మక ఉభయవిధ శృంగారస్వరూపుడు, నిఖిల రసామృతమూర్తి శ్యామసుందరుడు, వ్రజేంద్రనందనుడు నయిన శ్రీకృష్ణుడే 'బర్హా పీడం' ఇత్యాది వేణుగీతరూపమున వ్రజాంగనల మానసపంకజము లందు ప్రవేశించెను. భావనావిశేషముచేత వృద్ధిని పొంది, ఆ వ్రజాంగనల అంతరాత్మలందు, మనఃప్రాణ ఇంద్రియాదులందు సంపూర్ణముగా నిండి, వారిని అప్రాకృతలనుగాచేసి, మనోహర,

మంగళమయ మూర్తిగా అభివ్యక్తమై, ఆయనయే వ్రజాంగనలతో అంతరమైన రమణము చేసెను. ఈ ఆంతరరమణమే, యథార్థ మైన రమణము. ఇచట, దేహాదుల వ్యవధానము లేదు. విశేషించి, అంతఃకరణమందే శ్రీకృష్ణుడు అభివ్యక్త మగుటవలన వ్రజాంగన లతో వ్యవధానరహితము, పరమము నయిన ఆయన చేసిన ఆంతర రమణము సుసంపన్న మయ్యెను. ఏకకాలముననే, సంప్రయోగ, విప్రయోగ, ఉభయవిధ శృంగారరసము అనుభూయమానమగుట, రెండును ఉద్బుద్ధములు, నగుట ఇచట గల వైలక్షణ్యము. ఈ విషయమును ప్రదర్శించుటకొఱకే 'వేణురవ' శబ్దము ప్రయుక్త మైనది, 'ర' అగ్నిబీజ మగుటవలన దానిచే విప్రయోగాత్మకము ఉద్బుద్ధము నయిన శృంగారరసము గ్రహింపనగును. 'వ' అమృతబీజ మగుటవలన దానిచేత సంప్రయోగాత్మకము, ఉద్బుద్ధము నయిన శృంగారరసము గృహీతమైనది.

ఈ రసము గొప్పగొప్ప నిర్వికల్పసమాధి సిద్ధులను, నిర్గుణ పరబ్రహ్మస్వరూపనిష్ఠులను, మహాయోగీంద్రులను, మునీంద్రు లను సయితము తన వైపునకు బలాత్కారముగా ఆకర్షించు కొనుటయే, ఏతద్రస విశేషము. ఆత్మస్వరూపమందు రమించు వారు, చిజ్జడాధ్యాసరూపమైన గ్రంథిని భేదించువారు నయిన శుకాది, సనకాది మహామునీంద్రులు గూడా అఖండ, అనంత, అసంగ, కూటస్థమైన ఆ స్వాత్మరూపావస్థితిని వదలి, అచింత్య, అనంత, సుమధుర, అఖిలరసామృతమూర్తియైన పరమ మంగళ మయము, లోకోత్తరము, అద్భుతము మనోహరము నయిన ఆ శ్రీకృష్ణ సౌందర్య, మాధుర్య సమాస్వాదనమందు ఆసక్తు లగుదురు -

"ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే ।
కుర్వన్త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః ॥"

శుకయోగీంద్రుడు జన్మతోనే సజాతీయ, విజాతీయ స్వగత భేదరహితము, అఖండము, అనంతము, స్వప్రకాశము, నిర్గుణము నయిన పరబ్రహ్మయందు పరినిష్ఠితమతి. ఆ శుకయోగీంద్రుని అఖండస్థితి, ఆకాశము విరిగిమీదపడినను, మేరుపర్వతము విశీర్ణమైనను, సముద్రము శుష్కించిపోయినను, చలించునది కాదు. మాయామోహజాలమునందు బద్ధుడై పోయెదనను భయముతో ద్వాదశవర్షపర్యంతము మాతృగర్భమునుండి బహిర్భూతుడు కాక, ఆగర్భమందే, నిర్గుణ, నిరాకార తత్త్వమందే, సర్వాత్మనాపరినిష్ఠితుడై ఉండెను. గర్భమునుండి బయల్పడినంతనే ఆ శుకయోగి, అరణ్యమునకు బయలుదేరెను. తత్త్వవేత్త అగుటవలన స్త్రీ పురుషాది భేదము ఆయన దృష్టికి వచ్చుటలేదు. మహాయోగియైన ఆ శుకదేవుడు అష్టాదశసహస్ర శ్లోకాత్మకమైన ఆ భాగవత మహాసంహితను తన తండ్రియగు వ్యాసమహర్షినుండి ఎట్లు అధ్యయనముచేసెను ? అని శౌనకమహర్షికి గొప్ప సందేహము కలిగెను. అంత, సూతముని ఇట్లు చెప్పెను –

"బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనక కపిశం వైజయన్తీం చ మాలామ్ ।
రంధ్రాన్వేణో రధరసుధయా పూరయన్ గోపబృందై
ర్బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్ గీతకీర్తిః ॥"

శ్రీవ్యాసమహర్షి, ఈ శ్లోకము కొందఱు శిష్యులకు చెప్పి, వారిని అరణ్యములో ఉన్న శుకదేవుని దగ్గఱకు పంపెను. శిష్యులు అరణ్యములో ఉన్న శుకదేవుని చెంతకు పోయి, అతి మధుర స్వరములో ఆ శ్లోకమును పునః పునః పఠించిరి. ఆ శ్లోకమున విని, అందు వర్ణింపబడిన శ్యామసుందరుడు, మదనమోహనుడు,

భగవంతుడునయిన శ్రీకృష్ణుని మధుర మనోహరమూర్తిచింతనము చేసి, ఆయన సమాధిసుడయ్యెను. సమాధిభగ్నమైనంతనే ప్రేమ పరవశుడై శుకదేవుడు నాట్యము చేయసాగెను. శిష్యులు వెళ్లి, తమ ఆచార్యుడైన వ్యాసమునీంద్రునితో జరిగినస్థితిని చెప్పిరి. అంత, వ్యాసుడు ఇట్లు ఆలోచించెను 'ఆ శ్లోకప్రభావము పుత్రుపై కలిగినది, అతడు, ఇంతవఱకు రాలేదేమి'? అపుడు, వ్యాసమునీంద్రుడు దివ్యదృష్టితో చూచెను. అపుడు 'ఇటువంటి లోకోత్తర సౌందర్యలావణ్యసంపన్నుడైన భగవంతుడు నాబోటి దీనునిపై ఎట్లు కృప చూపును?' అని శుకులవారికి సందేహము కలిగినట్లు నిశ్చయించుకొనెను. వెంటనే, వ్యాసమహర్షి, మఱొక శ్లోకమును చెప్పి, శిష్యులను శుకదేవుని దగ్గఱకు పంపెను. శిష్యులు ఆ శ్లోకమును మధురమైన స్వరముతో గానము చేసి, శుకదేవునికి వినిపించిరి -

"అహో బకీయం స్తనకాలకూటం జిఘాంసయా
పాయయదప్యసాధ్వీ ।
లేభే గతిం ధాత్ర్యుచితాం తతోఽన్యం కం వా
దయాలుం శరణం వ్రజేమ ॥"

అనగా లోకబాలఘ్ని, దుష్టరాక్షసి అయిన పూతన ప్రభువును చంపవలయునన్న కోరికతో కాలకూట హాలాహల విషసంపృక్తమైన స్తన్యపానము చేయించెను. కాని, ఆమెకు గూడా ఆ కృష్ణ భగవానుడు తల్లికి యోగ్యమైన సద్గతి నొసగెను. ఆ భగవంతుని కంటె ఎక్కువ దయాళువు, కృపామయుడు మఱి ఎవరు ఉందురు? ఆశ్చర్యము!

బ్రహ్మకు గూడా 'భగవంతుడైన శ్రీకృష్ణుడు వ్రజవాసులైన గోపాలకుల నుండి ఎట్లు విముక్తుడగును'? అని గొప్ప చింత కలిగెను. బ్రహ్మ శ్రీకృష్ణభగవానునితో - హే దేవ! నీవు ఈ వ్రజ

వాసులకు ఏమి ఒసగి ఋణవిముక్తుడ వగుదువు ? అని అడిగెను. దీనికి చింతింపనేల ? వారికి త్రైలోక్యసుఖము నొసగి ఋణవిముక్తుడను అగుదునని నీవు చెప్పవచ్చును. కాని, భగవాన్ ! నీవే సర్వఫలాత్మకుడవు. అనంత సౌఖ్యసింధువు. నిఖిల బ్రహ్మాండమందలి సమస్త ప్రాణులు "అస్య మాత్రా ముపజీవన్తి" అను శ్రుతి వచనానుసారము ఏ ఆనందసుధాసింధువునందలి ఒక్క బిందువును పొంది, ఆనందించుచున్నారో, ఆ అనంత, అఖండ మహానంద సింధువు, మూర్తిమంతమై ఎవరి ప్రాంగణమున ధూళిధూసరితమై విహరించుచున్నదో, వారికి ఆనందబిందువుయొక్క లోభము ఏమి చూపెట్టగలవు ? కావున, వారికి త్రైలోక్య సుఖము నిచ్చియు వారి ఋణమునుండి విముక్తుడవు కాజాలవు. కేవలము ఈ వ్రజవాసులకే కాదు, వారి సమస్త కులమునకు నన్ను సమర్పించుకొని నేను ఋణవిముక్తుడను అగుదునని చెప్పినచో, హే భగవాన్ ! నీవు విషమిశ్రితమైన స్తన్యము నొసగిన పూతనపట్ల, ఎట్లు వ్యవహరించితివో, అట్టి వ్యవహారమే గృహ, విత్త, సుహృత్, ప్రియదేహ, పుత్ర, ప్రాణ, అంతరాత్మాదులను సర్వస్వము నీ శ్రీచరణములందు సమర్పించునట్టి ఈ వ్రజవాసులతో గూడా చేయుట ఉచితమగునా ? పూతనకు కులసహితము, కుటుంబసహితముగా నీవు సద్గతి నొసగితివి కదా ! వారిలో సద్గతినొందక, ఎవరు మిగిలియున్నారు ? తృణావర్త, అఘాసురాది పూతనా కుటుంబమునకు సంబంధించిన వారందఱికి నీవు ఆత్మసమర్పణము చేసితివి.

తేలిన సారాంశ మేమనిన, విషప్రదానము చేసిన పూతనకు గూడా ఎవరు ఆత్మసమర్పణము చేసిరో, యోగీంద్రులైన మునీంద్రులకు స్వప్నమునందు గూడా ఎవరి దర్శనము దుర్లభమో, కమలదళములకంటె గూడా శతకోటి గుణిత అధిక కోమలములైన నీశ్రీచరణములతో ఆమె శరీరముపైన క్రీడించితివో,

ఎవరి ప్రభావముచేత పూతనాశవము దాహము చేయబడినపుడు దానినుండి దివ్య సుగంధము మూడు యోజనముల దూరము సమస్త భూమియందు వ్యాపించెనో, కృపాసింధువు, భగవానుడు నయిన ఆ శ్రీకృష్ణునికంటె ఎక్కువ దయగలవారు ఎవరు ఉందురు ?

ఈ శ్లోకమును వినినంతనే శుకదేవుడు, గద్గదుడయ్యెను. వ్యాసుని దగ్గఱకు పోయి, భాగవతము నంతయు అధ్యయనము చేసెను. ఇటువంటి నిర్గుణ బ్రహ్మనిష్ఠులు, శాంతులు సమాహిత అంతఃకరణము కలవారునయిన యోగీంద్రులను సైతము తన దివ్య, సుమధుర, మనోహర, సౌరస్య, సౌగంధ్య, సౌందర్యాదిగుణగణములచేత ఆకర్షించునట్టి శ్రీకృష్ణభగవానుడు తన గోపబాలకులతో బృందారణ్యధామమునకు చేరెను. ఎట్లు చేరెను ? "నటవరవపుః భిభ్రత్" అనగా, నటునివలె, వరునివలె శృంగారమును ధరించి చేరెను. ఇచట 'నట'శబ్దముచేత విప్రయోగాత్మక శృంగారరసము, 'వర'శబ్దముచేత సంప్రయోగాత్మక శృంగారరసము అభిప్రేతము. నటుడు చంద్రుడు, వాయువు మున్నగు వాస్తవ పదార్థములు లేకపోయినను, తమ అభినయముల ద్వారా రసమును అభివ్యంజితము చేయును. ప్రియతమునితో సర్వాంగీణమై నసంశ్లేషము ఉన్నను, అకస్మాత్తుగా వియోగజన్యమైన తీవ్రతాపముయొక్క అనుభవము కలుగును. 'నట' శబ్దముచేత ఆ విప్రయోగాత్మక శృంగారరసమే గ్రహించబడినది. భావుకులైన భక్తులకు సంప్రయోగాత్మకమైన శృంగారముకంటె విప్రయోగాత్మకమైన శృంగారమునకు అధిక గౌరవము కలదు. కావుననే అభ్యర్హితమగుట వలన 'నట'శబ్దముయొక్క ప్రయోగము ముందు చేయుబడినది. ఒకానొకడు శ్రీకృష్ణునితో ఇట్లనెను – "ఓ మహారాజా ! లలిత, విశాఖ మున్నగు మీ ప్రేయసులు మీ వియోగము వలన మిక్కిలి దుఃఖిం

చుచున్నారు. మీరు ఒకమారు వ్రజమునకు పోయి వారికి దర్శన మొసగి, ఏల రారు ?'' శ్రీకృష్ణుడు ఇట్లు సమాధానము చెప్పెను- ''ఇపుడు, వారికి నా అవసరమే ఉండదు, నేను వారి దగ్గఱ ఉన్నప్పుడు వారికి కేవల బాహ్యమైన నా రమణమే అనుభూత మగును. కాని, నేను సమీపమున లేనపుడు మానసిక సంస్మరణ విశేషము వలన వారికి సర్వాంగీణమైన నా అంతరరమణానుభవము కలుగును''. ఈవిధముగా సంయోగకాలమందు గూడా అపుడపుడు సంప్రయోగానందము లభించును. ఈ స్థితియొక్క వర్ణనమే, నిమ్నోదాహృత శ్లోకమందు లభించును.

''ప్రాసాదే సా పథి పథి చ సా పృష్ఠతః సా పురః సా,
పర్యంకే సా దిశి దిశి చ సా తద్వియోగాతురస్య ।
హంహో చేతః ప్రకృతి రపరా నాస్తి మే కాఽపి సా సా
సా సా సా సా జగతి సకలే కోఽయ మద్వైతవాదః ॥''

విప్రయోగాత్మక శృంగారము ఉద్వేలితమైనపుడు సమస్త ప్రపంచము భగవన్మయమగును. కావున, 'నటవత్' అని చెప్ప బడెను, ప్రేక్షకులకు రసాస్వాదనము కలిగించుటకై నటుడు విచిత్ర మైన స్వరూపమును ధరించినట్లే, శ్యామసుందరుడు, వజేంద్ర నందనుడునయిన శ్రీకృష్ణుడు వ్రజాంగనల మనస్సులను ఆకర్షిం చుటకై విచిత్రమైన వేషమును ధరించెను. 'వర'పదముచేత ప్రత్యగ్రభోక్తృమైన వరుడు గ్రహించబడును. వివాహముకొఱకై వెళ్ళునట్టి వరుడు సర్వాపేక్షయా అధిక సుందరవస్త్రములను ఆ భరణాదులను ధరించి, తనను చక్కగా అలంకరించుకొనును. ఆ రీతిగానే శ్రీకృష్ణుడు గూడా సుందర వేషమును ధరించి, బృందా రణ్యధామమును ప్రవేశించెను. 'వర' పదము సంప్రయోగాత్మక శృంగారమును ద్యోతనము చేయును. ఈవిధముగా 'నటవర

వపుః'' అను శబ్దముచేత ఉద్బుద్ధ సంప్రయోగాత్మక. విప్రయోగాత్మక ఉభయవిధ శృంగారరసాత్మకుడు శ్రీకృష్ణభగవానుడని అవగత మగుచున్నది.

''బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనక కపిశం వైజయన్తీం చ మాలామ్ ।
రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్ గోపబృందైః
బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్ గీతకీర్తిః ॥''

భగవంతుడు, పరమానందకందము నయిన శ్రీకృష్ణచంద్రుడు నటవర శరీరమును ధరించి, 'బర్హాపీడమును ధరించియు, వైజయంతీమాలను ధరించియు, కర్ణములందు కర్ణికారమును ధరించియు, గోపబృందముతో వేణువును అధరసుధచే పూరించుచు బృందారణ్యధామమును చేరెను. అనంత బ్రహ్మాండములందలి ప్రాణులను ఆనందింపజేయునట్టి రసములకు ఉద్గమస్థానమైన నిఖిల రసామృత సింధుసారము చేత శ్రీకృష్ణప్రభువుయొక్క అవయవ నిర్మాణము జరిగెను. నిఖిల, రసామృతమూర్తి అగుచు, విశేషించి, ఉద్బుద్ధమైన ఉభయవిధ శృంగారరసముచేత భగవంతుని శరీర నిర్మాణము జరిగెను. లోకమున, సంప్రయోగాత్మక, విప్రయోగాత్మకములైన రెండు శృంగారములు ఏకకాలావచ్ఛేదేన (ఏకకాలమందు) ఉద్బుద్ధములు, ఉద్వేలితములు కావు. ఇచట, పరస్పర ధర్మాశ్రయుడు, ''అణోరణీయాన్ మహతోమహీయాన్'' ప్రభువు నయిన శ్యామసుందరునియందు రెండువిధములైన శృంగారరసములు ఏకకాలావచ్ఛేదేన అభివ్యక్తము లయ్యెను.

అద్భుతమైన ప్రేమోన్మాదమందు, శ్రీకృష్ణుడు, వృషభానునందిని- ఈయిరువురికిని, సంప్రయోగమందు, విప్రయోగమందు గూడా సంప్రయోగస్ఫూర్తి కలుగును. ఈవిధముగా ఉద్వేలితము,

సంయోగగాత్మక, వియోగాత్మకము, ఉభయవిధము నయిన శృంగారరససార సర్వస్వము చేతనే నటనాగర శరీరనిర్మాణము జరిగెను. కావున, ఆయన 'నటవర వపుః' అని సంకీర్తింపబడెను. అథవా,

''నటవరవపుః - నటేభ్యోఽపి వరం వపుః యస్య సః।''

అనగా, నటులకంటె గూడా వరమైన - శోభనమైన వపువును=శరీరమును ధరించి, భగవంతుడు బృందారణ్యధామమున ప్రవేశించెను. నటులు అనేకులు కలరు, నాట్యము చేయువారు ఎందరో ఉన్నారు. కాని, వ్రజమోహనుడైన శ్రీకృష్ణచంద్రుని వపువు (శరీరము) కొంత లోకోత్తరమైనది, భగవంతుడు, శంకరుడు నయిన విశ్వనాథుని తాండవనృత్యము ప్రసిద్ధము. ఆ తాండవ నృత్యమును చూచుటకై ఇంద్ర, చంద్ర, వరుణాది దేవతలందఱును, అప్సరసలు, సిద్ధులు, మహర్షులు, యక్షులు, కిన్నరులు మున్నగు వారందఱును వత్తురు. ప్రదోషకాలమందు భగవంతుడు, నటరాజరాజు, భూతభావనుడు నయిన విశ్వనాథుని తాండవనృత్యము జరుగును. ఆ సమయమున, సమస్త దేవగణమేమిటి, శ్రీకృష్ణచంద్రుడు గూడా అచటకు వచ్చును. ఆ తాండవనృత్యము అంత అద్భుత మగుటచేతనే ఆ విశ్వనాథుడు నటరాజరాజు. ఎవరి నృత్యమైనను, ఆ నటరాజు చేయు తాండవనృత్యము వంటిది కాదు. కాని, కాళియనాగ ఫణములమీద, శ్రీకృష్ణపరమానందకందము, మన్మోహనుడును అయిన వ్రజేంద్రనందనుడు చేసిని తాండవనృత్యము విలక్షణము. తత్సామగ్రి గూడా విచిత్రమైనది. ప్రభువు కాళిందీహ్రదమున ప్రవేశించి ఉన్నతమైన ఆ కాళీయ నాగఫణములపై నృత్యము చేసినపుడు దేవతలు, అప్సరోగణము వాద్యవాదనము చేయసాగిరి. ఈ నృత్యమునకు పోలినది మఱొక నృత్యము లేనే లేదు. కావున, ఆ శ్రీకృష్ణపరమాత్మను 'నటరాజ

వపుః' అని అందురు. నటునికంటె, నటరాజుకంటె, నటరాజరాజు కంటె శోభనమైన శరీరమును శ్రీకృష్ణభగవానుడు ధరించెను. ఆ స్వరూపము ఎటువంటిదనిన, ఆ స్వరూపమును చూచినంతనే, చరాచరములు, చేతనాచేతనములు సమస్తము నాట్యము చేయును కావున,

''నటనం ఆనందోల్లాసవికారం రాతి దదాతీతి నటవరం
తద్వపురితి నటవరవపుః ।''

అనగా, స్థావర జంగమాత్మకమైన సమస్త ప్రపంచమును ఆనందోల్లసితము చేయువాడే 'నటవరవపు'వని భావము. దీని విశేషమును ఏమని వర్ణింతుము! ఇతరుల విషయమును దూరముగా ఉంచుడు. ఆ స్వరూపము స్వయముగా వ్రజేంద్రనందనుడు, శ్యామసుందరుడు, మన్మోహనుడు నయిన భగవంతునే నాట్యము చేయించును. భగవంతుడు నాట్యమే చేసెను –

''యన్మర్త్యలీలౌపయికం స్వయోగమాయాబలం
దర్శయతా గృహీతమ్ ।
విస్మాపనం స్వస్య చ సౌభగర్ధేః పరం పదం
భూషణభూషితాంగమ్ ॥''

భగవంతుడు మానవ లీలకు ఉపయుక్తమైన మాయాబలమును ప్రదర్శించుచు, ఎటువంటి స్వరూపమును ధరించుననిన, ఆ స్వరూపము స్వయముగా ఆయననే విస్మయములో పడవేయునదై ఉండును. ఆశ్చర్యము! ఆ సౌందర్య, మాధుర్య, సౌరస్యములు అద్భుతములు. ఇటువంటి స్వరూపమును ఆస్వాదించువాడు భాగ్యవంతుడు. తన అమృతమయ ముఖచంద్రదర్శనము చేయు సౌభాగ్యము, స్వయముగా భగవంతునికి లేదు. ఆ సౌభాగ్యము వృషభానునందినికి, వ్రజాంగనలకు, భక్తులకే కలదు.

భగవంతుడు, కేవలము మణిమయ ప్రాంగణమందలి మణిస్తంభము లందు ఆత్మ ప్రతిబింబములనే చూచును.

"రత్నస్థలే జానుచరః కుమారః సంక్రాన్తమాత్మీయ
ముఖారవిందమ్ ।
ఆదాతుకామ స్తదభఖేదాత్ నిరీక్ష్య
ధాత్రీవదనం రురోద ॥"

నందరాణియొక్క మణిప్రాంగణమున, పారాడుచు, నడచుచు ఆ శ్రీకృష్ణుడు తన ముఖచంద్రప్రతిబింబమును చూచి ముగ్ధుడై నర్తించెను.

తన శరీరసౌందర్యమును చూచి, స్వీయ ముఖచంద్ర ప్రతి బింబమును గాంచి, 'దానిని నేను తీసికొందు'నని తలచును. ప్రియమైన వస్తువును గుండెకు హత్తుకొనక, దూరమునుండి చూచుటలో సంతోషము కలుగదు. వాస్తవమునకు, ఈ భావన భక్తులకు ఉండును. కాని, ఆ భావనయే వ్రజేంద్రనందనుడు, శ్యామ సుందరుడు నయిన మన్మోహనునికి తన శరీర ప్రతిబింబమును చూచి, అ సంతోషభావమే కలిగెను. ఆయన, దానిని తీసికొనవల యునని, పట్టుకొనవలయునని తలంచెను. కాని, ఆ ప్రతిబింబము చేతికి చిక్కనందున, ఖిన్నుడయ్యెను. వ్రజరాణి అయిన తల్లి యొక్క ముఖమును చూచి, రోదించసాగెను. అనంతకోటి బ్రహ్మాండనాయకుడు ఆ ప్రతిబింబమును చూచి, నర్తించునపుడు చరాచరజగత్తు ఆయనను చూచి నర్తించుటలో ఆశ్చర్యమేమి కలదు ? భగవంతుడు తన సర్వజ్ఞత్వమును, తన సర్వశక్తిమత్త్వ మును మఱచిపోయెను. ఈవిధముగా ఆ స్వరూపము స్వతః భగవంతునే విస్మయములో ముంచివేసెను –

"భూషణానాం భూషణాని అంగాని యస్య సః ।"

శ్రీకృష్ణుని ఒక్కొక్క అవయవము, భూషణములకు సైతము అలంకారము చేకూర్చునట్టిది. భగవంతుడు ధరించిన ఆభరణములు, ప్రభుశరీరమును భూషిత మొనర్చుట లేదు. ప్రభుధారితములైన కిరీట, కౌస్తుభ, కుండల, కటక, అంగదాదులచేత ప్రభుశరీరము ప్రశోభితమగుటలేదు. కాని, ప్రభుశీర్షము చేత కిరీటము, కర్ణములవలన కుండలములు, హస్తముల వలన కటకములు, బాహువులవలన అంగదములు, కంఠమువలన కౌస్తుభము మున్నగు భూషణములే భూషితము లగుచున్నవి. వాస్తవమునకు ఇదియే ఉత్తమమైన సిద్ధాంతము. కావున, ఇదియే చెప్పబడినది –

"చలాఽపి యత్ శ్రీః న జహాతి తత్పదమ్ ।"

లక్ష్మి, శోభ, శ్రీ (సిరి) వీరు సర్వత్ర చంచలలు అని చెప్పబడుదురు. వస్తుమాత్రమందు శోభ ఉండును. కాని, ఎంతవఱకు? 'జాయతే'(పుట్టుచున్నది) 'అస్తి' (ఉన్నది) 'వర్ధతే' (వృద్ధిపొందుచున్నది)–అనునంతవరకు శోభ ఉండును, ఇంతియే 'విపరిణమతే' (పరిణామము చెందును) అను స్థితి వచ్చినపుడు శోభ హ్రాసము పొందును. వృక్షమునకు అంకుర, పత్ర, పుష్ప, ఫలములవఱకే శోభ ఉండును. అనంతరము, ఆ శోభ తరిగిపోవుట ఆరంభించును. ఈరీతిగా, ప్రపంచమందలి ప్రతి వస్తువునందు శోభ చంచలమే అయి ఉండును. కాని, ఆ శోభ అచలయై ఉండుట ఎచట? కేవలము ప్రభువైన శ్రీకృష్ణుని మంగళమయ శరీరమునందు మాత్రమే అచలయై ఉండును, ఏల ఉండును? అచట, (శ్రీకృష్ణుని విషయములో) ఆయన స్వభావము ననుసరించి, "జాయతే, అస్తి, వర్ధతే" వఱకే కలవు. అనంతర వికారములు లేవు. సామాన్యముగా, భగవంతుడు షడ్వికార రహితుడు. కాని, ఆయన నిర్గుణ, నిరాకార,

సచ్చిదానందఘన దృష్టితోమాత్రమే షడ్వికారరహితుడు. భక్తులైన భావుకుల దృష్టిలో ఆ భగవంతుడు సగుణ, సాకార, పరమానంద, నిఖిల రసామృతమూర్తి. అపుడే నందరాణి నుండి జన్మ-జాయతే, వ్రజమహారాజైన నందుని మంగళమయమైన అంకమున శైశవ, కౌమార, పౌగండ, కైశోరాది దశల కారణముగా వర్ధతే-వృద్ధిపొందుచున్నాడు, అంతియే. తరువాత వచ్చు విపరిణామాదులు లేవు. శోభ చంచలమైనను తరిగిపోవుట ఎట్లు? ఉన్న చోటనే ఉండును.

'దేవీభాగవతము'లో గోలోకవర్ణన ప్రసంగమందు అతివిచిత్రమైన గాథ ఒకటి కలదు. గోలోకవాసియైన శ్రీకృష్ణచంద్రపరమానందరూప సన్నిధిలో వృషభానునందిని వాసము చేయుచుండెను. అచట శోభ, ప్రభ, క్షమ, శాంతి, దాంతి, గోపాంగనలందరును ఉన్నట్లు వర్ణనము కలదు. అచట, శ్యామసుందరుడు, వ్రజేంద్ర నందనుడు నయిన భగవంతునితో 'శోభ' అను నామము గల గోపాంగన విహారము చేయుచుండెను. అపుడు, వృషభానునందిని అచట కేతెంచెను. అమెను చూచినంతనే సిగ్గుతో, భయముతో, శోభ దేహత్యాగము చేసెను. దేహత్యాగము చేసిన ఆ శోభనుండియే సమస్త బ్రహ్మాండమందలి విద్వాంసుల ముఖాదులందు ఆ శోభ విభక్తమై వ్యాపించెను. ఈవిధముగానే, క్షమ, శాంతి, దాంతి మున్నగువారి కథ కూడా కలదు. దీని తాత్పర్యమేమనిన, వృషభానునందినివలన లజ్జితలైన శోభా, క్షమాదులు అన్యప్రాణులందు విభక్తలై వ్యాపించినవి. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక శక్తిరూపములో ఏ శోభాదులు భగవంతునియందు ఉన్నవో, అవి తమ లాలసచేతనే భగవంతునియందు ఉండునుగాని, భగవంతుడు ఆ శోభాదులను ఆహ్వానించడు. శ్రీకృష్ణప్రభువు ఉద్ధవునితో ఇట్లనును -

"నిర్గుణం మాం గుణాః సర్వే భజన్తి నిరపేక్షకమ్ ।"

సమస్త గుణములు తమ గుణత్వసిద్ధికొఱకై నన్ను సేవించును. అవి భక్తిపురస్సరముగా నన్ను చేరినచో, నేను వానిని స్వీకరింతును. భగవంతుడు లక్ష్మీదేవిని గూడా ఏమియును యాచించలేదు. ఆమెయే ఇట్లు చెప్పెను –

"సుమంగలః కశ్చన కాంక్షతే న మామ్"

క్షీరసాగర మథనమువలన, లక్ష్మీదేవి జన్మించినపుడు, స్వయంవరము కొఱకై ఆమె దేవ, దానవ, దైత్య, మహర్షులను అందఱిని చూచెను. కాని, ఆమె మనస్సుమాత్రము 'సుమంగలు'ని యందు లగ్నమయ్యెను. 'కాంక్షతే న మామ్' అన్నదియే, ఆమె యందు గల దోషము. ఆమె ఇట్లు ఆలోచించుచుండెను – 'నన్ను ఎవరు వాంఛించుచుందురో, వారు నాకు ఇష్టులు కారు. నేను ఎవరిని అభిలషింతునో, వారు నన్ను వాంఛించరు. ఆయన గూడా, ఏల వాంఛించును ? ఆయన, స్వప్రకాశ, సచ్చిదానందఘన పరమానందరూపమందే అవస్థితుడై ఉండును. అయినను, నేను ఆయననే వరించితిని. ఇందువలన, భగవంతుడు ఆమెకు (లక్ష్మీదేవికి) స్వీయ పరమ సుభగ వక్షఃస్థలమునందే స్థాన మొసగెను. సర్వ గుణగణముల స్థితియు ఇదియే. భగవంతుడు ఆ గుణములను వాంఛించడు, ఆగుణములు ఆయనను (భగవంతుని) అభిలషించును. భగవతియైన మహాలక్ష్మికి శంకరభగవానునియందు గూడా గుణములు గోచరించినవి గాని, లక్ష్మీదేవి ఆ శివుని వేషమును చూచి, భయము నొందెను. లోకమున, సాధారణముగా జామాత (అల్లుడు) ఎట్లు ఉన్నను, అత్తగారికి బాగుగనే ఉండును. కాని, పార్వతీదేవి వివాహమునందు హిమాలయపత్నియైన 'మేన' గూడా భయపడెను. జగన్మాతయైన గౌరీదేవి, భీతి నొందలేదు. గౌరీదేవికి

శివుని సాక్షాత్కారము ఎట్లయ్యెనో, లక్ష్మీదేవికి అట్లు సాక్షాత్కృతుడు కాలేదు. ఆ మహాలక్ష్మికి, శుద్ధత్వాది సమస్తగుణములు బాగుగా నచ్చినవి. కాని, అమంగళత్వము వలన భయము నొందెను.

"మహోక్షః ఖట్వాంగం పరశు రజినం భస్మ ఫణినః ।"

మహాలక్ష్మికి శివుని మోహకస్వరూపము ప్రాదుర్భవించక పోవుట భావానుకూలమే. 'సుమంగళుని'యందు తళుకు బెళుకులు అన్నియు గలవు. కాని, ఆయన, వాంఛించుటయే లేదు. కౌస్తుభము ఎంత తపస్సు చేసెనో కదా! అని భావుక భక్తులు అందురు. భగవంతుడు తనను స్వీకరించవలయునని, కౌస్తుభమణి తపస్సు చేసినందున, భగవంతుడు స్వీకరించెను. కౌస్తుభాదుల భాగ్యము ఎంత మహిమోపేతము!

గోపాంగనలు ఇట్లు భావన చేయుదురు - 'మనము వ్రజ ధూళిరైయె ఉండిన, ఎగిరి భగవంతుని శరీరమందు సంలగ్నలమై ఉండెడివారము కదా! దానికి ఏమియు విఘ్నము కలుగజాలదు. కౌస్తుభమణి, సదా భగవంతుని వక్షఃస్థలమున విరాజమానమై ఉండును. తుదకు, వృషభానునందిని కూడా కౌస్తుభ మనిన, ఈర్ష్య పడును. ఆమె ఇట్లనును 'హే సఖి! భగవంతుడు ఎవరికిని లభించకపోయిన, సంతాపము ఉండెడిది కాదు. కాని, వనమాల అయినచో, సర్వదా ప్రభువుయొక్క వక్షఃస్థలమున విహరించు చుండును. చెప్పుము, మాధుర్యాధిష్ఠాత్రి అయిన వృషభాను నందిని ఎవరిపై ఈర్ష్యపడుచున్నదో, దాని అదృష్టము అల్పమైనదా? నిత్యము, భగవంతుని కపోలములను చుంబించునట్టి (స్పృశించునట్టి) కుండలముల మహిమ, అనల్పముకాదా? ఇవి ఎంత తపస్సు చేసి ఉండును? 'గోపాలచంపువు' అను గ్రంథమున

ఇట్లు వివరించబడెను – గోపాంగన, కుండలములందలి మకరిని భావన చేసి, ఇట్లనును – 'హే మకరి ! నీవు మా శ్యామసుందరుడైన మన్మోహనుని కపోలములను చుంబించుచున్నావుకదా !' ఇది అంతయు, గోపాంగనల ఈర్ష్య. ప్రకృతమునకు వత్తము. గుణములు, తమ ఆశ్రయమునకు మహత్త్వాతిశయమును ఆధానము చేయును. (సంపాదించిపెట్టును) అనర్థమును నివారించును.

అనంత ఆనందస్వరూపుడైన శ్రీకృష్ణునియందు నిరతిశయమైన ఆనందము, మహత్త్వము కలదు. దానియందు అతిశయత్వాధానము కుదరనే కుదరదు. అనర్థస్పర్శయు ఉండదు. అట్టి స్థితిలో ఆయనకు గుణముల ఆవశ్యకత ఏల ? అట్లే భూషణముల చేత శోభను పెంపొందింపవలసిన ఆవశ్యకత ఏమి కలదు ? అచట లక్ష్మీదేవియే నివసించుచున్నది కదా ? భగవంతునికి ఎవరి అపేక్షయు ఆవశ్యకము కాదు. కాని, ఆ యా వస్తువుల తపస్సునకు ప్రసన్నుడై, వాని భక్తిని గాంచి, భగవంతుడు వానిని స్వీకరించెను. శ్రీరామచంద్రుడు పెండ్లికి తరలిపోయినపుడు శుభశకునములన్నియు తమంతట తాము ప్రకటమయ్యెను. ఈసమయమున, వెళ్లకపోయిన, వాటికి సాఫల్యము ఎప్పుడు లభించును ? అని ఆలోచించినవి. ఈవిధముగానే సర్వవిధ భూషణభూషితుడైన భగవంతుడు తన స్వరూపమును జూచి, విస్మయచకితుడై నాట్యము చేసెను.

నాట్యమునకు మూలము ఆనందోల్లాసము. ఆ ఆనందోల్లాసము దేనివలన ? స్వీయ ప్రతిబింబదర్శనము చేత. తాత్పర్యమేమనిన, ప్రభుస్వరూపము చరాచర ప్రపంచమును నాట్యము చేయించునట్టిదేకాక, భగవంతుని గూడా నాట్యము చేయించునట్టిది, స్వగుణములను గూడా నాట్యము చేయించునట్టిది. నటవరవపువు ఉన్న స్థలమున, చెప్పానదేమి కలదు ! నటుడు సామాజికులకు రసా

స్వాదనము కలిగించుటకై విచిత్రమైన వేషధారణము చేయును. ఇచట, భగవంతుడు, తన అభిరుచి ననుసరించియే సహజముగా తాదృశుడు. నటుడు సామాజికులనందఱిని రసమునందు ఓతప్రోతము చేయుటకై విశేష యత్నము చేయును. ఇచటయినచో, అటువంటి ప్రయత్నము లేదు.

"నటేభ్యోఽపి వరం వపుః యస్య సః ।"

వరుడు సహజముగానే సుందరుడు, లోకమున, ముహూర్తము నిశ్చయమైనంతనే అభ్యంగన, ఉద్వర్తనాదులు ఆరంభ అధిక వరశుల్కమునకై సౌందర్యవృద్ధి ప్రయత్నము, తళుకుబెళుకులు ఆరంభమగును. వివాహసమయమునందైనచో, చెప్పనవసరమే లేదు. వరుడు, నటునికంటె గూడా అందముగా ఉండవలయునని తలంచును. భగవంతుడు, ఎల్లవేళల, విచిత్ర వేషమును ధరించియే ఉండును. సాధారణ మానవునికి విచిత్ర వేషము కాదాచిత్కము (ఎన్నడోగాని సంభవించదు). నిత్యము ధరించు వేషమందు వైచిత్ర్యము ఉండదు. వైచిత్ర్యమునకై వేషవిశేషమందు ఆగంతుకత్వము వివక్షితము. కావుననే, నిమ్నోదాహృత విగ్రహవాక్యము గ్రహింపబడినది -

"నటవరవపుః - నటశ్చాసౌ వరశ్చ నటవరః, తస్యేవ వపుర్యస్య సః ।"

'నట' శబ్దముయొక్క తాత్పర్యము ద్విభుజత్వమందు కలదు. వ్రజలీలాసర్వస్వము ద్విభుజత్వమే. కావున 'నటవర వపుః' అని చెప్పబడెను. భగవంతుని వేషము విచిత్రముగా ఉండిన, ద్విభుజత్వము లేకుండిన, ఆ ఆనందము కలిగియుండెడిది కాదు. వ్రజవాసులకు ఆయనయెడ ఇంత మమకారము ఉండీ యుండెడిది

కాదు. వ్రజవాసులు ఇట్లందురు - 'శ్రీకృష్ణచంద్రపరమానందకందమందు పరమేశ్వరత్వము అభివ్యక్తమై ఉన్నచో, భగవంతుడు వెలతెలపోయి ఉండెడివాడు. చతుర్భుజునియందు ఎవరికిని ప్రీతి కలిగియుండెడిది కాదు. వారు ఆశ్చర్యపడిపోయెడివారు. భక్తుల మాధుర్యభావమందు ఈశ్వరభావాభివ్యక్తి లేదు. పరమేశ్వరుని వలన జనులు భయపడుదురు. ఆయనవలన, సంకోచము పొందుదురు. ఇచట్టైన, మనోహరుడు, శ్యామసుందరుడు, ప్రాణేశ్వరుడు నయిన హృదయేశ్వరుడు తమ హృదయగత వస్తువు, పరమేశ్వరుడు కాడు. అప్రాకృత్వము, అలౌకికత్వము యొక్క అభివ్యక్తి స్వాభావికతకు బాధక మగును. ఏ భగవంతుని భృకుటీభంగమునకు అందఱును నాట్యము చేయుదురో, ఆ అనంత కోటి బ్రహ్మాండనాయకుడైన ప్రభువుయొక్క కోమల, మంగళమయ హస్తములను తన చేతితో పట్టుకొని నందరాణియైన యశోద,

"సా గృహీత్వా కరే కృష్ణ ముపాలభ్య హితైషిణీ ।"

బెత్తము చూపించి 'ఒరే కొట్టెదను' అని పలికెను. ఆమె, పరమేశ్వరుడని భావించినచో, ఇది, జరిగి ఉండెడిది కాదు. తన ముఖమందు శ్రీకృష్ణుడు సమస్త విశ్వమును చూపి, పరమేశ్వరత్వమును వ్యక్తము చేసినపుడు బెత్తము చేతినుండి జారిపోయెను, మాధుర్య రసము వ్యాపించెను. కావున 'నటవరవపుః' అనగా ద్విభుజుడు. మేము చతుర్భుజుని ఖండనము చేయుచున్నామని దీని అర్థము కాదు. కాని, ఎవరికి ఎటువంటి భావన ఉండునో, భగవంతుడు వారికి ఆ విధముగానే ఉండును.

'నటవరవపుః' - నటునివలె, వరునివలె శరీరము ధరించిన వాడు అని పూర్వము చెప్పబడినది. 'నటవరవపుః' సర్వదా

దేవతల విచిత్ర వేషములో ఉండువాడు. మానవుడు, కోరికతో విచిత్రవేషమును ధరించును. రసవిశేషముయొక్క ఆస్వాదమునకై భగవంతుని విచిత్ర వేషమునందు ఆగంతుకత్వము వివక్షితము. సాధారణముగా భగవంతుడు సర్వదా పరమానందరసామృతమూర్తి. కాని. నేడు స్వేచ్ఛతో మధుర వేషమును ధరించెను. ఈ విషయమే 'నటవరవపుః' అని చెప్పబడినది. మనుష్యశరీరము ధరించిన వాడగుటవలన మమకారము, నిర్భరమైన అనురాగము, అత్యంత నిస్సంకోచభావము ఉండును. అట్లు కానిచో, చతుర్భుజత్వమునందు ఈశ్వరత్వము అభివ్యక్తమగును. అనంతకోటి బ్రహ్మాండ నాయకత్వము, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్త్వము పదే పదే వ్యక్తమగును. దానివలన సంకోచము కలుగును. అందువలన, భగవంతునితో గల ప్రేమయందు స్వాభావికత్వము రాజాలదు. ప్రేమయందు స్వాభావికత్వము ఉండుటయే, దాని ఉత్కర్ష. ఈశ్వరునియందు అనురాగము విహితమై ఉండును. భగవంతుని యందు భక్తియొక్క విధి చెప్పబడును. 'విధి రత్యంత మప్రాప్తౌ' అత్యంతము అప్రాప్తియందే (లభించకపోవుటయందే) విధి చెప్పబడును. ఉదాహరణకు, "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః" ఇచట అగ్నిహోత్రమునందు స్వాభావికమైన ప్రీతి లేనట్లే భగవత్ప్రీతి స్వాభావికము కాదు. కావున విధి చెప్పబడును.

"తస్మాత్ భారత సర్వాత్మన్ భగవాన్ హరిరీశ్వరః,
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ।"

ఇత్యాది వాక్యములు అభయమైన కామన గల ప్రాణి, భగవంతుని యందు భక్తి కలిగియుండవలయును, అని విధివచనములు చెప్పుచున్నవి. ఈవిధముగా విధి, ఎచట ఉండునో, అచట, తదప్రాప్తి

భావించబడును. విధి ఉన్నచోట, ప్రేమ అల్పమగుట ప్రాణుల స్వభావము. మాతాపితరులయందు పుత్రుని ప్రేమ భార్యలేనంత వఱకే ఉండును. భార్యయందు గల ప్రేమ, మాతాపితరుల యందు ఉండదు. మాతాపితరుల యందలి ప్రేమ పుణ్యమని విధి వచనములు చెప్పుచున్నవి.

"మాతృదేవోభవ, పితృదేవోభవ"

ఇత్యాది వచనములచేత మాతాపితరుల ప్రేమ విధించబడుచున్నది. ఇంతియేకాదు, మాతాపితరులయందు ప్రేమలేకపోయిన, హానిగూడా చెప్పబడినది. తాత్పర్యమేమనిన, దేవతాప్రీతికంటె మాతాపితరుల యందు ప్రేమ ఉండుట ఎక్కువగా సంభవము. మాతాపితరుల ప్రేమకంటె దేవతాప్రీతి ఎక్కువ ఇష్టమైనది. తల్లియందు గల ప్రేమవంటి ప్రేమ, భగవంతునియందు ఉన్నచో, చెప్పనదేమి కలదు ? కాని, అట్టి ప్రేమ లేకపోవుటచేతనే భగవత్ప్రీతి విధించ బడినది. భగవంతుని ప్రేమకంటె, మాతృప్రేమ స్వాభావికము. తరువాత మాతృప్రేమకంటె గూడా స్త్రీప్రేమ స్వాభావికము. కావుననే, ఇచట 'మాతృదేవోభవ' అను వచనముచే మాతృప్రేమ విధించబడినది. కొంత ముందుకుపోయి, 'స్వదార రతి' (తన భార్యయందలి ప్రేమ) యొక్కవిధి చెప్పబడినది. ఈ విధి ఏల చెప్పబడినదనిన, తన భార్యయందు గల ప్రేమకంటె, ఉచ్ఛృంఖల మైన (విచ్చలవిడి) మానసిక ప్రవృత్తి కలవారికి కులటలందు, వేశ్యలందు, ప్రేమ అధికముగా ఉండును. ఈ స్వాభావిక ప్రవృత్తికి శాస్త్రములు కళ్ళెము వేసినవి. మానవుడు స్వభావము చేతనే కామచారుడై ఉండును. ప్రవహించుచున్న జలమును ఆపుట కొఱకే ఆనకట్టలు వేయబడును. 'శ్రుతిసేతువు' అను శబ్దమునకు అర్థమిదియే. విధినిషేధశాస్త్రము ఆ సేతువు - ఆ ఆనకట్ట. ఆ సేతువు ప్రాణియొక్క విచ్చలవిడితనమును సహజప్రవృత్తిని

నియంత్రితము చేయుటకొఱకై ఉన్నది. కాని, ప్రవహించుచున్న జలమును ఆపుటకు ప్రయత్నించినపుడు అది, ఆనకట్టను బ్రద్దలు చేయును. అటులనే, స్వాభావికమైన ప్రీతిని ఆపుటవలన అది, అత్యధికముగా వృద్ధి చెందుచునే ఉండును. ప్రపంచమందు ఈ దోషము ఉండుటవలన, సర్వథా హేయము (పరిత్యజింపతగినది) లోకములో ఏది దోషమో, అదియే భగవంతుని విషయములో గుణము. అనగా, భగవత్సంబంధము చేత దోషములు గూడా గుణములగును. అనంతకోటి బ్రహ్మాండనాయకుడు, సర్వాంతరాత్మ, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, నిరుపాధికుడు, పరమ ప్రేమాస్పదుడు నయిన భగవంతునియందు నీ మనోవృత్తులను సాంసారికములైన, తుచ్ఛములైన వస్తువులనుండి విముఖమొనర్చి భగవంతునిదిశగా ప్రవహింపజేయవలయుననియు, దానియందే పరిపూర్ణమైన కృతకృత్యత్వము కలదనియు, పురాణములు, వేదములు, శాస్త్రములు చెప్పుచున్నవి. కాని, అది, అతి కష్టమైన విషయము. కొందఱు మహాయోగులు, అమలాత్ములు, పరమహంసలు, మునీంద్రులు, యతీంద్రులైన యోగులు సమాధిమున్నగువానిచేత అట్లు చేయుటకు సమర్థులగుదురు. కాని, ఇచట అట్టి పరిస్థితి లేదు. ఇచటైనచో, సచ్చిదానందఘనుడు, పూర్ణతముడు, పురుషోత్తముడు, సర్వాంతరాత్మయు నయిన ఆ భగవంతుడే, స్వాభావిక పరమ ప్రేమాస్పదుడు కావలయును. ఒకానొక కామినికి, ప్రియతముడు, ప్రేష్ఠతముడు (అత్యంత ప్రియుడు)నయిన ప్రాణేశ్వరుని ఉత్కట సమ్మిలనేచ్ఛ కలిగినట్లు స్వాభావికమైన, ఉత్కటమైన, ఉత్కంఠ భగవంతునియందు కలుగవలయును. ఎవరైనను, అడ్డగించుటకు వచ్చినచో, వానిని నాశమొందించవలయును. ఆ స్థితి ఇచట, కలిగినది. శ్యామసుందరుడు, వ్రజేంద్రనందనుడు, మన్మోహనుడు నయిన నటవర

వపువు. అపుడు, సామాన్య జనులకు అలౌకిక విషయమందు ప్రీతి ఉండదు. కాని, లౌకిక వస్తువునందు ప్రీతి ఉన్నచో, దానివలన నరకము లభించును. ప్రీతిమాత్రమే వివక్షితము కాదు. దానితో ప్రయోజనము లేదు. లేనిచో, సమస్త ప్రపంచము ఎవరో ఒకరి యందు ప్రీతి ఉండుటవలన, విముక్తముకావలసి ఉండును. అట్లు కాదు. ప్రీతి ఉండవలసినది అలౌకిక వస్తువునందు. భగవంతుడనిన, అలౌకిక పురుషుడు. కాని, నరుడగు, 'నటవరవపుః', అతి అద్భుత విచిత్రవేషధారి. అనంతకోటి బ్రహ్మాండనాయకుని అలౌకికత్వము ఎచటైనను ప్రకటమయినచో, కార్యము నెరవేరదు. కావున, అలౌకికత్వమును గుప్తమొనర్చుకొని, లౌకికస్వరూపములో ప్రకటము కావలసివచ్చును. దీనివలన, ప్రాణుల ప్రీతి యందు స్వాభావికత్వము కలుగును. కావున,

"బబంధ ప్రాకృతం యథా"

ప్రాకృతమైన వస్తువును బంధించినట్లు, యశోద, తన గారాబు బిడ్డను బంధించెను. 'ప్రాకృతం యథా' - అప్రాకృతపురుషుని యశోద, ప్రాకృతునివలె బంధించెను.

అలౌకిక తత్త్వమందు లౌకికత వ్యక్తమగుట అన్నది ఇదియే. కుంతీమాత ఇట్లనును -

"గోప్యాదదే త్వయి కృతాగసి దామ తావద్యా తే
దశాఽశ్రుకలిలాంజన సంభ్రమాక్షమ్ ।
వక్త్రం నినీయ భయభావనయా స్థితస్య సా మాం
మోహయతి భీరపి యద్బిభేతి ॥"

హే నాథ! నీ ఆ లీల, వ్యామోహసింధువునందు నిమజ్జన మొనర్చ జనములను చేయించును -

"తా మా త్తయష్టిం ప్రసమీక్ష్య సత్వర
స్తతోఽవరుహ్యాపససార భీతవత్ ।
గోప్యన్వధావత్ న యమాప యోగినాం క్షమం
ప్రవేష్టుం తపసేరితం మనః ॥"

నవనీతభాండములను బ్రద్దలుకొట్టి ఉలూఖలము (రోలు) పైన విరాజిల్లునట్టి శ్యామసుందరుడు, నవనీతమును తన నోటిలో పెట్టుకొనును, గోపబాలకుల నోటిలో పెట్టును, రామావతారమందలి చెలికాండ్రయిన వానరముల నోటికందించును, తన తల్లి, వచ్చుట లేదు కదా అని మాటిమాటికి వెనుదిరిగి చూచును. ఇంతలో తల్లి చూచెను. ప్రాంగణములో, పారిపోవుచున్న తన గారాబుబిడ్డను చూచి, తల్లి యశోద బెత్తము తీసికొనిపరుగిడెను. తల్లిని చూచి, ప్రభువు గూడా భయభీతుడై రోటిమీదనుంచి దుమికి పారిపోయెను. వ్రజరాణియైన యశోదామాత గూడా వెన్నాడసాగెను. ఎవరిని వెన్నాడినది ?

"న యమాప యోగినాం క్షమం ప్రవేష్టుం
తపసేరితం మనః ।"

అమలాత్ములు, పరమహంసలు నయిన యతీంద్రుల చిత్తము ఎవరిని పట్టుకొనుటకు సమర్థము కాకపోయెనో, ఆ పూర్ణతమ పురుషోత్తముడు, బ్రహ్మాండనాయకుడు, నిఖిల రసామృత మూర్తియు నయిన శ్రీకృష్ణప్రభువును నందగేహిని, 'ఒరే నేడు నీ పని పట్టెదను, చూడు' అని పట్టుకోదలచును. అతికష్టముమీద ప్రభువు, చేతికి చిక్కెను. ఒరే, నీవు పెద్ద కొండ్రముచ్చవు అయితివి, నేను, ఈవేళ నీ కొండ్రముచ్చతనమును మఱచిపోవు నట్లు చేయుదును, చూడు. కుంతీదేవి ఇట్లనును – 'నాథ ! ఈ మాట అని, యశోద త్రాడును తీసికొనునపుడు, నీవు విచిత్రమైన

స్థితిలో పడితివి. నీల కమలకోశసదృశమైన నీ కపోలములపైన అంజనమిశ్రితములైన అశ్రుబిందువులు అత్యంత సుశోభితము లనిపించెను. శిరస్సు అవనతమైనది, నేత్రములు అశ్రుపూర్ణము లైనవి, అంజనమిశ్రితములైన అశ్రువులు కపోలములపైన, నీల కమలకోశములందు ముత్యములు విరాజిల్లుచున్నట్లు శోభించు చున్నవి. ఆ శోభను ఏమి వర్ణింపగలము! నీవు భయపడు చున్నావు. భయభీతుడవై నీ ముఖారవిందమును క్రిందికి వాల్చి, రోదించుచున్నావు. ఎవరి భయముచేత భయము గూడా భీతి చెందునో, ఎవరు, కాలకాలుడో, మహాకాలేశ్వరుడో, మృత్యుం జయుడో, అట్టి నీవు భయభీతుడవై రోదనము చేయుచున్నావు.

"యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః ।
మృత్యు ర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః ॥"

సకల ప్రపంచమును మృత్యురూపమైన పప్పుతో, కూరలతో కలిపి, భక్షించునట్టివాడు, వ్రజగేహిని బెత్తమునకు భయపడెను. అనంతకోటి బ్రహ్మాండనాయకత్వము అభివ్యక్తమైనపుడు, ఈ భావ మంతయు ఉండదు. ఒక స్థానమున నిట్లు చెప్పబడెను –

"ముక్తిం దదాతి కర్హిచిత్స్మ న భక్తియోగమ్।"

భగవంతుడు భక్తులకు ముక్తినొసగునుగాని, భక్తిని మాత్రము త్వరగా ఒసగడు. ఏలయనిన, భక్తిభావబంధముచేత బద్ధుడై పర తంత్రుడు కావలసివచ్చును. ఇచట, స్వాభావికమైన ప్రేమ ఉన్నది. ఈ కారణముచేతనే బృందారణ్యమందు గోపబాలకులకు, వ్రజాంగనలకు నటవరవపుష్మంతుడైన భగవంతునియందు గల ప్రేమ, విష్ణు, శివతత్త్వాత్మకుడైన పరమాత్మయందు లేదు.

ఎచటనో, ఒక కథ వింటిని – కృష్ణభగవానుడు వ్రజనగరము నుండి మథురకు వెళ్లెను. అప్పుడు, గోపాంగనలు విరహిణులై

విలపించసాగిరి. అపుడు ఎవరో ఇట్లు చెప్పిరి - 'మధుర ఎక్కువ దూరము లేదు, మీరు అచటకు పోయి, ప్రభువును కలిసి రండు'. గోపాంగనలు అశ్రుసాగరమున ప్రపంచమంతయు మునిగిపోవు నంతగా వారు విలపించిరి. వ్రజవాసులు నచ్చజెప్పగా, ఆ వ్రజాంగనలు మధురకు వెళ్లిరి. ద్వారపాలకులు భగవంతునికి ఈ వార్త చెప్పిరి. అంత, ప్రభువు 'రానిండు' అని చెప్పెను. వ్రజాంగలు లోనికి పోయిరి. శ్రీకృష్ణచంద్రపరమానంద స్వరూపముయొక్క ఐశ్వర్యమును జూచిరి. చూచినంతనే, వెంటనే మేలిముసుగు కప్పుకొనిరి, వారు ఇట్లు అనిరి - 'ఈయన, మా మన్మోహనుడు కాడు, మురళీమనోహరుడు, నల్లని కంబళి ధరించిన నందనందనుడు మా సర్వస్వము'.

ఒకమారు ఇట్టి కథ జరిగెను. వాసంతికమైన (వసంతఋతు సంబంధమైన రాసోత్సవము. ఆ ఉత్సవమునందు, శ్యామ సుందరుడు, వ్రజేంద్రనందనుడైన భగవంతుడు రాసవిలాసము చేయుచుండెను. ఇంతలో, భగవంతుడు ఒక లతపాటున దాగి కొనెను. అపుడు గోపాంగనలు భగవంతుని అన్వేషించుచు, అడుగుచు ఊగిపోవుచుండిరి. దైవవశమున, భగవంతుడు దాగి ఉన్న స్థానమునకు జేరిరి. ఈ గోపాంగనలను జూచినంతనే ప్రభువు చతుర్భుజరూపమును ధరించెను. చతుర్భుజుడైన భగవంతుని జూచి నంతనే భక్తితో ఆయనకు కేవల ప్రణామము మాత్రము చేసి, ఇట్లనిరి - హే భగవాన్! మీరు మా శ్యామసుందరుడైన వ్రజ నందనునితో మమ్ము కలియునట్లు చేయుడు, ఆయనతోటి కలయిక మాకు కలుగజేయుడు. భగవంతుడు 'తథాఽస్తు' అనెను. ఆ గోపాంగనలు చతుర్భుజునిచేత ఆకర్షింపబడలేదు. ఈ విషయమే 'నటవరవపుః' నందు కలదు. ద్విభుజుడైన మోహన మురళీధరుని యందు గల ప్రేమ అన్యత్ర లేదు. చతుర్భుజత్వాదులు

భగవంతుని ఐశ్వర్యభావములు. తత్ప్రభావము మాధుర్యభావాభి వ్యక్తియందు లేదు. ఇంత ఏల? సూర్యునిముందు, చంద్రుని ప్రకాశము లేనిచందముగా మాధుర్యభావవికాసమందు, మాధుర్య భావతీవ్రతయందు ఐశ్వర్యభావ ప్రకాశము ఉండదు. వృషభాను నందినియందు మాధుర్యభావ పూర్ణ ప్రకాశము కలదు.

అస్తు. ఇచట చెప్పినట్లుగా, అలౌకికమే కావచ్చు, కాని, దానియందు ప్రీతి లౌకికదృష్టితో ఉండవచ్చు, దానియందలి అలౌకికత గుప్తమై ఉండవచ్చు, భగవంతుడు వ్రజమున, అత్యధిక సాజాత్యమునే అభివ్యక్తము చేసెను. మొదట, నరరూప ముతో (నరత్వేన) తరువాత, గోపరూపముతో (గోపత్వేన), సన్నిహిత సంబంధిరూపముతో అభివ్యక్త చేసెను.

విష్ణు, పురాణములో ఒక కథ కలదు – శ్రీకృష్ణభగవానుడు గోవర్ధనపర్వతోద్ధరణము చేసినపుడు, అద్భుతమైన ఆ ప్రభావ మును చూచి, ఇతడు గోపబాలకుడు కాడు, గోపవేషధారియైన ఈశ్వరుడని అందఱు అనుకొనిరి. వీరు తనను సందేహించుచున్నా రని భగవానుడు తెలిసికొనెను. అంతియే, ప్రభువు రోధించసాగెను. కృష్ణుడు ఏడ్చుచుండుటను గోపాలకులు చూచిరి. 'ఏల రోదించు చున్నావు?' అందఱును శ్రీకృష్ణుని ఓదార్చసాగిరి. 'మీరు నన్ను మీవాడుగా తలచుట లేదు, అన్యుడనని అనుకొనుచున్నారు' అని రోదించుచుంటినని కృష్ణభగవానుడు అనెను. ప్రేమయందు అలౌకికత బొత్తుగా ఉండరాదు, సందేహము లేశమాత్రముగూడా ఉండరాదు.

ఒకమారు, భగవంతుడు మృద్భక్షణము చేసినపుడు, కృష్ణుడు మన్ను తినెనమ్మా! అని బలరాముడు తల్లితో చెప్పెను. ఆమె, ఆ మాటను విని, కొట్టుటకు బయలుదేరెను. ఆమె, ప్రభువును

పట్టుకొని 'ఒరే, నీవు మన్ను ఏల తింటివి? అని అడిగెను. అపుడు కృష్ణప్రభువు భయపడి 'నాహం భక్షితవానంబ' - నేను, మన్ను తినలేదని చెప్పెను. ఐశ్వర్యమును ప్రదర్శించుటకై ఇట్లు చెప్ప లేదు, ప్రాకృత శిశువువలె తల్లిని చూచి భయపడి, ఇట్లు పలికెను- 'అందఱు నీవు మన్ను తింటివి' అని చెప్పుచున్నారే? అని యశోద అనెను. 'అందఱును అసత్యము చెప్పుచున్నారు' అని కృష్ణుడనెను. అపుడు, యశోద 'బలరాముడు కూడా చెప్పుచున్నాడే' అనెను. అంత, భగవానుడిట్లనెను - ఈవేళ, గోపాలురు అన్నయ్యను తమ పక్షములో కలుపుకొనిరి. కావుననే ఆయన గూడా అసత్యము చెప్పెను, నమ్మకము లేకపోయినను, నా నోరు చూడు అమ్మా' అని అనెను. దీని భావమేమనిన, నోరు చూపించుటకు సిద్ధపడుటవలన మన్ను తినలేదని తల్లి అనుకొనును. మన్ను తిని ఉన్నచో, నోరు చూపించుటకు సంసిద్ధుడు కాడు. ఒక అసత్యమును దాచుకొనుటకు ద్విగుణితముగా, త్రిగుణితముగా అసత్యము చెప్పవలసివచ్చును. ఆ తల్లిగూడా గట్టి పట్టుదల కలది. 'నోరు తెరువుము, చూచెదను' అని ఆమె అనెను. ఆ మాట విని, భగవంతుడు నోరు తెరచెను. నోరు ఏమి తెరచెను? భక్తులైన భావుకులు మాతృకోప సూర్యరశ్మి వలన, ప్రభుముఖకమలము వికసించేనని చెప్పుదురు. ముఖ కమలము వికసించగా, లోపల బ్రహ్మాండములు! ఇది ఎట్లు సంభ వించెను? దీనికి కారణమేమనిన, భగవంతుని ఐశ్వర్యాధిష్ఠాత్రియైన మహామాయ, ప్రభువువెంట, సేవావకాశమును అన్వేషించుచు తిరుగుచుండెను.

'భగవాన్! లోకము నిన్ను మిక్కిలి బాధపెట్టుచున్నది, నేను దీనిని సహింపజాలను' అని మాయ అనెను. అంత, ప్రభువు

మహామాయతో ఇట్లనెను – 'నీవు మౌనముగా జరుగుచున్న లీలను చూడుము, ఏదియో చేయవలయునన్న జంజాటములో పడకు'. అయినను, ఆమె అంగీకరించక, యశోద, శ్రీకృష్ణుని నోటిలో మన్ను చూడ నుద్యమించెను. అపుడు. ఐశ్వర్యాధిష్ఠాత్రియైన మహాశక్తి, ఇట్లు ఆలోచించెను – యశోదామాత మట్టిని చూచిన, నా ప్రభువును దండించును, నేను ఉండగా, ఇట్లు జరుగుట సముచితము కాదు. కావుననే, ఆ ఐశ్వర్యాధిష్ఠాత్రియైన శక్తి, కృష్ణ భగవానుని నోటిలో బ్రహ్మాండములను దర్శింపజేసెను. తల్లి చేతిలోని బెత్తము జారి క్రిందపడిపోయెను. విషయము చెడిపోవు చున్నదని భగవంతుడు ఆలోచించెను. వెంటనే,

"వ్యతనోత్ వైష్ణవీం మాయామ్ ।"

యశోద కళ్లు తెరచి చూచినంతనే నా కన్నవానికి ఏదియో దృష్టిదోషము తగిలినది అని అనుకొనెను. తన్నివారణమునకై 'థూ, థూ' అని 'ద్రిష్టి' తీయసాగెను. భగవంతుడు మాయాశక్తితో ఇట్లనెను – నీవు నన్ను రక్షించితివా ఏమి ? 'థూ థూ' అనిపించితివి. పోనిండు, ఈ భావములన్నియు, 'నటవరవపువు' నందే సంభవము. కావుననే, ఇట్లు చెప్పిరి –

"మాయాశ్రితానాం నరదారకేణ సాకం విజహ్రుః
కృతపుణ్యపుంజాః ।"

ఈవిధముగా తరువాత 'బిభ్రత్' అను శబ్దము కలదు. ఏల ఉన్నది ?

"ఏవం నటవస్యైవ వపుః నటవరవపుః తాదృశం
బిభ్రత్ ।"

భగవంతుడు రసాత్మ అని పూర్వము చెప్పబడినది. కాని, రసము అమూర్తమైన కారణమున, అది కదలలేదు, మెదలలేదు.

పరము తత్త్వము గూడా కదలదు, మెదలదు. ఉద్బుద్ధము, ఉభయవిధము నయిన సంప్రయోగాత్మక శృంగార రసాత్మ, ఒక అమూర్తపదార్థము. రసవస్తువు హృదయస్థము. కేవల అమూర్త రసమును వేణువు, వాదనము చేయలేదు. అది కదలదు, మెదలదు. ఆ అమూర్తరసము కేవలము వృషభానునందిని హృదయమందు కలదు. కావుననే 'బిభ్రత్' అని చెప్పబడెను. అమూర్తరసము ఇచట, మూర్తరసమయ్యెను. ఏలయనగా, భావుకులైన భక్తులు ఆ రసమును సర్వేంద్రియగ్రాహ్యముగా ఆహ్లాదించవలయును. అమూర్తరసము, మనోగ్రాహ్యమాత్రము. వేదాంతమునందు చరమ వస్తువుయొక్క ఆస్వాదనము మనోగ్రాహ్యమని చెప్పబడెను.

"బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్"
"స్వయం తదన్తఃకరణేన గృహ్యతే।"

కావున. దానియందు సర్వేంద్రియగ్రాహ్యత్వము లేదని చెప్పబడెను. భక్తులకు మనోగ్రాహ్యమాత్రమగుటచేత సంతోషము లేదు. కాని, సర్వేంద్రియములందు, అంతరాత్మయందు, అంతఃకరణమందు, ప్రాణమందు, రోమరోమమందు ఆ రసానుభవము కలుగవలయును. ఈ భావుకుల అనుభూతి కొఱకే, 'బిభ్రత్'. అమూర్తము, ఉద్బుద్ధము, ఉభయవిధము నయిన సంప్రయోగాత్మక శృంగారరసము మూర్తమైన శ్రీకృష్ణచంద్రపరమానందకందరూపములో మూర్తమై చూడవలయును. రస పరిణామమే శర్కరాదులవంటి రసముయొక్క నిర్యాసమే- పాకము, సారము. అట్లే, పరమానందరసముయొక్క నిర్యాసము (సారము, జిగురు) భగవంతుడు. సారము రసముయొక్క ఘనీభావమే అగును. తరువాత, దీని అభివ్యక్తియందు గొప్ప ఉన్నతత్త్వమును ఉంచెను. ఈ అమూర్తరసము మూర్తము ఎట్లయ్యెను ?

"అనాఘ్రాతం భృంగైః అనపహృత సౌగంధ్య మనిలైః
అనుత్పన్నం నీరేష్వనుపహత మూర్మికరణాభరైః॥
అదృష్టం కేనాపి క్వచన చ చిదానందసరసో।
యశోదాయాః క్రోడే కువలయ మివౌజ స్తదభవత్ ॥"

'నటవరవపుః' బిభ్రత్' ఈ శబ్దములచేత ఉద్బుద్ధము, ఉభయవిధము నయిన సంప్రయోగ, విప్రయోగ శృంగారరసము స్వయముగా అమూర్తమగుటవలన, ఆ రసమునకు గమాగమన ములు పొసగజాలవు. కావున, 'బిభ్రత్' అని చెప్పబడెను. అగుటకు మాత్రము అమూర్తమే. భక్తానుగ్రహ విశేషమువలన, ఆ అమూర్తరసమే 'నటవరవపు' ధారణము చేసెను. అమూర్తరసము మూర్తరూపములో అభివ్యక్తమయ్యెను. వేదాంతుల బ్రహ్మ, కేవల మనోగ్రాహ్యము, బుద్ధిగ్రాహ్యము మాత్రమే గాని, సర్వేంద్రియగ్రాహ్యము కాదు, అని భక్తులు చెప్పెదురు. ఆ భక్తులు కోరునది నిఖిల రసామృతమూర్తి అయిన భగవంతుని, సర్వేంద్రియగ్రాహ్యునిగా చేయుటయే. సర్వేంద్రియములు మనోబుద్ధులపై ఈర్ష్యపడును. పూర్ణతమ పురుషోత్తముని ఆస్వాద నము చేయుచున్న ఆ మనోబుద్ధులను చూచి, నేత్ర, శోత్రాది ఇంద్రియము లన్నియు, ఉవ్విళ్ళూరుచుండును. ప్రతి రోమము, తమ ప్రియతముడైన ప్రాణధనుని సంశ్లేషము (సంయోగము) కొఱకు ఉత్కంఠితమగును, వ్యాకులమగును. భగవంతుని సంయో గమును కోరనివారు ఎవరుందురు ?

"పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్ పరాఙ్
పశ్యతి నాన్తరాత్మన్ ।"

అని శ్రుతివచనము. స్వయంభువు, ఇంద్రియములను బహిర్ముఖ ములగునట్లు సృష్టించెను. 'వ్యతృణత్' అను శబ్దము హింసార్థక

మైన 'తృహు' ధాతువునుండి నిష్పన్నము. స్వయంభువు ఇంద్రియములను సృజించెను అను అర్థమునందు 'వ్యరచయత్' అని చెప్పుదురు. కాని, 'వ్యతృణత్' అని చెప్పబడెను. ఆ స్వయంభువు ఆ ఇంద్రియములను బహిర్ముఖములుగా చేసి చంపివేసెను. వానిని సర్వప్రాణులకు పరమ ప్రేమాస్పదుడైన భగవంతుని రసాస్వాదనమునుండి వంచిత మొనర్చెను. ఈ లోకమున ప్రియ వియోగసమానమైన దుఃఖము మఱొకటి లేదు.

"లోకే నహి స విద్యేత యో న రామ మనువ్రతః।"

ప్రాణేశ్వరుని వియోగము సహింపగల వ్యక్తులు ఈ లోకమున ఎవరును లేరు. ఇంద్రియములను బహిర్ముఖములను చేయక ఉండి యున్నచో, అంతరాత్మయొక్క ఆస్వాదనము చేసియుండెడివి. కావున, సర్వేంద్రియములు భగవత్తత్త్వానుభవము, లేక భగవద్దర్శనము, లేక భగవత్స్వరూపమైన రసమును ఆస్వాదింపక, భగవంతుని మంగళమయ శరీరసంస్పర్శలేక, తమను అకృతార్థుల మని, హతభాగ్యులమని భావించును. దానిని ఆ ఇంద్రియములు తమ హింస అనియే భావించును. బుద్ధి, బ్రహ్మాకారాకారితమై రసాస్వాదనము చేయుచున్నట్లు తాము గూడా. చేయువలయునని తలంచును అను విషయము స్పష్టము. తరువాత

"అక్షణ్వతాం ఫలమిదం న పరం విదామః।"

ఇత్యాది శ్లోకములందు ఇంకను అధికముగా స్పష్టమగును. వాల్మీకి మహర్షి ఇట్లనెను –

"యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి।
నిందితః స భవేత్ లోకే స్వాత్మాప్యేనం విగర్హతి॥"

ఎవరు రాముని, స్నేహపూర్ణమైన దృష్టితో చూడరో, ఎవరిని రామచంద్రుడు కృపాదృష్టితో చూడడో, అతడు సమస్త లోకమందు

నిందితుడు, వాని అంతరాత్మ గూడా, వానిని గర్హించును. ఈ విధముగానే భగవంతుని సేవకు ఉపయోగపడని సర్వేంద్రియములు నిరర్థకములు. కావుననే, భక్తగణము, ఉద్బుద్ధము, ఉభయవిధము, సంప్రయోగ,విప్రయోగాత్మకము, శృంగారరసాత్మకము నయిన భగవంతుడు కేవల బుద్ధిగ్రాహ్యుడు అయినంత మాత్రమున సంతోషమునొందరు. ఆ భగవంతుని రోమరోమముతో, సర్వేంద్రియములతో సంస్పర్శను అవగాహమును కోరుదురు, కావున, ఆ భక్తుల మానసిక సంస్కారానుసారము (వాసనానుసారము) ఉద్బుద్ధము, ఉభయవిధము నయిన శృంగారరసాత్మక తత్త్వము సర్వేంద్రియగ్రాహ్యమగుటకై సర్వభావముతో సమాస్వాదనము కలిగింపజేయుటకై నటవరవపువైన శ్రీకృష్ణుడు బృందారణ్యమున ప్రవేశించెను.

'బిభ్రత్'అను పదము, 'డుభృఞ్ ధారణ పోషణయోః' అను ధాతువునుండి నిష్పన్నమయ్యెను. దీనికి ధారణ, పోషణములు అను రెండు అర్థములు కలవు. ఉద్బుద్ధ, ఉభయవిధ శృంగార రసాత్మకుడైన భగవంతుడు వేణువాదనము చేయుచు, బృందారణ్యమందు ప్రవేశించెను. ఆయన ఎవరు ? అని అడిగిన, వృషభానునందినియొక్క హృదయగత వస్తువు, భక్తుల హృదయగత వస్తువు అని చెప్పవలయును. అనగా, భక్తులభావమే శ్రీకృష్ణచంద్ర పరమానందకందరూపమున ప్రకటమయ్యెను. కాగా, భగవంతుడు భక్తుల మనోభావనామయుడని భావము.

"స్వేచ్ఛామయశ్చ న తు భూతమయశ్చ"

"స్వాః స్వీయా తేషాం ఇచ్ఛా స్వేచ్ఛా. తన్మయః
న తు భూతమయః ।"

ఈ వపువు (శరీరము) భూతమయము, మాయామయము,

ప్రకృతిమయము కాదు. కాని, భావుకులైన భక్తులకు ప్రీతిమయము, ఇచ్ఛామయము. ఉద్బుద్ధము, ఉభయవిధము నయిన శృంగారరసాత్మక స్వరూపమని చెప్పినచో, వృషభానునందిని యొక్క అంతఃకరణమందు, వ్రజాంగనల అంతఃకరణమందు ఉభయవిధ శృంగారరసాత్మక స్వరూపమని తెలియనగును. నాయక విషయకమైన శృంగారరసము నాయికయొక్క అంతఃకరణమందే (హృదయమందే) ఉద్బుద్ధమగును, అమూర్తమైన ఈ రసము, వృషభానునందినీ హృదయగతమైన వస్తువు మూర్తమై బృందారణ్యధామమందు ఏల ప్రవేశించెను? అనిన, సర్వేంద్రియ గ్రాహ్యమగుటకొఱకే ప్రవేశించెనని గ్రహింపనగును. ఉద్బుద్ధ, ఉభయవిధ శృంగారరసాత్మ, హృదయస్థ వస్తువైనచో, అపుడు, సర్వేంద్రియగ్రాహ్యము కాదు. కాని, హృదయస్థమైన ఆ వస్తువే బృందావనస్థమయ్యెను. మొదట, ఆ వస్తువు హృదయస్థమే ఎట్లు అయ్యెను? అనిన, మొదటినుండియు ఆ వస్తువును, శ్రీకృష్ణచంద్రపరమానందకందమే ధరించి పోషించెను.

''ఆశాభృతాం త్వయి చిరా దరవిందనేత్ర!''

ఒక వ్రజాంగన ఇట్లనును – ఓ శ్యామసుందరా! ఓ వ్రజేంద్రనందనా! నీ సమాగమముయొక్క ఆశను ధరించియున్నాను, ఆ ఆశాకల్పలతాబీజమును వ్రజాంగనల స్నిగ్ధహృదయక్షేత్రమున నాటితిని. కొండరాళ్ళతోను, ఇసుకతోను నిండిన క్షేత్రమున ఈ ఆశాకల్పలత అంకురితము కాదు. అనగా, భగవత్సంయోగ సంబంధమైన ఆశాకల్పలతను హృదయమందు నాటవలయును. అది, అంకురితము కావలయును, పుష్పితము కావలయును, ఫలింపవలయును. ప్రత్యాశిత (ఆశింపబడిన) వస్తువుయొక్క సమ్మిలనమే (సంయోగమే), తత్సాఫల్యము. ఇది భగవత్కృప

వలన భావుకులైన భక్తుల హృదయమందు ప్రకటమగును. వ్రజాంగనల హృదయమందు భగవత్సంయోగమునకు సంబంధించిన ఆశను గూడా, ఆయనయే నాటెను, పోషించెను. ఈ యిరువదియొకటవ అధ్యాయమందు పుష్పించెను; తత్పుష్ప పరిమళము వేణుగీతము ద్వారా ప్రకటమగును. దీనిభావమేమనిన శ్యామసుందరుడు, వ్రజేంద్రనందనుడు నయిన శ్రీకృష్ణచంద్రుడే వృషభానునందినీ హృదయమున, వ్రజాంగనల హృదయమున స్వసంమిలనోత్కంఠను, ఆశను నాటెను. అదియే శృంగారరస స్వరూపము. ఎప్పుడైనను, తదాశాకల్పలతాంకురము వాడిపో సాగినప్పుడు, గోపాంగన తన అశ్రుబిందువులతో సిక్తము చేయ దలంచును, శ్రీకృష్ణచంద్ర పరమానందకందము యొక్క వియోగ రూపమైన బాడబాగ్నివలన సంతప్తము కాసాగినపుడు, ఆ గోపాంగనయే శ్రీకృష్ణ చరణారవింద పరాగరూపమైన కజ్జలమును (కాటుకను) కన్నులకు పెట్టును, కృష్ణపాదపంకజ పరాగమువలన ఈ అగ్ని, ప్రశమిత మగును. శ్రీకృష్ణచంద్రుడే ఈ శృంగారరస ధారణ, పోషణములు చేసెను. ఇచట గూడా హృదయస్థమైన ఉద్బుద్ధ ఉభయవిధ సంప్రయోగ, విప్రయోగాత్మకమైన శృంగార రసమును మూర్తమొనర్చుటకై ధరించెను, పోషించెను.

ఇపుడు, భూషణముల వర్ణనము జూతము. బర్హాపీడము - బర్హామయ ఆపీడనము, వైజయంతి, కర్ణికారము, పీతాంబరము ఇవన్నియు భూషణములు. కేవల 'నటవరవపు' స్వరూపము. 'నటవత్, వరవత్ వపుః' అని బాహ్యార్థమును గ్రహించినచో, శోభ అనియు, భూషణమనియు అర్థము సిద్ధించును. నటుడే విచిత్ర వసనములతో, వేషముతో అలంకరించుకొనును. అట్టి అర్థమును గ్రహించుటవలన, తాదృశ శరీరజ్ఞానము కలుగును. కాని, ఇంతియేకాక, 'నట' పదముచేత, 'వర' పదముచేత సంప్రయోగ,

విప్రయోగాత్మక శృంగారము చెప్పబడినచో, భగవత్సంబంధమైన, ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారాత్మకమైన రసస్వరూపము సిద్ధించును. భగవంతునికి మూడు శృంగారములు కలవు.

"భూషితా అప్యభూషయన్"

శ్రీకృష్ణచంద్ర పంమానందకందము గోపాలకులతో, బలరామునిలో మాతృగృహమునుండి బయలుదేరుటకు ముందే, తల్లి, నలుగుపిండిపెట్టి, అభ్యంగనము చేయించిన తరువాత, నానావిధ విచిత్ర దివ్య అలంకారములతో భూషితుని చేసి, బృందారణ్యమునకు పంపును. తరువాత, వనమునకు వచ్చి, గోప బాలకులు వనసామగ్రులతో భూషితుని చేయుదురు. కర్ణికారముతో (కర్ణభూషణముతో) ఆభూషితుని జేయుదురు. పరమ సుందరమైన గుంజాహారమును ధరింపజేయుదురు. అపుడు, ఉద్బుద్ధ, ఉభయ విధ శృంగారరస నిర్యాసరూపము, ఆనందసుధాసింధువును మథించి, అద్భుతమైన ఈ పారతమ తత్త్వము వినిఃస్రుత మయ్యెను. పూర్ణానురాగరస సారసింధువుచేత, ప్రభువుయొక్క సమస్త శరీర నిర్మాణము జరిగెను. స్వరూపావిర్భావము జరిగినపుడు, నలుగుపిండి, అభ్యంగనము, అనులేపనము, స్నానము మున్నగునవి జరిగెను. మొదట, ఉద్వర్తనము. ఆనందబృందావనచంపువునందు ఇట్లు చెప్పబడెను –

"ఉద్వర్తితమివ సౌరభ్యేణ"

ఇతరులకు మంచి వాసన వచ్చుటకు ఉద్వర్తనము (నలుగుపిండి) పెట్టబడును. ఇచట, భగవంతుని స్వరూపమునకైనచో, సౌరభ్యము చేతనే నలుగుపెట్టుట జరిగినది. అనంతకోటి బ్రహ్మాండాంతర్గతమైన సౌరభసారసర్వస్వమే ఆయనకు నలుగుపిండి.

"అభ్యక్తమివ స్నేహేన"

అన్యత్ర, మానవులయందు స్నానము వలన మధురిమ వ్యక్తము చేయబడును. ఇచట, భగవద్విషయక భావుకుల స్నేహముచేత భగవంతుని అభ్యంగనము జరిగెను. అనంత బ్రహ్మాండగతమైన మాధుర్యబిందువుయొక్క ఉద్గమస్థానమైన మాధుర్యసింధు సారముతో భగవంతుడు స్నానము చేయించబడెను. శ్రీకృష్ణ చంద్రుని మంగళమయమూర్తియొక్క స్నానము మాధుర్యామృత సారసర్వస్వముతో చేయించబడును.

"మార్జితమివ లావణ్యేన"

ముత్యముయొక్క మధ్యభాగమున గల ప్రకాశమును (మెఱుపు) 'లావణ్య'మని అందురు. ఆ లావణ్యసార సర్వస్వముచేతనే మార్జనము జరిగెను. ఇక, అనులేపనము కలదు.

"అనులిప్తమివ సౌందర్యేణ"

లోకమున అనులేపనముచే సౌందర్యము అధికమగును. భగవంతుని, విషయమున, సౌందర్యసారసర్వస్వముచేతనే అనులేపనము జరుగును.

"భూషితమివ త్రైలోక్యలక్ష్మ్యా"

అనంతకోటి బ్రహ్మాండగతమైన లక్ష్మీదేవిచేతనే, ఆ భగవంతుడు భూషితుడై ఉండెను. ఇది, స్వాభావికమైన శృంగారము. నంద రాణియైన యశోదచేత చేయబడిన శృంగారము (అలంకారము), అటుపిమ్మట గోపబాలకులచేత బృందావనము నందు చేయబడిన శృంగారమే 'బర్హాపీడము'

'బిభ్రత్'-బర్హమయమైన ఆపీడమును భగవంతుడు ధరించి, ఉండెను. 'ఆపీడ'మనగా, శిరోభూషణము. ఆ శిరోభూషణము

మయూరపిచ్ఛముతో (నెమలికన్నుతో) నిర్మితము, అద్భుతము నయిన ముకుటమును ధరించి ఉండెను. నాట్యము చేయుచున్న మయూరమునుండి, ఏ నెమలికన్ను జారిపడునో, దానిని 'బర్హ' మని అందురు. ఆ బర్హము చేతనే ఈ కిరీటము రూపొందెను. మయూరమునకు ఆనందోల్లాసము కలిగినపుడు ఆ మయూరము నృత్యము చేయును. మేఘగర్జనముతో మేఘశ్యాముని, అద్భుత మైన మేఘమును, చూచుచు మందమందమైన గర్జనముతో రసోల్లాసముతో, రసోద్బోధనముతో, ఆ నెమలి నృత్యము చేయు చున్నపుడే ఆ పిచ్ఛము (ఆ నెమలికన్ను) క్రింద పడును. ఆ నెమలి కన్నును ధరించి, ఉద్బుద్ధమైన ఉభయవిధ శృంగారరస మును ఇంకను అధికముగా ఉద్బోధింపజేసెను (మేల్కొల్పెను). ఇది ఉద్దీపనకోటిలోనికి చేరినది. ఆ నెమలిపింఛమును తన భూషణ ముగా ధరించి, భగవంతుడు రసోల్లాసమును వ్యక్తము చేసెను. ఇచట ఎంత ఎక్కువగా ఉద్బుద్ధ ఉభయవిధ శృంగార రసాత్మత యందు రసాభివ్యక్తి కలుగునో, అంత అధికముగా భక్తులందు రసోల్లాసము కలుగును. భగవంతుడు తమను కలియుటకై ఉత్కంఠితుడై ఉన్నాడని భక్తులకు, తెలిసినపుడు, వారి ఉత్కంఠకు ఎల్లలు ఉండవు. అపారమైన ఈ ఉత్కంఠను ఇంకను పెంపొం దించుటకై భగవంతుడు నెమలిపింఛమును ధరించును.

"రాధా ప్రియమయూరస్య పత్రం రాధేక్షణప్రభమ్।"

భగవంతుడు ఏ మయూరచంద్రకమును (నెమలికన్నును) ఆభూషణముగా చేసికొనెనో, ఆ నెమలికన్ను వృషభానునందినీ నికుంజమునకు (పొదరింటికి) సంబంధించినది. శ్రీకృష్ణపరమా నందకందము యొక్క శరీరమువలె ఆ మయూర కంఠమున శ్యామలత్వము కలదు. కావుననే శ్రీకృష్ణచంద్రుని, స్మరింపజేయున దగుటవలన వృషభానునందిని (రాధ) ఆ మయూరమును తన

యొద్ద ఉంచుకొనును. భగవంతుడు ఆ నెమలి పింఛమునే ధరించును. ఈ పింఛమునందలి కన్ను వృషభాను నందిని నేత్రముతో సమానమైనది. కావున భగవంతుడు ఆ భూషణమును శిరోధార్యము చేసికొనెను. భక్తునికి సంబంధించిన వస్తువును భగవంతుడు తన శిరోభూషణముగా చేసికొనును. అథవా, శ్రీరాధ యొక్క శీర్షమందలి కొప్పుముడివలె ఈ నెమలి కన్ను ఉండును. కావున ఇది రాధాదేవికి అలంకారమైన జుట్టు కొప్పుముడివలె ఉండుట వలన భగవంతుడు ఆ నెమలి పింఛమును తన భూషణముగా చేసికొనును. ఇంతయేగాక, అనంతర ప్రసంగమందు మూడు భావములు చూపబడినవి. అంత్యంత సరసము, నూతనము, అరుణ వర్ణము గలది ఆమ్రపల్లవము అగుటవలన దానిని గూడా ప్రభువు తన భూషణముగా ధరించెను. దాని అరుణిమ చేత రాగమును (అనురాగమును) ప్రదర్శించెను. ఇది ఉద్బుద్ధ, ఉభయవిధ శృంగార రసాత్మక స్వరూపమైన అంగి (ప్రధాన) రసము, మిగిలినవన్నియు అంగరసములు. అయిన, దానిచేత ఈ స్వరూపమందు రజఃకృతమైన (రజోగుణమునకు సంబంధించిన) రాగజన్యమైన ఒక విక్షేపము సూచింపబడెను. నెమలి పింఛమందలి శ్యామలత్వము చేత లిలక్షయిషితమైన (లక్ష్యముగా చేయుబడదలచుచున్న) తమోగుణముచేత గాఢమైన ఆసక్తి చూపబడెను. సరసమైన అరుణ పల్లవము చేత రాగము చూపింపబడెను. రసమునందు ఇవన్నియు రాగము అగుచున్నవి. సాధారణముగా రాగమునందు రసము ఉండును. ఇచటైనచో, ఉద్బుద్ధ ఉభయవిధ శృంగార రసాత్మమైన శ్రీకృష్ణచంద్ర పరమానందమందు రాగము, ఆసక్తి వ్యసనము లగుచున్నది. తాత్పర్యమేమనిన, భక్తులు రస స్వరూపుడైన భగవంతునియందు రాగము, ఆసక్తి, వ్యసనము పొందదలంతురు. అనగా భక్తులు

ఆ విధమైన రాగము, ఆసక్తి. వ్యసనము కలిగియుందురు. అటులనే తరువాత భగవంతుడు భక్తులయందు రాగ ఆసక్తి, వ్యసనములను కలిగి ఉండును. వృషభానునందినికి, వ్రజాంగనలకు శ్రీకృష్ణ పరమానందకందము మన్మోహనుడైన శ్యామసుందరినియందు రాగ, ఆసక్తి, వ్యసనములుండురీతిగా భగవంతునికి వృషభానునందినియందు, గోపాంగనలయందును రాగ, ఆసక్తి, వ్యసనములు ఉండుమ. మొదట భక్తునికి భగవంతునియందును, తరువాత భగవంతునికి భక్తునియందును రాగ, ఆసక్తి, వ్యసనములు ఉండును. వృషభానునందిని యొక్క హృదయగతమైన వస్తువు శ్రీకృష్ణచంద్రుడైనట్లే, శ్రీశ్యామసుందరిని హృదయగత వస్తువు వృషభానునందిని అని చెప్పబడినది, ఇది లౌకికవత్, ప్రాకృతవత్ వ్యక్తమగుననియు కాని అవి అలౌకికమనియు చెప్పబడినది. రసము రసాలంబనము రసాశ్రయము ఈ మూడును మూడు జాతులకు సంబంధించినవై ఉండును. ఇచట మాత్రము ఒక్కటియే. ఇవి పరమ రసామృత సింధువుయొక్క మూడు వికాసములు. శ్రీకృష్ణచంద్రుడు, వృషభానునందిని పరస్పరము హృదయములు. శ్రీకృష్ణచంద్రుని స్వరూపముచేత వృషభానునందినియొక్క హృదయగతమైన ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసము మూర్తమయినట్లే, వృషభానునందిని యొక్క స్వరూపముచేత శ్రీకృష్ణచంద్రపరమానంద కందము యొక్క హృదయగతమైన ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసము మూర్తమయ్యెను. కావున ఇరువురును ఉభయాత్మకులు. ఈ దృష్టితో ఇరువైపుల ఈ స్వరూపమందు రసాభివ్యక్తి కలిగెను. వీర రసమునందు వీరరసము యొక్క, కరుణరసమునందు కరుణరసము యొక్క సంచారము ఉన్నట్లు ఉభయవిధ శృంగారరసాత్మయందు రసాభివ్యక్తి కలిగెను. "బర్హాపీడం" 'నటవరవపుః' అనుచు ఇదియే చెప్పబడును.

ఇపుడు 'బిభ్రత్' - బర్హాపీడము కంటె భిన్నమైన ఆభూషణము ధరించబడెనని చెప్పబడుచున్నది.

''కర్ణయోః కర్ణికారం బిభ్రత్''

చెవులో గన్నేరు పువ్వులను ధరించెను. 'కర్ణయోః' ద్వివచనాంతశబ్దము, 'కర్ణికారం, ఏకవచనాంత శబ్దము. కావున కర్ణికారమునందు గూడా కొందఱు ద్విత్వమును కల్పింతురు. అథవా, ఒకప్పుడు ఎడమ చెవియందును మఱొకప్పుడు కుడి చెవియందును కర్ణికారమును ధరించునని చెప్పుదురు. ఏతావతా రసవైదగ్ధి విశేషము చెప్పబడినది. భగవంతుని రెండు కర్ణములు రసోద్భావకములనియు, కర్ణములయందు రసానుభావకము, రసోద్బోధకము నయిన పుష్పమును ధరించుటచేత రసమును ఉద్వేలితము చేసెననియు భక్తులైన భావుకులు చెప్పుదురు. అథవా రెండు కర్ణములు ద్వివిధ-సంప్రయోగ, విప్రయోగాత్మక-శృంగారానుభావకములు. సంప్రయోగకాలమున హాస, రాస, విలాస మిశ్రితములైన వచనములచేత ఆ సంయోగరసము పుష్టమగును. విప్రయోగకాలముమందు వేణుదూతద్వారా భక్తులను భగవంతుడు ఆహ్వానించినపుడు శ్రోత్రములకే పని. అథవా ఏకాంతమందు భక్తులు 'తచ్చింతనం తత్కథనమ్' అను రీతిగా భగవంతుని చింతనము చేయుట వలన భావనాపరిపాక మహిమచేత ఈ శ్రోత్రముల ద్వారముననే దూరస్థలైన వ్రజాంగనల ఆర్తి విలాపములు భగవంతునికి అనుభూయమానములగును. దీనియందు ముఖ్యములైన ఏ శ్రోత్రములు కలవో వానిని భగవంతుడు అలంకరించెను. అనగా భగవంతుడు ఒకప్పుడు సంయోగ శృంగార పోషణము, మఱొకప్పుడు వియోగ శృంగార పోషణము చేసెను.

మఱికొందఱు ఇట్లు చెప్పుదురు. 'కర్ణికార'మనగా గన్నేరు పువ్వు కాదు, పసుపుపచ్చని వర్ణము గల కలువవంటి పుష్పము

(ప్రొద్దుతిరుగుడు పువ్వు)సూర్యాభిముఖముగా ఉండుట ఆ పుష్ప స్వభావము. సూర్యుడు ఏ దిశగా ఉండిన ఆ పుష్పము, ఆ వైపున ఉండును. కర్ణికారపుష్పము (ప్రొద్దుతిరుగుడు పువ్వు) నందలి ఈ స్వభావమును తెలిసికొని, భగవంతుడు దానిని ధరించెను. మా భక్తులు, ఎటు ముఖమును ఉంచుకొందురో, నేను గూడా వారికి అభిముఖముగా ఉందునని భగవంతుడు సూచించును. ఐతావతా, భక్తులు ఎటువైపు ఉందురో అటువైపుననే ఉభయవిధ శృంగారరసము ఉన్ముఖమై ఉండును. కావుననే భగవంతుడు వానినిధరించి ఈ విషయమునే ప్రదర్శించెను.

"బిభ్రద్వాసః కనకకపిశమ్"

భగవంతుడైన శ్రీకృష్ణచంద్రపరమానందకందము కనకవర్ణపీతాంబరమును ధరించి బృందారణ్యమునకు వచ్చెను. రసముఆవృతమై ఉండుటకై ఆయన, పీతాంబరమును ధరించి వచ్చెను. ఉద్బుద్ధమైన ఉభయవిధ శృంగారరసమే శ్రీకృష్ణచంద్ర పరమానంద కందము. ఆ రసము నిరావరణమైనచో, రసభంగమగును. నిరావరణరసము రసాభాసమని చెప్పబడును. కావున, దానిని ఆవృత మొనర్చి ఉంచవలయును. ఈ రసము ఉచ్ఛలితరసము, ఉద్బోధిత రసము. శృంగారరస స్వరూపమును శ్రీకృష్ణచంద్ర భగవానుడు మయూరపిచ్ఛమయమైన ముకుటమును ధరించి సూచించెను. రసోల్లాసమునందే నెమలికన్నె రాలిపడును. కావున, దానిని ధరించుట రసోల్లాసలక్షణము. ఏతాదృశమైన ఉద్బుద్ధ, ఉభయవిధ శృంగారరసము ఆవృతము కానిచో, రసాభాసమగును. కావున,

"కనక కపిశం వాసో బిభ్రత్ ।"

పీతాంబరమును ధరించెను. రసము ఆవృత మగుటచేతనే, రసమగును. అట్లే ఉత్కంఠావిశేషమును పెంపొందించుటకై రసము

ఆవృత మయియే ఉండవలయును. బృందావనధామమందు శ్రీబహాలీమందిరమున, మాటిమాటికి, ప్రతి క్షణము తెర వేయబడు చుండును. ఏలయన, ఇట్లు చేయుటవలననే ఉత్కంఠ స్థిరముగా ఉండును. నిరావరణమైన, నిర్విఘ్నమైన రసమునందు ఉత్కంఠ క్షయమగును. వాస్తవమునకు, రసము ఆస్వాదించుటవలన, తరిగి పోదు. అయినను, లౌకికమైన పద్ధతితో ప్రభువు రసాస్వాదమును కలిగించుచున్నాడు. అత్యంత సౌందర్యవతి, పరమ రమణీయ మూర్తియైన నాయిక గూడా చంద్రునివంటి ముఖముపైన మేలి ముసుగు వేసికొనును. కావున, ఉద్బుద్ధ, ఉభయవిధ శృంగారాత్మ యైన శ్రీకృష్ణభగవానుడు కనకకపిశ పీతాంబరముతో తనను ఆవృత మొనర్చుకొనెను. అనగా భక్తులకు శ్రీకృష్ణచంద్రపరమానందమును కలియుటయందు ఆటంకమైన ఏ ఆవరణము కలదో, అది మాయ. మాయయే, నిరావరణముగా, భగవంతుని దర్శించనీయదు. ఆ రీతిగానే గోపాంగనలకు, నిరావరణ, ఉద్బుద్ధ, ఉభయవిధ శృంగారరసాత్మయైన శ్రీకృష్ణచంద్ర మారమానందకంద దర్శన మందు బాధకము పీతాంబరము. శ్రీ వల్లభాచార్యుడు గూడా పీతాంబరమును 'మాయ' అనియే అంగీకరింతురు. భగవంతుడు సైతము, ఇట్లనును –

"నాహం ప్రకాశః సర్వస్యయోగమాయాసమావృతః ।"

కావుననే అందటికి భగవత్తత్త్వము అనుభూయమానము కాదు. ఒకవేళ, తత్త్వానుభవము కలిగిన, కేవలము భగవత్కృప వలననే కలుగును. పీతాంబరము కేవలము వస్త్రము మాత్రమే కాక, తప్త కాంచనసదృశమైన సువర్ణవర్ణాంబరమై ఉండుటయందలి తాత్పర్య మేమి? సువర్ణము మోహకమైన పదార్థము. అత్యంత విశ్వసనీయు లయినవారి విశ్వసనీయతను తుడిచిపెట్టివేయునది సువర్ణమే అయి ఉండును. కావున, సువర్ణవర్ణము కల పీతాంబరము వ్యామోహకము.

మాయ, కనకతుల్య. ఈ వ్యామోహము అతిక్రమించగల వ్యక్తియే ఆ ఆవరణముచే ఆవృతమైన బ్రహ్మను దర్శించ గలడు. కనకముయొక్క ఆవరణములో చిక్కికొనినవాడు రసాత్మ మైన బ్రహ్మను ఏమి దర్శింపగలడు ?

"వేధా ద్వేధా భ్రమం చక్రే కాన్తాసు కనకేషు చ ।
తాసు తేష్వప్యనాసక్తః సాక్షాత్ భర్గో నరాకృతిః ॥"

ఇటువంటి ఆవరణముచేత తన శరీరమును ఆవృతము చేసికొని, భగవంతుడు బృందారణ్యధామున ప్రవేశించెను. అనగా, భగవద్దర్శనము చేయదలంచిన వారి ఎదుట, ప్రప్రథమమున, మాయాసంబంధమైన తళుకుబెళుకులు ఎదురగును. దానిని అధిగ మించగలిగిన, మంచిదే. కేవల కనకసదృశముగానే కాదు, అగ్ని తప్తమైన సువర్ణమువలె దేదీప్యమానము, ప్రకాశమానము, పీత వర్ణాంచితము నయిన పీతాంబరముతో తనను ఆవృతము చేసి కొనెను. దానిని అతిక్రమించిన, మంచిదే. పీతాంబరప్రకాశము అనేకవిధములుగా ఉండును. కొందఱు సువర్ణవర్ణ మనిన, మఱి కొందరు, దివ్యదీప్తివంతమైన ఒకానొక విద్యుత్సదృశ మందురు. కొందఱు కదంబకింజల్క మనిన, మఱికొందఱు రవికిరణసమానమని చెప్పుదురు. ఇచట మాత్రము, విద్యుత్తుకంటె గూడా శతగుణిత ముగా, సహస్రగుణితముగా దేదీప్యమానమైన పీతాంబరము ఉన్నది. అది, ప్రభువు శరీరమునకు విలక్షణమైన శోభ నొసంగు చున్నది. ఇంద్రనీలమణిగిరిపైన విద్యుత్తు మెఱసినట్లు, శ్రీకృష్ణ చంద్రపరమానందకంద మహేంద్రనీలమణిని లజ్జిత మొనర్చు స్వరూపముపైన పీతాంబరము విద్యుత్తువలె ప్రకాశించుచున్నది, అద్భుత శోభను చేకూర్చుచున్నది. అథవా, సజల నీలాంబుదము

పైన, మేఘశ్యామునిపైన విద్యుత్తు మెఱయుచున్నట్లు, ప్రభువు యొక్క శరీరముపైన. పీతాంబరము దేదీప్యమానమగును. అందున, ఈ నీల జలదము జల మొసంగునట్టిది. శ్రీకృష్ణచంద్ర పరమానందకందమైనచో, ఆనందరసవర్షి – అనురాగరసవర్షి, ప్రేమానందరసవర్షి. ఇది ఒకానొక అద్భుత, సుధామయ జలదము. కావుననే అద్భుతమైన విద్యుత్ప్రకాశమును, లజ్జిత మొనర్చునట్టి పీతాంబరముచే ఆవృతుడై ఉన్నాడు. శ్యామల జలదము (నీల మేఘము) జలపూర్ణమయియే ఉండును. ఇచట గూడా శ్రీకృష్ణ చంద్రుడు ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసస్వరూపుడే. శృంగా రాధిష్ఠాతయైన దైవము విష్ణువు. ఆయన, శ్యామవర్ణము కలవాడు శృంగారరసస్వరూపవర్ణనమందు, తద్రసవర్ణము కూడా శ్యామవర్ణ మని చెప్పబడినది. ఈ ప్రకారముగా శ్రీకృష్ణప్రభు శరీరముపైన పీతాంబరము అద్భుతమైన దీప్తి నొసగుచున్నది.

ఇది (పీతాంబరము), 'మాయ' అని భక్తులు చెప్పుదురు. కాని, ఏవంగుణవిశిష్టమైన పీతాంబరము వృషభానునందినియే. ఈ విధముగానే వృషభానునందిని శరీరముపైన గల భూషణము లన్నియు, శ్రీకృష్ణచంద్రపరమానందకందమే.

"శ్రవసోః కువలయ మక్ష్ణో రంజన మురసో
మహేంద్రదామ ।
బృందావన తరుణీనాం మండన మఖిలం హరి ర్జయతి ॥"

వృషభానునందిని యొక్క కర్ణములయందు, వ్రజాంగనల కర్ణములయందు కమలములవంటి కర్ణాభరణములు కలవు. రాత్రి యందు వికసించునట్టి, భూమిపై ఉద్భవించు కమలవిశేషము 'కువలయ'మనబడును. ఆ కువలయము శ్రీకృష్ణుడు. అనగా, వారి కర్ణాభరణము శ్రీకృష్ణభగవానుడు. వారు తమ నేత్రములకు

పెట్టుకొనునట్టి అంజనము, ప్రాకృతమైన అంజనము కాదు. శ్యామ సుందరుడైన ఆ వ్రజేంద్రనందనుడే, అంజనమై వారి నేత్రము లందు విరాజమానుడగును. వారి భూషణములు కాష్ఠ, పాషాణమయ ములు కావు.

"ఈదృశా పుష్పభూషణేన యా భూషయన్తి న సుభ్రువః ।
ధిక్ తదీయ కులయౌవనం ధిక్ తదీయ
గుణరూపసంపదః ॥"

ఏతాదృశమైన పురుషభూషణములచేత తమ హృదయ మందు అలంకరించుకొనని సుభ్రువులైన (మంచి కనుబొమ్మలు గల) స్త్రీల కుల, శీల, యౌవన, గుణరూపసంపత్తికి ధిక్కారము (వ్యర్థము). శ్యామసుందరుడు, పురుషభూషణుడు, పురుషోత్తముడు నయిన శ్రీకృష్ణునితో తమను భూషితము చేసి కొనని స్త్రీలు తమను, కంకరరాళ్లతోను, కొండరాళ్ళతోను అలంక రించుకొందురు, శ్రీకృష్ణచంద్ర పాదపంకజ పరాగమునే కాటుకగా పెట్టుకొనువారి హృదయమున. వెలుగొందు మహేంద్రనీల మణిమాల గూడా శ్రీకృష్ణచంద్ర పరమానందమూర్తియే. లోకము నందలి ఇతర స్త్రీలు రాళ్లతో తమను అలంకరించుకొనినను, అలంక రించుకొందురుగాక! కాని, బృందావనవాసినులైన స్త్రీల మండనము అలంకారము ఒక్క శ్రీకృష్ణచంద్రపరమానందకందమే, సాధారణముగా శ్రీకృష్ణచంద్రపరమానందకందము, మన్మో హనుడు, మదనమోహనుడు, శ్యామసుందరుడు నయిన భగవానుడు ఆ వ్రజాంగనల హృదయమున ఉండనే ఉన్నాడు. కాని, బయట గూడా ఆయనయే, హృదయమునకు బాహ్యాభ్యం తరములందు ఒకడే ఉండవలయును. వ్రజాంగనల, వృషభాను నందినియొక్క అంతరాత్మ, అంతఃకరణము, ప్రాణము, ఇంద్రియములు, రోమరోమము అన్నిటియందు, ఉపరిష్టాత్ పైన

అధస్తాత్ (క్రింద) సర్వతః అంతట శ్రీకృష్ణుడే ఉన్నాడు. వృష భానునందిని శరీరమందు నీలవర్ణము గల చీర, నీలము, అద్భుతము నయిన నిచోలము (మేలి ముసుగు) ఇంద్రనీల వర్ణముగల కంకణములు (గాజులు) హృదయవిలింపితమైన (హృదయమునందు పూయబడిన) మృగమద కస్తూరిక. అంతయు భగవన్మయమే. దీనినంతయు ఎంత వర్ణించగలము! కావున, సంక్షేపముగా చెప్పబడినది.

"మండన మఖిలం హరిర్జయతి ।"

"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ
భజామ్యహమ్ ।"

అనియే శ్రీకృష్ణప్రభుసిద్ధాంతము. పూర్ణతమ పురుషోత్తముడైన శ్యామసుందరభగవానునికి, వృషభానునందిని కాక, భూషణముగా చేసికొనదగినవారే లేరు. వ్రజాంగనలకు, వృషభానునందినికి, భూషణము శ్రీకృష్ణచంద్రపరమానందకందము. భగవంతుడైన శ్రీకృష్ణచంద్రపరమానందమునకు గూడా సమస్త ఆభూషణములు, వృషభానునందిని, వ్రజాంగనలే. శ్రీకృష్ణప్రభువునకు అంతరంగ స్వరూపిణి వృషభానునందిని, వృషభానునందినికి అంతరంగ స్వరూపుడు శ్రీకృష్ణభగవానుడు. కావుననే—

"ఉభయోఃభయభావాత్మా"

అని చెప్పిరి. భగవంతుడు భక్తమనోభావనామయుడైనట్లు, భక్తుడు, భగవన్మనోభావనామయుడు. భక్తుని హృదయము భగవంతుడు. భగవంతుని హృదయము భక్తుడు. ఈ దృష్టితోనే భగవంతుడు పీతాంబరముచే ఆవృతుడు. అద్భుత, అనంత పరమానంద సుధాసింధువునందు మధురిమ ఉన్నరీతిగానే శ్రీకృష్ణ చంద్రపరమానందకందము నిఖిల రసామృతసింధుపునందు

మాధుర్యాధిష్ఠాత్రి అయిన వృషభానునందిని, తదంశభూతలైన వ్రజాంగనలు కలరు. శ్రీకృష్ణపరమానందకందము ఒక తరుణ తమాలము, శ్రీవృషభానునందిని, ఒక సువర్ణలత, సువర్ణవర్ణాంచిత లతాపరివేష్టితమైన తరుణ తమాలము సుశోభితమగునట్లు, వృషభానునందినిచేత శ్రీకృష్ణచంద్ర పరమానందకందము సమాశ్లిష్టుడై ఉండును. ఇరువురి సంబంధము అద్భుతము, అఘటితము, సుస్థిరము. భగవంతుని కంఠమున వైజయంతీ మాలకలదు.

"వై నిశ్చయేన జయన్తీ జయశాలినీ"

కందర్పుడు (మన్మథుడు) ఏ ధనస్సుతో నిఖిల విశ్వమును జయించెనో, దానిని వదలిపెట్టెనా అన్నట్లు ఈ వైజయంతీమాల శోభిల్లుచుండును. శ్రీకృష్ణచంద్రపరమానందకందముయొక్క నఖమణిమయ చంద్రికాదర్శనము వలన, కందర్పుడు మూర్ఛితుడయ్యెను. అనంతకోటి బ్రహ్మాండనాయకుడు, కందర్పదర్పదళన నటువు నయినభగవంతుని కంఠమందలి పంచవర్ణాంచిత పుష్ప గ్రథితము, అమ్లానము (వాడిపోని) నయిన ఈ పుష్పమాల అద్భుత సౌగంధ్యయుక్తము. భగవంతుని దగ్గఱ మూడు శక్తులు కలవు. 1) ఉద్బోధకశక్తి, 2) ఆచ్ఛాదకశక్తి, 3) విక్షేపశక్తి, కర్ణములయందలి కర్ణికారము ఉద్బోధకము, పీతాంబరము ఆచ్ఛాదకము, బ్రహ్మస్వరూపోపలబ్ధియందు అది విఘ్న దాయకము. కాని, రసజ్ఞులకు రసము కూడా అంతకంటె అధిక మైనది. విక్షేపకమైన వైజయంతీమాల దానివలన వ్రజాంగనలు ఉద్వేగమును పొందుదురు. 'ఇవన్నియు మన శ్యామసుందరునికి ఆవరణములు' అని వ్రజాంగనలు తలంతురు. ఏలయన, రసాస్వాదనపరాయణులైన రసికులు నిర్విఘ్న, నిరుపద్రవ, నిరావరణ రసాస్వాదనమును అభిలషింతురు. వారికి పీతాంబరము యొక్క, వైజయంతీమాలయొక్క వ్యవధానము సహ్యమగునా?

అని భావింతురు. హారము, కంచుకముయొక్క వ్యవధానము కూడా సహ్యము కాని స్థితిలో పీతాంబర, వైజయంతీమాలా వ్యవధానము ఎట్లు సహ్యమగును. శ్రీకృష్ణచంద్రపరమానందకందము యొక్క దివ్యస్వరూపము ఇటువంటి అద్భుతమైనది. వీని అన్నిటితో దుర్లభత్వము సూచితము. దుర్లభత్వమందే రసము కలదు. 'చ' కారము వలన, వనమాల కూడా కంఠము మొదలుకొని, మధుర మనోహర పాదారవిందములు గూడా దుర్లభాతాసూచకములే, వీని అన్నింటిచేత భగవంతుని శరీరము ఆవృతమై ఉన్నది. జ్యోతిర్మయమైన జలదావృతమైన మేఘావృతమైన ఆకారము ఆచ్ఛాదితమైనట్లు, శ్యామల, మహోమయ (తేజోమయ), ఆనంద రసమయ శరీరము, అనేక ఆవరణములతో ఆవృతమై అస్పష్టమైన జ్యోతి అయ్యెను. ఆ పీతాంబరము మధ్యనుండి శ్రీకృష్ణశరీర మందలి దేదీప్యమాన శ్యామలత్వము ప్రకాశించును. స్వప్నము నందైనను, ఒక్క బిందుమాత్రము ఆస్వాదించుటకు లభించినవారే, దానిని తెలిసికొనజాలుదురు. ఆ భగవంతుని సర్వాలంకారముల దీప్తి ఎవరి మనస్సులో మెఱయునో, అతడు సర్వదా భగవంతునికి అమ్ముడుపోవును. ఆ శ్యామలత ఎట్టిది?

"కృష్ణవర్ణ త్విషాఽఽకృష్ణమ్।"

శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క శరీరము అతని పుష్ప సంకాశము, నీలాంబుజము, నీరధర సమానము. అపుడు గూడా అది 'త్విషాఽకృష్టమ్'-ఒక అద్భుత దీప్తియందు గుప్తమై ఉన్నది, కావుననే శ్యామల మహోమయమని చెప్పబడును. తేజస్సు రెండువిధములుగా ఉండును- ఒకటి, శ్యామతేజము, రెండు గౌరతేజము. గౌరతేజము వృషభానునందినికి సంబంధించినది, శ్యామ తేజము శ్రీకృష్ణసంబంధి. తేజస్సునందు శ్యామలత గుప్తమై ఉన్నది. కేవల ప్రకాశదీప్తి వ్యక్తము. అనంతకోటి

సూర్యులను లజ్జింపజేయు దీప్తియందు, శ్యామలత ఆవృతము. కావున, అది విచిత్రసంయోగము మహేంద్రనీలమణియొక్క తేజస్విత్వము, సుశోభితత్వము, అపూర్వత్వము, సుచిక్కణత్వము పంకజకోమలత్వము, తాపాపనోదకత్వము మనోహారిత్వమందు వీని సంమిశ్రణము భగవంతునియందు కలదు. భక్తుని మనస్సు మధుకరము (తేనెటీగ) వంటిది. మధుకరము అనేక పుష్పముల నుండి మధువును గ్రహించినట్లే, భక్తుడు, ఈ తత్త్వములను గ్రహించి భగవన్మూర్తిని రూపొందించుకొనును.

అద్భుత అలంకారసహితుడైన భగవంతుని, ఏమి వర్ణింపగలము! కోటి సూర్యసమాన రత్నజటితమైన, అద్భుతమైన మయూరపింఛముతో గూడిన ముకుటము, దేదీప్యమాన కుండలచ్ఛవి, సుగంధిత పుష్పమాల, శ్యామల కపోలములపైన సుందర కుండలములు, కపోలములపైన ప్రేలాడుచున్న శ్యామల. స్నిగ్ధ, సచిక్కణ (నునుపైన) అద్భుత అలకావళియొక్క శోభ వర్ణింపనలవికానిది. శ్యామలవర్ణము గల నాగశిశువు అమృతమయుడైన చంద్రుని రసమును (వెన్నెలను) గ్రహించుటకై వెళ్ళినదా అన్నట్లును, అథవా, నీలకమల కోశముపైన భ్రమరబృందము వచ్చి రసాస్వాదనమునకై నిశ్చలము నిస్తబ్ధమై విరాజిల్లు చున్నట్లును, లేక అందమైన వంకరటింకరఅయిన ఉంగరములు తిరిగిన ముంగురులయొక్క అలకావళి స్నిగ్ధ, సచిక్కణ శ్యామల, అమృతమయ నీలాంబుజముపైన పరాగలోభముచేత కూర్చున్న భ్రమరముల సమూహమా అన్నట్లు ఉన్నవి. ఇక ఝుంకారమునకు కొదవ ఏమి? కారణమేమనిన, ఆ భ్రమరబృందము అద్భుతము, మాదకము నయిన మకరందమును పానము చేసి మత్తిలి చాంచల్యరహితములై నిశ్చేష్టములయ్యెను, ఇటువంటి ముఖచంద్రుని ఎదుట ఏనుగు గున్నల తొండముల వలె గోళాకారముగా ఉన్న చక్కగా

బలిసిఉన్న నునుపైన దీప్తిమయమైన యోగ్యమైన ఎత్తుపల్లములు గల భుజములు దివ్య కుంకుమ మిశ్రితమైన హరిచందన విలేపిత మైనవి. భగవంతుని శరీరమునందు కుంకుమ మిశ్రితమైన హరి చందనము చంద్రునియొక్క చంద్రికచేత వ్యాప్తమైన ఇంద్రనీల మణి రచితములైన అంగదములు, కంకణాదులు, హస్తాంగుళు లందు అంగుళీయకము. నఖములందు అరుణిమతో శోభించుచున్న హస్తములతో వేణువును పైకి ఎత్తి అధరముపై ఉంచుకొని అధర సుధతో పూరించుచున్నవి.

"రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్ ।"

వేణురంధ్రములను అధరసుధతో పూరించుచున్న భగవంతుడు బృందారణ్యధామమునకు చేరెను. అది ఎట్లు ఉన్నదనిన శ్రీకృష్ణ చంద్రపరమానందకందమునకు వేణుచ్ఛిద్రములను అధరసుధతో పూరించునట్టి అభిరుచి కలదా అన్నట్లు ఉన్నది. నటనాగరుడు, నటవపువు నయిన శ్రీకృష్ణుని అభిరుచి గూడా చిలిపితనముగా ఉన్నది. ఏలయన వేణువునందు జనులు దోషారోపణము చేయు చున్నారుకదా అని భగవానుడు ఆ వేణువునందు చిలిపితనమును నింపుచుండెను. ఛిద్రములను దోషములనియే చెప్పుదురు.

"ఛిద్రేషు అనర్థాబహులీ భవన్తి"

ఒక ఛిద్రము (రంధ్రము) ఉన్నచో, అనర్థము వాటిల్లును. ఈ వేణువునందు ఏడు రంధ్రములు కలవు. ఏడు రంధ్రములు గల ఈ వేణువును ప్రజలు నిందితమని, కళంకితమని భావింతురు. కావున, నేను దానిని నా సుమధుర అధరసుధతో పూరింతునని భగవంతుడు తలంచెను. అనగా, పరమానందకందమైన శ్రీకృష్ణ చంద్రుని, హస్తారవిందమందు ఉండునట్టి, ఆయన అధరముపైన

విరాజమానమగు వేణువు, ఛిద్రసహితమై ఉండుట, మంచిది కాదు అని భగవంతుని అభిలాష. కావుననే –

"రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్।"

అధరసుధ ఇట్లు ఆలోచించెను– జడమైన ఓవేణువా ! నేను అద్భుతమైన నా ప్రభావము చేత నిన్ను ప్రాణము కలదానినిగా చేసెదను. అంతియే. ఈ అభిప్రాయముతో సుమధురమైన అధర సుధ వేణువును ప్రాణవంతముగా చేయదలచెను, ఆ వేణువు అధరసుధాసంస్పర్శచేత ప్రాణవంతమైన గీతమును వ్యాపింప జేయసాగెను. ఇపుడు, అధరసుధ ఇట్లు ఆలోచించెను – వేణువు, కేవల జడవస్తువే అధరసుధయందలి పరమప్రవీణ సంబంధము చేత వృక్షములనుండి మధుధార స్రవింపసాగెను. సరోవరములు, సరస్సులు, కమలకమలినులు, కుముదకుముదినులు రోమాంచితము లయ్యెను. యమునానది ఆగిపోయెను. పాషాణములు ద్రవించెను. కాని, వేణువు మాత్రము శుష్కముగానే (రసహీనముగానే) ఉండెను. వేణువు ఛిద్రసహితము. బోలుగా ఉండును. రస శూన్యమై ఉండును. హృదయరహితమై ఉండును. కావుననే దాని పైన అధరసుధారసప్రభావము పడలేదు. దీని ప్రభావము సహృదయునియందే కలుగును, హృదయము లేనివానియందు కలుగదు. మలయాచలముపైన చందనవృక్ష సంబంధముచేత, వృక్షములన్నియు చందన వృక్షములగును. కాని, వంశవృక్షము (వెదురుచెట్టు) వంశీవృక్షముగానే ఉండును. ఇతర వృక్షములలో హృదయమున్నది. ఆ వృక్షములన్నియు బోలైనవి కావు, హృదయశూన్యములు కావు, ఛిద్రసహితములును, గావు. వెదురు చెట్టు హృదయశూన్యము, నిస్సారము అని చెప్పుదురు. గ్రంథి (ముడి, కణుపు) ఉండుట మంచిది కాదని చెప్పుదురు. చిజ్జడ

(చిత్+జడ) గ్రంథి ఏ కాలమునాటిదో, తెలియదు. ఈ చిజ్జడ గ్రంథి నశించుట కష్టము. లోకమందు ఈ వెదురుచెట్టు కర్కశమైన ఛిద్రములు కలదని చెప్పుదురు. వెదురు వాసమునందు గ్రంథులే గ్రంథులు. ఒక ఛిద్రముండిన వేలకొలది అనర్థములు కలుగును. ఈ వేణువునందు ఏడు రంధ్రములు కలవు. కావున, దానిపై ఏ ప్రభావము కలుగదు. కావున, అధరసుధ ఇట్లు ఆలోచించి, వేణురంధ్రములందు రసమును నింపి, దానిని సప్రాణము చేసెను, సచేతనమొనర్చెను. ఆ వేణువును వదలి, ఆ రసము వ్రజాంగనల నిరావరణ కర్ణకుహరముల ద్వారా వేణుగీతరూపములో వారి హృదయమున జేరెను. ఆ వ్రజాంగనల హృదయమందే ఆ వేణుగీతము తన సమస్త పరాక్రమమును సమస్త మాధుర్యమును వ్యక్తము చేసెను. ఇచట, చక్రవర్తి పైన పేర్కొనిన కొన్ని భావములు చెప్పెను.

"అథవా నీచీనా (తుచ్ఛా, అపకృష్టా) సుధా అపి యస్యాః సకాశాత్ సా అధరసుధా"

శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క అధరసుధయందలి మధురిమచేత సుధ గూడా అతి తుచ్ఛ మనిపించును అని భావము. అనగా, దేవతలయొక్క, చంద్రునియొక్క, ధన్వంతరియొక్క అమృతమును అపకృష్టము చేయునట్టిది ఈ అధరసుధ. ఆ అధర సుధతో శ్రీకృష్ణభగవానుడు వేణువును పూరించసాగెను.

వేణువునందు సుమధురమైన అధరసుధ ప్రవేశించును. అదియు, స్వయముగా అమూర్తము. ఛిద్రమునందు (రంధ్రము నందు) ఆకాశము నిండియుండును. అమూర్త పదార్థముచేత ఆకాశము నిశ్ఛిద్రము కాదు. అనగా అవకాశరహితము కాదు. కావున, అమూర్తరసమువలన, వేణువు నిశ్ఛిద్రము కాలేదు.

వాస్తవమునకు, భగవంతుడు వేణువునకు అధరసుధ ఒసంగనేలేదు. కేవల సంసర్గమువలన జరుగునదేమి ? ప్రభుకృపవలన, ఆ అధర సుధ ఎవరికి లభించునో, అతడే ప్రభావితుడగును. ఒకే జలము నందు జలగలు ఉండును, కమలములును ఉండును. అధికారియైన వాడే యోగ్యత గలవాడే (యోగ్యమైనపాత్రయే) వస్తువును గ్రహించును. అనగా, వాస్తవమున, వేణువునకు అధరసుధ నొసగనేలేదు. వేణుపాత్ర ద్వారా అధరసుధ వ్రజాంగనలకు పంప బడినది. దర్వితో (గరిటె) రసము వేయవచ్చు, కాని, దర్వికి రసాస్వాదము కలుగదు. ఆ దర్వి, రసోపభోగసామగ్రి. వేణు పాత్రద్వారా అధరరసము గోపాంగనల కొసంగబడినది. బృందారణ్యమందున్న శ్రీకృష్ణపరమానందకందముయొక్క అధర సుధాభోగము వ్రజస్థితలైన వ్రజాంగనలకు కలుగుట ఎట్లు ? కావున, అధరసుధను, సాధనభూతమైన వేణుచ్ఛిద్రములందు నింపి, వ్రజాంగనాహృదయములకు చేర్చెను. వేణువుదర్వివంటిది. అందువలన, వేణువు శుష్కముగానే, సచ్ఛిద్రముగానే ఉండెను. ఇచట, ప్రభుసంకల్పమే కారణము. వేణువు అందఱికి సమానమే. స్వాతిచినుకు, వంశవృక్షమునందు వంశలోచనము, గోవునందు గోరోచనము, శుక్తికయందు ముత్యము, గజకర్ణికయందు గజ ముక్తాఫలము అయినట్లే అధరసుధ భిన్నభిన్న పాత్రలయందు పడును, వేణువు, కేవలము భిన్నభిన్న పాత్రలందు చేర్చునది మాత్రమే.

ఇచట, అనేక పక్షములు (అభిప్రాయములు) కలవు. సాధారణముగా, వ్రజాంగనలు వేణువునందు ప్రసన్నలైనపుడు,

"యాచేఽహం వంశదేహమ్"

అని ప్రశంసనే చేయుదురు. హే సఖి! మనము వంశదేహమును యాచన చేయుదము. విధాత మనమీద ప్రసన్నుడైనచో మనకు

వంశదేహమును అనుగ్రహించుగాక. గోపాంగనాశరీరమందు మనకు కృతార్థత లేదు. వంశదేహము ఉండియున్నచో, ఎప్పుడైనను భగవంతుని అధరముపైన నిద్రించియుండెడివారము, అధరసుధను ఆస్వాదించియుండెడివారము. కాని, మనము కులాంగనలమైతిమి. మనకు ఈ అవకాశము లభింపజాలదు' అని చెప్పుకొనుచుండెడివారు. గోపాంగన వేణువుపైన ఈర్ష్యపడి నపుడు, వేణువునందలి దోషములనే ఏకరువు పెట్టును. అస్తు. తేలిన సారాంశమేమనిన, ధర్మషట్కసహితమైన రసరూపధర్మిని వేణు రంధ్రముల ద్వారా వ్రజాంగనల హృదయమందు చేర్చుట వేణువుయొక్క పని.

"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్యయశసః శ్రియః ।"

ఇవి భగవంతునికి గల ఆఱు ధర్మములు. అనగా, సంపూర్ణషట్భగ (ఐశ్వర్య) సంపన్న, అచింత్య, అఖండ, అనన్త, రసధర్మీ పూర్ణకామ పురుషోత్తముడు భగవంతుడు. వేణువునందు సప్త చ్ఛిద్రములు కలవు. కావున, షట్ ఛిద్రములద్వారా ఒక్కొక్క భగధర్మము (ఐశ్వర్య ధర్మము), సప్తమ ఛిద్రముద్వారా షట్ ధర్మసహితుడైన భగవంతుడు అధరసుధద్వారా, వంశియందు (వేణువునందు) ప్రవేశించి, తద్ద్వారా వ్రజాంగనల హృదయ మందు ప్రవేశించునని భావుకులైన భక్తులు వచింతురు. అధర సుధలు మూడు విధములు. దానిని అనుభవించునట్టి అధికారము కలవారు గూడా మూడు విధములుగా ఉందురు. నిరోధము కలవారే సుధాస్వాదనమునకు అధికారులు. నిరోధమనగా సమస్త ప్రపంచ విస్మరణపూర్వకముగా శ్రీకృష్ణపరమానందకందమునందు మనస్సు లయమగుట. అదియు, మూడు విధములుగా ఉండును. 1) ప్రేమ నిరోధము, 2) ఆసక్తినిరోధము, 3) వ్యసననిరోధము. ప్రేమ

నిరోధము గల వ్యక్తికి దేవభోగ్యసుధ, ఆసక్తినిరోధముగల వ్యక్తికి భగవద్భోగ్యసుధ, వ్యసననిరోధము గల వ్యక్తికి, సర్వభోగ్యసుధ అని చెప్పబడెను. ఈ సిద్ధాంతము శ్రీవల్లభాచార్యుడు వచించెను. ఈ దేవుడు ఎవరు? శ్రీమద్భాగవతమందలి దశమ స్కంధమందు నిరోధము, ఏకాదశస్కంధమందు ముక్తి, ద్వాదశ స్కంధమందు ముక్తికి ఆశ్రయుడైన బ్రహ్మ వివరింపబడిరి. నిరోధవర్ణనము ఉండుటచేత దశమస్కంధమే ముఖ్యము. ఏలయనగా, శ్రీకృష్ణచంద్రునియందు మనోలయమగుటయే ప్రధానము. శ్రీవల్లభాచార్యుని అభిప్రాయములో ముక్తి, అత్యంత విలక్షణమైనది. ముక్తులైన పురుషులు పూర్ణతమ పురుషోత్తముడైన పరమానందమును చేరి, సాయుజ్యము నొందుదురు. ఇటువంటి ముక్తత్వము గల వ్యక్తియొక్క ముక్తియే ముక్తి. పరమ పురుషార్థము శ్రీకృష్ణచంద్రుని లీలారసాస్వాదనము. ముక్తులైన వారు లీలారసాస్వాదనము చేయగలుగుదురా? స్వరూపమునుండి ముక్తుల నిష్కాసనమే, పుష్టిమార్గీయమైన ముక్తి.

"ముక్తిర్హిత్వాఽన్యథారూపం స్వరూపేణ వ్యవస్థితిః।"

అని భాగవతవచనము. కాల్పనికమైన, ఔపాధికమైన రూపమును వదలి పారమార్థికమైన భగవద్రూపమందు లీనమగుటయే, ముక్తి యలి భావము. పారమార్థిక రూపము అఖండము, అనంతము, నిత్యము శుద్ధము, బుద్ధము, ముక్తస్వభావము, స్వప్రకాశాత్మకము. ఇది, అద్వైతుల ముక్తి. జీవుల స్వీయరూపము గోపాంగనాభావమని అందఱు చెప్పుదురు. దానిని వదలి ఎవరు సాంసారికమైన స్త్రీత్వ, పుంస్త్వములలోనికి వచ్చియున్నారో, దానిని త్యజించి, పూర్వ భావమును చేరుటయే ముక్తి. మరికొందఱు జీవుడు స్వభావముచేతనే భగవంతునికి నిత్యదాసుడని చెప్పుదురు. ఇతర భావములు కలిగినచోట, ఆ భావము భ్రష్టమైనది. ఆ ఇతర

భావములను పరిత్యజించి, భగవంతుడు మన ప్రభువు, మనము ఆ భగవంతునికి దాసులము అనెడి రూపమును పొందుట ముక్తి అందురు. కాని, ఇచట గల ముక్తి, జీవుని ముక్తిత్వమునుండి విముక్తియై ఉన్నది. అనగా, జీవునికి ముక్తత్వమునుండి విశ్రాంతి లభించవలయును.

ఒక కథ కలదు. ఒకమారు దేవర్షియైన నారదమునీంద్రుడు ప్రఫుల్లితము, అద్భుతము, ఆమోదమయము నయిన బృందారణ్యమునకు వచ్చెను. అచట, వృషభానునందినియొక్క, వ్రజాంగనలయొక్క దివ్య, ప్రేమమయ, హాసరాసవిలాసవిలాసితమైన భావముల అనుభూతినొంది రోదింపసాగెను. రోదించుచున్న నారదమునీంద్రుని చూచి, ఇటువంటి ఆనందసముద్రములో మునకలు వేయుచున్న సమయమున ఏల ఏడ్చుచుంటిరి? అని ప్రశ్నించిరి. అంత, నారదమునీంద్రుడు ఇట్లు సమాధానము చెప్పెను-'మేము దుఃఖించుచున్నది ముక్తులైనవారికొఱకు, బద్ధులైనవారికైనచో ఈ రసానందము కలుగుట సంభవము. వారికి వృషభానునందిని శ్రీకృష్ణపరమానందకందముల ఏతాదృశ అద్భుతమైన ప్రేమరసపూర్ణ శృంగార దర్శనము లభింపనగును. కాని, ముక్తులైనవారికైనచో, ఇది, లభించుట పూర్తిగా అసంభవము. ఈ భావముతోనే వేదాంతుల ముక్తి, పాషాణకల్పమని చెప్పుదురు. కాని, దానిని నిరూపించుటకు, ఇచట అవకాశము లేదు.

ఆశ్రయము - పైన పేర్కొనిన ముక్తులకు భగవల్లీలోపయోగములైన దివ్య దేహాదుల నొసగుట, పూర్ణతమ పురుషోత్తములయందు లీనులైన జీవులను నిష్కాసనము చేసినపుడు ముక్తినుండి ముక్తులైనవారిని లీలాపరికరములకు ఉపయుక్తులనుగా చేయుట ఆశ్రయము. దీనినే 'ప్రత్యాపత్తి' అందురు. దీనిని అనుసరించి ఆ జీవులు బృందావనమందు గుల్మలతా, పాషాణ వృక్షము

లయిరి. ముక్తులు మునీంద్రులు, అమలాత్ములు, మహాత్ములు నయిన పరమహంసలే వచ్చి సర్వరూపములలో ప్రకటమైరి. ఇటువంటి పరమహంసలకు భోగ్యమైన సుధయే దేవభోగ్యసుధ.

"ద్యోతనాత్మకత్వాత్, ప్రకాశాత్మకత్వాత్ శ్రీకృష్ణ
స్వరూపత్వాత్ దేవాః, కిం వా దీవ్యన్తీతి దేవాః।"

శ్రీకృష్ణచంద్రునితో క్రీడించుటకై వచ్చినవారే దేవతలు. 'దివ్' ధాతువు అత్యంత వ్యాపకమైన అర్థము కలది.

"దివ్ క్రీడా విజిగీషా వ్యవహార ద్యుతి స్తుతి మోద
మద స్వప్న కాంతి గతిషు।"

ఈ దేవతలు పురుషోత్తముడైన శ్రీకృష్ణచంద్రుని లీలాపరికరములగుటకై ఆవిర్భవించిరి. వీరికి గూడా ప్రేమనిరోధము కలిగెను. ఈ దేవతలు శ్రీకృష్ణప్రభువుయొక్క ప్రేమయందు సంసార విస్మరణ పూర్వకమైన మనస్సుతో ఆయనలో లీనమయిరి.

"బృందావనం పరిత్యజ్య పదమేకం న గచ్ఛతి।"

అను రీతిగా వారిస్థితి కలదు. అది యుక్తమే. కాని, భగవంతుడు బృందావనమునుండి వెడలిపోయినపుడు, తరు గుల్మాదులు ఏల శుష్కములు కాలేదు? కారణమేమనిన అవిబహిర్ముఖములు కావు. శ్రీకృష్ణచంద్రుడు ఎచటకును పోలేదనియే వానిభావము. ప్రభువు అచట లేడనివారికి తెలిసియుండిన అవి వాడిపోయి ఉండెడివి, రోదించి ఉండెడివి, దగ్ధమయిపోయి ఉండెడివి. కాని ప్రేమ నిరోధసంపన్నములైన లతలయందు, తరు గుల్మాదులయందు ఖగ, మృగములయందు దేవభోగ్యమైన అధరసుధాసంచారము కలిగెను. భగవానుని ముఖచంద్ర వినిఃస్సృతమయిన ఏ వేణునాదామృతమును వృక్షలతాదులు ఖగ, మృగాదులు ఆస్వాదించునో, ఆ వేణునాదామృతము దేవభోగ్యమైన అధరసుధ. ఈ అధరసుధ

శ్రోత్రపేయముగాని, ముఖపేయము కాదు. (చెవులచే వినదగినది గాని నోటితో త్రాగదగినది కాదు) సుమధురమైన ఈ అధరసుధా నుభవము శ్రోత్రముల ద్వారానే కలుగును.

ఇచట వాసవమునకు రసస్వరూపమైన శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క మంగళమయమైన లీల గూడా రస స్వరూపమే అను విషయము తెలిసికొననగును. ఆ భగవంతుని లీలాపరికములు గూడా రసస్వరూపమే, భగవంతుడు వాస్తవము నకు ఆత్మరతుడు, శ్రీకృష్ణచంద్రపరమానందకందముయొక్క భక్తులు గూడా ఆత్మరతులే. రమణము చేయుటకై వారికి స్త్రీ, పుత్ర, ధనాదులైన అనాత్మసామగ్రులు అపేక్షితములు కావు. అట్టి స్థితిలో వారి ధ్యేయవస్తువు పూర్ణతముడు, పురుషోత్తముడు, భగవంతుడు, ఆత్మారాముడు, ఆప్తకాముడునయిన ఆత్మయందు రమింతురు, అనుటలో సంశయము ఏల? వారు తమలో తాము రమింతురు.

"న హి స్వాత్మారామం విషయ మృగతృష్ణా భ్రమయతి"

స్వాత్మారాముడైనవానిని విషయమృగతృష్ణ భ్రమింపజేయు లేదని భావము. భగవంతుని రమణము ఆత్మయందు, వృషభాను నందినియందు, వ్రజాంగనలయందు ఉండును. అందఱును భగవత్స్వరూపులే.

"స భగవాన్ కస్మిన్ ప్రతిష్ఠితః, స్వే మహిమ్నితి హోవాచ ।"

అంతిమము సర్వాధారము నయిన తత్త్వము తనయందే స్థితమై ఉండును. భూమికి జలము ఆధారము, జలమునకు, తేజస్సు ఆధారము, తేజస్సునకు వాయువు, వాయునకు ఆకాశము ఆధారము. ఆకాశమునకు తన్మాత్రలు ఆధారము. తన్మాత్రలకు

అహంకారము ఆధారము, అహంకారమునకు మహత్తత్వము ఆధారము, మహత్తత్వమునకు – ప్రకృతికి సత్త్వము ఆధారము. ఇపుడు ఆ సత్వమునకు ఆధారము ఏది? అది స్వయముగా నిరాధారమై తనయందే తానుస్థితమై ఉండును. కావున శ్రీకృష్ణపరమానందకందము సర్వత్ర తనయందే వ్యక్తమయ్యెను. ఈదృష్టికల వారు ఆత్మరతి కలవారై ఉండవలయును. కాని, అందఱును రసస్వరూపులు, ఆత్మరతులే అయినపుడు ఒకరికి మఱొకరికియందు ఆకర్షణము, ప్రేమ, ఆసక్తి, వ్యసనము ఎట్లు సంభవించును? ఏలన శ్రీకృష్ణపరమానందకందము, స్వరూపమందే రమణము నొందుచున్నట్లే వృషభానునందిని, వ్రజాంగనాదులు గూడా స్వస్వరూపమందే రమించుచున్నారుగదా! అనగా, పరస్పరాకర్షణము కలుగదు. ఆకర్షణము లేనిచో నానావిధములైన విలాసము లేల? ఏకము,అద్వితీయము నయిన భగవత్తత్వమందు అనేకత్వము ఏల సంభవించెను?

"ఏకోఽహం బహుస్యామ్!"

అను శ్రుతి ఏల? కేవలము లీలారసాస్వాదనము కొఱకు మాత్రమే అని దీనికి సమాధానము.

ఆత్మారాముడు, ఆప్తకాముడు, పూర్ణతముడు నయిన పురుషోత్తమునికి లీలారసాస్వాదనము ఎట్లు సంగతము? అను ప్రశ్న ఉదయించును. యుక్తమే. ఈ ఆపత్తి (ప్రశ్న) సర్వసిద్ధాంతములయందును గలదు. అయిన,

"ఆప్తకామస్య కా స్పృహా?"

అని ఏల చెప్పుదురు? మఱి, సమస్త ప్రపంచము ఎట్లు సంభవము? దీనికి మొదటి సమాధాన మేమనిన, ఆప్తకాముడైన భగవంతునికి

స్వప్రయోజన మేదియును లేదు. కాని, అనాదిసిద్ధులైన జీవుల కొఱకు భగవంతుడు జగన్నిర్మాణము చేయుచున్నాడు, ఏకము నందు అనేకత్వమును రచించుచున్నాడన్న విషయము సర్వమత సిద్ధము. 'కఱ్ఱ విరగరాదు, పాము చావనురాదు' అని అనినచో, ఆ మాట నిరర్థకము. అనాదికాలమునుండి ఏకమునందు అనేకత్వము, వ్యక్తమై ఉన్నది. జీవభావము, నవీనమైనది కాదు. ఆకాశము ఉన్నప్పటినుండియు, దానియందు శ్యామలత్వ భ్రాంతి కలదు. ఆరీతిగానే, అనాదిజీవులు ఉన్నారు, అనాది ప్రకృతి కలదు. కాని, అనాదులయినను, సాంతములు. (ప్రాగభావము వలె), ఒక్క సచ్చిదానందపరమాత్మను వీడి, అనియు, సాంతములు.

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।"

లీలారసవిశేషమునకై నిఖిల రసామృతసింధువు, పూర్ణతముడు, పురుషోత్తముడు నయిన శ్రీకృష్ణచంద్రపరమానందకందము తనను తానే, సర్వ స్వరూపములలో వికసింపజేసికొనెను. కావుననే శుద్ధ రసమయ లీలయందు ప్రాకృతత్వము లేదని తెలియనగును. ఆకర్షణము లేదనినచో, లీల ఎట్లు సంభవము? అనిన, ప్రభువు ఒక వైష్ణవీమోహినీ మాయాశక్తిచేత సర్వప్రాణుల స్వరూపము లను ఆవృత మొనర్చును, మోహితము చేయును. కావున, నిఖిల రసామృతమూర్తియై కూడా, ఆ భగవంతుడు తనను తాను విస్మ రించును. ఈ విధముగానే వృషభానునందిని, వ్రజాంగనలు మున్నగువారు గూడా తమను తాము మఱచిపోవుదురు. స్వయం తృప్తులైనచో, అన్యస్పృహ ఎట్లు కలుగును? కాని, ఈ వైష్ణవీ మోహినీమాయవలన యశోదామాత ప్రభుముఖారవిందమునందు చరాచర విశ్వమును చూచుచు గూడా తనను మఱచిపోయినది. అట్లే ఇచట గూడా, అందఱు స్వ స్వరూపమును మఱచిపోయిరి.

ఆసక్తివలన తనను మఱచుట ఎట్లు? అనిన, జనులు భంగు త్రాగి తమను తమ రుచితో (ఆసక్తితో) మోహితము చేయుచునట్లే, తమను విస్మరింతురు. ఇది ఏల? విస్మృతి కొఱకు. విస్మృతి యందు గూడా, అది స్వేచ్ఛామూలకమైనచో, స్వాదము ఉన్నది. అనగా, ప్రాకృత మానవుడు, భంగు మున్నగు మాదక ఆసవముల చేత స్వరూప విస్మృతిపూర్వకముగా క్రీడయందు ప్రవృత్తు డగును. అట్లే వైష్ణవీమాయచేత భగవంతుడు గూడా లీలయందు ప్రవృత్తుడగును. మంగళమయమైన ఈ రసలీలవలన, తన్మనన నిదిధ్యాసనముల వలన ప్రాణులకు పరమ కళ్యాణము కలుగునను విషయము స్పష్టము, జన్మ, కర్మలు సర్వప్రాణులకు గలవు, ప్రాణుల జన్మకర్మలు బంధహేతువులగును. కాని, భగవంతునికి జన్మకర్మబంధములు లేవు.

"జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥"

జీవేశ్వరులకు జన్మ, కర్మలు సమానమైనవా? జీవుని జన్మ కర్మలను గుఱించి వినుచు, చూచుచు, కల్ప, కల్పాంతరములు గడచిపోయినవి. ఇపుడు, భగవంతుని జన్మ, కర్మల శ్రవణము చేయవలయును. తద్ద్వారా శ్రీకృష్ణచంద్రపరమానందప్రాప్తి కలుగును. భగవంతుని జన్మ కర్మల శ్రవణము వలన ప్రాణుల జన్మ, కర్మబంధము వీడిపోవును. ప్రాణుల జన్మ, కర్మల శ్రవణము వలన, జన్మ కర్మపరంపర అభివృద్ధి చెందును. కావున, అది భగవంతుని లీలయే. కాని, అది, అప్రాకృత లీల. స్వాభావికమైన ఆసక్తి కొఱకై లౌకిక రూపములో చెప్పబడినది. ప్రపంచమందలి ఆకాంక్ష, వాంఛ, ఆశ, తృష్ణ, మఱియు, శ్రీకృష్ణ చంద్రపరమానందకందసంమిలనాకాంక్ష, వాంఛ, ఆశ, తృష్ణ

సమానములగునా? కాదు. రెంటియందు ఆకాశ, పాతాళములకు గల అంతర మున్నది. ఆ ఆశ, పిశాచిని, ఈ ఆశ, కల్పలత. కావున, పూర్ణతముడు, పురుషోత్తముడు, నిఖిల రసామృతమూర్తి అయిన శ్రీకృష్ణచంద్ర పరమానందకందము తనను తాను సర్వ రూపములలో అభివ్యక్తము చేసికొనె ననుట పూర్తిగా నిర్వివాదము. అయినను, లీలారసమునకై, ఆసక్తికై ఇచట స్వరూపానందవిస్మరణము అపేక్షితము. ఈవిధముగా భగవత్స్వరూపుడయ్యు, ఈ దేవుల విస్మృతికారణమువలన సుధవైపు ఆకర్షణము జనించెను. వారి ప్రేమనిరోధమున కనుకూలమైన ఆ సుధ దేవ భోగ్యమైన సుధ. వ్రజాంగనలు, శ్రీకృష్ణుని అమృతమయముఖ చంద్రుని అధరసుధ అనుభవించుటకు యోగ్యత కలవారు. కాని, వారు వ్రజమునందు ఉన్నారు, వారు ఎట్లు అనుభవించెదరు? కావున, వేణుచ్ఛిద్రములందు ప్రవేశింపజేసి, గీతరూపముతో నిరావృతములైన కర్ణకుహరములద్వారా వారి హృదయములకు చేర్చవలయును. ఆ సుధను వారు అంతఃకరణమందు, అంతరాత్మ యందు, ప్రాణమునందు, రోమరోమమునందు అనుభవించి, ఆంతరమైన రమణము నొందెదరు. సర్వభోగ్యమైన అధర సుధానుభవమును పొందునట్టి యోగ్యత లభించుటకై భగవద్భోగ్యమైన అధరసుధ, ప్రయుక్తమైనది. శ్రీకృష్ణచంద్రభగవానుని ముఖమునుండి వినిర్గతమైన వేణుగీతపీయూషమును నిరావరణములైన కర్ణకుహరముల ద్వారా పానమొనర్చి, అంతఃకరణమునందు దానిని భావనాభావితము చేయుచున్న వ్రజాంగన, మరల దానినే ఉద్గారరూపములో వర్ణించును. ఆ అధరసుధయే, వ్రజాంగనల అధరపల్లవముపైకి వచ్చును, దానివలననే అధరపల్లవము పవిత్రమగును. అపవిత్రమైన ముఖమునుండి శ్రీకృష్ణచంద్రపరమానంద కందముయొక్క అధరపల్లవమందు గల సర్వభోగ్యమైన అధర

సుధానుభవము కలుగజాలదు. కావున, ఆ వ్రజాంగనల వేణుగీత పీయూషమును శ్రోత్రములతో ఆస్వాదించినపుడే, భావనాపరివర్ధనోద్గారవర్ణనము చేత ముఖము పవిత్రమైనపుడే వారు సర్వభోగ్యమైన అధరసుధానుభవమునకు అధికారము కలవారగుదురు.

మొదట, భగవంతుడు భక్తులయందు రమణము నొందును. ఉపుడు, భక్తులు భగవంతునియందు రమణము నొందుటకు అధికారులగుదురు. శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క ముఖపంకజమునుండి వెలువడిన వేణుగీతపీయూషముద్వారా వ్రజాంగనల ముఖపంకజమందలి అధరపల్లవము పరిశుద్ధమైనపుడు, వ్రజాంగనలు భగవద్రమణమునకు యోగ్యత కలవారగుదురు. సంప్రయోగాత్మక శృంగారమునందు శ్రీకృష్ణుడు గూడా వ్రజాంగనల పవిత్రమైన అధరపల్లవమునందు అధరసుధను అనుభవించును. ఈవిధముగా వ్రజాంగనల అధరపల్లవమందు గల సుధ భగవద్భోగ్యమైన సుధ అగును. వ్రజాంగనల అధరపల్లవమందు గల సుధ గూడా, శ్రీకృష్ణుని అధరసుధయే. ఏలయనగా, భగవంతుని అధరమునందు గల భగవద్భోగ్యమైన అధరసుధయే వేణురంధ్రములందు ప్రవేశించి, గీతపీయూషరూపములో వ్యక్తమై వ్రజాంగనల శ్రోత్రములయందు, అంతఃకరణమునందు, అంతరాత్మయందు నిండి, వర్ణనవ్యాజముతో అధరపల్లవమును పొంది సంప్రయోగకాలమున భగవద్భోగ్యమైన అధరసుధ అయ్యెను. భగవంతుని అధరమందు ఉండి అది భగవద్భోగ్యమైన సుధ కాజాలనట్లు అయ్యెను.

"శ్రీశ్చ తే లక్ష్మీశ్చ"

అను స్థలమందు గూడా 'శ్రీ' శబ్దమునకు అర్థము వృషభానునందిని. సామాన్యముగా 'శ్రీ' శబ్దప్రయోగము 'లక్ష్మి' అను అర్థములో

గూడా ప్రయుక్తమగును. కాని, 'శ్రీ', 'లక్ష్మి' శబ్దములు వేఱు వేఱుగా ఉన్న స్థలమున 'శ్రీ' శబ్దమునకు 'లక్ష్మి' అని అర్థము ఏల చెప్పవలయును ?

"శ్రయతే హరిః యా సా శ్రీః, శ్రయుతే సేవతే (శ్రిఞ్ సేవాయామ్)"

అను విగ్రహవాక్యములను అనుసరించి 'శ్రీ' అనగా, 'లక్ష్మి' అని అర్థము. కాని, ఇచట,

"శ్రీయతే సర్వైః గుణైః యా సా"

అను విగ్రహవాక్యమును అనుసరించి కర్మార్థమందు ప్రత్యయము వచ్చెను. సమస్త గుణగణములచేతను, అద్భుత సౌందర్య, సౌరస్య, సౌగంధ్యాదులచేతను సేవింపబడునది 'శ్రీ'శబ్దవాచ్య అగును. సేవకురాలు 'శ్రీ'కాదు, సేవ్యయే. 'శ్రీ' అగును. అనగా సకల గుణగణములు రూపుదాల్చి, ఎవరిని సేవించునోఆమె, వృషభానునందినీ 'శ్రీ'అయిఉన్నది. అనంతకోటి బ్రహ్మాండాంతర్గతములైన సౌరస్య, సౌగంధ్య, సౌందర్య, మార్దవ, మాధుర్యాది గుణములకు అధిష్ఠాతృలైన మహాలక్ష్మి, మహాశక్తులు మూర్తిమంతములై రాధాసేవయందు ఉపస్థితలై ఉందురు. కావుననే భూలోకధామమందు రూపుదాల్చిన శోభాది గోపాంగనలు రాధాసేవయందు ఉపస్థితలై ఉందురు. ఇపుడు, వృషభానునందినీ సౌందర్యమును ఎవరు ఊహింపగలరు ? అనంతకోటి బ్రహ్మాండాంతర్గతమైన సౌందర్య బిందువునకు ఉద్గమస్థానమైన ఏ సౌందర్యసింధువు కలదో, తదధిష్ఠాత్రియైన మహాలక్ష్మి, వృషభానునందిని సేవలో నిమగ్నయై ఉండును. భగవంతుడు, శ్యామసుందరుడు, వ్రజేంద్ర నందనుడు నయిన శ్రీకృష్ణచంద్రపరమానందము యొక్క మాధుర్యాధిష్ఠాత్రి స్వయముగా వృషభానునందినియే. అనంతకోటి

బ్రహ్మాండాంతర్గతమైన ఏ మార్దవము కలదో, తదధిష్ఠాత్రీదేవియైన మహాలక్ష్మియొక్క చరణములు ఎంత కోమలము అనిన, అతి కోమలములైన కమలదళములు గ్రుచుకొనునేమో అన్నంతభయము కలుగును. ఎవరి చరణములయందు ఇంత మృదులత్వము కలదో, ఆ మహాలక్ష్మియొక్క హస్తారవిందముల కోమలత్వమునకు మేరయే లేదు. ఏతాదృశమైన మార్దవ, కోమలత్వాది గుణసంపన్న యైన మహాలక్ష్మి సుకోమలములైన తన హస్తములతో వృషభాను నందిని చరణములను స్పృశించుటకు ఆమె కోమల చరణములకు బాధ కలుగునేమో అని సంకోచించును. ఈవిధముగానే క్షమాధిష్ఠాత్రి దయాధిష్ఠాత్రి, శోభాధిష్ఠాత్రి, కరుణాధిష్ఠాత్రి శక్తులు సకల గుణ గణములతో నిరంతరము వృషభానునందినీసేవ చేయుచుందురు.

"శ్రీయతే హరిణాఽపి యా సా శ్రీః"

అని భావుకులైన భక్తులు కొందఱు 'శ్రీ'శబ్దమునకు విగ్రహవాక్య మును చెప్పుదురు. భక్తులు భగవంతుని సేవించినట్లే, భగవంతుడు భక్తులను సేవించును అని వారు చెప్పుదురు. అది యుక్తమే.

"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ
భజామ్యహమ్ ।"

అని స్వయముగా భగవంతుడే చెప్పెను.

వృషభానునందిని శ్రీకృష్ణచంద్రపరమానందకందమును సేవించినట్లే భక్తజనమునకు విధేయుడైన, భగవంతుడు గూడా రాధను ఎట్లు సేవించక ఉండును? 'ఆనందబృందావన చంపువు' నందు ఒక కథ కలదు -

ఒకానొకప్పుడు, శ్రీకృష్ణచంద్రపరమానందకందము, తన చిలుకకు పాఠములు చెప్పుచుండెను. దానితోపాటే, శ్రీరాధను గూడా ధ్యానించుచుండెను. చివఱికి ఎవరో ఒకరిధ్యానము చేయు

చుండవలయునే కదా! భక్తులు, భగవద్ధ్యానము చేసినచో, భగవంతుడు భక్తుల ధ్యానము చేయుచుండును. రాధాధ్యానము వలన కలిగిన ఆనందములో శ్రీకృష్ణప్రభు నేత్రములనుండి అశ్రువులు ప్రవహించుచుండును. శరీరము పులకాంకురితమగును. ఈవిధముగానే, మహాభారతమునందు ఒక కథ గలదు. భగవంతుడు భీష్ముని ధ్యానించుచుండెను. ఆ సమయముననే ధర్మరాజైన యుధిష్ఠిరుడు అచటకేతెంచెను. ధ్యాననిమగ్నుడైన భగవంతుని చూచి, ఆశ్చర్యచకితుడయ్యెను. శ్రీకృష్ణభగవానుడు ఎవరిని ధ్యానించుచుండెనా? అని ధర్మరాజు ఆలోచించుచుండెను. ఇంతలో భగవంతుని ధ్యానభంగమయ్యెను. "హే భగవాన్! మీరు ఎవరిని ధ్యానించుచున్నారు? అని ధర్మరాజు ప్రశ్నించెను. అంత, భగవంతుడు ఇట్లనెను - "ఇపుడు భీష్ముడు అంపశయ్యపై పరుండి ధ్యానించుచున్నాడు".

"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ
భజామ్యహమ్ ।"

అని నా నియమము. కావున, నేను గూడా, ఆ భీష్మధ్యానము నందే తన్మనస్కుడనై ఉన్నాను." ఈ విషయమును అటుండ నిండు. పూర్ణతముడు, పురుషోత్తముడు నయిన ఈ ప్రభువు యొక్క మాధుర్యాధిష్ఠాత్రిదేవత రాధ. ఆరాధాధ్యానమునదే శ్రీకృష్ణభగవానుడు ఉండెను, తజ్జపమునే చేయుచుండెను, వేణువునందు గూడా ఆమెనే ధ్యానము చేయుచుండెను.

"వత్స! పఠ, ధారాధరవపుః శ్రీమన్నారాయణోఽవతు ।"

అని చిలుకకు గూడా పాఠము చెప్పుచుండెను. ఈ వ్యాజముతో 'ధారాధారవపుః' నందు "ధారాధారా" అని అనుటవలన, రాధా నామ స్మరణము చేయుచుండును అని తెలియవలయును.

"మరామరా" అని జపించుటవలన వాల్మీకిమహర్షి గూడా రాముని యందు పరినిష్ఠితుడయ్యెను. ఈవిధముగా తలక్రిందులు చేసి ఏల ఉచ్చరించవలయును? అనిన, తల్లియైన నందరాణిముందు ఒక స్త్రీనామమును స్మరించుట వలన ఆతల్లి ఏమని భావించునో? కావున, శ్రీకృష్ణుడు ఈవిధముగా బయటబడుటలేదు. ఇంతియేకాక, తల్లి వ్రజగేహినియైన నందరాణి 'నా కన్నవాడు గొప్ప భక్తుడు, స్నానము చేసి, నామజపము చేయుచున్నాడు' అని తలచును. సారాంశమేమనిన,

"శ్రీయతే శ్రీకృష్ణేనాపి యా సా శ్రీః"

ఆ 'శ్రీ' లేనిచోట, శ్రీకృష్ణునికి ఆనందము (రమణము) లేదు. ఆ రాధామాధుర్యాధిష్ఠాత్రిశక్తియే, మాధుర్యసారసర్వస్వమైన శ్రీకృష్ణచంద్రుని అమృతమయమైన ముఖచంద్రునియందు అధర సుధారూపములో విరాజమానయై ఉన్నది. కావున, అధరసుధను వేణురంధ్రములందు నిక్షిప్తము చేసి, వ్రజాంగనల హృదయ మందు చేర్చినపుడు, ఆ అధరసుధయే వ్రజాంగనల ముఖ పంకజమున ప్రవేశించెను. ఆ స్వరూపమువారి అంతరాత్మల యందు, అంతఃకరణములందు, ప్రాణములందు, రోమరోమమున వ్యాపించెను. ఆ అధరసుధయే, వృషభానునందిని. కావున, అచట, శ్రీసంచారము కలదు. అనగా, రాధాసంచారము కలదని భావము. రాధాదేవి సంచారము కలచోటనే శ్రీకృష్ణచంద్రపరమానంద కందము రమణము నొందును. పూర్ణతముడు, పురుషోత్తము నయిన భగవంతుడు స్వీయ మధుర్యాధిష్ఠాత్రిశక్తిని ఆస్వాదిం చును. పుష్పములందు స్వయముగా ఘ్రాణశక్తి ఉన్నచో, అవి సుగంధమును ఆఘ్రాణించినట్లే, ఈ రమణము ఉన్నది. భగవంతుడు ఆత్మరతుడై ఉన్నాడని స్పష్టమైనది. అమలాత్మలు,

పరమహంసలు నయిన మునీంద్రులు భగవద్ధ్యానము చేయుచుందురు. అట్టివారు తమ ఆనందమునకై మఱొకరిని అపేక్షింపరు. అట్టి మహనీయులకు ధ్యేయుడు, ఆరాధ్యదైవము నయిన శ్రీకృష్ణ ప్రభువు ఆత్మరతుడుకాక, అనాత్మరతుడు ఎట్లగును ?

ప్రతిప్రాణికి అపేక్షితమగు వస్తువేదనిన, బ్రహ్మసంస్పర్శ కొఱకు, బ్రహ్మరసానుభవము కొఱకు ప్రయత్నించుటయే. ఇదియే జీవిత సాఫల్యము. ఈ లోకమందలి షడ్రసములను అనుభవించి అనుభవించి, కల్పాంతరములు గడచిపోయినవి. కావున, ప్రతి ప్రాణి, ఆ బ్రహ్మరసస్పర్శకొఱకై ఉవ్విళ్ళూరుటయే యుక్తము.

ఎవరి మనస్సు, ఆ బ్రహ్మస్పర్శకై ఉత్కంఠితముకాదో, అతడు ప్రాణి కాడు. శ్రీకృష్ణుడు అందఱియందు రమణము నొంది నపుడే ఇది సంభవము. మొదట, బ్రహ్మ, జీవునియందు రమణము నొందవలయును. అనంతరము జీవుడు బ్రహ్మయందు రమించును. వ్రజాంగనలలో ఒకతె, ఋషిరూపిణి. మఱొకతె అగ్నిస్వరూపిణి. ఒకామె, సాధనాభ్యాసముచేత సిద్ధురాలు. మరొకతె, నిత్యసిద్ధురాలు. ఒకామె జనకపురవాసిని అయిన జానకి. వారందఱియందు మొట్టమొదటగా శ్రీకృష్ణచంద్ర పరమానందముయొక్క, రమణము జరుగవలయును. అపుడు, వారు శ్రీకృష్ణునియందు రమణము నొందుదురు. ఇచట, ఇరువురి రమణమునందు భేదము కలదు. ఆ విషయమును తరువాత చెప్పెదము. కాని, భగవంతుడు భక్తునియందు ఎట్లు రమణము నొందును ? అనునది ఇచటగల ప్రశ్న. ఆ భగవంతుడుడైనచో, ఆప్తకాముడు ఆత్మారాముడు. కాని, వృషభానునందిని అయిన రాధ, ఆయన ఆత్మయే. ఆనందసుధాసాగరము కంటె, తన్మాధుర్యము భిన్నమా? కావున, శ్రీకృష్ణుని ఆత్మయే, వృషభానునందిని. ఆయన,

రమణము ఆయనయందే కలదు. అయిన, వ్రజాంగనలయందు ఎట్లు రమణము నొందును? దీనికి సమాధానమేమనిన, శ్రీకృష్ణ చంద్రుని ఆత్మ సంచరించుచోటనే, ఆయన రమణము జరుగును. కావుననే, వ్రజాంగనలయందు శ్రీకృష్ణపరమానందకందము మొదట ఆత్మను సంచరింపజేసెను. శ్రీకృష్ణపరమానందసింధువు యొక్క మాధుర్యసార సర్వస్వభూతమైన అధరసుధ వృషభాను నందినియే, వేణుగీతము ద్వారా ఆయనయే, భగవద్భాగ్యమైన, సుధారూపములో వ్రజాంగనల శ్రోత్రములద్వారా వారి అంతః కరణమునందు, అంతరాత్మయందు, ప్రాణములయందు. ఇంద్రియ ములయందు, రోమరోమమునందు పరిపూర్ణమయ్యెను. కావుననే, వ్రజాంగనలు గూడా, రాధారూపమును దాల్చి శ్రీకృష్ణుని ఆత్మలే అగుదురు. ఇపుడు, వారియందు శ్రీకృష్ణుని రమణముగూడా, ఆత్మ రమణమే అగును. వారియందు ఆత్మయొక్క ఛాయ పడెనా? కాదు, తత్సంసర్గమాత్రముచేతనే వారికి తన్మయత్వము కలిగినది, మాధుర్యసారసర్వస్వము పైపైననే ఉండియున్నచో, పై మెఱుగు అని చెప్పవచ్చును. ఇచట, భగవంతుడు, తన అధర సుధను, వేణువుద్వారా, వారి హృదయములయందు నింపి, భావనాపరివర్ధితము చేసి, సర్వత్ర, స్వరూపమునందు నింపి, తన్మయలనుగా జేసెను. సూర్యప్రతిబింబము దర్పణమునందు పడును, జలమునందు పడును, కాష్ఠముమీదగాని, గోడమీదగాని పడదు. గోడను నీటితో తడిపినచో, గోడపైన గూడా ప్రతిబింబము పడును. ఆత్మయొక్క ప్రతిబింబము అంతఃకరణముమీద పడును, ఘటముపైన పడదు. నేత్రముద్వారా అంతఃకరణము ఘటాకారా కారితమైనపుడు, జలమయభిత్తిపైన సూర్యబింబము పడినట్లు, ఘటముపైన గూడా పడును. ఈవిధముగానే, సూర్యప్రతిబింబము ముఖ్యముగా జలములో ప్రతిబింబించును, గోడపైన జలసంసర్గము

చేతనే, అ ప్రతిబింబము పడును. ఆరీతిగానే, వృషభానునందిని యందు శ్రీకృష్ణుని ముఖ్యరమణము ఉండును. ఇతర వ్రజాంగనల యందు వృషభానునందినియైన రాధాసంసర్గముచేత రమణము సిద్ధించును. మాధుర్యసార సర్వస్వమైన అధరసుధాసంచారము వలన సర్వత్రసంసర్గము ఉన్న కారణముగా భగవంతుని రమణము సర్వత్ర ఉండును. అద్వితీయ, పూర్ణతమ, పురుషోత్తమ రస స్వరూప పరమతత్త్వము స్వయముగానే, శ్రీకృష్ణరూపమునను, వృషభానునందినిరూపమునను ప్రకటమయ్యెను. ఆ పరమ తత్త్వమే, వ్రజాంగనల రూపములోను, లీలాభూమి రూపములో గూడా, వ్యక్తమయ్యెను. కాని, మోహినీశక్తివలన, సమస్తము అవృతమై ఉండెను అని సిద్ధాంతము. ఎవరికి ఏ రూపము కలదో, ఆ రూపమే, వ్యక్తమగును. వ్యక్తమైన అగ్ని గల కాష్ఠము యొక్క సంబంధముచేత, అవ్యక్తాగ్ని గల కాష్ఠమునందు గూడా అగ్ని అభివ్యక్తమగును. ఆరీతిగానే, వ్యక్తమైన ఆత్మస్వరూపము గల వస్తువుయొక్క సంబంధముచేత అవ్యక్తమైన ఆత్మస్వరూపము గల వస్తువునందు గూడా, ఆత్మ అభివ్యక్తమగును. వాస్తవము నకు, వ్రజాంగనలు గూడా, రసస్వరూపిణులు. కాని, వారియందు మాధుర్య స్వరూపము అవ్యక్తముగా ఉండెను. దానివలన, రాధ యొక్క వ్యక్త స్వరూపసంబంధము కలిగినపుడు, అది, వ్యక్త మయ్యెను. శ్రీకృష్ణచంద్రపరమానందకందముయొక్క అధరసుధ, వ్యక్తమైన మాధుర్యసారసర్వస్వము. తత్సంబంధముచేత వ్రజాంగనలయందు గూడా, మాధుర్యసార సర్వస్వమైన ఆ అధర సుధ వ్యక్తమయ్యెను. ఈ విశ్వమంతయు ఆనందమయమని మనము చెప్పుదుము.

''ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనందేన
జాతాని జీవన్తి, ఆనందం ప్రయన్త్యభి సంవిశన్తి ।''

అను శ్రుతివచనము ఈ సమస్త భూతములు ఆనందమునుండియే యుత్పన్నమగుచున్నవనియు, జన్మించిన భూతములన్నియు ఆనందముచేత జీవించుచున్నవనియు. చిట్టచివఱకు ఆనందము నందే లీనమగుచున్నవనియు చెప్పుచున్నది.

ఈ సిద్ధాంతము ననుసరించి, సమస్త విశ్వము ఆనంద స్వరూపమే. ఒకానొకనికి అమృతసాగరమునందు లవణసముద్ర మను భ్రాంతి కలిగినట్లుగానే, అచింత్య, అనంత, పరమానంద సింధువునందు భవసాగర భ్రాంతి కలుగును. ఆనందసాగరము యొక్క. మంచు బొమ్మవు నీవు, నీలోపల, బయట, సర్వత్ర, ఆనందము నిండియున్నది. ఈరీతిగా అందఱి వాస్తవ స్వరూపము ఆనందమే. కాని, అది అవ్యక్తము.

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ ।"

అనుచు శ్రుతి, ఆకాశాది పృథ్వీపర్యంతము గల సమస్త విశ్వము ఆత్మనుండియే, ఆవిర్భవించినదని చెప్పుచున్నది.

వస్తుతః, కాష్ఠము, అగ్ని గూడా, వేఱు వేఱు వస్తువులు కావు. ఆత్మనుండియే ఆకాశము, ఆ ఆకాశమునుండి వాయువు, ఆ వాయువునుండి తేజస్సు ఉత్పన్నమయ్యెను. తేజస్సునుండియే, జలము, ఆ జలమునుండి పృథివి, ఆపృథివినుండియే, కాష్ఠాదులు ఉత్పన్నములయ్యెను. కారణముకంటె కార్యము భిన్నము కాదని సిద్ధాంతము. మృత్తికనుండి ఉత్పన్నమయిన ఘటము మృత్తు కంటె భిన్నము కాని రీతిగానే, తేజస్సు నుండి జనించిన జలము తేజస్సుకంటె భిన్నముకాదు. జలమునుండి పుట్టిన భూమి, దాని వలన ఉత్పన్నమయిన కాష్ఠముగూడా, అగ్ని, లేక తేజస్సుకంటె

భిన్నములు కావు. ఈవిధముగా, కాష్ఠమునకు, అగ్నికి వాస్తవిక భేదము ఉండదు. అయినను, కాష్ఠము, తేజస్సునకు ఆవరకమై ఉండును. కార్యముచేత కారణస్వరూపము ఆవృతమయియే ఉండును. ఈవిధముగా, సర్వతత్త్వముల ఆనందస్వరూపత్వము ఆవృతమై ఉన్నది. మాధుర్యసారసరస్వము, సుమధురము నయిన అధరసుధాసంబంధమైన వేణుగీతపీయూషముయొక్క ఆస్వాదనము లభించినచోట, వ్యక్తమైన ఆనందస్వరూపముతో ఆ ఆనందము వ్యక్తమగును. అచటనే, ఆత్మరతుడైన శ్రీకృష్ణుని రమణముగూడా, కలుగును. ఇది, ఉపన్యాసము కాదు, యుక్తియును కాదు. శుద్ధమైన ఆధారముపైన ఉన్న సిద్ధాంతము. తెలిసికొనదలచినవారు, తెలిసికొనదగిన సిద్ధాంతము. శ్రీకృష్ణుని రమణము ఆత్మయందుగాని, అనాత్మయందుకాదని తాత్పర్యము.

అభివ్యక్తి, అనేకవిధములుగా ఉండును. వంశీగీతము ఎన్నడును వినని జీవులకు

"ప్రవిష్టః కర్ణరంధ్రేణ స్వానాం భావసరోరుహామ్"

అను వచనానుసారము భగవంతుని మంగళమయ కథాసుధా శ్రవణమువలన స్వాభావికమైన ఆనందరూపత్వము వ్యక్తమగును. కావుననే, ప్రతిస్థలమునందు శ్రవణమే, ముఖ్యమని చెప్పబడినది,

"మద్గుణశ్రుతిమాత్రేణ"
"ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహికతాం గతా ।"
"ఆత్మావా౽రే ద్రష్టవ్యః శ్రోతవ్యః ।"

ఇత్యాది వచనములవలన శ్రవణమాహాత్మ్యము స్పష్టముగా విదితమగును. భగవంతుని గుణగణ శ్రవణముచేత అంతఃకరణమునందు భగవంతుని అభివ్యక్తి కలుగును. గుణచరిత్రశ్రవణము

ద్వారా భగవంతుని ప్రేమచేత ద్రవీభూతమైన, చిత్తవృత్తి భగవంతుని దిశగా అఖండముగా ప్రవహించుటయే, 'భక్తి' అనబడును. భగవత్కథా శ్రవణమువలన భక్తుని హృదయము నందు భగవంతుడు తప్పక, అభివ్యక్తమగును. కాని, శ్రవణము గూడా, భగవంతుని అభివ్యక్తము చేసికొనునట్టిదియే అయి ఉండ వలయును. ఉన్నత శ్రేణికి చెందిన పరమహంసలు, భావుకులైన భక్తులు తమ హృదయమునందు భగవతత్త్వమును అనుభవించుచు 'భావన' (మననము) వలన దానిని అభివృద్ధి చేసికొందురు, ఎక్కడో పుట్టిన చిన్న జలధార అనేక స్థలములయందలి సెలయేరుల వలన పెద్దదగును. అట్లే, ఒకానొక భక్తుడు సంపూర్ణముగా శ్రవణ, మనన, నిదిధ్యాసనముల వలన, భగవతత్త్వముచు హృదయము నందు సాక్షాత్కరించుకొనును, దానియందు మునకలు వేయును, చింతనముచేయును, అచట, ఆ రసమే, అంతఃకరణమునందు, ప్రాణములయందు, రోమరోమమునందు సర్వత్ర, నిండి యుండును. ఎచటైనను, ఏదియో ఒకవిధముగా తద్భావోద్గారము కథాసుధారూపములో బహిర్గతమైనపుడు, అది ప్రాకృతగాధ కాదు, భగవతత్త్వమే, ఆ రూపముతో వ్యక్తమగును. వాల్మీకిమహర్షి యొక్క శోకమే, శ్లోకరూపమున వ్యక్తిమయ్యెను.

''శోకః శ్లోకత్వ మాగతః''

వాల్మీకి తమ శిష్యుడైన భరద్వాజునితో తమసానదీతీరమునకు వచ్చెను. అచట క్రౌంచపక్షుల జంట విహరించుచుండెను. ఇంతలో ఒక వ్యాధుడు క్రౌంచపక్షిని బాణముతో గొట్టెను. అది చనిపోయెను. క్రౌంచి (ఆడు క్రౌంచపక్షి) కరుణవిలాపము చేయసాగెను. మహర్షి హృదయము కరుణారససాగరపూర్ణమయ్యెను. జానకిదేవి ఆశ్రమ మున కేతెంచెను, లోకాపవాదభయముచేత శ్రీరామచంద్రుడు

సీతాదేవిని లక్ష్మణుని తోడుగా ఇచ్చి అరణ్యమున వదలివేసెను. రథముపైన లక్ష్మణుని విహ్వలునిగా చూచి, జనకనందిని 'లక్ష్మణా! నీ ఈ విహ్వలస్థితి ఏమి? అని అడిగెను. అంత, లక్ష్మణుడు చెప్పిన సమాచారమును విని, జనకనందిని, మూర్ఛితురాలయ్యెను. ఆమెను, అచటనే వదలివేసి, లక్ష్మణుడు అయోధ్యకు వెళ్లెను. వాల్మీకి, శిష్యులవలన ఈ వృత్తాంతమును విని, జనకనందినిని, జరిగిన వృత్తాంతమును అడిగెను. అటుపిమ్మట. ఆమెను ఓదార్చి, ఋషిపత్నుల సంరక్షణములో ఆమెను ఉంచెను. ఆమెకు యథా సమయమున, ఇరువురు పుత్రులు ఉదయించిరి. శ్రీరామచంద్రుని వియోగమునందు జనకనందినీ క్రందనమువలన, అద్భుతకారుణ్య రససాగరమైన హృదయమునందు తరంగిత మగుచున్నదే, క్రౌంచీ విలాపముతో పొంగిపొరలివచ్చెను –

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః ।
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్ ॥"

ఇది, బుద్ధిపూర్వకముగా వ్రాయబడినది కాదు, శోకమే, శ్లోకమయ్యెను.

ఎవరైనను, ఏ విషయమునైనను, బుద్ధిపూర్వకముగా చెప్పిన, ఉద్గారము (పొంగు) కాదు. రసమునందు ఒక పొంగు వచ్చును. అది పైకి పొంగిపోవును, సంకుచితమైన (ఇరుకుగా ఉన్న) దివ్యపాత్రయందు నిండి ఉన్న రసము వాయుచలనముల వలన, లేక ఏదేని కారణముచేత ఉచ్ఛలితమైన అదే, ఉద్గారము (పొంగు). ఈకారణముచేతనే, భక్తులు శ్రీకృష్ణచంద్రపరమానంద కందమునకు సంబంధించిన మంగళమయమైన, పరమ పవిత్రమైన చరిత్రను హృదయమునందు అవగాహనము చేసికొందురు. ఎచటైనను, ప్రశ్నవశమున, లీలారససుధాసారఘాతుదు, పరమానంద

రసామృతమూర్తియైన భగవంతుడు, కథాసుధారూపమున అభివ్యక్తమగును. ఇదియే, వ్యక్తమైన అగ్ని. భావుకులైన భక్తుల ముఖపంకజమునుండి వినిఃసృతమైన శ్రీకృష్ణకథాసుధ శ్రోత్రేంద్రియముద్వారా భక్తుని హృదయమున జేరిన, అచటనయితము శ్రీకృష్ణస్వరూపము అభివ్యక్తమగును.

"జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యమ్"

అను వచనానుసారము, సాధారణముగా అందఱును భగవత్స్వరూపులే. కాని, అవ్యక్తరూపములో ఉందురు. ఎవరికి ఆ భగవంతుడు వ్యక్తమగునో, వారి ముఖపద్మమునుండి కథాసుధారూపములో వెళ్ళిన ప్రతి స్థలమునందును, ఆయన వ్యక్తమగును. అపుడు, శ్రీకృష్ణుని ఆత్మ, వ్యక్తమైన ప్రతి స్థలమునందును ఆత్మారాముడైన శ్రీకృష్ణుడు రమించును. ఆనందస్వరూపుడైన శ్రీకృష్ణునినుండియే నిఖిల విశ్వము ఆవిర్భవించినదని భావము. కావున, అందఱును, శ్రీకృష్ణుని ఆత్మలే. ఏవిధముగా అయినను, శ్రీకృష్ణుడు వ్యక్తమైన ప్రతి స్థలమున శ్రీకృష్ణసంబంధియైన రమణము ఉండును. ప్రత్యేకించి, వ్రజాంగనల కయినచో, పరంపరయా కాక, సాక్షాత్తుగా శ్రీకృష్ణముఖచంద్రునికి సంబంధించిన, అధరసుధారూపుడైన శ్రీకృష్ణుని ఆత్మరూపిణియైన వృషభానునందిని, వేణుగీతరూపములో లభించినది. కావున, వారి అవ్యక్తి రసరూపత్వము, ఆత్మరూపత్వము సంపూర్ణముగా వ్యక్తమయ్యెను. కావున, వ్రజాంగనలందఱును వృషభానునందినీస్వరూపిణు లయిరి. శ్రీకృష్ణచంద్రపరమానందకందముయొక్క అధరమునందు ఉండునట్టి అధరసుధ వ్రజాంగనల అధరమును జేరెను. తదనుభవము శ్రీకృష్ణచంద్రపరమానందకందము

పొందెను. కావున, అది, భగవద్భోగ్యమైన సుధ. ఇపుడు, వ్రజాంగనల రమణము శ్రీకృష్ణునియందు జరుగును.

జీవాత్మలు, నానావిధములైన కర్మలను ఆచరించి, చంద్ర లోకమునకు బోయి, చంద్రరూపమును ధరించుదురనియు, వారు చంద్రభావాపన్నులై దేవతలకు అన్నము - భోగము అగుదురని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. అయిన, కర్మలు దేవతలకు - ఖాద్యసామగ్రి అగుటకయియే, అనుష్ఠింపబడుచున్నవా? ఇచట 'అన్న' శబ్దమునకు 'భోగ్యసాధన'మని అర్థము. రాజసభా సదస్యులు రాజుయొక్క మానసికానందము కొఱకు ఉండుటవలన, ఆ రాజునకు ఉపకరణములుగా భావింపబడుదురు. అట్లే, జీవులు గూడా, ఇంద్రసభాసదస్యులై వారి ఆనందసాధనములగుదురు. అదియే, వారికి గల భోగ్యత్వము. ఈవిధముగా సమస్త జీవ జగత్తు, పరమాత్మను ఆరాధించి, ఆ భగవంతుని యశస్సును అధికము చేయుదురు. కావున, ఈ సకల జీవప్రపంచము పరమాత్మకు భోగ్యవస్తువై ఉన్నది. భగవంతుడు, వాస్తవమునకు ఆప్తకాముడు, ఆత్మారాముడు. అయినను, భక్తులకొఱకై స్వరూప మును ధరించును. భక్తుల మనస్సునందు గూడా, తాదృశమైన ఉత్కంఠయే, ఉండును. ఆ భక్తులు, భగవంతుని పీతాంబరము, భగవంతుని చందనము, భగవంతుని మస్తకముపైన విరాజమాన మగు ముకుట కిరీటము, భగవంతుని శరీరముమీద శోభిల్లునట్టి గుంజామాల. కంఠమునందలి వైజయంతీమాల, వన్యస్తబక మయము, పుష్పమయము నయిన మాలయై ఆ భగవంతుని, సేవింపవలయునని వాంఛింతురు. ఇంద్రాదులు నిష్కాములు కారు. భగవంతుడు నిష్కాముడు. కేవలము జనులకొఱకే, ఆయన సకాముడగును. ఈవిధముగా జీవులు భగవద్భోగ్య సాధనములగుట జీవులకు గల భోగ్యత్వము. ఈరీతిగానే, భగవంతుడు గూడా.

జీవభోగ్యుడగుట, మరొక విషయము. ఈ సమస్తసామగ్రితో - భగవద్భోగ్యమైన అధరసుధాసంచారముచేత - భగవదాత్మభూతురాలు, మాధుర్యసారసర్వస్వము నయిన వృషభానునందిని సంచరించును. అపుడు, శ్రీకృష్ణచంద్రపరమానందకందరమణము జరుగును. మొదట, జీవునియందు భగవంతునకు భోగ్యత్వము కలిగి, దానియందు భగవంతుడు రమణము చెందును. అపుడు, భగవంతుడు జీవులకు భోగ్యుడగును. ఆయనయందు జీవులు రమింతురు, మొదట, వ్రజాంగనలయందు శ్రీకృష్ణరమణము, తదనంతరము, శ్రీకృష్ణునియందు వ్రజాంగనల రమణము. భోగ్యము పరతంత్రమై ఉండును, భోక్త, స్వతంత్రుడై ఉండును. వ్రజాంగనలయందు - జీవులయందు - పారతంత్ర్యము, శ్రీకృష్ణచంద్రపరమానందమునందు స్వాతంత్ర్యము ఉండును. స్వాధీన (కృష్ణాధీన)జీవులైన వ్రజాంగనలయందు శ్రీకృష్ణుడు రమించును. జీవాత్మలైన వ్రజాంగనలు శ్రీకృష్ణునియందు రమణము కలిగిన స్థానమునందు జీవాత్మలైన వ్రజాంగనలు భోక్తలు, భగవంతుడు భోగ్యుడు, వ్రజాంగలయందు స్వాతంత్ర్యము, శ్రీకృష్ణునియందు పారతంత్ర్యము - ఇది విపరీత క్రమము. కాని, ఈ విషయము మహోన్నతమైనది. ఇది దార్శనికదృష్టి.

ఇచట, శృంగారరసప్రాధాన్యము చెప్పబడినది. సంప్రయోగాత్మక, విప్రయోగాత్మక శృంగార రసాత్మలీలయిది. శృంగారరసమునందు నాయిక భోగ్య, నాయకుడు భోగ్యుడు అగును. దీనిని సాధారణస్థితి అందురు. అసాధారణస్థితి యందు నాయకుడు, నాయికాభావాపన్నుడగును. నాయిక, నాయకభావాపన్నురాలగును. లౌకిక శృంగారమునదైనచో, అంతయు, ఆరోపమే. కాని, తత్త్వతః, ఏమియును ఉండదు. రసోద్రేకమునందు ఒకవిధమైన అభిమానము కలుగును. ఆ స్థితిలో విపరీత రతి

కలుగును. కాని, ఇచట, అనగా, భగవద్విషయక శృంగారరసము నందు కేవల అభిమానమే లేదు, వస్తుతః, నాయకుడు నాయికా భావాపన్నుడయ్యేను, నాయిక, నాయకభావాపన్న అయ్యేను. స్వాతంత్ర్యమే, పుంస్త్వము, పారతంత్ర్యమే స్త్రీత్వము. పురుషుడు ఏక, పూర్ణతమ, పురుషుడే. నిరంకుశము, పూర్ణము నయిన స్వాతంత్ర్యము కేవలము ఆయనయందే, కలదు. తద్భిన్నులైన జీవులయందు ఆధి, వ్యాధి, జరా, మరణరూపము లైన అనేకవిధ పారతంత్ర్యబంధములు కలవు. ఎంతపరిమాణ ములో పారతంత్ర్యము నశించునో, అంత పరిమాణములో స్త్రీత్వము నశించును. ఎంత పరిమాణములో స్వాతంత్ర్యోదయ మగునో, అంత పరిమాణములో పుంస్త్వము కూడా ఉదయించును. అవిద్యా, కామ, కర్మాది, జరామరణాది ఏవిధమైన, పారతంత్ర్య మైనను, ఎవరియందు ఉండవో, అట్టి ఏకమాత్ర పురుషుడు శ్రీకృష్ణపరమానందకందము. కావున, ఇతర జీవులయందు స్త్రీత్వ పారతంత్ర్యము ఉన్నది. 'పరవశుడు జీవుడనియు, స్వవశుడు భగవంతుడనియు శ్రీగోస్వామితులసీదాసు వచనము. ఈ దృష్టి ననుసరించి, భగవంతుడు పూర్ణస్వతంత్రుడు, భక్తుడు పూర్ణ పర తంత్రుడు. భక్తుడు, తన అంతఃకరణమును, అంతరాత్మను, ప్రాణములను సర్వథా పూర్ణతముడు. పురుషోత్తముడును అయిన శ్రీకృష్ణపరమాత్మకు అనుకూలమైనవానినిగాను, అనుగాములుగాను చేసికొననగును, ఆయన రుచికంటె తన రుచి భిన్నముగా ఉండ నీయరాదు.

"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య విసర్జనమ్ ।
రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వ వరణం తథా ॥
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః ।

సర్వథా, ఆనుకూల్యసంకల్పముతో, ప్రాతికూల్యమును త్యాగము చేయవలయును. వేద, శాస్త్ర, పురాణాదులవలన, ఒకానొక విషయము రుచించదని వినిన, దానిని వెంటనే వదలి పెట్టుట, భగవంతుడు తనను అవశ్యము రక్షించును అను దృఢ, విశ్వాసము కలిగియుండుట, గోప్తగా (రక్షకునిగా) భగవంతుని వరించుటయును, తనను తాను భగవంతుని చరణారవిందముల యందు సమర్పించుకొనుట, తనయందు దైవ్యమును అభివ్యక్తము చేసికొనుట, తనయందు అపకర్ష (అల్పత్వ) చింతనము చేయుట ఈవిధమైన శరణాగతివలన, జీవుడు సంపూర్ణముగా తన పారతంత్ర్యమును వ్యక్తము చేయును. ఇటువంటి స్థితిలో భక్తుడు భోగ్యుడగును, అతనియందు భోక్తృరూపుడైన భగవంతుని రమణము జరుగును. ఈ స్థితి తారుమారైనపుడు ఆ భగవంతుడే, భక్తపరతంత్రుడగును.

"వశీకుర్వన్తి మాం భక్త్యా సత్స్త్రియః సత్పతిం యథా ।"
"మదన్యత్ తేన జానన్తి నాహం తేభ్యో మనాగపి ।"
"భక్తపరాధీనో హ్యస్వతంత్ర ఇవ ద్విజ ।"

భక్తులు భగవంతుని, స్వవశము చేసికొందురని భగవంతుడు చెప్పెను. పరమభగవద్భక్తుడైన అంబరీషమహారాజును దుర్వాసు డొనర్చిన కృత్యాప్రయోగమునుండి రక్షించుటకై భగవంతుడు సుదర్శనచక్రమును దుర్వాసునిపై వదలినపుడు, దుర్వాసుడు దేవతలశరణు జొచ్చెను. అపుడు సమస్త దేవతలు 'మేము భక్త విద్రోహిని రక్షింపజాలము అని పలికిరి. తరువాత, బ్రహ్మ, శివుడు ఇదియే సమాధానము చెప్పిరి. అంతమున, దుర్వాసుడు శ్రీమహావిష్ణువుదగ్గఱకు పోయెను, నిన్ను, రక్షించుటయుక్తమే, కాని, ఏమి చేయుదును? నేను స్వతంత్రుడను కాను, నేను

స్వతంత్రుడను కాను, నేను స్వతంత్రుడనై ఉండియున్న, అవశ్యము, నిన్ను రక్షించి ఉండెడివాడను. కారణమేమన,

"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ
భజామ్యహమ్"

అని నా వ్రతము. నా భక్తులు, ఎంత తన్మయు లగుదురనిన, వారు నాకంటె భిన్నమైనదానిని ఎఱుంగనే యెఱుంగరు, అట్టి స్థితిలో నేను గూడా, ఆ భక్తులకంటె అతిరిక్తమైన విషయమును ఏమి ఎఱుంగుదును?' అని పలికెను. దీనిని ఆధారముగా గొనియే, మొదట, భక్తునియందు పారతంత్ర్యము, భగవంతునియందు స్వాతంత్ర్యము ఉండునని, అనంతరము 'యే యథా మాం ప్రపద్యన్తే' అను వచనానుసారము భక్తునియందు స్వాతంత్ర్యము భగవంతునియందు పారతంత్ర్యము ఉండునను, మాట వచ్చెను.

మహా దేవాధిదేవులు ఎవరిని నిరంతరము ధ్యానింతురో, 'భీరపి యద్బిభేతి' - భయముగూడా ఎవరిని జూచి భీతినొందునో, అట్టి భగవంతుడే అయిన శ్రీకృష్ణచంద్రపరమానందకందము యొక్క రెండు హస్తములను తన ఒకచేతిలో పట్టుకొని, నందరాణి మరొకచేతితో బెత్తము చూపుట, భగవంతుడు గూడా, ఆ బెత్తము వలన భయపడుట - ఇదియే (భగవంతుని) పారతంత్ర్యము. దీని వలన, మొదట, భగవంతునియందు స్వాతంత్ర్యము, అనంతరము భక్తునియందు స్వాతంత్ర్యము ఉండు నను విషయము స్పష్టము. మొదట, భగవత్సంమిలనమునకై భక్తుడు ఉవ్విళ్లూరును, అనంతరము భక్తుని సంయోగమునకై భగవంతుడు ఉవ్విళ్లూరును. పరమ భక్తుడైన మధుసూదనసరస్వతి, బృందావనమునకు పోయి భగవత్సాక్షాత్కారము కొఱకై గోపాలసహస్రనామమును నాలుగు పర్యాయములు పురశ్చరణము చేసెను. కాని, ఆయనకు భగవ

త్సాక్షాత్కారము కలుగలేదు, అపుడు, ఆయన కాశీక్షేత్రమునకేగి, అచట, కాలభైరవమంత్రానుష్ఠానము చేసెను. ఆ అనుష్ఠానమునకు కాలభైరవుడు ప్రసన్నుడయ్యెను, వరము కోరుకొనుమని అనెను. ఆ వచనమును విని, శ్రీమధుసూదనసరస్వతి శ్రీకృష్ణసాక్షాత్కారమును అభ్యర్థించెను.

అంత, కాలభైరవుడు 'బృందావనమునకు పొమ్ము, అచట, గోపాలసహస్రనామ పురశ్చరణము చేయుము' అని ఆదేశించెను.

కాలభైరవుని వచనములను ఆలకించిన శ్రీమధుసూదన సరస్వతి "నేను అచట నాలుగు పర్యాయములు గోపాలసహస్రనామపురశ్చరణము కావించితిని గాని, శ్రీకృష్ణసాక్షాత్కారము కలుగలేదు" అని విన్నవించెను.

అంత, కాలభైరవుడు, నాలుగు పాపపర్వతములను చూపెట్టెను, నీవు చేసిన నాలుగు పురశ్చరణములవలన ఆ నాలుగు పాపపర్వతములు నశించెననియు, ఈమారు, పురశ్చరణము చేసిన, శ్రీకృష్ణసాక్షాత్కార మగుననియు వచించెను.

అపుడు, శ్రీమధుసూదనసరస్వతి, మరల బృందావనమున కేగెను, అచట, గోపాలసహస్రనామానుష్ఠానము చేసెను. అపుడు శ్రీకృష్ణభగవానుడు సాక్షాత్కరించెను. శ్రీశ్యామసుందరుడు మధుసూదనసరస్వతి ఎదుట నిలబడెను. అపుడు, ఆయన వెంటనే తన ముఖము త్రిప్పుకొనెను. శ్యామసుందరుడు ఎచటెచట నిల్చుండిన, అటునుండి మధుసూదన సరస్వతి తన ముఖమును త్రిప్పుకొనుచుండెను. చివరకు, శ్రీకృష్ణచంద్రుడే, మధుసూదన సరస్వతిని బ్రతిమలాడ నారంభించెను. ఆయన, శ్రీకృష్ణసాక్షాత్కారమునకై ఉవ్విళ్లూరుట ఎక్కడ, ఇపుడు శ్రీకృష్ణుడే బ్రతిమలాడుట ఎక్కడ! ఈ స్థితి ఏమిటి?

మహా స్వాతంత్ర్యమునకుముందు పారతంత్ర్యము అపేక్షిత మగుసు. స్వాతంత్ర్యమును కోరుచున్నచో, దానిని కొంత త్యాగము చేయవలయును. వేదశాస్త్రములు, మాతాపితరులు, ధర్మ, కర్మలనుండియు స్వాతంత్ర్యమును అభిలషించుదురు. కాని, ఈ స్వాతంత్ర్యము పారతంత్ర్య ఘోరగర్తమున బడవేయు నట్టిది. బాలకులు తల్లిదండ్రులకు, అధ్యాపకులకు పరతంత్రులు కానిచో, వారు విశృంఖల ప్రవృత్తి కలవారగుదురు. అపుడు జన్మ జన్మకు ఘోరము, అనర్థమయము, కంటకాకీర్ణమును అయిన గర్తములో పడిపోయెదరు. ఏ దేశమైనను, స్వాతంత్ర్యరక్షణకై సైనికసంఘటనము చేయదలచినచో, ఆ సైనికులు సేనాపతికి పరతంత్రులై ఉండవలయును. సైన్యము సేనాపతి ఆజ్ఞను ఉల్లంఘించినచో, విజయము, స్వాతంత్ర్యము లభింపనేరదు. కావున, అనంతకోటి బ్రహ్మాండనాయకుడు భక్తపరతంత్రుడై ఉండుననుట పరమ సిద్ధాంతము. ఎవరి భ్రూభంగమువలన అందఱిని నాట్యము చేయించునట్టి మాయ, ఎవరిముందు నాట్యము చేయునో, ఆయన స్వయముగా నర్తించుచుండును.

"తద్వశో దారుయంత్రవత్"

పరమానందమూర్తి శ్రీకృష్ణుడు కొయ్యబొమ్మ (తోలుబొమ్మ) వలె వ్రజాంగనాపరతంత్రుడయ్యెను.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని
మాయయా ॥"

సర్వభూతహృదయస్థితుడై భగవంతుడు కాష్ఠపుత్తలికవలె నిఖిలప్రాణులను ఆడించును, ఆయనయే, మరల ప్రేమ (భక్తి) పరతంత్రుడై భక్తులచేతిలో ఆటబొమ్మ అగును. భక్తునియందు

భగవద్భావాపత్తి, భగవంతునియందు భక్తభావాపత్తి - దీనినే పరస్పరభావాపన్నత అందురు. ఇది, రసోద్రేకమునందు, ఆనందాతిశయమునందు కలుగును. కావుననే, శ్రీకృష్ణునియందు వ్రజాంగనాభావాపత్తి, వ్రజాంగనలయందు శ్రీకృష్ణభావాపత్తి చెప్పబడినది. వృషభానునందిని శ్రీకృష్ణుడగుట, శ్రీకృష్ణుడు వృషభానునందిని అగుట భావనామహిమయే. ఇతరుల భావన, అభినివేశము, అభిమానము దృఢమైనది కాదు, భగవంతుని యొక్క, వృషభానునందినియొక్క అభిమానము సుదృఢమైనది. రసోద్రేకమునందు విపరీతరతి సంచరించినపుడు, వృషభానునందిని, శ్రీకృష్ణునియందు అభిమానపురఃసరముగా ప్రవేశించినపుడు, వృషభానునందినియందుగూడా, శ్రీకృష్ణుడు అభిమానపురఃసరముగా ప్రవేశించెను. కావుననే,

"శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః।"

అని చెప్పబడును.

ఇరువురును పరస్పరము అంతరాత్మలు. శివుడు సంహారకదేవత, విష్ణువు పాలకదేవత సంహారమునందు తమోగుణప్రాధాన్యము, పాలనమునందు సత్త్వగుణప్రాధాన్యము ఉండును. సత్త్వము స్వచ్ఛము, శుభ్రము, ప్రకాశాత్మకము. తమోగుణము ఆవరకము, కాలిమాయుక్తము. కావున, శంకరుడు కృష్ణవర్ణము కలవాడును, విష్ణువు శుక్లవర్ణము కలవాడును కావలయును. కాని, ఇచట తారుమారైనది. ఏల ? పరస్పరము ధృఢమైన ఉపాస్య ఉపాసక భావమువలన, పరస్పర వర్ణము ఒకరివర్ణము మఱొకరికి వచ్చినది.

శివుడు విష్ణుభగవానుని సేవకుడు, స్వామిసఖుడుగూడ కావున, నిర్మలుడు, సత్త్వగుణమయుడు నయిన విష్ణుభావనా

మహిమవలన, శివుడు, శుక్లవర్ణము కలవాడయ్యెను. భావనా మహిమవలననే విష్ణువు శ్యామవర్ణము కాలవాడయ్యెను. ఈ విధముగా చూచిన, సంకీర్ణతకు అవకాశము లేదు.

శంకరుడే, వృషభానునందిని అని అచటచట చెప్పబడినది. ఏలయనగా ఇరువురును పరస్పర అంతరాత్మ భూతులేకదా! వేణువు రుద్రరూపమని భావింపబడినట్లే, ఒకస్థలమున, శ్రీకృష్ణుడు కాళీ మాత అవతారమని భావింపబడెను. ప్రకృతమున, సాధారణ శృంగారమునందు భావన, అభిమానమాత్రమని తేలినది, ఇచట (భగవద్విషయమున) స్వరూపపరివర్తనము కూడా గలదు. ఇచట, బృందారణ్యము, శ్రీకృష్ణపరమానందకందము, వృషభానునందిని వ్రజాంగనలు – వీరితో గూడిన మంగళమయ లీలాభూమి, ఆ అచింత్య, అనంత, అద్భుత, ప్రేమానంద రససింధువునందు క్షణే క్షణే ఆవిర్భూతము, తిరోభూతము అగుచుండెను, నిమజ్జన ఉన్మజ్జనములు చేయుచుండును. ఆస్థితిలో ఒకప్పుడు, శ్రీకృష్ణుడు, వృషభానునందినీ రూపమునను, మరొకప్పుడు వృషభానునందిని శ్రీకృష్ణరూపములోను ప్రకటమగుదురు. "ఉభయోభయభావాత్మ" అని చెప్పబడినది. సాధారణ నాయకునియందు ఉత్కటమైన రసమే వ్యక్తము కాదు అని స్పష్టమైనది. కాని, నిఖిల రసామృత మూర్తి ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసాత్మయైన శ్రీకృష్ణుడు, రసస్వరూపమే. ఈయన సంపర్కమువలన ఇంత ఉత్కట, అద్భుత, అనంత రసము పరస్పరభావాపత్తి కలుగునట్లుగా ఉద్భూతమయ్యెను. ఈ శ్రీకృష్ణుడు పూర్ణతముడు, పురుషోత్తముడు, స్వయముగా భోక్తయే. భోగ్యుడుకాడు. వ్రజాంగన స్త్రీ, భోగ్య. కావుననే ఆ వ్రజాంగనల భోక్త అయిన శ్రీకృష్ణుడు భోగ్యుడు కాజాలడు. వారికే ఏమి? ఆయన ఇతర పురుషులకు గూడా భోగ్యుడు కాజాలడు. పురుషుడు పురుషులకు భోగ్యుడు

కాడు, పారతంత్ర్య లక్షణమైన స్త్రీత్వమే అందఱియందును గలదు. కావున అందఱునుభోగ్యులే. అయినశ్రీకృష్ణుడే స్వయముగా తనను అనుభవించునా ? కాదు. ఇది ఈ పద్ధతికి విరుద్ధము. ఇపుడు అధరపల్లవముయొక్క సర్వభోగ్యసుధ ఎవరికి భోగ్యమగును? దేవభోగ్యమైన సుధ ఖగ, మృగ, పశు, తరు లతా, గుల్మాదులకు భోగ్యమగును. భగవద్భోగ్యమైన సుధ శ్రోత్రేంద్రియములద్వారా వ్రజాంగనలకు భోగ్యమగును. అయిన సర్వభోగ్యసుధాభోక్త ఎవరు? భగవంతుడు భోగ్యుడయినపుడే సర్వభోగ్యసుధ భోగ్యమగును. ఇది ఎట్లు సంభవము? ఎవరును ఆయనకు భోక్త కాజాలడు, కావున భగవద్భోగ్యమైన అధరసుధ వ్రజాంగనలయందు సర్వత్ర నిండియుండెను. వ్రజాంగనలయందు శ్రీకృష్ణుని రమణము జరిగెను. వారు భగవద్భోగ్యమైన ఆ అధరసుధను అనుభవించిరి. అపుడు లోకోత్తరమైన రసోద్రేకము కలిగెను. దాని చేత వ్రజాంగనలయందు శ్రీకృష్ణభావాపత్తి, శ్రీకృష్ణునియందు వ్రజాంగనాభావాపత్తి కలిగెను, ఆ సమయమున శ్రీకృష్ణుడు భోగ్యుడయ్యెను. కావున సర్వభోగ్యమైన అధరసుధానుభవము వ్రజాంగనలకు లభించెను. సాధారణస్థితియందు ఎవరికిని భోగ్యము కాని అధరసుధ సర్వభోగ్యసుధ అని తెలిన సారాంశము. శ్రీకృష్ణుడు రమణమునొందిన స్థలమున విపరీతభావాపత్తి జరిగెను.

భక్తులయందు దీనికిఅనేక ఉదహరణములు కలవు. విష్ణుపురాణమున ప్రహ్లాదప్రసంగము అత్యంత సుందరముగా వర్ణింపబడెను. ప్రహ్లాదుని శరీరమునకు శిలను బంధించి వానిని సముద్రములోనిని విసిరి పారవైచిరి. యాతనలు పెరిగనకొలది ప్రహ్లాదుని విష్ణుభక్తి, అధికముగా అభివృద్ధి చెందెను. ఈ లోకమున, జనులు భగవద్భజనమును వా కులములో సహించరు,

కావున. విఘ్నములు, ఆటంకములు కలిగెనని చెప్పుదురు. ఏకాదశి నాడు ఎవరైనను, చనిపోయిన, ఏకాదశి అచ్చిరాలేదని చెప్పుదురు. బంగారము కాల్చినకొలది, దాని మూల్యము పెరుగును, వెలుగొందును. ఎక్కువ వన్నెవచ్చును. అట్లే, భక్తులు యాతనలను అనుభవించినకొలది, అత్యధికముగా ప్రకాశించుదురు. కావుననే భక్తులకు, కష్టములు, ఆపదలు వచ్చును. కాని, వారు ధైర్యముతో ముందుకే సాగుదురు. "భూతాని విష్ణుః" సమస్తము విష్ణుమయము అన్నది మొదటి స్థితి. అపుడు, "అహం విష్ణుః" – నేను విష్ణువును అను భావము యొక్క దార్ఢ్యము సంపాదింపబడును. ప్రహ్లాదుని పాదములు సముద్రములో పడినక్షణమున, భూమండలమంతయు, సముద్రసహితముగా ఊగిపోయెను. ఈ భావనామహిమచేతనే, విష్ణుభావాపత్తి కలుగును. ఈరీతిగానే. ఛాందోగ్యోపనిషత్తునందు

"భూమైవా ధస్తాత్"

ఇత్యాది వచనములచేత సర్వత్ర, సర్వదిశలయందు భూమ, పూర్ణతమ, పురుషోత్తముని చెప్పి

"అహమేవ సర్వతః"

అంతట నేనే ఉన్నాను అని చెప్పబడినది. శ్రీవల్లభాచార్యుడు కూడా, దీనిని అంగీకరించును. కాని, ఇది సంచారీభావమని చెప్పును. కొంతకాలముపాటు, ప్రేమోన్మాదములోనికి వచ్చును. రాసపంచాధ్యాయియందు వ్రజాంగన

"కృష్ణోఽహం పశ్యత గతిమ్"

అని అనును. హే సఖి! నేను శ్యామసుందరుడనే. అచట, వృషభానునందినియొక్క స్థితి ఇట్లుండెను –

"మధురిపు రహమితి భావనాశీలా"

ఒక చెలికత్తె, శ్రీకృష్ణునితో రాధాసందేశమున ఇట్లు చెప్పెను - 'మీ ప్రియురాలు మీకై నిరంతరము ప్రతీక్షించుచు "నేను శ్రీకృష్ణుడనే" అని భావన చేయును. భక్తి (ప్రేమ), జ్ఞానముల చరమ భావము ఒకటియే. నవనీతచోరుడైన శ్రీకృష్ణుడు

"దాసోఽహం దాసోఽహం"

అని జపించుచు భావనచేయుచు భక్తుని 'దా' వర్ణమును అపహరించెను. ఇక 'సోఽహం' మిగిలిపోయెను. ఇది భక్తిమార్గము. వేదాంతమార్గము భిన్నము, శృంగారరసమునందు నాయికా నాయకులు పరస్పర భావాపన్నులై ఉందురు. అట్లే, శ్రీకృష్ణుని యందు, వ్రజాంగన అయిన వృషభానునందినియందు పరస్పర భావాపత్తి కలిగెను. కావున, భగవంతుడు ఎవరికిని భోగ్యుడు కాడు, అట్టివాడు ఆ వ్రజాంగనలకు భోగ్యుడయ్యెను. అకారణము చేత సర్వభోగ్య అయిన ఆ అధరసుధాప్రాప్తి వ్రజాంగనలకు కలిగెను.

బృందారణ్యము ఎటువంటిది ?

"బృందారణ్యం స్వపద రమణం"

"స్వపదం వైకుంఠధామ తస్మాదపి రమణమ్"

"కింవా స్వపదేన (స్యస్వపదం అధిష్ఠానం) రమణమ్"

వైకుంఠములు రెండు కలవు. ఒకటి, భౌమ వైకుంఠము, రెండు పరమ వైకుంఠము, బృందారణ్యము భౌమ వైకుంఠము. అది, పరమ వైకుంఠముకంటెగూడా, రమణీయమైనది. వైకుంఠ వాసులు ఈ భౌమ వైకుంఠమునకు రాగా, ఆ పరమ వైకుంఠము గూడా, ఇచటకు వచ్చెను. భగవంతుడు వెళ్ళిన స్థలమునకు ఆయన ధామముగూడా వెళ్ళును. ఈ అభిప్రాయముతోనే, సుమిత్ర లక్ష్మణునితో ఇట్లనును -

"అయోధ్యా మటవీం విద్ధి"

శ్రీకృష్ణుడు ఉన్నచోట, వైకుంఠముగూడా ఉండునని దీని వలన తేలిన సారాంశము. భక్తుల హృదయముగూడా, వైకుంఠమే. శ్రీకృష్ణపరమానందకందముయొక్క బృందారణ్యము ఎచట గలదు? వ్రజాంగనల హృదయమునందు. అచట, ప్రవహించిన ప్రేమసుధాతరంగిణి యమునానది. వారి ఉన్నత విశాల వక్షోజములు, గోవర్ధనాది పర్వతములు. రోమపంక్తి వనము. ఈవిధముగా సర్వభావములును అచట, సంపన్నము లగును. సజాతీయ. విజాతీయ భేదరహితుడైన శ్రీకృష్ణపరబ్రహ్మ యొక్క ప్రాకట్యము ఎచట జరుగును? మహావాక్యజన్య పర బ్రహ్మాకారాకారితమైన మానసికవృత్తియందు శ్రీకృష్ణపరబ్రహ్మ అభివ్యక్తమగును. సూర్యకాంతమణియందు అగ్నిరూపములో సూర్యుని అభివ్యక్తి జరిగినట్లు నిర్వృత్తికమైన అంతఃకరణము యొక్క పరబ్రహ్మాకారాకారిత వృత్తియందే, పరబ్రహ్మాభివ్యక్తి కలుగును. భక్తహృదయము ఎటువంటిది? అది, అతి నిర్మలము, స్నిగ్ధము, పవిత్రము, భగవదాకారాకారిత వృత్తిమంతము. భూమి మొదలుకొని క్రమముగా సర్వోపరిభాగమున, అవ్యక్తము, ఆ అవ్యక్తముపైన భగవంతుడు ఉండును. ఈ అవ్యక్తమే, ఆది శేషువు.

"శిష్యతే యః సః శేషః।"

కార్యములు కారణములయందు లయమైన తరువాత, కారణమే, శేషమై ఉండును. ఆ అవ్యక్తమాయవచ్ఛిన్న చైతన్యమహాకారము కారణము సహస్రఫణామండితము. దానియందే, శ్రీమన్నా రాయణుడు శయనించును. ఆ శేషశయనుడైన శ్రీమన్నా రాయణుడే, మహాకారణాతీతము, కార్యకారణాతీతము నయిన పర బ్రహ్మ.

"అవ్యక్త మనన్తాఖ్యమ్ ।"

అని భాగవతమునందు చెప్పబడినది. ప్రకృతి విశిష్టమైన చైతన్యమే అయిన ఆ అనంతుడే భగవదధిష్ఠానమైన ఆసనము. భగవదాకారాకారితము, స్వచ్ఛము, స్నిగ్ధము నయిన మనోవృత్తి యందు సగుణ. సాకార బ్రహ్మ అభివ్యక్తమగును. భగవంతు డున్న స్థలమునకు ఇది (మనోవృత్తి) వెళ్ళవలసివచ్చును. ఏల యనగా, అదిలేక, భగవంతుడు అభివ్యక్తి నొందడు. కావుననే, భక్తహృదయమే, అయోధ్య, భక్తహృదయమే బృందారణ్యము. దానిని సర్వత్ర, ప్రకటించుట కష్టము, శ్రమ. కాని, అది, వ్యాపకము. నేత్రము అని మనము దేనిని పిలుతుమో, అది, నేత్ర గోళకము, దానిలోపల అతీంద్రియమైన ఇంద్రియము ఉండును. అట్లే, బృందారణ్యము గోళకస్థానీయము. దానియందు ముఖ్య మైన బృందావనము కలదు. అచట, లౌకికత్వము దోషవశమున భాసమానమగును. భగవంతుడు తనయందే ప్రతిష్ఠితుడై ఉండును. ఆ శేషువు (ఆదిశేషువు) కేవలము అవ్యక్త జడాంశము కాదు. కాని, అవ్యక్తాంశమునందు చేతనాంశము ఉండును. బృందా రణ్యాలు అద్భుత, అనంత పరమానంద సుధాసింధువునుండియే, వికసితములైనవి. వానియందుగూడా, వానికి పైనగూడా, భగవ త్స్వరూపమైన బృందావనము వేఱుగా కలదు. బృందారణ్యము అవ్యక్తరూపము. దానియందు రసరూపమైన బృందారణ్యము ఉన్నది. స్వస్వరూపమైన బృందారణ్యమునందే, భగవంతుని రమణము జరిగెను.

"స్వపద రమణం, స్వపదాదపి రమణమ్"

వైకుంఠముతో గూడా రమణము. ఒక వ్రజాంగన ఇట్లనును -

"జయతి తేఽధికం జన్మనా వ్రజః శ్రయత ఇందిరా
శశ్వ దత్ర హి।"

హే శ్యామసుందర ! మంగళమయమైన నీ జన్మ, వలన వ్రజనగరి అత్యంత సుశోభితమయ్యెను.

"వై కుంఠాత్ సర్వస్మాదపి లోకాత్ అధికం జయతి"

ఎట్లు ? లక్ష్మీదేవి, బృందావనమందు నిరంతరము సేవ చేయుచుండును. వైకుంఠమునందైనచో, ఆ లక్ష్మీదేవి, శ్రీమాతయొక్క చరణారవిందముల రజస్పర్శకొఱకు ఉవ్విళ్ళూరుచుండును.

"యద్వాంఛయా శ్రీ ర్లలనాఽచరత్తపః"

యమునాఘట్టమునందలి బిల్వవనమునందు లక్ష్మీదేవి తపస్సు చేయును. ఈవిధముగా ఆలక్ష్మీదేవి ఈవ్రజమునందు సేవకురాలు. ఈరీతిగా "స్వపదాబ్జ్యంరమణం". బృందావనమునందు శ్రీచరణారవిందములు శిలలమీద అంకితములై ఉన్నవి. పాషాణముమీద నిలబడి చేసిన వేణునినాదమువలన ఆ పాషాణము కోమలమయ్యెను. ఆ కారణముచేత భగవత్పాదములు అచట అంకితములయ్యెను ఈరీతిగా భగవంతుడు బృందారణ్యమున, ప్రవేశించెను.

బృందారణ్యము స్వయముగా సుశోభితమే అయి ఉండును. కాని, ప్రభువుయొక్క శ్రీచరణారవిందములచేత అంకితమైన కారణమున, ఆ బృందావనము ఎక్కువగా సుశోభితమయ్యెను. అథవా,

"స్వపదం రమణం రతిజన్యం యస్య తత్"

భగవంతుని శ్రీచరణారవిందములవలన రమణము, రతి, ఆనందము లభించును. ఇట్టి ఆనందము ఏ వనమునకు లభించునో అది బృందావనము. అనగా ప్రభువుయొక్క శ్రీచరణముల స్పర్శయందు బృందారణ్యమునకు అద్భుతము, లోకోత్తరము

నయిన ఆనందము లభించును. భగవచ్చరణములే ఆనంద మయములు, మంగళమయములు. కావున, భగవచ్చరణ స్పర్శ కలిగిన ప్రతివస్తువునకును ఆనందము లభించియే తీరును. కాని, ప్రత్యేకముగా సరసమైనవానికి అత్యధికమైన ఆనందముకలుగును. కావున బృందారణ్యమునకు అధిక ఆనందము, రమణము కలిగెను. బృందారణ్యము సరసము, ఆర్ద్రము, అట్లయినపుడే భగవంతుని శ్రీచరణములు అచట అంకితములగును. ఒకవేళ ఎక్కువగా శ్రవణము కూడా చేసియుండవచ్చును. కాని హృదయము సరసము ఆర్ద్రము కాలేదు. అపుడు ప్రభుచరణములు అంకితములు కాజాలవు. గట్టి లక్కమీద ముద్రలు స్థిరముగా ఉండవు. అగ్ని సంబంధముచేత లక్క కరిగిపోయినపుడు ముద్ర అచట స్థిరముగా పడును. ఈ రీతిగానే హృదయము ఆర్ద్రమైనపుడే భగవంతుని మంగళమయ చరణములు అంకితములగును. కఠోరమైన హృదయమునందు కాదాచిత్కముగా (ఎపుడైనను) ప్రసంగవశము చేత అభివ్యక్తములైనను, స్థిరముగా ముద్రితములు కాజాలవు. ప్రసంగవశమున ఖలులు (దుష్టులు) గూడా ఉత్తమోత్తమ సంభాషణము చేయుచుందురు. కాని, వారు దానియందు స్థిరముగా ఉండరు. అచట, విదితమగు రసము రసాభాసము. కావుననే, హృదయము ద్రుతమగుటకు ప్రయత్నించినచో, భగవంతుని స్థిరమైన రతి కలుగును. కావున, బృందారణ్యము ద్రుతమగుట వలన (ద్రవీభావము నొందుటవలన) అచట, శ్రీచరణములు చిహ్నితములయ్యెను. ఆ బృందారణ్యమునకు రమణము, ఆనందము, రతి లభించును. ఆ బృందారణ్యమునందు భగవంతుడైన శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క నిరావరణ చరణములుండుట బృందారణ్యముయొక్క అద్భుత సౌభాగ్యము,

ఈ భాగ్యము ఉంతవఱకు ఎవరికిని లభింపలేదు. ద్వారకయందు భగవంతుడు నివసించును. అచట, ఆయన రాజాధిరాజు. రాజాధి రాజుయొక్క నిరావరణ చరణముల స్పర్శ భూమికి ఎట్లు సంభ వింపగల్గును? కావుననే, మధురకు గూడా, మధురానాధుని చరణముల స్పర్శ లేదు. దానికి ఈ సౌభాగ్యమే లేదు. ఈ సౌభాగ్యము బృందారణ్యమునకే కలదు. ఏలయనగా, ఇచటకు గోచారణరూపమైన స్వధర్మపాలనార్థమై శ్రీకృష్ణ ప్రభువు నిరావరణ చరణములతోనే ఏతెంచెను.

ఆనంద బృందావనచంపువునందు ఒక కథ కలదు. ఒకమారు శ్రీకృష్ణచంద్రుడు గోచారణార్థమై వనమునకు పోవుటకు మారాము చేసెను. శ్రీకృష్ణప్రభువు, తల్లితో ఇట్లనెను – "అమ్మా! నేను గోచారణమునకై వెళ్ళెదను", తల్లి, నందరాణి అయిన యశోద, తండ్రియైన నందుడు తమ గారాబుబిడ్డని ఒక్క క్షణకాలముగూడా తమను విడచియుండుటకు ఇష్టపడుటలేదు. సర్పమునకు మణి యందు లోకోత్తరమైన అనురాగము ఉండును. అట్లే నందరాజు తమ పరమ ప్రేమాస్పదుడైన శ్రీకృష్ణుడు గోచారణమునకై వెళ్ళుటవలన కలుగు వినియోగమును ఎట్లు సహింపగలడు? రాత్రి యందు వ్రజగేహినియైన యశోద, తన గారాబు బిడ్డని ఒడిలోనికి తీసికొని నిద్రించినపుడు మధ్యమధ్య మేల్కొనుచుండెడిది. మాటి మాటికి తన పిల్లవానిని స్పృశించుచుండెడిది. మహాదరిద్రునకు చింతామణి లభించిన, అతడు దానిని మాటిమాటికి జాగ్రత్త చేసి కొనుచుండును. అటులనే, వ్రజేంద్రగృహిణికి శ్రీకృష్ణప్రభువు నందు అద్భుతమైన అనురాగము ఉండెను. దానివలన, ఆమె మాటిమాటికి వానిని ముద్దిడుకొనుచుండును, మాడును అఘ్రాణించు చుండును. అట్టి శ్రీకృష్ణుడే, గోవత్సచారణమునకై వెళ్ళవలయు

నని మారాము చేసెను. అందున, ఈశ్యామసుందరుడు చేయునది చిలిపి మారాము.

అంత, తల్లి ఇట్లనును - బాబా! వెళ్ళవలదు.

అంత, శ్రీకృష్ణుడు ఇట్లనును - అమ్మా! కాదు. నేను వెళ్ళెదను. ఈ గోచారణము నా స్వధర్మము. దానిని నేను అవశ్యము పాలింపవలయును. చివఱకు శ్యామసుందరుడు అంగీకరించలేదు.

అపుడు, తల్లియైన యశోద ఇట్లనెను - బాబా, మంచిది. సరియైన ముహూర్తము లభించినపుడు వెళ్ళుము. నేను గర్గాచార్యులవారిని అడిగెదను.

భగవంతునకు సంకల్పము కలుగుటయే, అలస్యము! ఆ సమయముననే, గర్గాచార్యులు అచట కేతెంచెను. నేడు, బాబు మారాము చేయుచున్నట్లు ఉన్నదేమి? అని ఆ గర్గాచార్యుడు అడిగెను.

అంత నందరాణి, ఇట్లనెను - అయ్యా! తాను గోచారణమునకై బృందావనమునకు వెళ్ళెదనని బాబు అనుచున్నాడు. మీరు ముహూర్తము నిర్ణయింపుడు.

గర్గాచార్యుడుగూడా, పత్రములు చూచి ఇట్లనెను - 'మంచిదియే. ఈ గోపాష్టమి అత్యంత శుభదినము. ఆ దినముననే ముహూర్తము నిర్ణయించుము.

గర్గాచార్యుని వచనము విని, శ్రీకృష్ణుడు పరమప్రసన్నుడయ్యెను. గోకులాష్టమి వచ్చెను. ఆ దినమున, విధివిధానముగా గోపూజనము జరిగెను. యశోదామాత, శ్రీకృష్ణునిచేత గోవులకు సాష్టాంగప్రణామము చేయించెను. శ్రీకృష్ణప్రభువు తన తల్లితండ్రు

లకు ప్రణామము చేసి బృందావనమునకు బయలుదేరెను. ఇపుడు, తల్లి మాటిమాటికి గోపబాలురకు ఏదియో తెలియజెప్పుచుండును. ఇదిగో, మాబాబును జాగ్రతగా చూచుకొనుడు. వానిని, ఒంటరిగా ఎచటకును పోనివ్వకుడు. శ్రీకృష్ణుని హస్తారవిందమును గోపబాలకుల చేతిలో ఉంచును. ఈవిధముగా చెప్పుచు, చెప్పుచు, తల్లిదండ్రులు వానివెంట వెళ్ళుదురు. ఇది చూచి, శ్యామసుందరుడు ఇట్లనును - అమ్మా ! వెళ్ళెదను అమ్మా! తండ్రి ఇట్లనును - నాయనా ! పాదరక్షలను ధరించుము. శ్రీకృష్ణప్రభువు ఇట్లు సమాధానము చెప్పును. "వలదు, గోవు మన ఇష్టదేవత. ఈ గోమాత నిరావరణ చరణములతో పోవుచుండగా, నేను పాదరక్షలను ఎట్లు ధరించెదను ? పశుపాలనమే, మన ఇష్టదేవతారాధనము."

ఆరాధనయందు ఈ విధానమునే, పాటించవలయును. దిలీపమహారాజు నందినీధేనువుతో తత్సేవచేయుటకై వనమునకు పోయినపుడు ఈవిధముగానే వెళ్ళెను -

"స్థితః స్థితా ముచ్చలితః ప్రయాతాం నిషేదుషీ
మాసనబంధధీరః ।
జలాభిలాషీ జలమాదధానాం ఛాయేవ తాం భూపతి
రన్వగచ్ఛత్ ॥

శ్రీకృష్ణపరమానందకందము ధర్మసంస్థాపనార్థమై అవతరించెను. "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి" అనియే భగవద్వచనము. స్వయముగా, ఆచరించుట, ప్రచారము చేయుట ద్వారా ధర్మము సుస్థితమై ఉండును. కావుననే, గోచారణము ద్వారా శ్రీకృష్ణభగవానుడు స్వధర్మస్థాపనము చేసెను. భగవంతుడు చక్కగా గోసేవ చేయుచు నడచును. కావుననే, నిరావరణ చరణములతో (పాదరక్షలులేని పాదములతో) వెళ్ళెను.

కావుననే, బృందారణ్యమునకు సాక్షాత్తుగా శ్రీకృష్ణచరణస్పర్శ కలిగెను. అన్యములకు పరంపరయా కలిగెను. అన్యమైన ఏ ధామమునకు గూడా శ్రీకృష్ణుని నిరావరణ చరణముల స్పర్శ కలుగలేదు. కావుననే, అన్యత్ర సేవ్యురాలైన లక్ష్మిగూడా ఇచట, సేవకురాలై ఉండును. ఈవిధముగా చరణసంబద్ధమైన బృందావన సంబంధముచేతనే, సమస్త ధరిత్రి, తనను సౌభాగ్యశాలినిగా భావించును. ప్రభువు, నాహృదయమునందే కలడని భూమి గర్వితురాలయ్యెను.

వ్రజాంగనలు భూమిని గాంచి, 'ఓ ధరిత్రీ! శ్రీకృష్ణచంద్ర పరమానందకందము నిరావరణ చరణముల స్పర్శ కలుగుటకు నీవు ఎట్టి తపస్సు చేసితివి? అని అడిగిరి.

"కిం తే తపః క్షితి కృతం కేశవాంఘ్రిస్పర్శోత్సవోత్పులకి
తాంగరుహైర్విభాసి।
అప్యంఘ్రిసంభవ ఉరుక్రమ విక్రమాద్వా ఆహో
వరాహవపుషః పరిరంభణేన ॥"

హే సఖి! ధరిత్రి! శ్యామసుందరుడైన కేశవుని శ్రీచరణముల స్పర్శ కలుగుటకు నీవు ఏ యోగసాధన చేసితివి, ఏ ఆరాధన ఒనర్చితివి? ఆ ఉపాయము చెప్పిన, మేము గూడా అదియే చేసెదము. నీవు చేసిన తపస్సు తెలిసినచో, కల్పకల్పాంతరములందైనను, ఎప్పుడో ఒకప్పుడయినను, తద్భగవచ్చరణ స్పర్శ మాకు ప్రాప్తమగునట్లుగా, యుగయుగములు ఆ తపస్సే చేసెదము.

'మీరు, నా ఈ సౌభాగ్యమును ఎట్లు ఊహించితిరి? అని ధరిత్రి అడిగెను.

శ్యామసుందరుడైన వ్రజేంద్రనందనుని శ్రీచరణారవింద స్పర్శవలన కలుగు ఉత్సవమును మేము చూచుచున్నాము. ఆనందోద్రేకమువలన ఆహ్లాదమునందు రోమాంచము కలుగును. కార్యముచేతనే, కారణము ఊహింపబడును. నీవు, రోమాంచిత యగుట భగవచ్చరణస్పర్శఫలమే. భూమిపై గల వృక్ష, లతా, తరు, గుల్మ, ఔషధి, దూర్వలే రోమాంచములు. శ్రీకృష్ణపరమానందముయొక్క చరణస్పర్శవలననే, ఇటువంటి ఆనందము కలుగుట సంభవము' అని వ్రజాంగనలనిరి.

అంత, ధరిత్రి ఇట్లనెను - 'రోమాంచరూపములైన ఈ లతాదులు ఈనాటివా ? కాదు, ఇవి అనాదికాలమునాటివి'.

'ఈనాటికి కావను మాట యుక్తము కాదు. వామనావతారమున, భగవంతుడు తన చరణవిన్యాసములతో ముల్లోకములను వ్యాపించినపుడు, మంగళమయములైన ఆ చరణారవిందముల స్పర్శవలన, ఈ రోమావళి ఉద్గతమై ఉండును. చివఱకు, దీనికి కారణమేమి ? ఏమైనను చెప్పుము, ఆ భగవంతుని చరణస్పర్శలేక, ఈ రోమాంచము కలుగజాలదు. ఇటువంటి ఆహ్లాదము మరొకచోట ఎచటను కలుగదు'.

వ్రజాంగనావచనములను వినిన ధరిత్రి మరల ఇట్లనెను - 'కాదు, ఇవి, ఇంకను పూర్వకాలమునాటివి. వామనావతారమునకు ముందు, వృక్షలతాదిరూపములైన రోమాంచములు లేవా ?'

అపుడు, వ్రజాంగనలు ఇట్లనిరి -

"అహో వరాహవపుషః పరిరంభేణ ।"

హే సఖి ! ఈ రోమాంచములు ఆనాటివి కాకపోవచ్చును. గాని, మన ప్రియతముడైన ప్రాణధనుడు వరాహావతారమును గ్రహించి.

రసాతలమునుండి నిన్ను పైకి ఉద్ధరించుసమయమున, నిన్ను పరిష్వంగము చేసికొనెను. ఆ సమయమునుండి ఈ రోమావళి ఉండియుండును. ఈ రోమాంచితము బ్రాహ్మరససంస్పర్శ చేతనే కలుగజాలును. కావున, ఇప్పుడు కాకపోయిన, వామనావతారము నందు కలిగియుండనోపు, వామనావతారమునందు కలుగకపోయిన, వారాహావతారమునందే అనుకొనుము. హే సఖి! ధరిత్రి! దాచకుము, చెప్పుము, సత్యము చెప్పుము, మేము గూడా, నీవలెనే తప మాచరించెదము'.

ఈ కారణముచేతనే, బృందారణ్యసంస్పర్శవలన, భూమి అంతయు, రోమాంచితమయ్యెను. భూమి, తన సౌభాగ్యమునకు గర్వితురాలై మిడిసిపడుచున్నది. 'శ్రమ లేక, వింధ్యపర్వతము గొప్పది కాలేదు' అను మాట భూమివిషయమునగూడా, సంగతము.

వింధ్యాచలమునందలి ఏకదేశమైన చిత్రకూటమును శ్రీమద్రాఘవేంద్రుడయిన రామచంద్రుడు చరణములతో, స్పృశించెను. అచట, తాపస వేషములో భగవంతుడు నివసించెను. ఇంతమాత్రముచేతనే, వింధ్యపర్వతము గొప్పదనమును పొందినది.

ఒకనాడు, దేవర్షియైన నారదుడు వింధ్యపర్వతము దగ్గరకు వచ్చెను. ఆయన, ఆ వింధ్యపర్వతముతో ఇట్లనెను – 'నీవు అతి ప్రాచీనమైనదానవు. కాని, లోకమంతయు, హిమాలయము గొప్పదని భావించుచున్నది. ఇది అసంగత మనిపించుచున్నది'.

అపుడు, వింధ్యపర్వతము ఇట్లు ఆలోచించెను – 'సూర్యుడు మేరుపర్వతప్రదక్షిణము చేయును. ఈ కారణముచేతనే, లోకము మేరుపర్వతమును గొప్పదని భావించుచున్నది. కావున, దానిని ఆపి వేయవలయును. ఇట్లు ఆలోచించి, వింధ్యపర్వతము పెరగ

సాగెను. సూర్యభగవానుని మార్గము నిరుద్ధమయ్యెను. ధర్మ, కర్మ, ఉపాసనా, అగ్నిహోత్రాద్యనుష్ఠానములన్నియు ఆగిపోయెను. సూర్యోదయమే కాకపోయిన, ఏదియైనను జరుగుట ఎట్లు? అపుడు, దేవతలు, ఋషులు సంత్రస్తులై అగస్త్యమహర్షిని ప్రార్థించుటకై కాశీనగరమున కేగిరి. అగస్త్యమహర్షిని ప్రార్థించి, ఆయననే, వింధ్యపర్వతము దగ్గరకు పంపిరి. వింధ్యపర్వతము అగస్త్యమహర్షియొక్క అంతేవాసి. ఆయనను గాంచి, వింధ్య పర్వతము ఖర్వరూపమును ధరించి ఆ మహర్షికి ప్రణామము చేసెను.

అగస్త్యుడు ప్రసన్నుడై – 'నేను వచ్చునంతవఱకు నీవు ఇటులనే ఉండుము'అని పలికి దక్షిణ సముద్రమువైపునకు వెళ్లెను. వింధ్యపర్వతము ఉన్నది ఉన్నట్లుగానే, నిశ్చలముగా ఉండిపోయెను. శ్రీమద్రాఘవేంద్రుడైన శ్రీరామచంద్రుడు చిత్రకూటాద్రిపైన నివసించునపుడు, వింధ్యపర్వతము, మరల అనాయాసముగా ఉత్కర్షను పొందెను, తచ్ఛత్రువులు సైతము తన్మహత్త్వమును అంగీకరింపసాగిరి. భగవంతుని మంగళమయములైన శ్రీచరణముల స్పర్శచేత, బృందారణ్యమే కాక, సమస్త భూమండలము సౌభాగ్యసంపన్నమయ్యెను.

కింవా,

''స్వపదయోః రమణం రతిజనకం – స్వపదరమణమ్ ।''

భగవంతుని మంగళమయ శ్రీచరణారవిందములకు ఆనందము నొసగునట్టిది. అనగా, అతిరమణీయమైన భూమి, సుకోమలమైన ఇసుకతో, శ్యామలములు, ధవళములును అయిన దూర్వలతో, అద్భుతములైన అభినవ పత్రములతో, పుష్పములతో, పల్లవములతో బృందారణ్యభూమి శోభాయమానముగా

ఉండెను. శ్రీకృష్ణచరణారవిందముల విన్యాసముగల స్థలమున, కాఠిన్యము తెలియకుండునట్లు, బృందారణ్యము తనను అలంక రించుకొనినది. ప్రభుచరణములకు బాధ కలిగించని బృందారణ్య ధామమున, శ్రీకృష్ణుడు ప్రవేశించెను. శ్రీకృష్ణప్రభు చరణ విన్యాసము కలిగినచోట, బృందారణ్యము తన హృదయకమల మును వికసింపజేయుచుండెను. భగవంతుని చరణారవిందములు బృందారణ్యహృదయమునందే విన్యస్తములగుచుండును. శ్రీకృష్ణ ప్రభుచరణములు అత్యంత కోమలములనియు, ఆ చరణసరోజ ములయందు బృందారణ్యమునందలి దూర్వా, కుశ, కంటకాదులు గ్రుచ్చుకొనవచ్చుననియు, వ్రజాంగనలు సంతాపము చెందు చుందురు. అలౌకిక ప్రతీతి అభిలషణీయమే. శ్రీకృష్ణుని చరణార విందములయందు కంటకాదులు గ్రుచ్చుకొనునేమో? అని వ్రజాంగనలకు సర్వదా మనస్సు నొచ్చుకొనుచుండును.

"యత్తే సుజాతచరణాంబురుహం స్తనేషు భీతా వయం
ప్రియ దధీమహి కర్కశేషు।
తేనాటవీ మటసి తద్వ్యథతే న కింస్విత్ కూర్పాదిభి
ర్భ్రమతి ధీ ర్భవదాయుషాం నః ॥"

హే శ్యామసుందర! వ్రజేంద్రనందన! మన్మోహన! నీ శ్రీచరణములు సుజాతములు, సద్యోజాతములు, సుకోమలములు నయిన కమలములకంటె గూడా, శతకోటిగుణితముగా కోమలము లైనవి. మాకు గల తాపాపనోదనమునకై ఆ చరణాంబుజములను మా హృదయమునందు ధరింతుము. కాని, నీ చరణములనిన, సుకోమలములు, మా హృదయములందువా, కఠినములు, కావున కఠోరహృదయ సంపర్కముచేత నీ పాదకమలములు నొచ్చుకొను నేమో? అని సంకోచించుదుము. ఇందువలన, భయభీతలమై,

కర్కశహృదయములయందు - వక్షోజములయందు - మనోహను డైన శ్రీకృష్ణచరణారవిందములను ధరింతుము, దానివలననే, నీవు అటవీసంచారము చేయుచుందువు, వనమునందు సంచరించు చుందువు; అచట, బృందారణ్యమునందలి దూర్వా, లతా, గుల్మ, తృణ, అంకుర, కంటకాదులవలన, సుకోమలములైన నీ చరణ ములు వ్యథ నొందుటలేదు కదా? అయ్యో! శ్రీశ్యామసుందరునకు ఇంత కష్టము కలుగుటయా, మేము ఇంకను, జీవించి ఉండుటయా!

ఈ భావమువలననే, ఆ వ్రజాంగనల నిష్కామత్వము ప్రకటమగుచున్నది. ఇచట, స్వసుఖసుఖిత్వము కాదు, తత్సుఖ సుఖిత్వము ఉన్నది. దీనివలన శ్యామసుందరుని సుఖమునందు వ్రజాంగనలు సుఖము కలవారై ఉండుట చెప్పబడినది. తండ్రి, తన పిల్లవాని ముఖమును ముద్దిడుకొనుచున్నపుడు, పిల్లవానికి ఆయన గడ్డము, మీసములు గ్రుచ్చుకొనును. పిల్లవానికి ఇది బాధాకరముగా ఉండును. కావున, అతడు ఏడ్చును. కాని, తండ్రి, తన ఆనందములో పిల్లవాడు ఏడ్చుచుండుటను లక్ష్యపెట్టడు.

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి"

తండ్రి, పిల్లవానివైపు దృష్టి ఉంచడు. ముద్దులవాన కురిపించు చుండును. వ్రజాంగనలు శ్రీకృష్ణచరణారవిందములను సంపూర్ణ ముగా ఆలింగనము చేసికొనుట, రాగముయొక్క స్వాభావిక లక్షణము. కాని, శ్రీకృష్ణప్రభుచరణములు అతి కోమలములు, మా హృదయప్రదేశము అతి కఠినము, అని వారి హృదయము భయ పడుచుండును. ఇచట, చరణములకు బాధ కలుగునన్న దృష్టియే కాని, తమ ముఖముమీద దృష్టి లేదు. శ్రీకృష్ణచరణముల గాఢా లింగనము ప్రాప్తించినది. కాని, వారు రాగోద్రేకమును అణచి వేసుకొందురు. ఏమైనను, వారికి తమ యందు దృష్టి లేదు. ఈ

భావము సాధారణ కామినీ స్త్రీలయందు ఎచటైనను కలుగజాలునా? కావున,

"ప్రేమైవ గోపరామాణాం కామ ఇత్యగమత్ ప్రథామ్"

అని చెప్పబడినది. గోపాంగనలకు కామము లేదు. కాని, వారి ప్రేమయే 'కామ' శబ్దముతో ప్రఖ్యాతమయ్యెను. ఈ దృష్టితోనే "శ్రీచరణములకు కష్టము కలుగుచుండగా చూచియు, జీవించి ఉండగలమా?" అని వ్రజాంగనలు అనిరి. బ్రహ్మ, శరీరమును సృష్టించి మాకొసగెను. కాని, మా ఆయుర్దాయము నీ చేతిలో ఉంచెను. లేనిచో, ఇప్పటికీ ఎపుడో, మరణించి ఉండెడివారము. కాని, నీ దర్శనాభిలాషవలన ఈ నేత్రములు మరణింపనిచ్చుట లేదు. ఇదియే, మేము జీవించి ఉండుటకు కారణము.

"భవానేవ ఆయుః యాసాం తాసాం భవదాయుషామ్ ।"

ఇది, వ్రజాంగనల భావన. వాస్తవమునకు బృందావనము రస హీనము కాదు. ఏలయనగా,

"స భగవాన్ కస్మిన్ ప్రతిష్ఠితః ? స్వే మహిమ్ని ।"

అను వచనానుసారము ఈ బృందావనము భగవంతుని స్వరూపమే. మన్మోహనుని చరణముల కోమలత్వమునందును, సరసత్వము నందును బృందావనమునకు దృష్టి ఉండెను. కావున ఆ బృందారణ్యము శ్రీకృష్ణచరణముల క్రింద తన హృదయకమలమును వికసింపజేయుచుండెను. సాధారణముగా ఆ భగవంతుని చరణ స్పర్శవలన అతి కఠోరమైనవాని కాఠిన్యము కూడా దూరమగును. వజ్రము కూడా నవనీతమువలె సుకోమలమగును.

సింహినికి గూడా తన పుత్రునియందు రాగము ఉండును. కాని, సర్పిణికి ఉండదు, ఇందువలననే సర్పిణిని నిర్దయురాలని, పుత్రభక్షకురాలనియు, పుత్రాదిని అనియు అందురు. రాక్షసికి

గూడా తన పుత్రునియందు అనురాగము ఉండును. కాని, సర్పిణికి అనురాగము ఉండదు. కాని, ఇటువంటి సర్పిణి, ఇటువంటి వృశ్చికముగూడా భగవంతుని చరణదర్శనముచేసి సహజమైన తమ తామసభావమును తీక్ష్ణమైన విషమును వదలివేసి నిర్విషములు, శాంతములు, సాత్త్వికములును అగును. అపుడు బృందారణ్యమునందలి దూర్వా, లతా, కంటకాదులు కోమలము లగుటలో ఆశ్చర్యమేమి కలదు? ఆ భగవద్వస్తువే తాదృశమైనది,

"బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్గీతకీర్తిః।"

భగవంతుని చరణములకు ఆనందము నొసగునట్టి, "భయపడకుడు, ప్రభుచరణములకు కష్టము కలుగదు" అని వ్రజాంగనలకు సమాశ్వాసనము కలిగించునట్టి బృందావనమునందు గోపాలకుల సమూహముతో గీతకీర్తిగల భగవంతుడు ప్రవేశించెను. ఇది బృందకు సంబంధించిన అరణ్యము. 'బృంద' అనగా తులసి. మొదట జాలంధర దైత్యుని పత్నిగా ఉన్న బృందకుసంబంధించిన అరణ్యమున. దీని తాత్పర్యమేమనిన, దైత్య భోగ్యగా ఉన్న బృంద ఇపుడు భగవదీయురాలయ్యెను. అనగా భగవంతునికి సంబంధించిన వస్తువు అయ్యెను. ఈ బృంద, తులసి, లక్ష్మి వృషభానునందినివలె గోలోకాధామమునందు నివసించు (భగవదీయ) దివ్యమహాశక్తి. కాని, ఏమియో తెలియని ఒక దుర్విధి వలన భగవంతుని మహాశక్తి భగవద్భోగ్య అయి గూడా దైత్య భోగ్య అయ్యెను. ఇష్టములేకయే జాలంధర దైత్యునిపట్ల అనురక్తురాలయ్యెను. తరువాత పూర్ణతముడు, పురుషోత్తముడు అయిన శ్రీకృష్ణచంద్ర పరమానందకందము తన అనుకంపా విశేషముచేత జాలంధరదైత్యుని వధించి బృందను స్వీకరించెను.

కథ ఇట్లు ఉండెను. -జాలంధరునకు, శివునకు సంగ్రామము జరుగుచుండును. జాలంధర పత్నియైన బృంద పతివ్రత. ఆమె

పాతివ్రత్యము భంగము కానంతవఱకు జాలంధరవధ అసంభవము. కావున శ్రీమహావిష్ణువు జాలంధరవేషమును ధరించెను. బృంద యొక్క గృహములోనికి పోయి ఆమె పాతివ్రత్యము భంగము చేసినప్పుడు ఆ దైత్యుడు మరణించెను. బాహ్యముగా కనిపించు నట్టి ఈ భావము కొంత వక్రమైనది. శ్రీమహావిష్ణువు ఇటువంటి దుష్టమైన పని ఎట్లు చేసెను ? అని జనులు అడుగుదురు. కాని, దీనియందలి అంతరంగభావము మఱొక తీరుగా ఉన్నది. ధర్మా ధర్మ విచారణయందు వానికిగల గౌరవలాఘవములు చూడబడును. జాలంధరుడు స్వయముగ పాతివ్రత్యమును అంగీకరించువాడు కాడు. వేదోక్తిమార్గమును విఘటితము చేయుచుండెడివాడు. సర్వ ధార్మిక మర్యాదల వ్యాపాదకుడైనవాడు పాతివ్రత్యమును ఏమి యెఱుంగును ? ఇటువంటి సర్వ ధర్మనాశకుడైన జాలంధరుని నాశమొందించుటకై ఈషణ్మాత్రము ధర్మవ్యత్యయమును చేయ వలసియున్నచో అది సహ్యమే. ఒక సత్యమువలన పదివేల గోబ్రాహ్మణులవధ జరుగుచున్నచో ఆ సత్యమువలన లాభమేమి కలదు ? సత్యభాషణము మిథ్యాధర్మమైనచోట అసత్యమే పలుక వలయును.మన సత్యవచనమువలన అపారధర్మనాశనము జరుగు చున్నచో దాని మహిమ లేదు.

నా గాండీవధనుస్సును నిందించినవాని శిరస్సును త్రుంచి వేయుదునని అర్జునుని ప్రతిజ్ఞ. ఒకమారు ఇటువంటి సంఘటన జరిగెను. యుద్ధమునందు కర్ణునిచేత విహ్వలుడైన ధర్మరాజే గాండీవమును నిందించెను. ఇదివిని అర్జునుడు ఇట్లు ఆలోచించెను– "నేను క్షత్రియుడను, నా ప్రతిజ్ఞ దృఢమైనది." ఈ విధముగా ఆలోచించిన అర్జునుడు యుధిష్ఠిరుని వధించుటకై ఖడ్గము తీసెను. శ్రీకృష్ణభగవానుడు మధ్యలో అడ్డువచ్చి అర్జుననితో ఇట్లనెను– అరె! నీవు ధర్మముగూడా ఎఱుగుదువా! పరమారాధ్యుడు, జ్యేష్ఠ

భ్రాత అయిన ధర్మరాజు నీకు వధ్యుడా? నీ ప్రతిజ్ఞాపాలనము కొఱకు ఆయనను 'యుష్మత్' (నీవు) అను శబ్దముతో సంబోధించుము. ఇదియే పెద్దలను వధించుట అని అర్జునుడు తెలిసికొనెను. అతడు ధర్మరాజును 'నీవు, నీవు' అని పలుమార్లు అనెను. దీనివలన ధర్మరాజు ఉద్విగ్నుడయ్యెను. ఇదిచూచి అర్జునుడు ఇట్లు అనసాగెను – "నేను ఇపుడు ఆత్మహత్య చేసికొనెదను. నేను ధర్మరాజును ఉద్దేశించి 'త్వం' (నీవు) అను శబ్దమును ప్రయోగించితిని." అంత కృష్ణుడు ఇట్లనెను – 'నీవు పిచ్చివాడవు. నీవు నీ గొప్పతనమును చెప్పికొనుము. ఆత్మశ్లాఘ చేసికొనుము. ఇదియే ఆత్మహత్య.' అంత, అర్జునుడు ఆత్మశ్లాఘ సంకీర్తనము చేసెను. ఈవిధముగా భగవంతుడు చాతుర్యముతో పాండవుల నావను దరిజేర్చెను. కావుననే "కైవర్తకః కేశవః"అని చెప్పబడెను. కావుననే ధర్మాధర్మముల గౌరవ లాఘవములను ఆలోచింపవలెను. సర్వధర్మములకు శత్రువైన జాలంధరుడు ఇతర ఉపాయములతో మరణించనపుడు ఒక ధర్మమును విఘటన మొనర్చి అనంత ధర్మసంఘటనము చేయుట నైతికమే అయి ఉన్నది.

మరొక దృష్టితో చూచిన, అచట పాతివ్రత్యభంగమే జరుగలేదు. ఏలయనగా, శ్రీమహావిష్ణువు బృందకు పరమపతి. వస్తుతః, పాతివ్రత్యధర్మముకంటె గూడా, విష్ణుసంబంధమునే పొందుట పరమ ధర్మము. తెలిన సారాంశమేమనిన బృంద, మొదట భగవదీయురాలే, గోలోకధామనివాసిని. దుర్విధివలన ఈమె, జాలంధర భోగ్య అయ్యెను. ఈ బృంద మరెవరో కాదు, ప్రాణుల బుద్ధి. వాస్తవమున ఈమెకు సంబంధము ముఖ్యసాక్షితోనే ఉండవలెను. కావున బుద్ధి, పూర్ణతమ, పురుషోత్తమాకారాకారిత మగుటయే, స్వాభావికమైన సాఫల్యము. ఆ బుద్ధి, జగదాకారాకారిత మగుటయే

దుర్విధి. భగవత్ప్రాప్తికొఱకు జీవులకు బుద్ధి లభించినదిగాని, సాంసారిక నిర్ణయముల కొఱకు కాదు. కావున, భగవత్సంబంధము బుద్ధికి సుస్థిరమగుటయందే, ఆ బుద్ధియందు భగవదభివ్యక్తి కలుగుటయందే బుద్ధియొక్క పరమ సాఫల్యము. ఆ బృందకు దైత్యసంబంధమును విముక్తమొనర్చి, దైత్యభోగ్య అయిన ఆ బృందను భగవద్భోగ్యగా జేయుట శ్రీమహావిష్ణువుయొక్క మహాను గ్రహము. ఈ స్థితియే, ప్రపంచమునందు గూడా కలదు. బుద్ధుల పైన రాక్షసాధికారము కలదా లేక భగవదధికారము కలదా? సాధారణమైన బుద్ధి అసురభోగ్య అగును. కావుననే. ఆ బుద్ధి, పాప, తాప, దంభములయందు సంలగ్నము చేయబడును. నానా యోనులయందు జన్మించుచు తిరుగుట దాని ఫలమే. వాస్తవము నకు, ఘటము పుట్టినంతనే, ఆకాశముతో నిండిపోవును. తరువాత, పాలతో, జలముతో, మృత్తికతో నిండిపోవును. ఈవిధముగా బుద్ధి, ఉత్పన్నమైనంతనే, ఆకాశసదృశుడైన పరమాత్మతోనే నిండి యుండెను. దానిలో ప్రపంచము నిండియుండుట ఆగంతుకము. అయినను, బుద్ధి ఈ ప్రపంచమునకు పతివ్రత అయ్యెను. ఒక్క క్షణకాలముగూడా, దానినుండి ప్రపంచము బయటకుపోదు. ఇదియే, బుద్ధియొక్క దృశ్యప్రపంచమునందు, రాగము, ప్రీతి, పాతివ్రత్యము, అభినివేశము అయ్యెను. ఇపుడు, పూర్ణతమ పురుషోత్తముడే, దయ చూపవలయును. హఠాత్తుగా దైత్యసంబంధ విమోచనము చేసినపుడే, కొంత లాభము జరుగును. ఆ బుద్ధి, స్వయముగా నివృత్తము కాదు. ఈ బుద్ధిబలముచేతనే దైత్యుడు ప్రపంచమునందు అనేకములైన అనర్థములను సంపాదించు చున్నాడు. ఎవరు ఈ దైత్యవధ చేయుదురు? దేవాధిదేవు లందఱును, ఈ దైత్యునివలన, వ్యాకులురై ఉన్నారు. భగవంతుడు, బలాత్కారముగా ఈ దైత్యసంసర్గమును వదలించి

నపుడే, మంగళము కలుగును. వాస్తవ పతి, భగవంతుడే. ఏల యనగా, మొదట, బుద్ధి, భగవదాకారాకారితమై, తరువాత సర్వాకారాకారిత మగును. ఈ కథయే, అచట జరిగినది. గోలోకవాసిని అయిన బృందాదేవి శాపగ్రస్త అయ్యెను. జాలంధరుడుగూడా, గోలోకవాసియైన గోపాలకుడు. అతడు దైత్యుడయ్యెను. వానికి ఈ బృంద, పత్ని అయ్యెను. ఆమెకు ఈ సంబంధము ఆగంతుకము. కావున, రుద్రాదిదేవతలు ఏమియు చేయలేనివారైనపుడు, భగవంతుడు ఛలముతో దైత్యసంబంధమును వదలించి స్వకీయను స్వీకరించెను. ఈరీతిగానే, ఈ బుద్ధికి రాక్షసితోగల సంబంధమును వదలించి భగవంతుడు తన సంబంధమును స్థాపించవలయును. బుద్ధికిగల సర్వాకారాకారిత్వమును దూరము చేసి, దానియందు, తన (భగవంతుని) ఆకారమును స్థాపింపవలయును. అపుడే, ఆనందము కలుగును, స్వాతంత్ర్యము సిద్ధించును.

ఆ బృందముయొక్క అరణ్యమే, బృందారణ్యము.

అథవా,

"బృందాయాః వనం యౌవనం బృందావనమ్ ।"

ఇది బృందయొక్క యౌవనము. అనగా ఈ బృందావనము బృందయొక్క దేదీవ్యమానమైన స్వరూపమే. ప్రతి దశయందు శ్రీకృష్ణచరణారవిందములచేత సుశోభితమగుట బృందావనము యొక్క స్థితి. భగవంతుడు సాలిగ్రామమునందు విరాజమానుడై ఉన్నచోట ఆ బృంద తులసీరూపములో సేవ చేయును. ప్రియతముడు, ప్రాణధనుడు అయిన పురుషోత్తముని రూపములో ప్రభువు వ్రజమునందు అవతరించినపుడు ఆ బృంద ఇచట బృందావనములో ప్రకటయయ్యెను. ఇచట ప్రవహించు యమునా నది బృందాహృదయముయొక్క ప్రేమానందరసప్రవాహము.

ఈ బృందారణ్యమునందు గల వృక్షములు రోమాంచములు. బృందారణ్యభూమియే బృందాదేవిశరీరము. కావున వ్రజాంగనలు ఇట్లు ఈర్ష్యపడుదురు — సఖి! చూడుము మనోమోహనుడైన శ్యామసుందరుడు బృందావనమునందు ప్రవేశించును. ఇచట అంతయు విపరీతమే జరుగుచున్నది. మన అధరసుధను ఆయన ఎంత దురుపయోగము చేయుచున్నాడో చూడుము. జడము, సచ్ఛిద్రము, శుష్కమునయిన వంశీచ్ఛిద్రములయందు ఆ అధర సుధను నింపుచున్నాడు. మన హృదయమునందు ఆయన చరణా రవిందములు స్థాపితములు కావలయునని మనము వాంఛించుదుము. కాని అట్లు జరుచలేదు. ఆయన మొదట బృందావనము నందు ప్రవేశించెను. అథవా

"స్వపదరమణం – స్వస్యాః ఆత్మీయాయాః
వృషభానునందిన్యాః పదైః రమణమ్ ।"

అనగా శ్రీవృషభానునందినియొక్క మంగళమయ చరణారవిందములతో సుశోభితమగు బృందారణ్యములో శ్రీకృష్ణుడు ప్రవేశించెను. రాసలీలాదులయందు వృషభానునందిని అచటకు వచ్చును. కావున ఆ వృషభానునందినియొక్క చరణములచేత భూషితమైన అరణ్యమునందు శ్రీకృష్ణుడు ప్రవేశించెను. ఏతావతా ఉద్దీపన విశేషము సిద్ధించెను. శ్రీకృష్ణచంద్రపరమానందకందముయొక్క అంతరంగప్రేయసియైన వృషభానునందినియొక్క చరణచిహ్నితమైన బృందారణ్యమును చూచి ప్రసన్నత కలిగెను. కావున 'ప్రావిశత్' అని చెప్పబడెను. అనగా బృందారణ్యములోనికి ప్రవేశించెనని అర్థము.

ఆ శ్రీకృష్ణప్రభువు ఏమి చేయుచు ప్రవేశించెను?

"రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్"

వేణువుయొక్క రంధ్రములను అధరసుధతో పూరించుచు ప్రవేశించెను. 'వేణోః' శబ్దముచేత పుంస్త్వము సూచితము చేయ బడెను. వేణువు పుంలింగ శబ్దము. పురుషరూపమైన వేణుఛిద్రముల యందు అధరసుధను పూరించుచు భగవంతుడు ప్రవేశించెను. మరొక దృష్టి ఏమనిన, వేణుఛిద్రములయందు అధరసుధాసన్ని వేశము చేసి, భగవద్భోగ్యమైన అధరసుధను వ్రజాంగనల యందును, దేవభోగ్యమైన అధరసుధను ఖగాదులయందును ప్రవేశపెట్టెను. దీనికి కేవలము వేణువు ఒక పాత్రయే(సాధనమే). అధరసుధారసము వేణువునకు లభించదను విషయమే, ఉప పాదనము చేయబడినది. భగవంతుని అధరసుధచేత పాషాణములు ద్రవించినపుడు, వేణువు ఏల సంస్కరింపబడలేదు, దానియందు శ్యామలత్వము ఏల రాలేదు? అది ఉన్నది ఉన్నట్లుగానే, ఏల ఉండెను? దీనికి కారణమేమనిన, ఆ వేణువు కేవలము పాత్ర మాత్రగానే ఉండెను. దానికి ఎమియు లభించలేదు. మరొక దృష్టితో చెప్పినచో, వేణువు మంచి చాతుర్యము గలది, భగవంతు నకు ప్రియ సఖి. అది, వేణురూపములో తనను గుప్తము చేసికొని, పుంరూపములో అభివ్యక్తమై శ్యామసుందరుని అధరమునందు విరాజిల్లి, తన్మధుర సుధాపానము చేయును. ఎవరును దానిని చూచి, ఈర్ష్యపడకుండునట్లు అది వేణువయ్యెను. ఈ వేణువు శ్యామసుందరుని రసాస్వాదనము చేయుచున్నదని తెలియకుండు నట్లు వేణువయ్యెను. లేనిచో, ఎవరైనను ఆ అధరసుధను దొంగి లింతురు. వృషభానునందిని పలుమార్లు దానిని దొంగిలించెనుగూడ. కావున, ఆ వేణువు సచ్ఛిద్రమై, గ్రంథిసహితమై, శుష్కమై ఉండును. ఏలయనగా, ఆ వేణువు బహుచాతుర్యము కలది. ఉత్తమశ్రేణికి చెందిన రసికులు తమ రసమును అభివ్యక్తము

చేయరు. రోదనము చేసినను, లోపల లోపలనే చేయుదురు. బాహ్యముగా చేయరు. ఈవిధముగ వేణువు మహాధైర్యముతో రసాస్వాదనము చేయుచుగూడా, తనను శుష్కముగానే ఉంచుకొనును. తనయందు ఆకుపచ్చని పల్లవములు బయల్వెడుచో శ్యామసుందరుడు తనను వదలిపెట్టునని ఆలోచించును. ఇది మనకు ఉపయోగించునది కాదని అయున, అనును. ఏ రసాభివ్యక్తియందు శ్యామసుందరుడు దానిని వదలునో, ఆ రసము నిష్ప్రయోజనము. వేణువు శ్యామసుందరుని అమృతమయ ముఖచంద్రునిపైన ఆసీనమై, అధరసుధారసాస్వాదనముచేత ప్రపుల్లితమయ్యెను, అని తలచినపుడు అది మ్రోగనే మ్రోగదు. అది, సరసము కానంత వఱకే అధరపల్లవముపైన పరుండబెట్టుకొనుట, సుధాస్వాదము నొసంగుట జరుగును. కావున, ఆ వేణువు తనను సరసము కానివ్వదు. పరంపరయా అధరసుధాస్వాదనము వలన పాషాణములు ద్రవించినపుడు, నదులు స్తబ్ధములు, రోమాంచితములు అయినపుడు సాక్షాత్తుగా రసాస్వాదనము చేయు వేణువు సరసము ఏల కాదు? గోపికలకు ఈ చాతుర్యముయొక్క జాడ తెలిసెను. కావుననే, వ్రజాంగనలు తరువాత ఇట్లు అందురు –

"గోప్యః కిమాచరదయం కుశలం స్మ వేణుః।"

హే సఖి! ఈ వేణువు ఏమి పుణ్యము చేసికొనెనో గదా!

ఒక స్థలమున, ఇట్లు చెప్పబడినది – ఒక సమయమున, శ్యామసుందరుడైన వ్రజేంద్రనందనుడు రాధాగుణసంకీర్తనమునందు వ్యగ్రుడై ఉండెను. అపుడు, భగవంతుని ముఖపంకజము నుండి సరస్వతీదేవి అభివ్యక్తి అయ్యెను. ఆమె, అనంతకోటి కందర్పుల దర్పదళనమునందు పటువు అయిన స్వరూపమును చూచినపుడు ముగ్ధురాలై భగవంతుని ఆలింగనమును అభిలషిం

చెను. అంత, శ్రీకృష్ణచంద్రుడు ఇట్లనెను - "నానుండి ఇటువంటి పరిరంభణము కోరుచున్నచో, బృందావనమునందు వేణురూపమున ప్రకటమగుము". ఆమె, వంశీరూపమును దాల్చి, బృందావనమునకు బోయి, ఘోర తప మాచరించెను. అనేక యాతనలు సహించెను, ఛేదింపబడెను, విదీర్ణము చేయబడెను, అగ్నియందు కాల్చి సరళమైనదిగా చేయబడెను. ఛిద్రసహితముగా చేయబడెను. అపుడు, ఆమె, శ్రీకృష్ణచంద్రపరమానందకందము యొక్క ముఖచంద్రునిపై విరాజమాన అయ్యెను. ఇపుడు శ్రీకృష్ణప్రభువు ఆ వేణువును (సరస్వతిని) తన అధరపర్యంకము పైన పరుండబెట్టుకొని, ముకుటమును ఛత్రముగా పట్టుకొని, కుండలములతో నీరాజనమిచ్చి, అధరసుధాభోగమును కలిగించి, కోమలములైన తన, యంగుళీదళములతో ఆమె (వేణువుయొక్క) పాద సంవాహనము చేసెను. శ్రీకృష్ణచంద్రుడు ఆ వేణువునందు అతి ప్రసన్నుడై ఉండును. ఈరీతిగా వేణువును సుధారసముతో ఆపూరితము చేయుచు భగవంతుడు బృందారణ్యధామమున ప్రవేశించెను.

"ఇతి వేణురవం రాజన్ సర్వభూతమనోహరమ్ ।
శ్రుత్వా వ్రజస్త్రియః సర్వా వర్ణయన్త్యోఽభిరేమిరే ॥"

వేణుచ్ఛిద్రములయందు ప్రవేశించి, భగవంతుని అధర సుధయే 'బర్హాపీడం' అను శ్లోకముగా వ్యక్తమయ్యెను. దీని యందు ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసము కలదు. కావుననే, శ్రీశుకమునీంద్రుడు పరీక్షిన్మహారాజుతో ఇట్లనెను -

"నాశకన్ స్మరవేగేన విక్షిప్తమనసో నృప ।"

అనగా, స్మరవేగముచేత విక్షిప్తమైన మనస్సు గలవారగుటవలన, వ్రజాంగనలు తద్వర్ణనము చేయజాలకపోయిరి. 'నాశకన్' -

వర్ణించలేకపోయిరి అనినపుడు, ఈ వర్ణనము ఎట్లు సంభవము ? దీనికి సమాధానమేమనిన, పరమ అంతరంగ వ్యక్తియైన శ్రీశుకుడు తరచుగా వ్రజాంగనలయందు తన్మయుడై లీలావర్ణనము చేయును. కావున ఆయన ఎపుడు ఏ లీలను వర్ణించుచుందురో అపుడు ఆ రసమునందు తన్మయులగుచుండెడివారు. కావున వ్రజాంగనలు శ్రీకృష్ణచంద్రపరమానందకందముయొక్క ముఖ చంద్రునినుండి నిర్గతమైన వేణురవమును – వేణునాదమును – శ్రవణము చేసినపుడు తద్వర్ణనము చేయుటకై ప్రయత్నశీలలు అగుచుండెడివారు. కాని, వేణునాదము మహామోహనమంత్రము, దానిచేత వారు మూర్ఛిత లగుచుండెడివారు. అతికష్టముమీద భగవత్కృపవలన, స్వస్థితి గలవారై, మరల వేణుగీత శ్రవణము చేయుదురు. నాదమనిన, నాదముమాత్రమే. గీతమునందు కొంత అర్థము ఉండును. కావున, వేణుగీతార్థస్వరూపుడైన శ్రీకృష్ణుడు వ్రజాంగనల హృదయమునందు, అంతఃకరణమునందు, అంత రాత్మయందును అభివ్యక్తుడగును. మరల, ఆ వ్రజాంగనలు తద్వర్ణనము చేయుటకై ప్రయత్నింతురు. శ్రీకృష్ణస్మరణముచేత పునః, మూర్ఛితలగుదురు. మొదట, వేణునాదమువలన మూర్ఛితలు, అనంతరము ఆ వేణునాదముయొక్క ఉద్గమస్థాన మైన శ్రీకృష్ణచంద్ర స్మరణముచేత మూర్ఛితలు, మరల, గీతా ర్థానుభవముచేత, మోహితలగుదురు. చివరకు వర్ణనము చేయ దలచినపుడు, విక్షిప్తమనస్కలై వర్ణించుటకు సామర్థ్యము లేనివా రగుదురు. వారి ఈ అసామర్థ్యమును చూచి, తన్మయావస్థను పొందిన శుకుడే, స్వయముగా వర్ణించును. ఇచట, ఇది, శుకవాక్య మగుట దీనికి హేతువు. ఇది గోపికలు వర్ణించియుండిన, 'గోప్య ఊచుః' అని చెప్పిఉండెడివారు. అట్లు చెప్పనందున, లీలారసభావా పన్నుడై గోపాంగనాభావాపన్నుడైన శ్రీశుకుడు "ఇతి వేణురవం

రాజన్'' అని చెప్పుటవలన స్పష్టమగుచున్నది. మరొక భావమే మనిన, పరీక్షిన్మహరాజును సంబోధించి, శ్రీ శుకదేవుడు ఇట్లనును– ''వ్రజాంగనల మనస్సునందు క్షోభ ఏల కలిగెను? శ్రీకృష్ణ పరమానందకందముయొక్క ఎటువంటి స్వరూపము అభివ్యక్తమై క్షోభాజనకమయ్యెనో, అది 'బర్హాపీడం' ఇత్యాది శ్లోకములచే ప్రతిపాదితము. ఇటువంటి ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసాత్మక స్వరూపమును హృదయమునందు అనుభవించుటవలన, వారి హృదయములు స్మరాతిరేకముచే విక్షుబ్ధములయ్యెను, కావున,

''యాదృశం స్వరూపం మనఃక్షోభకరం జాతం
తాదృశమాహ బర్హాపీడమితి।''

అని చెప్పబడెను. కావుననే, శ్రీ శుకుడు, అంతర్లీలానివిష్టుడనియు, సాక్షాత్తు వృభానునందినియొక్క నిత్యనికుంజమునందు నివసించు శుకమనియు భక్తులు చెప్పుదురు. ఏ శుకమునకు వృషభానునందిని శ్రీకృష్ణనామమును పాఠముగా చెప్పెనో, శ్రీకృష్ణుడు గూడా, ఏ చిలుకలకు వృషభానునందినీ నామమును పాఠముగా చెప్పెనో, ఆ శుకముయొక్క అవతారవిశేషమే, ఈ శుకమునీంద్రుడు. కావున, ఈ శుకమునీంద్రుడు లీలారసమును ప్రత్యక్షముగా, ఆస్వాదించుచు వర్ణించుచుండెడివాడు. అయినను ఆయన, అధికారానుసారముగానే, ''ఇతి వేణురవం'' అని గుప్తమైన శబ్దములలో వర్ణించెను.

ఇచట 'ర' వర్ణముచేత అగ్నిబీజము విప్రయోగాత్మక శృంగారము 'వ' వర్ణముచేత అమృతబీజము సంయోగాత్మక శృంగారము వివక్షితము. ఆ వేణురవము ''సర్వభూత మనోహరము.'' శ్రీజీవగోస్వామి ఇట్లు చెప్పుదురు – ఇచట, 'భూత' పదముచేత చేతనాచేతనములను, స్థావర జంగమములను సమస్తమును గ్రహించవలయును. 'మనోహర' పదమును లక్షణయా

'వికారకారి' అను అర్థమునందు గ్రహింపవలయును. ఈ వేణు రవము ప్రతి ప్రాణియందును, చేతనాచేతనములయందును, వికారమును గలిగించెను.

"అస్పందనం గతిమతాం పులకం తరూణామ్ ।"

అని చెప్పబడెను. గమనశీలము గల ప్రాణులు నిశ్చలులైరి. యమునాప్రవాహము ఆగిపోయెను. పర్వతములు, పాషాణములు ద్రవీభూతములై ప్రవహించినవి. కావున, ఈ 'మనోహర' పదము వికారకారి అను అర్థమున పర్యవసితము. కావున, స్థావరజంగమము లన్నియు, క్షుబ్ధములయ్యెను.

"శ్రుత్వా వ్రజస్త్రియః సర్వాః ।"

ఇతరులయందును క్షోభ కలిగియుండవచ్చునుగాని, వ్రజాంగనలకు విశేషమైన క్షోభ కలిగెను. అచట, ఆ వేణురవము తన తీవ్ర పరాక్రమమును అత్యంతము వ్యక్త మొనర్చెను. చేతనాచేతనములకు క్షోభ కలిగినపుడు. వ్రజవాసుల విషయము చెప్పనేల ? మొదటి విషయమేమనిన, ఆ రవము, సర్వమనోహరము, ప్రేమకు ప్రధానమైన స్థలమునందు తత్ప్రభావవిషయము చెప్పనేల ? భక్తి, వృద్ధురాలై బృందావనమునకు వచ్చి, యువతి అయ్యెను. ఆ బృందావనము దివ్యభక్తిక్షేత్రము. పైకి చూచుటకు ఆ వ్రజభూమి నీరస మనిపించినను, అంతరంగమునమాత్రము అత్యంత స్నిగ్ధము సరసము, సుకోమలమును అయినది. తద్వ్రజవాసులు, తత్రాపి, అత్యంత కోమలహృదయముకల స్త్రీలు. వారిలోను, మనోహర వేణు రవశ్రవణము చేసిన వ్రజాంగనలు – కొంత భావాపన్నలు, సఖ్య భావాపన్నలు నయిన సౌభాగ్యవతులయందు ఆ వేణురవము యొక్క విశేషప్రభావము కలిగెను.

ఎవరిపైన, ప్రభావము కలిగెను ? అందఱిపైన – 'సర్వాః' ఈ పదము (సర్వాః) చేత నిత్యలు, సాధనసిద్ధాదులు,.

పూర్ణతముడు, పురుషోత్తముడు, పరమ రసామృతమూర్తియు నయిన శ్రీకృష్ణుడు నిత్యుడు, ఆయన మాధుర్యాధిష్ఠాత్రియైన వృషభానునందిని నిత్య, తదంశభూతలైన వ్రజాంగనలు సైతము 'నిత్యలు', గోలోకధామమునందు పరమానందకందమైన భగవానుడు సర్వదా విరాజమానుడై ఉండును. అచటే వృషభాను నందిని, అంతరంగభూతలు, అంశభూతలును అయిన వ్రజాంగనలు గూడా విరాజిల్లుచుందురు. సాధనసిద్ధలలో, రెండవవారు ఋషిరూప సాధనసిద్ధలు.

''అద్యాపి యత్పదరజః శ్రుతిమృగ్యమేవ ।''

అనగా, నేటివరకు శ్రుతులు పరమ రసామృతమూర్తియైన భగవంతుని, అన్వేషించుచున్నవి. అన్వేషించుచున్న ఈ శ్రుతులకు మూర్తిని ధరించిన ప్రభువు లభించినపుడు, ఆ ప్రభువుయొక్క ఆద్భుత గుణగణములయందు ప్రసన్నలైనపుడు ఆ శ్రుతులు బ్రహ్మస్పర్శాభిలాషను వ్యక్తము చేసినవి. ప్రభువు, ఆ శ్రుతులను వ్రజమునకు, పొండు అని ఆదేశించెను. వారే, సాధనసిద్ధలు. వారుగూడా నిత్యలే. ఏలయన, బ్రహ్మయందే నిరంతరము శ్రుతుల రమణము ఉండును.

''సర్వే వేదా యత్పద మామనన్తి ।''

సమస్త వేదములు ఆ పూర్ణతమ పురుషోత్తముని ప్రతిపాదిపాదించు నని తేలిన సారాంశము.

ఈ సిద్ధాంతము ననుసరించి సర్వ శ్రుతుల తాత్పర్యము పరమేశ్వరునియందే కలదు. ఆ పరమేశ్వరునియందే, శ్రుతులు రమణము చెందును. ఈ శ్రుతులయందు 'అనూఢా, ఊఢా' అని రెండు భేదములు కలవు. ఎవరు, శ్రీకృష్ణప్రాప్తికై కాత్యాయనీ పూజనము చేసిరో, వారు అనూఢలు (పెండ్లికాని కన్యలు)

అనబడుదురు. తమ తమ భర్తలయందు మమకారముమాత్రము కలవారు ఊఢలు (పెండ్లి అయినవారు) అనబడుదురు. బ్రహ్మ గోవత్స, గోపాలాదులను హరించినపుడు, శ్రీకృష్ణప్రభువు తనకు తానుగానే, ఒక సంవత్సరపర్యంతము గోవత్స, గోపాలాది రూపములను ధరించినపుడు, గోపకన్యల వివాహము బాహ్యదృష్టితో అన్య గోపాలకులతో జరిగెను. కాని, వస్తుతః, అందఱి వివాహములు శ్రీకృష్ణప్రభువుతోనే జరిగెను. వాస్తవమునకు, స్థితి ఇదియే. ఏల యనగా, శ్రీకృష్ణుడే ఆ సమయమున సకల గోపబాలకుల రూపములో విరాజమానుడై ఉండెను. కావున, లోకదృష్టితో ఆ గోప కన్యలు అన్యవివాహితలు అయి గూడా, శ్రీకృష్ణప్రభువునకు స్వకీయలే అయిరి. వారిలో పరకీయత్వము కేవలము ఆరోపము మాత్రమే.

"న జాతు వ్రజదేవీనాం పతిభిః సహ సంగమః"

అని చెప్పబడినది. వ్రజాంగనలు ఎన్నడును, ప్రాకృత (ఈ ప్రపంచమునందు గల) పతులతో సంగతలు కాలేదు. శ్రీకృష్ణ ప్రభువే, వారి సర్వస్వము. ఈ స్థితియే శ్రుతిరూపలైన సాధన సిద్ధలయందు గూడా కలదు.

అనేక శ్రుతులు భగవంతునియందు "ప్రజ్ఞానం బ్రహ్మ" ఇత్యాది రీతిగా తాత్పర్యము కలిగి ఉండును. మఱికొన్ని శ్రుతులు పరంపరయా అగ్ని, యమ, వరుణాదుల స్తుతిద్వారా భగవంతునితో సంబంధము కలిగి ఉండును. ఏ శ్రుతులకు ఏ అర్థము ఉండునో, వానికి ఆ అర్థములతో సంబంధము ఉండును. ఇదియే, ప్రతిపాద్యప్రతిపాదక భావసంబంధమనియు చెప్పబడును. వాక్కుకు, అర్థమునకు వాస్తవమున భేదము లేదు. వాగర్థముల సంబంధము పతిపత్నిసంబంధము. అర్థము పతి, వాక్కు పత్ని.

"కదాచన స్తరీరసి"

అను శ్రుతి, ఇంద్రప్రస్తావిక అగుటచే ఇంద్రపత్ని. ఏ వాక్యమునకు ఏది ప్రతిపాద్యవస్తువో, అదియే, తత్పతి. ఆరీతిగానే, ఏ శ్రుతి వాక్యములకు ఆపాతతః, (పైకి చూచుటకు) అర్థము అన్యమో, కాని, మహాతాత్పర్యము బ్రహ్మయందే యుండునో - అవాంతర తాత్పర్యము ఇంద్రాదులయందును, మహాతాత్పర్యము బ్రహ్మ ప్రకాశనమునందును ఉండునో, అట్టి శ్రుతులు గూడా కలవు. పరమాత్మయే, ముఖ్యపతిగా గల ఒక శ్రుతి కలదు.

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

అను శ్రుతి పరమేశ్వరునకు స్వకీయ. ఏ శ్రుతులు ఇంద్రాదులను ప్రతిపాదించుచు పరమాత్మయందు పర్యవసితములగునో, ఆ శ్రుతులకు అవాంతరపతులు ఇంద్రాదులు, ముఖ్యపతి పరమేశ్వరుడైన బ్రహ్మ. ఇటువంటి పరిస్థితిలో ఈ విధముగా చెప్పబడినది -

"కథ మయథాభవన్తి భువి దత్తపదాని నృణామ్ ।"

అనగా, ఎవరైనను, ఎచట అడుగువేసినను, చివరకు ఆ అడుగు భూమిమీదనే ఉండును. ఈ విధముగా సమస్త తత్త్వములు పరంపరయా బ్రహ్మయందే చరితార్థములగును. కటక, ముకుట, కుండలాదులు సువర్ణమే కదా! సముద్రమునుండియే, లక్షలాది సముద్రతరంగములు లేచును. అట్లే, పరమాత్మనుండియే, ఉద్భవించిన ఇంద్రాదులందఱును పరమాత్మలే అయి ఉన్నారు.

పూర్వమీమాంసకులు, జాతియందు శక్తిని అంగీకరించుదురు. ఆ శక్తి 'త్వ' ప్రత్యయముచేత వేద్యము. ఉదాహరణకు 'ఘటత్వము' అనగా, ఘటముయొక్క భావము ఘటరూపముగా పరిణమించిన మృత్తిక. ఈరీతిగానే మృత్తికాత్వముయొక్క అర్థము జలము, జలత్వమునకు అర్థము తేజస్సు. తేజస్త్వమునకు అర్థము

వాయువు. వాయుత్వమునకు అర్థము ఆకాశము. ఆకాశమునకు అర్థము అహంతత్త్వము. ఆ అహంతత్త్వమునకు అర్థము మహత్తత్త్వము. ఆ మహత్తత్త్వమునకు అర్థము అవ్యక్తము. ఆ అవ్యక్తముయొక్క అర్థము సత్తత్త్వమునందు పర్యవసించును. కావున, సమస్తమునకు అర్థము ఆ సత్తత్త్వమే.

"సా సత్తా సా మహానాత్మా తామహు స్త్వతలాదయః ।"

కావున, బ్రహ్మయందే సమస్త శక్తులయొక్క పర్యవసానమగును.

"సర్వేషామపి భావానాం భావార్థో భవతి స్థితః ।
తస్యాపి భగవాన్ కృష్ణః కిమతద్వస్తు నిరూప్యతామ్ ॥"

అనగా, సమస్త వస్తువుల భావార్థము స్వకారణమునందు పర్యవసితమగును. అదియు, సత్తయందు పర్యవసించును. ఆ సత్తయే, శుద్ధమైన యథాత్మ్య బ్రహ్మ. ఇపుడు, శ్రుతుల అర్థము బ్రహ్మయందు పర్యవసితమగుటలో ఆశ్చర్యమేమి కలదు? చివఱకు శబ్దమని దేనిని అందుము? ప్రపంచమును శబ్దమందుము. ఆ ప్రపంచము పరబ్రహ్మయే. కావున, ఏమి చేసినను, సత్తయందే, సమస్తము పర్యవసిత మగును, ఆ సత్తయే, పరబ్రహ్మ. అయినను, వాని అవాంతర తాత్పర్యము, ఈ పరమతాత్పర్యము విభిన్న పదార్థములే. 'ఘట' శబ్దమునకు సాక్షాత్తుగా అర్థము కంబుగ్రీవాదులు గల వ్యక్తి (వస్తువు). కాని, గంభీర పర్యాలోచన చేసినపుడు, దాని అర్థము బ్రహ్మయే అగును. వాస్తవరూపము అదియే, కృత్రిమరూపములు వేఱు వేఱుగా ఉండును.

కావున, వ్రజాంగనల కృత్రిమ మమకారాస్పదులు విభిన్న గోపాలకులు. కాని, వారితో వ్రజాంగనలకు సంగమము కలుగ లేదు.

వ్రజాంగనలు శ్రీకృష్ణపరమానందకందముతో రాసలీల చేయుచున్నప్పుడు. వ్రజమునందు బ్రాహ్మీరాత్రి ప్రకట మయ్యెను. ఆ రాసలీలయొక్క దివ్య శోభను జూచి, చంద్రుడు ఆకాశమధ్యమున స్థగితుడయ్యెను.

"విస్మితః శశాంకః"

ఆఱు మాసముల రాత్రి. గృహమునందు గోపాలకు లందఱును వారి వారి దారలు (భార్యలు) వారి ప్రక్కననే ఉండిరని భావించు చుండెడివారు.

"మన్యమానాః స్వ పార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్
దారాన్ వ్రజౌకసః ।"

ఏతావతా, ఈ వ్రజాంగనలు శ్రీకృష్ణునకు స్వకీయలు అని స్పష్ట మయినది.

శ్రీకృష్ణపరమానందకందముతో విహారము సలుపు చున్నప్పుడు సైతము, తద్వ్రజాంగనల మాయామయస్వరూపము గోపాలకులందఱి యొద్ద ఉండెను. కావుననే, 'న జాతు' అని చెప్ప బడినది. అయిన,

"వ్రజదేవీనాం పతిభిః సహసంగమః"

అను వచనముచేత సిద్ధమైన, విషయమేనిన, ఏ శ్రుతులకు అవాంతర తాత్పర్యము ఇంద్రాదులయందు గలదో, ఆ శ్రుతులు పరకీయలు. ఏ శ్రుతులకు సాక్షాత్తుగా, ప్రభువునందు తాత్పర్యము కలదో, ఆ శ్రుతులు స్వకీయలు. వీరిలోగూడా, తటస్థ, ప్రౌఢ, ముగ్ధ ఇత్యాది భేదములు అనేకము కలవు. ఒక శ్రుతి, నిషేధ ముఖముగాను, మరొక శ్రుతి విధిముఖముగాను, భగవంతుని యందు పర్యవసితములగును. ఈవిధముగా మహాతాత్పర్య భావము కలుగనంతవఱకు అవాంతరతాత్పర్యము గూడా ఆదర

ణీయము. ప్రపంచమునందు గూడా, గౌణపతి, ముఖ్యపతి ఉందురు. రాజాదులు గౌణపతులు. వాస్తవమైన పతి పూర్ణతముడు, పురుషోత్తముడును అయిన పరమాత్మ. ఆ పరమాత్మప్రాప్తి కలుగునంతవఱకు అవాంతరపతిని అనుసరించుట అపేక్షితమే అగును.

జలము బ్రహ్మ, తరంగములు జీవులు. ఉదకమునందు తరంగమున్నట్లు పూర్ణతమ పురుషోత్తమునియందు జీవభావము ఉండును. వీనిలో ఒక తరంగమునకు అన్య తరంగములతోటి సంబంధము గౌణము. తరంగములకు జలముతో ముఖ్యమైన, సుస్థిరమైన స్థాయి అయిన సంబంధము ఉండును. కాని, అంతర్ముఖత్వములేనికారణమున, తమ వాస్తవసంబంధము వైపునకు దృష్టి ప్రసరించదు. తరంగము జలమును అపలాపము చేసినచో, స్వయముగా అస్తిత్వము కలిగి ఉండదు. ఆరీతిగానే. జీవుడు, బ్రహ్మను త్రోసిరాజు అనినచో, తాను ఎట్లు ఉండును? వాస్తవమునను, అతడు బ్రహ్మయే. కాని అంతర్ముఖుడు కానందున, అతడు బ్రహ్మను దర్శింపలేడు. జీవుడు, ఆనందసింధువుమధ్య ఉండును. అది, ఆనందసింధువని తెలియనిచో, తృష్ణ ఎట్లు ఉపశమించును? యదార్థమైన వస్తువును మఱచి, కృత్రిమ వస్తువును అతడు చూచును.

జీవులమైన మనము కృత్రిమ సంబంధము గల భార్యాదులతో సంబంధము పెట్టుకొందుముగాని, యథార్థమైన సంబంధము గల బ్రహ్మతో సంబంధము పెట్టుకొనము. కృత్రిమమైన దానికొఱకే, సమస్తము చేయుదుము. ఒక తరంగమునకు మరొక తరంగముతో గల సంబంధము ఎన్ని దినములు ఉండును? ఏదియో ఒక దినమున, వియోగము తప్పక కలుగును. జీవునకు గల సంబంధము ఆగంతుకముగాన, క్షణభంగురము. కావుననే

సర్వులకు పరమపతి పూర్ణతముడైన పురుషోత్తముడు. ఆయనయే, సర్వులకు ముఖ్యపతి.

రాసలీలా ప్రసంగమునందు, శ్రీకృష్ణప్రభువు వ్రజాంగనలను వెడలిపొండని చెప్పినపుడు, ఆ వ్రజాంగనలు శ్రీకృష్ణచంద్రునకు ఒక కథ చెప్పిరి – "ఒక పతివ్రత స్త్రీ కలదు. ఒకమారు ఆమె, భర్త విదేశములకు వెళ్ళినపుడు, ఆమె భర్తయొక్క మూర్తికి పూజచేయుచుండెడిది. ఒకనాడు, ఆ విగ్రహమునకు పూజ చేయుచుండగా ఆమె భర్త వచ్చెను. ద్వారము తెరువుము అని కేక వేసెను. ఇపుడు ప్రశ్న ఏమనిన, ఆమె, తలుపు తెరుచుటయా, లేక భర్తృవిగ్రహమును పూజించుచు కూర్చుండుటయా? అని, శ్రీకృష్ణుని ప్రశ్నించిరి. అంత, శ్రీకృష్ణుడు ఇట్లు సమాధానము చెప్పెను – ఇపుడు, వాస్తవ పతికి స్వాగతము చెప్పవలయును. అంత, వ్రజాంగనలు 'మాకు గూడా, సమాధానము వచ్చినది' అని పలికిరి.

తాత్పర్యమేమనిన, శాలిగ్రమమును విష్ణుబుద్ధితో పూజించిన రీతిగానే, ప్రాకృతులైన భర్తలను పరమపతిబుద్ధితో, పూజింపవలయును. కావుననే,

"విష్ణురూపాయ వరాయ లక్ష్మీరూపాం కన్యాం సంప్రదదే।"

అని కన్యాదానమునందు చెప్పుదురు. ప్రపంచమునందలి సంచలనములన్నియు పూర్ణతముడైన పురుషోత్తముని వైపునకే ఉన్నవి. ఆ భగవంతుడు లభించనంతవఱకు సంచలనము యథాతథముగానే ఉండును. కావున, సర్వ శ్రుతుల మహాతాత్పర్యము బ్రహ్మయందే నిర్ధారితమైనది.

ఈవిధముగా స్వకీయలు, పరకీయలు, ముగ్ధలు, ప్రౌఢకాంతభావవతులు, సఖ్యభావవతులు, శ్రుతిరూపలు, మునిరూపలు

నయిన వ్రజాంగనలందఱును, వేణురవమును శ్రవణము చేసి, తద్వర్ణనము చేయుచు, ఆనందోన్మాదమునందు తన్మయతావశము చేత ఒక వ్రజాంగన మరొక వ్రజాంగనను శ్రీకృష్ణుడని భావించి పరిరంభణము చేసికొనసాగిరి. ప్రేమోన్మాదమునందు శ్రీకృష్ణుడే వారికి సర్వత్ర, కన్పడసాగెను. అథవా, వర్ణనము చేయుచు స్వబుద్ధియందు ఆరూఢుడైన శ్రీకృష్ణప్రభువుయొక్క మంగళమయ మూర్తిని పరిరభంణము చేయసాగిరనియు చెప్పవచ్చును.

వేణురవమునందే, శ్రీకృష్ణచంద్ర పరమానందకందము యొక్క స్వరూపము, తన్మంగళమయ లీలలయి ఉన్నది. కావున, తద్వర్ణనమునందు శ్రీకృష్ణచంద్ర వర్ణనము కలదు. మొదటగా శ్రీకృష్ణుడే, రసామృతమూర్తి. ఆయనయందు గూడా, సాధనత, సాధ్యత - రెండును గలవు. కరచరణారవిందములు మొదలగు ఇతర అవయవములయందు సాధ్యతతోపాటు సాధనత గూడా కలదు. ఆనందము కేవలము సాధ్యమే. సమస్తము ఆ సాధ్య వస్తువు కొఱకే అయి ఉన్నది. కాని, ఆ సాధ్యవస్తువు ఎవరికొఱకును కాదు. ఇదియే, బ్రహ్మ లక్షణము. కావున, రెండును, ఒకటియే. శబ్దాది సమస్త పదార్థములు ఆనందనిమిత్తమే అయినరీతిగా, ఆత్మార్థమైగూడా అయి ఉన్నవి.

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి ।"

ఆనందము నిరతిశయము, నిరుపాధికము, పరప్రేమాస్పదమైనట్లు ఆత్మగూడా, నిరతిశయము, నిరుపాధికము, పరప్రేమాస్పదము.

ఏ వస్తువునందు ఒకప్పుడు, ప్రేమఉండి, మరొకప్పుడు ప్రేమ ఉండదో, అది అపరప్రేమాస్పదము. ఇట్లు ఉండని వస్తువు పరప్రేమాస్పదము. ఔపాధికము అపరము, స్వాభావికము 'పరము', ఔపాధికమైన వస్తువు ఉపాధియొక్క అధీనములో

ఉండును. స్వాభావికమైన వస్తువు ఉపాధియొక్క అధీనములో ఉండదు. అది, నశించునట్టిది కాదు. ప్రపంచమునందలి స్త్రీ, పుత్రాది ప్రేమలన్నియు, ఔపాధికములు. ఇంతవేల, ప్రపంచము నందు దేవత అనుకూలముగానున్నపుడే, ఆ దేవతయందు ప్రేమ కలుగును. మంత్రములయందు గూడా, కొన్ని అరి (శత్రు) మంత్రములు ఉండును, మరికొన్ని మధ్యమ మంత్రములు ఉండును. ఏ మంత్రము వలన, అనుకూలమైన ఫలము కలుగదో, అది, అరిమంత్రము. ఈ అభిప్రాయముతోనే, సమాన తత్త్వములు సమాన సాధకులు లభించినపుడు చక్కగా మంత్రసిద్ధి కలుగునని చెప్పబడినది. ప్రస్తుతము ఈ ఆలోచనలే లేవు. మొదట, చక్కగా విచారించి మంత్రదీక్షను పొందవలయునని శాస్త్రములు చెప్పు చున్నవి.

సారాంశమేమనిన. దేవతలుగూడా, ఆత్మకు అనుకూలురై నపుడే ఆ దేవతలయందు ప్రేమకలుగును. శైవులు విష్ణువును ద్వేషించుట, వైష్ణవులు శివుని ద్వేషించుట చూచుచుందుము. వాస్తవ మునకు, పూర్ణతముడు, పురుషోత్తముడు నయన భగవంతుడు ఒక్కడే. కాని, వ్యర్థముగా ఆ భగవంతునియందు ద్వేషాస్పదత్వ మును, రాగాస్పదత్వమును ఊహింతురు. రామభక్తులకు రామాయణము మధుర మనిపించినంతగా అన్యగ్రంథములు మధురములుగా ప్రతీయమానములు కావు.

బృందావనమునందైనచో, శ్రీకృష్ణునియందు గూడా, భేదమును భావింతురు. ఒకరు ఎడమవైపు ముకుటము గల శ్రీకృష్ణుని భావించిన, రెండవవాడు కుడివైపు ముకుటము గల శ్రీకృష్ణుని ధ్యానించుదురు. వాస్తవమునకు, కుడి, ఎడమలయందు గూడా, కొంత భావము, కొంత రహస్యము తప్పక గలదు. వేణు

గీత సందర్భమునందు ఎడమవైపు ముకుటము గల శ్రీకృష్ణుడే ఉన్నాడు.

"వామబాహుకృత వామకపోలః"

శ్రీకృష్ణభగవానుని లలితమైన మూర్తియందు ముకుటము ఎడమ వైపునకే నతమై ఉండును. వృషభానునందిని విరాజిల్లుచున్న వామాంగమునందు శ్యామసుందర శ్రీకృష్ణపరమానందకందము యొక్క వామాంగమునందే ఒంగియుండుట కన్పడును. ఆయన ఎటువైపునకు ఒంగియుండునో, అటువైపునకే ఆయన ఆభరణములు గూడా, ఒంగియుండునని చెప్పెదురు. కావున, ఆ పరిస్థితిలో ముకుటము ఎడమవైపునకు వ్రాలుట స్వాభావికము. శ్రీకృష్ణ బలరాములు ఉన్నచోట, దక్షిణభాగమునందున నందుడు, నంద రాణి వామభాగమునను, మధ్యన బలరాముడు నందుని దగ్గఱ, శ్రీకృష్ణుడు యశోదదగ్గఱ ఉన్నపుడు, ముకుటము కుడివైపు బలరామునివైపునకు ఒంగియుండును. వాస్తవమునకు, ఇదియే, రహస్యము. చివఱకు, ఈ జగడము న్యాయాలయము నకు పోయినపుడు, న్యాయాధిపతి, ముకుటమును తిన్నగా పెట్టు కొనుము అని తీర్పు ఇచ్చెను.

పోనిండు. మూలవిషయ మేమనిన, ఆనందము, నిరతి శయము, నిరుపమము, పరప్రేమాస్పదము. అన్యమైనవేమో, ఔపాధికములు, సాతిశయములు. ఆనందము, ఆత్మ ఒక్కటియే. ఆనందముతో ఎన్నడును శత్రుత్వము లేనిచందముగానే, ఆత్మతో గూడా ఎన్నడును శత్రుత్వము ఉండదు. సర్వద్రోహము జరుగ వచ్చును గాని, ఆత్మద్రోహము ఎన్నడును జరుగదు. శ్రీకృష్ణుడు నిఖిల రసామృతమూర్తి, ఆనందసారసర్వస్వము. ఆయన, సాధ్య వస్తువేగాని, సాధనము కాడు. కాని, దానియందుగూడా, దేవభోగ్య

మైన అధరసుధ, భగవద్భోగ్యమైన అధరసుధకు సాధనమనియు, భగవద్భోగ్యమైన ఆ అధరసుధ గూడా, సర్వభోగ్యమైన అధర సుధకు సాధనమనియు భక్తులైన భావుకులు చెప్పుదురు. పరస్పరము భావాపత్తిపూర్వకముగా అది (వేణురవము) సర్వ భోగ్య అధరసుధకు సాధ్యమాత్రము. అది, దేనికిని సాధనము కాదు. అది, రసమువలన అభివ్యక్తమగును. ఆ భగవంతుని నిత్య లీలగూడా, అందు నిహితమై ఉన్నది. కావుననే,

"ఇతి వేణురవం రాజన్"

అని శుకుడు చెప్పెను. ఈ వేణురవమునందు అమృతత్వము యొక్క ఉపాలంభము కలుగును. దానివలన, బ్రహ్మ, ఇంద్ర, శుక, సనకాదులు గూడా, మోహితులగుదురు.

"శక్ర శర్వ పరమేష్ఠి పురోగాః కశ్మలం యయు
రనిశ్చితతత్త్వాః।"

పూర్ణతముడు, పురుషోత్తముడు నయిన భగవంతుడు దీని వలన ప్రకటమగుటచేతనే, ఈ వేణురవమునను ఇంత ప్రాధాన్యము కలదు. సాధారణముగా, భగవంతుడు సర్వత్ర ఉండును. కాని, అభివ్యంజకమైన సాధనము లేనపుడు ఏమగును? కావున, భక్తులు వ్యంగ్యమైన భగవంతునికంటె గూడా వ్యంజకమైన భగవన్నామ మును అధిక మహత్త్వము కలదిగా భావింతురు. కోట్లకొలది సంపద గృహమునందు నిండియుండవచ్చును. ఆ సంపద ఉన్నదని తెలియనిచో, దాని ప్రయోజనమేమి? ఆ గృహయజమాని నాగలి దున్నుకొనుచునే ఉండును. భగవన్నామము ఆ కోశాగారమును తెఱచు సాధనము. పూర్ణబ్రహ్మ, పురుషోత్తముడు నయిన భగవంతుడు ఒక నిధి. 'నామము' ఆ నిధిని తెఱచునట్టి సాధనము.

ఈ నామము అను బీజకము (తాళపు చెవి) ద్వారా ప్రయత్నించినపుడు, భగవంతుడు ప్రకటమగును, బ్రహ్మకంటె

నామము గొప్పదనియు, రామచంద్రుడు ఒక స్త్రీని (అహల్యను) ఉద్ధరించిన, రామనామము కోట్లకొలది దుష్టులను దుర్బుద్ధులను, సంస్కరించెననియు చెప్పబడినది. నామము మూలచికిత్స అయినచో రాముడు, పల్లవచికిత్స అగును.

శ్రీరామచంద్రుడు, ఎలుగుబంట్లను, వానరములను సహాయముగా దీసికొని, ప్రాకృత శతయోజనవిస్తీర్ణమైన సముద్రమును దాటెను. కాని, నామస్మరణమువలన అపారమైన భవసాగరమే ఇంకిపోవును. కావున, భగవన్నామము సర్వమహనీయమైనది. మహావాక్యశ్రవణమువలన, తత్త్వసాక్షాత్కారమగునని వేదాంతములు చెప్పుచున్నవి. భక్తులుగూడా, భగవత్సాక్షాత్కారమునకు మూలము శ్రవణమే అని అంగీకరింతురు. నిర్గుణ సాక్షాత్కారమునకు గూడా, శ్రవణాపేక్ష కలదు, వ్రజాంగనలకుగూడా, ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసాత్మకమైన శ్రీకృష్ణప్రాప్తికై వేణురవమే అపేక్షితము. ఆ వేణురవముచేతనే, శ్రీకృష్ణచంద్ర పరమానంద కందము వ్యక్తమగునని, వ్రజాంగనలు ఆ మూలవేణురవమునే పట్టుకొందురు.

ఆరంభమునుండియే, హృదయమునందు విరాజమానమై ఉన్న నిర్గుణ పరబ్రహ్మతత్త్వముయొక్క శ్రవణ, మనన, నిదిధ్యాసనముల ద్వారా మహావాక్యములచేతనే, సాక్షాత్కారము కలుగును. ఆరీతిగానే, సగుణ, సాకార, సచ్చిదానంద పరబ్రహ్మ సాక్షాత్కారముగూడా, తచ్చరిత్ర, తద్గుణగణ శ్రవణమువలన కలుగును. చరిత్రశ్రవణమువలన, మొదట చరిత్రనాయకుడైన భగవంతుని మానసరూపము ప్రకటమగును. మానసమైన ఆ భగవత్ప్రతిమాధ్యానము చేయగా, చేయగా మా ఆ యా యవనికాపసారణ మగును. దానివలన, మాయావృతుడైన ఆ భగవంతుని దివ్యరూపము అభివ్యక్తమగును. ఈవిధముగా, శబ్దముచేతనే,

భగవదభివ్యక్తి కలుగును. తరువాత, భగవచ్చరిత్ర శ్రవణము వలన, భగవన్నామసంకీర్తనమువలన భగవంతుడు అభివ్యక్త మైనపుడు, సాక్షాత్తుగా, భగవంతుని ముఖచంద్రవినిర్గతమైన వేణు గీతపీయూషపానము:వలన, భగవదభివ్యక్తి జరుగుట స్వాభావికము. శబ్దము ప్రకాశకము, అర్థము ప్రకాశ్యము. శబ్ద బ్రహ్మరూపములో అభివ్యక్తమైన భగవదీయాధరసుధవలన భగవంతుడు ప్రకటమగుట స్వాభావికము.

ఆ వేణురవమునే వర్ణించుచు, వ్రజాంగనలు పరస్పరము అభిరమణము పొందుదురు. ఈ వేణురవము ద్వారా, సదానంద రూపమే వ్యక్తమగును. 'శ్రీకృష్ణ' పదమునకు అర్థమే సదానందము.

"కృషిర్భూవాచకః శబ్దః ణశ్చ నిర్వృతివాచకః।"

'కృష్' ధాతువునకు 'భూ', 'సత్తా' అని అర్థము, 'ణ'కు నిర్వృతి - ఆనందము అని అర్థము. కాగా, సత్త, ఆనందము 'కృష్ణ'శబ్దము నకు అర్థము అని తెలినది.

"తమాలశ్యామలత్విట్ యశోదా స్తనంధయః।"

అను వాక్యమునకు అర్థము శ్రీకృష్ణుడె అని కొందఱు చెప్పుదురు. దీనియందుగూడా ఏమియును విరోధము లేదు. దానియందు గూడా, సత్తానందములకు ఐక్యము కలదు. స్వయంప్రకాశ సత్తా రూపమైన ఆనందము, ఆనందరూపమైన సత్తయు, ఒకే వస్తువు. సత్తారూపిణి వృషభానునందిని, ఆనందస్వరూపుడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణచంద్రపరమానందకందము, వృషభానునందిని సత్తానంద ములవలె అభిన్నులు. ఆనందము సత్త కానిచో, సత్త లేని ఆనందము, అసత్ వస్తువు అగును. అసద్రూపమైనది ఆనంద మెట్లగును? ఆరీతిగానే, ఆనందవియుక్తమైన శుద్ధ సత్త అన్నది

లేదు. జడపదార్థముల సత్త, దోషజుష్టము, సవిశేషము, సప్రపంచము. కాని, శుద్ధ సత్త, నిరుపద్రవము, నిర్విశేషము, ఆనందరూపమే అయి ఉన్నది. మిగిలిన వన్నియు, వినశ్వరమైన సత్తలు. సాధారణముగా వైషయికానందము గూడా, వినశ్వరమైనదిగాన, సదానందము ఎచట లభించును ? ఆనందము, సత్త-రెండును పరస్పరవిశేషణములు. ఆ ఆనందము అబాధ్యము, జగదానందము బాధ్యము. కావుననే, అత్యంత అబాధ్యము, నిత్య స్వప్రకాశము నయిన శ్రీకృష్ణస్వరూపము వాస్తవికము, సద్రూపము, ఆనందరూపము నయినది. ఆ ఆనందముతో సత్త సంలగ్నమైనపుడు, దానియందు సాంసారికమైన ఆనందముకంటె విలక్షణత్వము, నిత్యత్వము వచ్చును, ఈరీతిగా, సత్తయందు ఆనందము సంలగ్నము కాకపోయిన, ప్రాపంచిక సత్త వచ్చును. కావున, సత్, ఆనందములు రెంటిని భగవంతుడు సంబంధింపజేసెను. ఈ సత్, ఆనందములు రెండును పరస్పరము ఎన్నడును పృథక్త్వమును జెందవు. కావున, వృషభానునందినీ శ్రీకృష్ణులు పరస్పరము అంతరాత్మస్వరూపులు. ఒకటి ఏమనగా, జలమునందు తరంగములవలె పరమామృతరసమూర్తియైన శ్రీకృష్ణుని యందు వ్రజాంగనలు అవియుక్తలై (అవిభాజ్యలై) ఉందురు. చంద్రికయందు చంద్రునకువలె, ప్రభయందు సూర్యునకువలె వారికి (వ్రజాంగనలకు, శ్రీకృష్ణునకు) అవిఘటితమైన (విడదీయరాని) సంబంధము కలదు. కాని, ఇంతకంటెగూడా, ఇది అమృతమునందలి మధురిమవలె అంతరంగసంబంధము. ఈవిధముగా పరమ రసామృతమూర్తియైన శ్రీకృష్ణుడు ఉన్నచోటున, ఆయన మాధుర్యాధిష్ఠాత్రియైన వృషభానునందిని ఉండును. అమృతత్వమునుండి మధురిమను వేఱు వేసినపుడు, అమృతత్వము ఎక్కడ ఉండును ? వేదాంతులు గుణ-గుణులకు తాదాత్మ్యమును

అంగీకరింతురు. కావున, సత్తానందరూపులైన వృషభానునందినీ శ్రీకృష్ణులు ఇరువురును, ఒక్కరే. ఒకే సదానందరూపుడైన భగవంతుడు గౌరతేజ, శ్యామతేజోరూపములోను, రాధామాధవుల ఉభయరూపమునను అభివ్యక్తమయ్యెను. ఈ దృష్టితోనే, శ్రీకృష్ణుని అంతరస్వరూపము వృషభానునందిని అనియు, బాహ్యస్వరూపము పురుషుడనియు, అటులనే, వృషభానునందిని అంతర స్వరూపము పురుషుడనియు, బాహ్యస్వరూపము వృషభానునందిని అనియు చెప్పుదురు.

'హిత హరివంశసంప్రదాయమునందు' గౌర శ్యామ వర్ణములుగల మంజూషికలలో శ్యామ, గౌర వర్ణములు కల రసము నిండియున్నట్లు, ఈ రాధాకృష్ణులు కలరని చెప్పుదురు. రెండు మంజూషికలును, ఏకజాతికి సంబంధించినవే. గౌరవర్ణము కల మంజూషిక శ్యామహృదయము కల వస్తువు, శ్యామవర్ణాంచితమైన మంజూషిక గౌరహృదయము కల వస్తువు. గౌరవర్ణము గలదాని యందు శ్యామరసము, శ్యామవర్ణము కలదానియందు గౌరవర్ణాంచితరసము నిండి ఉన్నవి. ఈవిధముగా, పరస్పరము శ్రీకృష్ణ, వృషభానునందినులు పరస్పరహృదయగత వస్తువులు. ఇరువురి యందుచు, పరస్పర అంతరంగత్వము కలదు. కావున, 'ఉభయోభయభావాత్మలు అని చెప్పిరి. ఈవిధముగా, ఆ పరమ తత్త్వము సంపూర్ణముగా నిండి, వేణురవముద్వారా అభివ్యక్తమగును. కావున, తద్వర్ణనము చేయుచున్న వ్రజాంగనలు శ్రీకృష్ణచంద్ర పరమానందస్వరూపమును పరిష్వంగ మొనర్చుచు, అనురాగ మహిమచేత, పరస్పరము పరిరంభణము చేసి కొనసాగిరి. అథవా, శ్రీకృష్ణసాక్షాత్కారమువలన, రమణమును పొందసాగిరి.

గోప్య ఊచుః —

"అక్షణ్వతాం ఫలమిదం న పరం విదామః సఖ్యః పశూ
ననువివేశయతో ర్వయస్యైః ।
వక్త్రం వ్రజేశసుతయో రనువేణుజుష్టం యైర్వా నిపీత
మనురక్తకటాక్షమోక్షమ్ ॥"

శ్రీధరాచార్యస్వామి అభిప్రాయానుసారము 'గోప్య ఊచుః' అను వాక్యము లేదు. కావున,

"అనువర్ణనేనాహుః, అక్షణ్వత్తామితి"

అని శ్రీధరాచార్యవ్యాఖ్యానము. 'గోప్యః' అను శబ్దమునకు అర్థము శ్రీసనాతనగోస్వామి –

"గోపయన్తి శ్యామసుందరమితి గోప్యః ।"

అని చెప్పుదురు. వ్రజాంగనలు తమ శ్యామసుందరుని, ఎవరును తెలిసికొననట్లు గుప్త మొనర్చుదురు.

వ్రజాంగనలు ఇట్లు అనుకొందురు – ఓ సఖులారా ! నేత్రములు కలవారికి, నేత్రధారులకు ఇదియే, ఫలము. ఆ ఫల మేదియో వెంటనే, చెప్పజాలకపోయిరి. ప్రేమభారము వలన, వివశలైరి. కావున, హృదయగతమైన తత్త్వనిర్దేశము చేయుటకు అశక్యమయ్యెను. అది, బయటకు వచ్చుటయే లేదు. సఖీ ! ఇపుడు అది, వారి హృదయమునకే తెలియును. ఇచట, 'అక్షణ్వతాం'అను శబ్దముచేత 'సర్వేంద్రియవతాం' అను అర్థమును చెప్పికొన వలయును. ఇంద్రియములు కలవారికి, ఆ ఇంద్రియములకును ఇదియే, ఫలము. 'అవృత్తచక్షుః' అనగా, కేవలము నేత్రములను మూసికొనినంతమాత్రముచేత దర్శనము కలుగజాలదు. విశేషించి, నేత్రేంద్రియోపలక్షితములైన సర్వేంద్రియముల నిగ్రహము ఆవశ్యకము. ఇచటగూడా, వ్రజాంగనలు ఇట్లు చెప్పికొందురు – హే సఖి ! సర్వేంద్రియములు కలవారికి ఇదియే, ఫలము,

కేవలము చక్షుష్మంతులకు మాత్రమే కాదు. అపుడు, పరమ రసామృతమూర్తి, వ్రజేంద్రనందనుడు, శ్యామసుందరుడు నయిన శ్రీకృష్ణచంద్రుడు, పరమానందకందము, ఆయన మంగళమయ ములైన అవయవముల సౌరస్యాదులను ఆస్వాదించుట ఫలమని చెప్పిరి. లేనిచో, నిర్గుణ, నిరాకార పరబ్రహ్మ ఇంద్రియములకు ఉపభోగ్యము కాదు.

"యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ।"

కావున ఇంద్రియములు విఫలములైనవే కదా! బుద్ధిగ్రాహ్యమైనను ఏమైనది? మహావాక్యజన్యము, తదాకారితము నయిన అంతఃకరణ వృత్తిచేత తత్స్పర్శ కలిగెను. నిర్వృత్తికమైన అంతఃకరణమునకు గూడా స్పర్శ లభించలేదు. అయినను నిర్వృత్తికమైన అంతః కరణమునకు స్పర్శలభించెనని అనుకొనుడు. కాని, ఇంద్రియముల కైనచో లభించలేదు. శుద్ధమైన స్పర్శ జీవాత్మకు – సర్వోపాధి వినిర్ముక్తునకు – లభించును కావుననే ఆ వ్రజాంగనలు ఇట్లు అందురు – హే సఖి! మన్మోహనుడైన శ్రీకృష్ణచంద్రపరమానంద కందముయొక్క అమృతమయముఖచంద్రుని ఈ నేత్రములతో దర్శించుట, భుజములతో పరిష్వంగము చేసికొనుట, ఘ్రాణములతో తత్సౌరభమును ఆఘ్రాణించుట, రసనేంద్రియముతో ప్రియతమ సుమధురమైన అధరసుధాపానము చేయుట ఇంద్రియములు గలవారి ఇంద్రియములకు సాఫల్యము సిద్ధించును. సర్వేంద్రి యముల ద్వారా అనుభవయోగ్యము, సర్వులకు పరమ ప్రేమా స్పదము నయిన శ్రీకృష్ణపరమానందకందము కేవలము బుద్ధి గ్రాహ్యమగుట సహింపరానిది. కాని, సర్వులు ప్రత్యణువునందు వ్యాకులత నొందుదురు. ఇంద్రియములు దుఃఖించనట్టి ఒకనొక కైవల్యస్థితి ఉండిన ఉండవచ్చుగాక! అటువంటి కైవల్యస్థితి

లేనిచో పూర్ణమైన ఆస్వాదనము అందఱకును కలుగవలయును. ఏలయనగా ఏ తత్త్వమైనను భగవంతుని వియోగమునందే కలదు. ఆ సత్తారూపమునుండి గూడా వియుక్తమగుట అసత్, స్ఫూర్తి విహీనము, నీరసమునగుట ఎవరు అభిలషించుదురు? ఎవరు తమను స్ఫూర్తి విహీనులగుట, నీరసులగుట, సత్తావిహీనులగుట కోరు కొందురు?

"లోకే నహి స విద్యేత యో న రామ మనువ్రతః ।"

అని చెప్పబడినది. ప్రియతముని వియోగమునందు ఉండజాలక పోవుటయే పరమ ప్రేమికుని లక్షణము.

"త్రుటి ర్యుగాయతే త్వా మపశ్యతామ్"

ప్రియవియోగమునందు ఒక లవ, నిమేషకాలము గుడా యుగములు కల్పములు, మహాకల్పము లగును.

"గోపీనాం పరమానంద ఆసీత్ గోవిందదర్శనే"

"క్షణం యుగశతమివ యాసాం యేన వినాఽ భవత్"

వ్రజాంగనలకు శ్యామసుందరుని దర్శనమునందు మహాకల్పములు గూడా క్షణకాలమువలె గడిచిపోవును. వియోగమునందు క్షణ కాలముగూడా కల్పసమానముగా గడుచుచుండెడిది, ఇదియే తీవ్ర తాపము.

ఇంతియే కాదు. విశేషించి వియోగమునందు ఉండజాలక పోవుటయే ఉత్కటమైన ప్రేమ. జలమును వీడి తరంగము ఎచటైనను ఉండజాలునా? ప్రియవియోగమునందు ఉండలేక పోవుట శుద్ధప్రేమ లక్షణము. సత్పదార్థమును వీడిన, అసత్పదార్థ మగును. శ్రీకృష్ణపరమానంద రసస్వరూపముయొక్క వియోగము నందు నీరసత్వము స్ఫూర్తిరాహిత్యము కలుగును. ఈ విధముగా

అందఱును శ్రీకృష్ణపరమానందకందముయొక్క అనన్య ప్రేమికులైనపుడు సర్వేంద్రియములకు 'అయ్యో శ్రీకృష్ణప్రభువు ప్రకటమయ్యెను, మనము ఆయననుండి వంచితులమైతిమి అని ఈర్ష్య కలుగును. ఆ ఇంద్రియములు దుఃఖించును.

"పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః ।"

ధ్యానమునందు శ్రీకృష్ణానుభూతి కలిగినవారి నేత్రాది ఇంద్రియములు రెపరెప కొట్టుకొనును, ఉవ్విళ్ళూరుచుండును. కావున వ్రజాంగన

"అక్షణ్వతాం ఫలమిదం"

అని అనిన, రెండవ వ్రజాంగన

"న పరం విదామః పరం కించిత్"

అని అనినచో, ఈ తత్త్వమే, లేదు. కాని,

"వయం తు న విదామః"

మనము ఎఱుంగము. ఖండనమండనముల వలన, మనకు వచ్చు ప్రయోజనమేమి? ఎవరికైనను, పరమాత్మ, ఉండిన ఉండుగాక, కాని, మనకు మాత్రము శ్యామసుందరుడు ఉన్నాడు. భక్తులు ఇట్లు అందురు – "శ్యామసుందరుడు ఎటులైనను ఉండనిండు, నా ప్రియతముడు, ప్రాణధనుడు మమ్ములను ద్వేషించిన ద్వేషించుగాక, లేక, మాపై కరుణవహించి యుండుగాక. కాని, మాకు మాత్రము జ్ఞేయ, ధ్యేయ వస్తువుసమస్తము ఆ శ్రీకృష్ణుడే. ఆయన, మమ్ము ప్రేమించినపుడే మేము గూడా, ఆయనను ప్రేమింతుమను నిబంధనము లేదు. ఇట్టి నింబంధనమున్నచో, అది వ్యాపారమగును. సౌందర్యమునకు నిబంధనము ఉండదు. అట్టి నిబంధనము ఉన్నచో, అది వ్యభిచారిణీభక్తి అగును. ఎవరు ఎటుల ఉన్నను, తమ వస్తువునందు నిరతిశయమైన ప్రీతి

ఉండుటయే, స్థిరమైన భక్తి. ఇదియే, ఉచితము. కావున, ఆ వ్రజాంగనలు ఖండనమండనములు చేయరు.

"ఆన్యే అన్యత్ జానన్తు నామ వయం తు న విదామః।"

అని వ్రజాంగనలు అనుకొందురు. అనగా, మోక్షాది అన్య ఫలములను ఎవరైనను ఎఱింగియుండిన ఉండుగాక, కాని, మేము ఎఱుంగము. కైవల్యము లభించినదని ఒప్పుకొందుము. కాని, అది సర్వేంద్రియగ్రాహ్యము కాదు గదా! కావున, ఇంద్రియవంతుల లాలస ఏమనిన, ఆ శ్రీకృష్ణప్రభువు సర్వేంద్రియగ్రాహ్యుడై లభింపవలయుననియే.

వ్రజాంగనలు ఇట్లు చెప్పికొందురు - హే సఖి!

"వయం ఉపనిషద్రూపాః"

మనము ఉపనిషద్రూపిణులము. మనము ఎఱుంగకపోయిన, ఇతరుడెవరు ఎఱుంగును. ఫలము శ్రుతియే, చెప్పును. అపుడు వేదవిహీనమైన నూతన ఫలమును ఎవరైనను, ఎఱింగిన ఎఱుంగుదురు గాక. అనగా, వేదప్రామాణ్యము గలవారు సారభూతమైన ఫలనిర్ణయమునందు ఉపనిషత్తులనే, ప్రమాణముగా భావింతురు. కావున, ఇదియే, ఫలము, మఱొక ఫలము లేదు.

ఇంతకంటె, ఉత్తమమైన మఱొక విషయము కలదు. బ్రహ్మదేవుడు ఇట్లనును -

"యేషాం తు భాగ్యమహిమా"

ఈ వ్రజాంగనలయొక్క ఈ వ్రేపల్లెలో నివసించువారియొక్క అనంత, అద్భుత భాగ్యమహిమను మేము ఏమని సంకీర్తింతుము? మేము మమ్ము ధన్యులముగా భావింతుము. మేము ఎవరము? ఏకాదశేంద్రియములకు అధిష్ఠాత్రి దేవతారూపులము, ఏ

వ్రజాంగనలు నీ ఉద్బుద్ధ ఉభయవిధ శృంగార రసాత్మక పరమ రసామృతమూర్తిని, నీ ఆనందమును సాక్షాత్కరించుకొందురో, వారి మహిమ అలౌకికమైనది. ఇంద్రియాధిష్ఠాత్రిదేవతనైన నేను నన్ను అత్యంత భాగ్యవంతునిగా భావించుదును. ఇదేమి ? ఏల యనగా, వ్రజాంగనలు తమ హృషీకచషకములతో (ఇంద్రియ రూపపానపాత్రలతో) నీ శోభాయుక్తములైన అవయవముల సౌందర్యామృతసుధను పానము చేయుచున్నపుడు, తదధిష్ఠాత్రి దేవత నగుటచే నాకు పరంపరయా హృషీకచషకములతో సంబంధము కలుగును. వ్రజాంగనలు తమ హృషీకచషకములైన ఇంద్రియ పానపాత్రలతో శ్రీకృష్ణచంద్రపరమానందముయొక్క సౌందర్య, మాధుర్య, సౌగంధ్యామృతమును పానము చేయుదురు. కావున, ముఖ్యపాత్రలు వ్రజాంగనలు. పానసాధనము ఇంద్రియ పాన పాత్ర. నేత్ర పానపాత్రద్వారా అమృతమయమైన నీ ముఖ చంద్రుని సౌందర్యామృతమును, ఘ్రాణపానపాత్రద్వారా సౌగంధ్యామృతమును, శ్రోత్రపానపాత్రద్వారా వేణుగీతమును, అమృతవచనములను, రసనాపానపాత్రద్వారా అమృతమయ ముఖచంద్రుని సుమధురమైన అధరసుధాపానము చేయుట. ఇచట, వ్రజాంగనలు పానకర్త్రిలు. ఇంద్రియరూప పానపాత్ర యొక్క సంబంధము "దర్వీ పాకరసం యథా" అనునట్లు రస యుక్తముగా చెప్పబడినది. ఇచట, బ్రహ్మ, 'తాను చషకమును గూడా కానని' చెప్పెను. ఇంద్రియములు గూడా కరణములు, వానికిగూడా రసానుభవము లేనపుడు, ఆ ఇంద్రియములకు అధిష్ఠాతలమైన మా దేవతలకు తద్రసానుభవము ఎట్లు కలుగును ?

వ్రజాంగనలు శ్రోత్రేంద్రియముద్వారా శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క వచనసుధను పానముచేయుదురు. తద్వచనసుధాపానమునందు ఈ ఇంద్రియములు దొన్నెలు. పాన

పాత్రకు స్వాదమేమి కలుగును? గిన్నె, స్వాదమును ఏమి గ్రహించును? అయినను, ఆ రసమును స్పృశించునట్టి ఒక పాన పాత్రగూడా, తాను కృతకృత్యమైనట్లు భావించును, మనము పారంపర్యేణ మనను కృతార్థులముగా భావింతుము. అపుడు, ఇంద్రియములు, వానికంటెగూడా, అధికముగా వ్రజాంగనలు ఎంత భాగ్యవతులు? మేము ఏ యింద్రియములకు అధిష్ఠాన దేవతలమో, ఆ యింద్రియములద్వారా, వ్రజాంగలు శ్రీకృష్ణ ప్రభు సౌందర్య, సౌగంధ్యాదులను ఆస్వాదించుటయే మా భాగ్యమని భావింతుము. కావున,

"ఏషాం తు భాగ్యమహిమాఽచ్యుత తావదాస్తామ్ ।"

ఈవిధముగా బ్రహ్మాది దేవతలే, పరంపరయా శ్రీకృష్ణ సౌందర్య, సౌగంధ్యాదిపానము చేయుదుమని చెప్పుచున్నప్పుడు, వ్రజాంగనలు

"అక్షణ్వతాం ఫల మిదం న పరం విదామః సఖ్యః ।"

అని ఏల చెప్పరాదు? హే సఖి! మన ఇరువురి మధ్య సంవాదము అంగీకారమా, కాదా? వ్రజాంగన, తన సఖితో ఇట్లు చెప్పుచున్నది- 'ఇదం' అనగా, స్వరూపము ప్రస్ఫురిత మగుచున్నపుడు, 'బర్హాపీడం నటవరవపుః' అని వర్ణింపబడిన ఆ బృందావనవిహారియే, ఇచట 'ఇదం' శబ్దముచేత చెప్పబడెను.

వ్రజమునందు వ్రజాంగనలకు శ్రీకృష్ణచంద్ర పరమానంద కందముయొక్క దర్శనము కలుగుచునే ఉండును. అయిన, వారు ఏల ఆర్తి కలవారైరి? అనిన, ఇట్లు చెప్పుదురు - 'వ్రజస్థుడైన శ్రీకృష్ణుని దర్శించుచునే ఉందురు. అయినను, అన్యాన్య స్వరూపములయందు, ఈ రసమయమునందలి దర్శనము విశేషమైనది.

"ఇదమితి బుద్ధిస్థత్వా దిదమా నిర్దేశః।"

అనగా, ద్వారకావాసి, మధురవాసి, వ్రజవాసి అందఱును ఒకరే గాని, ఇది, మన్మోహనుని 'నటవర వపువు'. ఈ వ్రజేశసుతులు, నందరాజపుత్రులు నయిన శ్రీకృష్ణ, బలరాములు వారి గోవులను బృందావనమునందు ప్రవేశపెట్టుచు, వంశీవిభూషితమైన వక్త్రి మును నేత్రములతో జూచినవారి ఇంద్రియములు సార్థకమును. బలరాముడు, వ్రజేశసుతుడు కాకపోయినను, పాలితపుత్రుడు (పెంపుడుకుమారుడు) అగుటవలన (పాలితపుత్రత్వాత్) వ్రజేశ సుతుడని ఆరోపము చేయబడినది. కొందఱు వసుదేవుడు వ్రజేశు డని అందురు. కాని, ఇది, వివాదగ్రస్తవిషయము. నందరాజ ప్రియపుత్రుడు శ్రీకృష్ణుడు, వసుదేవుని పుత్రుడు బలరాముడు. కాని, వ్రజవాసులు, ఇరువురును వ్రజేశపుత్రులే అని తలంచు చుండెడివారు. కావున, 'వ్రజేశసుతయోః' అని ద్వివచనము చెప్ప బడినది. 'వక్త్రిం' అని ఏకవచనము ఏకవద్భావముతో కావచ్చును గాని, దీనియందు స్వారస్యము లేదు. వ్రజాంగనల మనస్సు నందైనచో, మన్మోహనుడైన శ్రీకృష్ణుని అమృతమయ చంద్ర ముఖమే ఉండెను. అయిన, 'వ్రజేశసుతయోః' అని ప్రయోగ మేల ? కావుననే, 'అనువేణుజుష్టం' అని చెప్పాదురు. ఇది, బలరామ ముఖవ్యావర్తకము వ్రజేశసుతులైన బలరామ, శ్రీకృష్ణు లిరువురిలో ఎవరి వక్త్రిము వేణుజుష్టమో, అతని సౌందర్య, మాధుర్యసుధను ఆస్వాదించిరి.

వీరి మనస్సులలో శ్రీకృష్ణాతిరిక్తమైనది ఏమియును లేదు. అథవా, వారికి స్మృతి ఉన్నంతవఱకు తమను సంబాళించుకొనిరి. ఏదియో గందరగోళము ఉన్నదా ? అని ఎవరైనను అందురు. హే సఖి! గుప్తమైన ప్రేమ, సదా రహస్యముగానే ఉండును. కావున, ఇట్లనిరి - 'మేము ఇరువురి విషయము మాట్లాడుకొను

చున్నాము. అనగా, సంబాళించుకొని ద్వివచనము ప్రయోగించితిమి. మేము వ్రజవాసులముగాన, వారి పిల్లవానిని ప్రశంసింపవలయునను తలంపుతో మేము 'వ్రజేశ' శబ్దప్రయోగము చేసితిమి. ఇంతవఱకు బాగుగనే ఉన్నది. కాని, తరువాత సంబాళించుకొందమనినను, సంబాళించుకొనలేకపోయితిమి. శ్రీకృష్ణప్రభు ముఖచంద్రుడు మాయెదుట ప్రత్యక్షమయ్యెను. ఆముఖచంద్రుడు, వ్రజాంగనల హృదయస్థమైన పూర్ణానురాగసార సరోవరమునుండి ఉదయించునట్టివాడే. తుపానువలన సాగరము ఉద్వేలితమైనట్లుగానే, వ్రజాంగనల హృదయము ఉద్వేలిత మయ్యెను. వారు తమ భావములను అదుపులో ఉంచుకొనజాలరైరి.

ఇచట, శ్రీ వల్లభాచార్యుడు ఇట్లు చెప్పుదురు— 'భగవంతుడు ఎవరికి ఆధిదైవికములైన దేహ, ఇంద్రియ, మనోబుద్ధ్యాదులను ఒసగెనో, వారికి కృష్ణచంద్రుని సౌందర్యాదులను ఆస్వాదించుటయే, పరమ ఫలమై ఉన్నది. పద్మాయతాక్షుడైన పురుషుడు సదా అంధకారమునందే ఉన్నచో, అతనికి, నేత్రము లుండుటయే నిరర్థకము.ఆరీతిగానే,భగవంతుడు కృపతోయే ఆధిదైవిక దేహాదుల నొసగెనో, వానితో శ్రీకృష్ణప్రభువుయొక్క సుధాస్వాదనము చేయకున్న, అవి నిష్ఫలములు. కొంతకాలము అంధకారములో ఉండుట సంభవము కావచ్చును. కాని, సర్వదా అంధకారమునందే ఉన్నచో, నేత్రములుండుట, లేకపోవుట సమానమే అగును. ఈ స్థితిని శ్రీ వల్లభాచార్యుడు 'సర్వాత్మభావ' మందురు. అనగా, దేహేంద్రియ, మనోబుద్ధి, అహంకారాది విస్మరణ పూర్వకముగా, సర్వత్ర శ్యామసుందరునే దర్శించుట. ఈ అవస్థలో స్వీయ అస్తిత్వము భిన్నముగా ఉండదు. కావున, స్వపార్థక్యేన(తనకంటె వేఱుగా) శ్రీకృష్ణప్రభువుయొక్క భానముకూడా ఉండదు.

కావుననే, తత్సుధాస్వాదనభావము గూడా ఉండదు. కాని, దీనిని కాదాచిత్కము అందురు. అనగా, సంచారీభావ మందురు.

ఈ భావమును (సర్వాత్మభావమును) విశేషించి, విప్రయోగమునందు అంగీకరింతురు. దీనినే, ఆంతర రమణ మని కూడా అందురు. అనగా, బాహ్య సంప్రయోగము లేకపోయినను, ఆంతర సంప్రయోగము తప్పక ఉండును. దీని మహిమగూడా ఎక్కువగా సంకీర్తింపబడినది.

"సంగమ విరహవికల్పే వరమిహ విరహో న
సంగమ స్తస్య।"

సంగమ, విరహములలో ప్రియతముని విరహమే మంచిది. సంగమమునందు ప్రియతముడు ఒక్కడే ఉండును. విరహమునందు నిఖిల విశ్వమే ప్రియతమ మగును. ఎటు దృష్టి ప్రసరించినను, ప్రియతముడే కన్పడును. అయినను, ఈ భావమును 'సార్వదిక్' అని భావించినచో, గందరగోళ మగును. కావుననే, కమలాయతాక్షుడైన పురుషుడు ఉపమానముగా ఈయబడెను. భగవంతుని అధర సుధాపానమే, పరమ లక్ష్యము.

ధ్యానసాధన చేయువారు చివఱకు సర్వవిస్మరణమును వాంఛింతురు. విష్ణుపురాణ, భాగవతాది గ్రంథములయందు ధ్యానమును చెప్పిన స్థలమున, సాంగ, సపరివార, సర్వభూషణాది సహితుడైన భగవంతుని ధ్యానమే చెప్పబడినది. కాని, మనస్సు మాత్రము మహాచంచల భేతాళము. అది, ఒక ప్రదేశమున, నిశ్చలముగా ఉండుటయే కష్టము. కావున, మనస్సు ప్రభు భూషణములచింతనమే చేయవలయును. మనస్సు, అనేక విషయములయందు లగ్నమై ఉండిన, ఉండుగాక. కాని, ఆ అనేకత్వము ప్రభువుయొక్క స్వరూపమునందే ఉండవలయును. అచటనుండి

ఆ మనస్సును వేఱుగా వెళ్లనీయకుండుటయే ధ్యానమునకు సీమ (సరిహద్దు). చంచలమైన వానరమునకు పద్మాసనముపై కూర్చున్నను, నిర్వికల్పసమాధి ఎట్లు కలుగును? అనిన, దానికై ఒక ఉపాయము చేయుడు - ఆ వానరమును ఒక పూలతోటనుండి బయటకు పోనివ్వకుడు. తరువాత, ఒకే వృక్షమునందు, ఒకశాఖ మీద కూర్చుండియుండును. మనస్సు, వానరముకంటె అధిక చంచలము. క్షణకాలములో స్వర్గమునుండి నరకమువఱకు పరుగు తీయును. దీనికి, మొదట ఒక అలంబనమును కల్పించుడు. భక్తుల గాథ, శ్రీకృష్ణలీల, ఆలంపనము. తరువాత, ధ్యేయ మూర్తియందే మనస్సును ఉంచవలయును. ఈవిధముగా విషయ ములయందు సంచరించుటను పరిమితము చేయవలయును. విషయచింతన మెంత అత్యధికముగా ఉండునో, అంత అధికాధికముగా చంచలత్వము ఉండును. శ్రీకృష్ణచింతనము నందు మనస్సు ఎంత సంలగ్నమగునో, మానసము అంతగా స్థిర మగును.

"మా మనుస్మరత శ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ।"

మక్షికాసంతానము దుర్గంధభూయిష్ఠమైన వస్తువుమీద వ్రాలును గాని, చందనముపైన కూర్చుండదు. మొట్టమొదట, భూషణసహిత ముగా శ్రీకృష్ణుని సర్వావయవధ్యానమును, అనంతరము శ్రీకృష్ణావయవధ్యానమును, అటుపిమ్మట, కేవలము మందహాస యుక్తమైన ముఖచంద్రుని ధ్యానము చేయవలయును.

"తత్రైకాగ్రం మనఃకృత్వా"

సుస్మితముఖచంద్రునియందు మనస్సు ఏకాగ్రమైనచో, తరువాత ఏమియు చింతనము చేయవలదు. చివఱకు, ముఖచంద్ర

చింతనము జరుగగా, జరుగగా అలౌకిక సౌందర్య, మాధుర్య సుధాస్వాదనమునందు మనస్సు స్తబ్ధమగును, పరవశమగును విహ్వలము నగును, వాక్కు గద్గదమగును, చిత్తము ద్రవీభూత మగును, సర్వేంద్రియములు నిశ్చేష్టములగును. 'ప్రేమ (భక్తి) పూర్ణమైన మనస్సుతో' భరత, రామచంద్రసంమిలన సమయమున, భరతుడు ప్రేమ (భక్తి) రస సరోవరమయ్యెను, మనస్సు నిజ గతిరహిత మయ్యెను. ఆ సమయమున, ఎవరును ఏమియునూ మాట్లాడలేదు, ఏమియును ప్రశ్నించలేదు. 'మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము విస్మరించెను.' ఇంతకంటె శ్రేష్ఠమైన నిర్వికల్ప సమాధి ఎచట లభించును? నాలుగు అంతఃకరణములు (మనోబుద్ధి చిత్తాహంకారములు) నిశ్చలము లయ్యెను. ఈ ప్రేమామృతసింధువునందు ప్రేమికుని నిమజ్జన ఉన్మజ్జనములు జరుగుచున్నప్పుడు. సమస్తము విస్మృతమైపోవును.

"యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాం గతిమ్ ॥"

అని చెప్పబడినది.

కావుననే, భాగవతమునందలి తృతీయస్కంధమున, కపిల దేవహూతి సంవాదమునందు పరబ్రహ్మను ఉపదేశించి, సగుణ, సాకార భగవద్ధ్యానము చెప్పబడినది. మొదట, శ్రీకృష్ణచంద్ర పరమానందముయొక్క సమస్త ఆభూషణముల చింతనము చేయ వలయును.

"తచ్చాపి చిత్తబడిశం శనకై ర్వియుంక్తే ।"

అని చెప్పబడినది. ఈవిధముగా, భగవంతుని స్వరూపమునందు ఆ మనస్సును సంలగ్నము చేసి, సమస్త ప్రపంచమునుండి మరలించవలయును. చివరకు ప్రేమోన్మాదమునందు (భక్త్యా

వేశమునందు) ఇతరుల ధ్యానము ఉండకపోవుటయె కాక, ధ్యేయ స్వరూపముకూడా అదృశ్యమైపోవును. భగవంతుడు భక్తుల మనస్సును విస్మరించవలయునని భక్తులు అభిలషించరు. ఏల యనగా, అది ముముక్షువునకు సంబంధించిన విషయము. భక్తుడు ముముక్షువు కాడు. ఆ భక్తుడు బ్రహ్మలోకాంతము విరక్తుడై భగవంతుని ముఖచంద్రదర్శనమే కోరును.

ఈ విషయము ఇట్లు చెప్పబడినది –

"న కించి త్సాధవో ధీరా భక్తా హ్యేకాన్తినో మమ ।
వాంఛ న్త్యపి మయా దత్తం కైవల్య మపునర్భవమ్ ॥"

సర్వాత్మభావము కల భక్తునకు శ్రీకృష్ణచంద్రుని ముఖ చంద్రదర్శనమునందు క్షణికమైన, సర్వవిస్మృతిపురఃసరమైన భగవద్భావమే సర్వత్ర కలుగవచ్చునుగాని, ఎల్లప్పుడు, ఇది అభీష్టమని అంగీకరించరు. జాగ్రతగా భగవత్సేవ చేయవలయునని భక్తులు అభిలషింతురు. ఈ భావమును గైకొనియే

"అక్షణ్వతాం ఫలమిదం న పరం విదామః ।"

అని చెప్పబడినది. ఇచట, 'చంద్ర' పదము ప్రయోగింపబడక పోయినను, తరువాత వచ్చు 'పీతం' అను శబ్దమువలన, 'చంద్ర ముఖుడు' చంద్రుడు కానిచో, పేయ మెట్లగును?

"పిబత భాగవతం రస మాలయమ్"

ఇచట, నిగమకల్పతరువునుండి విగళితమైన రసమయఫలమును త్రాగుడని చెప్పిరి. ఫలముచోష్యముగాని, పేయము కాదు. దాని యందు పై చర్మము టెంక ఉండును. కావున, 'రసం' అని చెప్ప బడినది. అనగా 'రసవత్' (గుణవచనాత్ మతుప్). ఆమ్రఫలము రసవంతమై ఉండును. దానియందుగూడా కొంత త్యాజ్య పదార్థము ఉండనే ఉండును. ఇచట, పరిత్యాజమైన వస్తువు లేనే

లేనందున, రసాత్మకత్వము చెప్పబడినది. ఈ అర్థమునందే ఇచట 'పిబత' - పానముచేయుడని చెప్పబడినది. శ్రీకృష్ణచంద్రవక్త్రి పానము చేసిరనుటచేత ముఖచంద్రుడు గ్రహింపబడును. చకోరి, అమృతమయుడైన చంద్రుని చంద్రికను పానము చేయును. అట్లే, వ్రజాంగనలు శ్యామసుందరుడైన శ్రీకృష్ణచంద్రపరమానంద కందముయొక్క అమృతమయ ముఖచంద్రుని సౌరస్య, సౌగంధ్యాదియుక్తమైన సుమధుర అధరసుధాచంద్రికాపానము చేయుదురు. కావున, ఇది ప్రాకృతవక్త్రము కాదు, పూర్ణానురాగ రససార సాగరావిర్భూతుడైన చంద్రుడు. కావున, ఈ చంద్రుడు నిపానము చేయుటకు యోగ్యుడు. ఈవిధముగా పానము చేసిన వారి నేత్రములే సఫలములు.

అథవా, హే సఖి ! నేత్రములతో అనురాగపురఃసరముగా శ్రీకృష్ణచంద్రుని, వ్రజేంద్రనందనుని ముఖమును దర్శించిన వారు సౌభాగ్యశాలురు. వారిలో గూడా, సర్వాభోగ్యమైన అధర సుధాపానము చేసినవారు అధిక సౌభాగ్యశాలురు. ఇది, ప్రేమార్తి జన్యమైన ఒక వ్యాకులత, ఒక అసంతృప్తి. దానికి కారణమేమనిన, తమ సర్వస్వము, స్వీయము, నిత్యప్రాప్తమైన వస్తువునందు గూడా, దుర్లభత్వము ప్రతీతమగుటయే. వ్రజాంగనలు ఇట్లు అందురు - హే సఖి ! మన్మోహనుని ముఖచంద్రదర్శనము చేయువారు అనేక విధములుగా ఉందురు. భగవంతుని ఇతరావ తారమూర్తుల ముఖచంద్రదర్శనము చేసికొనువారు, ద్వారకావాసి, మధురావాసి, వ్రజవాసి అయిన భగవంతుని ముఖచంద్రదర్శనము చేసికొనువారు. ఆయన, తన చెలికాంద్రతో వనములో విహారము సల్పుచున్నప్పుడు, మనము, ఆ ప్రభువును దర్శింతుము. ఎవరు 'జుష్టం' ప్రీతి, అనురాగ, స్నేహపురఃసరముగా 'పౌనఃపున్యేన అభ్యసనం' చేసిరో, వారికి సాఫల్యము కలదు. అపుడు, సర్వ

భోగ్యమైన అధరసుధాపానము చేసినవారివిషయమున అడుగున దేమి ఉండును ?

'పశూ నను' - వ్రజాంగనలు గోవులను, తమ దర్శనమునకు విఘ్నమని భావించినపుడు, వానిని పశువులని చెప్పసాగుదురు. ఒక్క క్షణకాలము సైతము, కల్పకోటిశతమైనప్పుడు, పగలంతయు ఎట్లు గడచునో ? నిర్నిమేష నయనములతో శ్రీకృష్ణచంద్రుని రాకకై ఎదురు చూచుచుందురు. శ్రీకృష్ణుడు వచ్చినప్పుడు ధూళి ఎగురుచుండగా చూచి, నీరు చల్లుట అను మిషతో, గవాక్షముల నుండి గోధూళియందే రెప్పపాటులేక, శ్రీకృష్ణుడు వచ్చుచున్నాడని చూచుచుందురు. ఒకవేళ, విలంబము జరిగినచో, బ్రహ్మను, రుద్రుని నిందింతురు - శ్యామసుందరుడు వచ్చినపుడు ఋష్యాదులు ఆయనకు వందనములు చేయుదురుగాన, ఆయన వచ్చుటలో విలంబము జరుగును.

"వంద్యమానచరణః పథి వృద్ధైః ।"

బ్రహ్మాదులు వందనము చేసినపుడు వ్రజాంగనలకు అతికష్టము కలుగును - 'చూడు, సఖీ ! మొదట, ఆయన వచ్చుటకే విలంబము జరుగుచున్నది. దీనిపైన మధ్యలో ఈ దేవతలు వచ్చిరి. ఆ సమయమునందే, ప్రభువు తన సఖుల, గోవులచాటునకు పోవును. అపుడు, వారు గోవులను 'పశువు'లని అందురు. హృదయము నెఱుంగని 'పశు'శబ్దవాచ్యులు. హే సఖి ! వీనికి (ఈ గోవులకు) మన హృదయస్థితి, ఏమి తెలియును ? విప్రయోగమునందు మనకు ఎంత కష్టము కలుగుచున్నదో, వానికేమి తెలియును ! వీనికి మన బాధ తెలిసి ఉన్నచో, ఇవి అడ్డము అయ్యేడివి కావు. కావున, గోవులను 'పశువు'లని వ్రజాంగన లనిరి. వీనికొఱకే, మన నిత్య విప్రయోగము కలుగుచున్నది. జ్ఞానదృష్టితో బ్రహ్మనిష్ఠులు పశువులు.

"సర్వా నవిశేషేణ వశ్యతీతి పశుః"

బ్రహ్మనిష్ఠులైన ఈ దేవతలందఱును గోరూపధారులై శ్రీకృష్ణ దర్శనము చేయుటకై వచ్చిరి. దీనితోపాటు వ్రజాంగనలు విధాతను సయితము నిందింతురు –

"జడ ఉదీక్షతాం పక్ష్మకృత్ దృశాన్ ।"

సాయంసమయమున, శ్రీకృష్ణుడు వచ్చినప్పుడు, మన నేత్రములు ఆ శ్రీకృష్ణప్రభుదర్శనమునందు సంలగ్నమైనపుడు, కనురెప్పలు వ్రాలును. ఇది, పెద్ద విఘ్నము. ఈ పలకములను (కనురెప్పలను) సృష్టించినవాడు కేవల జడుడు. అతడు రసికుడై ఉండి ఉన్నచో, పలకములను సృష్టించియే ఉండెడివాడు కాడు. ఆ విధాత, ఈ పలకములను సృష్టించి, పెద్ద పొరపాటు చేసెను.

శ్రీ విశ్వనాథచక్రవర్తి ఇట్లందురు – "పరస్పరము వ్రజాంగనలు ఇట్లు చెప్పుకొందురు – ఓ సఖులారా! మీరు విధాత ఒసగిన నేత్ర, శ్రోత్ర, త్వక్, మనో బుద్ధ్యాదులను వ్యర్థము చేసికొనుచున్నారు. కావున, ధైర్యమునకు, లజ్జకు తిలాంజలి ఒసగి బృందావనమునందు శ్రీకృష్ణచంద్రపరమానందకందముయొక్క అమృతమయముఖచంద్రుని దర్శించి, నేత్రాదులను సఫలము చేసికొనుడు –

"యైర్దృష్టం స్పృష్టం నిపీతం తేషామేవ
ఇంద్రియసాఫల్యమ్ ।"

ఈ శ్రోత్రములతో శ్యామసుందరుని వచనామృతమును ఆస్వాదించకపోయినచో, బధిరులగుటయే మంచిది. ఈ నేత్రములతో మన్మోహనుని విలోకించుట జరగనిచో, నేత్రములు లేకపోవుటయే మంచిది. కావుననే, స్వప్నమునందు సైతము, ఈ రసాస్వాదనము కలిగినవారలకు అన్యదర్శనాదులు రుచింపవు. 'శ్రీకృష్ణప్రభు

ముఖమునందలి దర మందహాసమును చూచినవారు పరవశులై సమస్తమును మఱచిపోవుదు' రని భక్తవర్యుని కథనము.

ఒకమారు సూర్యదాసు శ్రీకృష్ణదర్శనమునకై బృందావనమునకు వెళ్లెను. అచట, శ్రీకృష్ణప్రభువును అన్వేషించుచు, బావిలో పడెను. ఇంతలో ఎవరిని అన్వేషించుచుండెనో, ఆయనయే వచ్చెను - శ్యామసుందరుడు, మన్మోహనుడు ఏతెంచెను. విశాలమైన తన భుజములతో ఆ శ్యామసుందరుడు సూరదాసును బావి నుండి బయటకు తీసెను. భగవంతుని మంగళమయ భుజముల అమృతమయస్పర్శ కలిగినంతనే, స్పర్శ, ప్రాకృత వస్తుస్పర్శ కాదనియు, బ్రాహ్మీస్పర్శ అనియు విదితమయ్యెను. ఆహా! సూరదాసు శరీరము రోమాంచితమయ్యెను. ఆయన, ఆనందోద్రేకములో మునిగిపోయెను. ఇంతలో భగవంతుడు 'నేను వెళ్లుచున్నాను' అనెను. ఎట్లు పోగలవు? అని సూరదాసు భగవంతుని హస్తమును పట్టుకొనెను. భగవంతుడు చేయి విదల్చికొనెను. అంత, సూరదాసు ఇట్లనెను - మంచిది,

''హస్త ముత్క్షిప్య యాతోఽసి బలాత్ కృష్ణ
కిమద్భుతమ్ ।
హృదయాద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే ॥''

''హే శ్యామసుందర! చేయి విదల్చుకొని పారిపోవుచున్నావు. హే నాథ! నేను జీవుడను, నీవు అనంతకోటి బ్రహ్మాండ నాయకుడవు. కావున, ఇందులో ఆశ్చర్యము లేదు. నీవు నా హృదయమునుంచి వెడలిపోయినప్పుడు, నీ పౌరుషమును కొలిసికొందును.''

''ప్రణయరశనయా ధృతాంఘ్రిపద్మః ।''

ద్రవీభవించిన లక్కయందు వేయబడిన రంగు, స్థిరముగా ఉండును. తీసివేయుద మనినను, తీసివేయబడజాలదు. రంగు,

లక్కనుండి వేఱు కావలయునని అనేక ప్రయత్నములు చేసినను, వేఱుకాజాలదు. ఆరీతిగానే, లక్క ఆ రంగును తననుండి తీసిపార వేయుదమని ఎంత ప్రయత్నించినను, తీసివేయజాలదు. రెండును వివశములు. అటులనే భక్తుని చిత్తమునుండి భగవంతుడు వెడలి పోదలచినను, భక్తుడు భగవంతుని, తన హృదయము నుండి దూరము చేయదలచినను, అది యసంభవము. ఇటువంటి విలక్షణ మైన పారతంత్ర్యము ఇరువురియందును కలుగును. సారాంశ మేమనిన, భగవంతుడు భక్తిపరతంత్రుడు. ఆ కృష్ణభగవానుడు సూరదాసు దగ్గఱకు తిరిగి వచ్చెను. అంత, సూరదాసు, హే ప్రభో ! నీ ముఖచంద్రదర్శనము అనుగ్రహించుమని ప్రార్థించెను. సూరదాసుకు భగవచ్ఛరీర సంస్పర్శలభించనే లభించినది. భగవంతుడు దర్శనమును ప్రసాదించెను, సూరదాసు కృతార్థుడయ్యెను. శ్రీకృష్ణప్రభువు వెళ్లిపోవుసమయమున, సూరదాసు ఇట్లు అభ్యర్థించెను - హే నాథ ! ఇపుడు, నా నేత్రములను తీసి కొనిపొమ్ము. నిన్ను దర్శించిన నేత్రములతో ఇపుడు, తుచ్ఛమైన ఈ ప్రపంచమును చూడగలుగుదునా ?

"అనురక్త కటాక్షమోక్షమ్ ।"

లజ్జతో ఎట్లు చూడగలవు ? అని వ్రజాంగన తన సఖితో అనెను. శ్రీకృష్ణదర్శన మగుటయే, దుర్లభము. అందున, విధాత సృష్టించిన జడపక్ష్మములు (కనురెప్పలు), అనంతరము లజ్జ, అపుడు దర్శనము వీనివలన ఏరీతిగా సంభవము ? అపుడు, వ్రజాంగన ఇట్లనెను - ఆ శ్రీకృష్ణముఖచంద్రుడు ఎటువంటి వాడనిన, 'అనురక్తకటాక్షమోక్షమ్'. సఖీ ! బయలుదేరుము నీవు ఆయన ముఖచంద్రుని దర్శించినంతనే, ఆ ప్రభువు, తన భ్రుకుటీ రూప కామకోదండమును ఎక్కుబెట్టి, నేత్రశరసంధానమొనర్చి, కటాక్షములను వర్షించి, హృదయ, మనోబుద్ధులను హరించి,

శుద్ధమైన భావములను స్థాపించును'. లజ్జాదులను త్యజించవలసి యుండును. సానురాగ కటాక్షముల మోక్షమైనట్లే, శ్రీకృష్ణుని అమృతమయముఖచంద్రుని చూచెదవు. శుద్ధ రసాస్వాదనము కలుగును''.

కొందఱు ఈ శ్లోకమునకు భావము ఇట్లు చెప్పుదురు - ఒక వ్రజాంగన, మన్మోహనుడైన శ్రీకృష్ణుడు బృందారణ్యమునకు వెళ్లుచుండగా, దర్శించెను. ధూళి, కన్పడుచున్నంతవఱకు, అసంతృప్త నిర్నిమేషదృష్టితో రెప్పవాల్చక చూచుచుండెను. కాని, ధూళిగూడా పోయినపుడు, చిత్రలిఖితమైనదానివలె కూర్చుండి, శ్రీకృష్ణపరమానందకందముయొక్క అలౌకిక దృశ్యమును చూచుచునుండెను అపుడు, వేణుగీత శ్రవణము చేసెను. హఠాత్తుగా స్మృతి వచ్చెను. నేత్రములు తళతళమని మెఱసెను. అపుడు, మరొక సఖి ఇట్లనును - ''హే సఖి! నేత్రములు ఏల తెరవవు ? సఖి! 'అక్షణ్వతాం ఫలమిదం' శ్యామసుందరుని దర్శనఫల మిదియే అని చెప్పెను. ఆయన, ఇపుడు కన్పడుట లేదుకదా, అయిన, నేత్రములేల తెరవవలయును ?

అథవా, నేత్రములు నిమీలితము చేసి, శ్రీకృష్ణధ్యానములో నిమగ్నమైన వ్రజాంగనను చూచి, మరొక వ్రజాంగన ఇట్లు ప్రశ్నించును - ఇది ఏమి ? ఏల ఇట్లు ఉంటివి ? ఆమె ఇట్లు చెప్పెను - హే సఖి! ఈ విశేషవిహ్వలత, దుర్దశ, మూర్ఛ, దీనత నేత్రములు కలవారికి ఫలము. నేత్రములు లేకపోయిన, ప్రభువుయొక్క, మన్మోహనునియొక్క ముఖచంద్రదర్శనము కలిగి ఉండెడిది కాదు.'' ఆమె ఇట్లు ప్రశ్నించెను - ''హే సఖి! ఆ ఫలమేమి ? నీవు ఆ ఫలమును అనుభవించితివా ?''

'లేదు'.

"వయం సువిదామ ఏవ।"
మేము దూరమునుండి అనుభవించితిమి. హే సఖి! చక్కగా ఆస్వాదించినవారే, ఎఱుంగుదురు!!!

"చూతప్రవాల బర్హ స్తబకోత్పలాబ్జ మాలానురక్త
పరిధాన విచిత్రవేషౌ।
మధ్యే విరాజతు రలం పశుపాలగోష్ఠ్యాం రంగే యథా
నటవరౌ క్వచ గాయమానౌ॥"

దీని భావము కొంత వివరించినపిమ్మట, మొదటి శ్లోకమునకు వత్తము. ఏలయనగా, దీనికి ఆ శ్లోకముతో సంబంధము కలదు. హే సఖి: బృందావనమునందు శ్రీకృష్ణుడు ఎట్లు ఉండెను? (ఈ వ్రజాంగనలకు గల ఆసక్తివిశేషముచేత అచటనే, గృహమునందు కూర్చుండియే, శ్రీకృష్ణదర్శనము కలుగుచున్నది) సుకోమల, నవీన, హరిత, అరుణ ఆమ్రపల్లవములు శ్రీకృష్ణ, బలరాముల ఆభూషణములు. ముకుటము, కుండలములు, హారములు, అంగదములు, కంకణములు, కాంచీ, నూపురములు మున్నగునవి రత్నమయభూషణములే. కాని, ఇవికాక, ఈ వేషము సుకోమలము, దేదీప్యమానము, అరుణము, సరసము నయిన ఆమ్రపల్లవమును ధరించిరి. నెమలిపింఛముతో చేయబడిన కళికలను (నెమలికన్నులను) ధరించిరి. ఆ కళికల మండలమయ ముకుటము విశాల ఫాలభాగముపైన విరాజిల్లుచున్నది. ఇది, ప్రాకృతిక శృంగారము. మయూర, ముకుటసన్నిధానమునందే, అలంకారముతో బర్హమయమైన, అనగా నెమలిపింఛములతో చేసిన గుచ్ఛములు ఉన్నవి. ఉత్పలములు, కమలములు అనగా రాత్రి పూట వికసించునట్టివి, పగటిపూట వికసించునట్టివియు నయిన ద్వివిధ కమలముల హారములు శోభిల్లుచున్నవి. పైనుండి, దామినీ ద్యుతివినిందకము, అద్భుతమునయిన పీతాంబరముచేత శరీరము

ఆవృతమై ఉన్నది. ఈ పరిధానముతోనే, అనగా నీలాంబర పీతాంబరముతోనే విచిత్ర, మనోహరవేషముకల శ్రీకృష్ణబలరాములిరువురును బృందావనమునందలి పశుపాలక గోష్ఠిలో నటవర వేషమును ధరించి విరాజమానులై ఉన్నారు. అపుడపుడు గాన నృత్యములను చేయుచుందురు. అచట, ఈ శ్లోకమునకుముందు వేణుచర్చ కలదు, దీనిచేత, ఉద్బుద్ధ ఉభయవిధ శృంగార రసాత్మకుడైన ఆ శ్రీకృష్ణుడు నటవరవేషమును ధరించి గోపాల వేషమున రసాభినయము చేయుచు విరాజమానుడై ఉన్నాడు. ఇటువంటి సరస, ఉద్బుద్ధ, ఉభయవిధ శృంగారరసాత్మ యైన శ్రీకృష్ణచంద్రపరమానందకందముయొక్క దర్శనమునకు ఇదియే, సమయము. చూతప్రవాళ, బర్హ స్తబక, ఉత్పలాబ్జాది ధారణము చేత రసాత్మకస్వరూపము విచిత్రమైనదయ్యెను. అనగా, పరమానందరసామృతమూర్తి, పూర్ణతముడునయిన పురుషోత్తముని యందు వైచిత్యము వచ్చెను. స్వయంరసాత్మయందు ఈ మూడు, నాలుగు విషయములు ఉన్నవి. 1. ఆమ్రపల్లవము, 2. బర్హ స్తబకము, 3. ఉత్పలాబ్జమాల, 4. పీతాంబరవిశేషము. స్థాయీభావ, వ్యభిచారిభావ, అనుభావము లను మూడు భావములు ఉండును. చూతప్రవాళముచేత, ఉద్బుద్ధ ఉభయవిధ శృంగార రసాత్మక స్వరూపమునందు శృంగారరసస్థాయీభావము ప్రదర్శితమయ్యెను. సరస, సుకోమల, అరుణ ఆమ్రపల్లవముచేత సరసత, అరుణము, రాగము సూచితము, కోమలత్వముగూడా సూచితము. లౌకిక దృష్టితో వ్రజాంగనల హృదయమునందు ఈ రూపమును వ్యక్తము చేయవలయును. వారి హృదయము నందు నిర్విశేషరూపము వ్యక్తమైనచో, వారి సర్వేంద్రియముల సాఫల్యము ఆశించుటకు వలనుపడదు. 'బర్హ స్తబకము' చేత వ్యభిచారీభావము ప్రదర్శింపబడినది. ఒక రసము ధర్మి అగును,

మరొక రసము ధర్మ మగును. శ్రీకృష్ణప్రభువుయొక్క మంగళ మయ శరీరము రసధర్మి. ఆ శరీరమునందు సరస ఆమ్రపల్లవ మును ధరించుటవలన రసము స్థాపింపబడినది. (రసనిష్పత్తి యైనది), రసాత్మ యగు శ్రీకృష్ణునియందు రససంచారము జరిగెను. భావుకులు రసలుబ్ధులై ఉందురు. ఇది యుక్తమే. కాని, ఇట్లైనచో, రసముగూడా దీనియందు లోభముకలదగుచున్నది. సంచారీభావము (వ్యభిచారీభావము) బర్హాస్తబకము ఎట్లు? అనిన, మయూరమునందు రసాక్రాంతి కాదాచిత్కమని భావము. నీల నీరద (మేఘ) దర్శనమువలన మయూరమునందు రసోల్లాసము కలిగినప్పుడు, అది నృత్యము చేయును. నృత్యము చేయుచున్న సమయముననే, దాని పింఛములు రాలిపోవును. ఇటువంటి మయూరపింఛమును ధరించి మూర్ఛాది ముప్పదిమూడు సంచారీ భావములను ప్రదర్శించెను. రసమును నిష్పన్నము చేసి ఈ సంచారీభావములు అస్తంగతములగును. ఎల్లప్పుడును ఉండవు. విభాగములు రెండు విధములుగా ఉండును – ఆలంబనవిభావము, ఉద్దీపనవిభావము. రసమునకు ఆలంబనము (విషయము) ఆలంబనవిభావము. వ్రజాంగనలకు రసాలంబనము శ్రీకృష్ణుడు. అనగా, ఆయనయే, ఆలంబనవిభావము. ఏ యే భావములచేత ప్రియతమునియందు ప్రేమ అధికమగునో, ఆ వేణు, మలయా నిల, చంద్రాదులు ఉద్దీపనవిభావములు. ఈ మూడును (ఆలంబన, ఉద్దీపనవిభావములు, అనుభావములును) రసానుభూతిని కలిగించు నవై యుండును. వీనిలో ఉత్పలాబ్జమాలచేత అనుభావము చూప బడినది. అటులనే, ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసాత్మ యైన శ్రీకృష్ణచంద్ర పరమానందకందమునందు సమస్త రసానుభవ సామగ్రి కలదు. వ్రజాంగనలు నిర్విశేషమని భావించి, ఉద్విగ్న లగుదురేమో, అని, విచిత్ర వేషమును ధరించి, సరసుడై

శ్రీకృష్ణుడు అభివ్యక్తమయ్యెను. అథవా, ఆమ్రపల్లవముచేత రజోగుణము సూచింపబడెను. దాని సరసత్వమువలన, పాను రాగత్వము, అరుణిమవలన రాగము సూచితము. సత్త్వగుణము స్వచ్ఛముగా ఉండును, తమోగుణము శ్యామలము, రజోగుణము అరుణము. నిర్గుణ, నిరాకార పరమాత్మయందు సత్త్వ, రజ, స్తమోగుణములు మూడు ఉండవు. అవి, ప్రాకృతపురుషుని యందు ఉండును. కాని, ఇచట రాగమాత్రమును సూచించుటకై రజోగుణము సూచింపబడినదని దృష్టియందు ఉంచుకొన వలయును. అప్రాకృత. అలౌకిక తత్త్వమునందు సైతము, సత్త్వ, రజస్తమస్సులు ఉండును. కావుననే, శ్రీ వల్లభాచార్యుడు వ్రజాంగనలను సాత్త్విక, రాజసిక, తామసిక భేదముతో మూడు విధములుగా ఉందురు. నిర్గుణస్వరూపము ఒకటి. ఈవిధముగా పదివిధములైన వ్రజాంగనలు చెప్పబడిరి. 'గోపీగీతము'నందు అందటి వచనములను వేఱువేఱుగా చూపిరి. 'రాసపంచాధ్యాయి'ని ఆయన (శ్రీ వల్లభాచార్యుడు) తామస ప్రకరణమని చెప్పెను. దీని తాత్పర్యమేమనిన, ప్రాకృత విషయము దోషదూషితము. లీల ఉన్న స్థలమున, అవష్టంభాత్మకమైన (నిరోధాత్మకమైన) తమస్సు, చాంచల్యాత్మకమైన రజస్సు, ప్రకాశాత్మకమైన సత్త్వము అవశ్యము అపేక్షిత మగును. ఆ లీల, ప్రాకృతమైనను, కావచ్చు, అప్రాకృతమైనను కావచ్చుకాక, ఈ గుణత్రయము అపేక్షితమే అగును. కాని, ఇచట, లీల అప్రాకృతము, అలౌకికము. కావున, దీనియందుగూడా, మూడింటిని చూపించెను. శ్రీకృష్ణభగవానుడు సరస ఆమ్రపల్లవమును ధరించి, అరుణిమను, రాగమును, ప్రేమను సూచించెను. ఇది, ఉద్బుద్ధ ఉభయవిధ శృంగార రసాత్మమైన శ్రీకృష్ణుడు వ్రజాంగనయైన వృషభాను నందినిపట్ల, సరాగుడని సూచితము చేయబడుచున్నది. ఏల

యనగా, ఆయన ఉదాసీనుడని ఎవరును భ్రమ చెందకుండునట్లుగా తన సరాగత్వమును సూచించెను. ఆయనయందు రాగము లేనిచో, నిరాశ జనించవచ్చును. ఉదాసీనుడైనచో, వృషభాను నందినిగాని, వ్రజాంగనలుగాని తమ రసాలంబనముగా ఎట్లు చేసి కొందురు ? రసాలంబనము రాగరహితము, రసహీనము, హృదయ శూన్యమును అగుటకు అవకాశము లేదు. కావుననే, ఉదాసీనత్వ మును, నిరాకారత్వమును సంగోపన మొనర్చుకొనుటకై ఆమ్ర పల్లవమును ధరించి సరసతను, సాపేక్షతను సూచించెను. ఈ లీలలో నిరపేక్షత్వము గుప్తమొనర్చబడును, సాపేక్షత్వము వ్యక్తము చేయబడును. లేనిచో, క్షీరసాగరము ఎవరి రాజధానియో అతడు క్షీరచౌర్య మెట్లు చేయును ? కావున, గుణ, ఐశ్వర్య, మాయాదులన్నియు గుప్తము చేయబడును.

బర్హాస్తబకమును ధరించి, తమోగుణము సూచిత మొనర్చెను. అది, అవష్టంభాత్మకము. అవష్టంభ శబ్దమునకు అర్థము నిరోధము. దీనిచేత ఆసక్తి సూచితమగును. ఆసక్తి, తమోగుణకార్యము. దురాగ్రహియైనవాడు దురభినివేశవశము వలన విషయసేవనమునుండి మరల్చినను, మరలడు. ఇది, ఆసక్తి యొక్క స్వరూపము. తత్సూచకమైన శ్యామల మయూర పిచ్ఛముయొక్క గుచ్ఛములచేత రచింపబడిన ముకుటమును ధరించి వృషభానునందినీవిషయకమైన ఆసక్తిని వ్యక్తము చేసెను. ఇట్లనెను – "ఉదాసీనుడను, రసహీనుడను కాను. నేను నిత్య నికుంజేశ్వరియైన వృషభానునందినియొక్క స్వరూపమునందు ఆసక్తుడ నయిన శ్రీకృష్ణుడను." ఉన్నత దృష్టితో జూచిన, ఇది భగవంతునకు భక్తునియందు గల ఆసక్తి. భక్తులు ఇట్లందురు – "ప్రభువు ఉదాసీనుడు, స్తబ్ధుడును అయినచో, మమ్ము రక్షింప వలయునను దృష్టి ఎట్లు కలిగియుండును ?" ఈ ఆసక్తిభావము

వివేషించి, వృషభానునందినియొక్క ఆసక్తికి – అనుకంపకు పాత్రుడు కావలయుననియే అభిలషించును. వృషభానునందిని యొక్క చేలాంచలపవనమువలన శ్రీకృష్ణచంద్రుడు తానుకృతార్థుడ నైతినని భావించునని చెప్పుదురు. ఉత్పలాబ్జమాలను (రాత్రి వికాసి, దివావికాసియగు కమలమాలను) ధరించుటద్వారా సత్త్వ గుణమును సూచించును. మొదటిదానివలన రాగము, రెండవదాని వలన గాఢమైన ఆసక్తి, మూడవదానివలన వ్యసనము సూచితము. అనగా, వృషభానునందినియొక్క ముఖచంద్ర దర్శనమును – భర్త్రానుసంధానవ్యసనమును – సూచితము చేయుటకై ఉత్పలము, సౌరభముచేత స్థిరమైన వాసన (సంస్కారము) వివక్షితము. ఈ విధముగా ఉద్బుద్ధ ఉభయవిధ శృంగారరసాత్మమైన శ్రీకృష్ణ చంద్రపరమానందకందము. వృషభానునందినీవిషయకమైన రాగ– ఆసక్తి – వ్యసనయుక్తమైన తత్త్వము వ్యక్తమైనది. ఇదియే, భక్తులకు ఉపయుక్తమైనదిగాని, నీరసము, నిర్వికారమైనది కాదు. రసధర్మియైన శ్రీకృష్ణుని ఈ స్వరూపము వ్యక్తము. అథవా, దీనివలన రసరూప సౌగంధ్యము వ్యక్తము. సరసమైన ఆమ్ర పల్లవముచేత సరసత, బర్హస్తబకముచేత రూపము, ఉత్పలాబ్జమాల చేత సౌగంధ్యము సూచితము. ఒకవేళ,

"రసే రసానంగీకారాత్"

అను మతము ననుసరించి బ్రహ్మ, నీరూప మయినచో, భక్తులైన భావుకులకు ఏమి ప్రయోజనము? రూపము రసాదియుక్త మగుట వలన, సర్వాభోగ్యమైన అధరసుధాలాలస గల వ్రజాంగనలకు, రూపభోగలాలస గలవారికి, సౌగంధ్యభోగలాలసులకుగూడా, దానియందు ప్రవృత్తి కలుగు నను విషయమును ప్రదర్శింప వలయును. ఏతాదృశమైన ఈ రసాత్మకరూపము సర్వథా గోప నీయమగు వస్తువు. కావున పీతాంబరముచేత ఆ రసాత్మకరూపము

ఆచ్ఛాదితమైనది. అనగా, కపటచాతుర్యముతో రాగ - ఆసక్తి - వ్యసనములను గుప్తము చేయవలయును. ఇచట, భావవృక్షమునకు రాగము బీజము, ఆసక్తి కళిక (మొగ్గ), వ్యసనము పుష్పమని చెప్పిరి. అనగా, శ్యామసుందరుని సుమధుర అధరసుధాపానము చేత వ్రజాంగనల స్నేహయుక్తము, సరసము నయిన హృదయమునందు శ్రీకృష్ణప్రభువు వేణువుద్వారా భావబీజమును నాటెను. బీజావాపము జరిగినంతనే, అది, అంకురితమయ్యెను. దానియందు ఆసక్తి అనెడి మొగ్గ తొడిగెను. మొగ్గయందుగూడా, రూప, రస, సౌరభములు ఉండునుగాని, గుప్తముగా ఉండును. అనంతరము వ్యసనము జనించినపుడు, అది, పుష్పించెను. పుష్పము వికసితమైనపుడు రూప, రస, సౌరభములు అభివ్యక్తము లయ్యెను. ఈవిధముగా వ్యసనావస్థయే, (సాంసారిక వ్యసనము కాదు, అది, ఘోర నరకమునకు మూలము.) భావుకులైన భక్తులజీవితమును సుఖమయము చేయును. దర్శన, పరిరంభణ, అధరామృతపానములు లేక, ఉండజాలకపోవుటయే, రాగ, ఆసక్తి,వ్యసనములు. ఇది, మహాభాగ్యమైన విషయము,

కొందఱు బర్హమును వేఱుగాను, స్తబకమును వేఱుగాను గ్రహింతురు. బర్హ మనగా, మయూరపింఛము, స్తబకమనగా, పుష్పగుచ్ఛము. ఉత్పలాబ్జమాలవలన వికసితమైన ఉత్పలము నందే సంపూర్ణముగా రస, రూప, సౌరభములు ఉండునని, ప్రదర్శింపబడెను. రస, రూప, సౌరభములు మొగ్గయందు గూడా ఉండును. కాని, ఆ మొగ్గ, వికసించనపుడు, అవి ఎట్లు తెలియును? కావున, ఉత్పలము, అబ్జము రెండును గ్రహింపబడినవి, కారణమేమన, రాత్రిపూట, వికసించునట్టి ఉత్పలము, పగటియందు వికసించక ఉండును, పగటిపూట వికసించునట్టి అబ్జము రాత్రి

యందు అవికసితమై ఉండును. ఒకేవిధమైనచో, నిరంతరము ఆ రెండును ఉండుట సంభవము కాజాలదు.

ఒక చెవియందు కర్ణికారపుష్పము, రెండవ చెవియందు ఉత్పలము ఉన్నవి. దక్షిణహస్తమునందు అబ్జము(నీలకమలము) ఉన్నది. అనగా, మొదటి స్వరూపము "బర్హాపీడం నటవరవపుః" అను వాక్యముచేత వర్ణింపబడినదే, ఈ శ్లోకమునందు గూడా వర్ణిత మైనది. ఇధకను, మఱికొంత సామగ్రి కలదు. ఇంతియే భేదము. శ్రీ వల్లభాచార్యుడు ఇట్లు చెప్పును - ఇచట, మూడింటివలన రజో గుణము, తమోగుణము, సత్త్వగుణము మూడును బోధింపబడినవి. అనగా, ఆమ్రపల్లవముచేత రజోగుణము, మయూరపింఛముచేత తమోగుణము, ఉత్పల, అబ్జమాలచేత సత్త్వగుణము సూచితములు. కావున, వీని విశేష ఆకారముచేతనే, ఆవిర్భవించిన నవరసములు గూడా ఇచట, సూచితములు. ఉద్బుద్ధ, ఉభయవిధ, శృంగార రసాత్మకమైన శ్రీకృష్ణచంద్రుడు నవరససమ్మిళిత స్వరూపము. కావుననే, తత్కృతమైన వైచిత్ర్యముగూడా, కలదు. ఈ విషయమే "విచిత్రవేషా" అను శబ్దముచేత ప్రదర్శితము.

అయినను, ఇచట విరోధము గోచరించుచున్నదని అనవచ్చును. అచట, కేవల రసమే, నాట్యమునందు వ్యక్తమగునని చెప్ప బడినది. సంప్రయోగమునందు రసధర్మసహితుడైన రసధర్మి వ్యక్తమగును. 'నటవరవపుః' అను శబ్దముచేత ఈ విషయమే చెప్పబడినది. 'నట' శబ్దముచేత విప్రయోగాత్మకమైన శృంగారము, 'వర' (పెండ్లికుమారుడు) శబ్దముచేత సంప్రయో గాత్మక శృంగారము చెప్పబడినది. అయిన, నటునివలె కేవల రసము ఉండునుగాని, రసధర్మి ఉండడు. ఏలయనగా, సామగ్రీ

సహితముగా రసము వ్యక్తమైనచోటనే, ధర్మ సహితముగా రసధర్మి ఉండును. సామగ్రీసహితుడైన నటునివలె అభినయముద్వారా, అన్నియు ఆరోపితములే అగును. ఆరీతిగానే, సామగ్రీరహితముగా రసము వ్యంజితమైనచోట, కేవల రసము ఉండును. కాని, వరుడు ప్రత్యగ్ర (నూతనమైన) భోక్తయైనచోట, నాయికానాయకు లందఱును స్పష్టముగా ఉందురు. సామగ్రిగూడా, ప్రత్యక్షముగా ఉండును. కావున, అచట, ధర్మ సహితమైన ధర్మి అభివ్యక్త మగును. ఇపుడు, ఇచట ఆమ్రపల్లవముచేత స్థాయీభావము, మయూరపింఛముచేత వ్యభిచారీభావము, ఉత్పలాబ్జమాలచేత అనుభావము ప్రదర్శింపబడెను. ఆయనయందు రాగము, ఆసక్తి, వ్యసనము చెప్పబడినవి. వానిని భావవృక్షముయొక్క అంకుర, కుట్మల, పుష్పములు అని చెప్పిరి. దానియందు రూప, రస, సౌరభముల వికాసము చెప్పబడినది. వ్యసనముద్వారా నిరంతర భోగము చెప్పబడినది. ఆ భోగమునందు, శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క సంపూర్ణ ఆస్వాదనము చెప్పబడినది. ఉత్పలాబ్జము వికసితమైనపుడే, దాని రూప, రస, సౌరభములు స్థిరముగా ఉండును. అపుడు, శ్రీకృష్ణసంయోగ వ్యసనము కలిగెను.

"అహోరాత్రం వాసనా స్యాత్"

అను వచనమునందు వాసనా నైరంతర్యము కలదు. అదియే వ్యసనము గూడ. జారిపోవునది వ్యసనము కాదు. ఏదిలేక, ఉండుట అసంభవమో, అదియే, వ్యసనము. వేదశాస్త్రాదులు ప్రయత్నము చేసినను, వీడిపోనట్టిదే, వ్యసనము. దాని ఆచ్ఛాదనముకొఱకే, దానిని గుప్తముగా ఉంచుకొనుటకొఱకే, పరిధానము (పీతాంబరము) చెప్పబడినది. దీని తాత్పర్యమేమనిన, శ్రీకృష్ణచంద్ర పరమానందమూర్తి, రాగవంతుడు, ఆసక్తిమంతుడు

వ్యసనవంతుడు నయి అభివ్యక్తిమయ్యెను, ఆయన, రసధర్మి అయ్యెను. ఇపుడు విహెూగము లేదు. సంయోగమే కలదు. అను, సందేహము. దీనిపైన – ఇది గూడా అభినయమే అని చెప్పెదురు. అచట, వనసుందరులైన ఆధిదైవిక శక్తులకు పూర్ణతముడు, పురుషోత్తముడును అయిన శ్రీకృష్ణుని సంయోగ రసమే ప్రాప్తమైనదని, అచట, శ్రీకృష్ణప్రభువు ప్రత్యక్షముగా రమణము నొందుటచేత ఆ సంయోగరసము లభించెనని ఒక దృష్టి కలదు. కాని, వ్రజాంగనలకు విప్రయోగమే కలదు. సామగ్రి ఉన్నను, నటుడు అభినయముద్వారా సామగ్రిని వ్యక్తము చేయును. అవిధముగానే, సంప్రయోగము లేకపోయినను, ఆరోపాదులద్వారా తదభివ్యక్తి కలుగును. అభినయము ఒకప్పుడు శబ్దములద్వారా (వాచికముద్వారా), మరొకప్పుడు కాముక వ్యాపారముద్వారా (ఆంగిక అభినయము ద్వారా), మరొకప్పుడు విభిన్న సామగ్రులను ధరించుట ద్వారా జరుగును. ఇచట, శ్రీకృష్ణప్రభువు యొక్క శృంగారాత్మక స్వరూపమును వ్రజాంగనలయందు వ్యక్తమొనర్చి, వారిని ఆంతరరమణము నొందింపవలయును. బాహ్యరమణమునందు సామగ్రి ఎంత అపేక్షితమో, ఆంతర రమణమునందు గూడా అంతయే అపేక్షితము. ఈ రెంటియందు భేదమేమనిన, బాహ్యసంబంధము ఉండదు. ఈ సమయమున, గోపాలగోష్ఠియందు గల నటవర వేషమును వ్రజాంగనలు ఆసక్తివశమున అనుభవించుచున్నారు. ఇచట, సభ గోపాలకులకు సంబంధించినది, కాని, ఈ అభినయము అంతవఱకే పరిమితముకాదు. వ్రజాంగనలకు గూడా సంబంధించి నది. ఏవంవిధ విశేషణ విశిష్టమైన స్వరూపమును అమృతమయ ముఖచంద్ర వినిర్గతమైన వేణుగీతముద్వారా వ్రజాంగనలు అనుభ వించుచున్నారు. తాత్పర్యమేమనిన, వ్రజాంగనలకు విప్రయో

గాత్మక శృంగారమే కలదు. అన్యస్థలములయందు, అన్యనటుల ద్వారా ఏ భావన, సామాజికులచేత, అనుభవింపబడునో అది అభినివేశమాత్రము, మనోరాజ్యమాత్రము. కాని, ఇచట వీరి భావన ఫలపర్యసాయి. భావుకుల భావన మనోరాజ్యము కాదు. భావుకుడు తాను భావించిన వస్తువే అగును.

"యద్యద్ధియా త ఉరుగాయ విభావయన్తి తత్తద్వపుః
ప్రణయసే సదనుగ్రహాయ ।"

కావున, భావుకులకు ఎటువంటి భావన ఉండునో, అట్టి స్వరూపమునే భగవంతుడు ధరించును. ఈ దృష్టితో ఈ అభినయముద్వారా గూడా వ్రజవాసినులయిన వ్రజాంగనలయందు వ్యక్తములైన, భావములు సత్యములే అగును. ఇచట. కేవలము వరుడనియే చెప్పవచ్చును. కాని, విప్రయోగ మర్యాదారక్షణము కొఱకు నటుడనియు చెప్పబడెను. అభినయ సామగ్రీసహితముగా ఆధిదైవిక శక్తులయందు సంప్రయోగము, వ్రజాంగనలయందు విప్రయోగము కలుగజేయుచు, శ్రీకృష్ణప్రభువు నటునివలె నటవర వేషమును ధరించి సమస్త భావములను అభివ్యక్తము చేయును. దీనిని అనుభవించుచున్న ఒక వ్రజాంగన ఇట్లనును - హే సఖి! విధాత ఒసంగిన లోచనములను అనగా, అంగప్రత్యంగములను సఫల మొనర్చుకొనుము. ఇంత, సుందరమైన దర్శనము వ్రజభూమియందు కలుగదు. పశువులమధ్య, గోపాలకులమధ్య మనోమోహనుడైన, వజేంద్రనందనుడు వ్రజమునుండి బృందావనమునకు పోవుచున్నపుడు దర్శనము నిర్విఘ్నముగా జరుగదు. పశువులు, సిగ్గు, కనురెప్పలు, గోపాంగనలు - వీరందఱు అడ్డుగా ఉందురు. హే సఖి! నికుంజమునందు దాగియుండి శ్యామసుందరుని దర్శనము చేసికొందము. ఇచట, అటువంటి సంవాదము, నృత్యము, గానము ఉండజాలవు.

"అక్షణ్వతాం ఫలమిదం న పరం విదామః ।"

ఇచట, "వ్రజేశసుత" అని ఏల అనిరనిన, అత్త, మేనత్త మన మాటలను చెవియొగ్గి వినిన విందురుగాక. మనము అనుచిత మైన విషయమును ఏమి అనుకొనుచుంటిమి ? జడచేతనములు, పశువులు అన్నియు, వ్రజరాజకుమారుని అమృతమయ ముఖ చంద్రదర్శనాభిలాష కలవి. ఆయన, ప్రతి ప్రాణికి, పరమ ప్రేమాస్పదుడు. కావున, చింత ఏమియును లేదు. ఓ సఖి ! బయలుదేరుము.

"గాయేన మానః అహంకారః యయోః తౌ ।"

శ్రీకృష్ణప్రభువు ఇట్లందురు - రండు. మీలో ఎవరైనను ఈ విధముగా గానము చేయువారు కలరా ? ఏతావతా, అభినయము మూడు విధములుగా ప్రదర్శించెను. ఒకటి పరమ సాత్త్వికము, రెండు నృత్యముద్వారా తామసము, మూడు గానము ద్వారా రాజసము. ఈరీతిగా, శ్రీకృష్ణబలరాములు "మధ్యే విరేజతుః"- గోపాలకులమధ్య విరాజిల్లుచున్నారు.

"గోప్యః కిమాచరదయం కుశలం స్మ వేణు ర్దామోదరాధర
సుధామపి గోపికానామ్ ।
భుంక్తే స్వయం యదవశిష్టరసం హ్రదిన్యో హృష్య
త్త్వచోఽశ్రు ముముచు స్తరవో యథాఽఽర్యాః ॥"

వ్రజాంగనలు ఇట్లందురు - 'హే సఖి ! ఈ గోపాలకుల సౌభాగ్యమహిమను ఎవరు వర్ణింపగలరు ? వారు పరమ అంతరంగ సఖులు. ఓ సఖీ ! శ్యామసుందరుని సఖులైన ఆ గోపాలురు శ్యామ సుందరుని ముఖదర్శనము చేయుదురు. పరిష్వంగము గూడా జేసికొందురు, ఆటలు ఆడుదురు. వారి మహిమ, అచింత్యము. ఆ సౌభాగ్యము మనకెక్కడిది ? అట్టి స్వాతంత్ర్యము మన కెచట

గలదు ? కాని, సఖీ ! చూడు, ఈ నీరస (రసరహిత) దారుమయ వేణుసౌభాగ్యము చూడు !

ఇచట, సనాతన గోస్వామి ఇట్లందురు – 'ఇచట, మహాభావ స్ఫూర్తి కలదు. దానివలన, వ్రజాంగనలకు శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క మంగళమయమూర్తికి సంబంధించిన సర్వభోగ్యాదరసుధయందు, అత్యంతాసక్తివశమున, స్ఫురిత భావము వలన, అలౌకికమైన ఉన్మాదము అభివ్యక్తమయ్యెను. కావున ఈర్ష్యాసహితమైన మిథ్యాకల్పన చేయుచు, మాట్లాడు చున్నారు, ఈ మహాభావము భక్తిరసమునందు ఉన్నత శ్రేణికి చెందినది, అధిరూఢమాదన - మోదనాఖ్యమైన అవాంతరభావము. ఆసక్తివిశేషమువలన, వ్రజాంగనల అంతరాత్మయందు మహాభావ స్ఫూర్తి కలిగెను. కావున, మిథ్యాకల్పన, తద్రసమయ భక్తి రసామృతసింధులహరి.

ఇచట, మూర్ఛా, మరణ, అపస్మారములు రసములు. ప్రపంచమునకు విపత్తి అయినదే, ఇక్కడి సంపద. ప్రియతముడు ప్రాణధనుడైన శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క విప్రయోగమువలన ఉదయించిన తీవ్రతాపమునందు వ్రజాంగన లకు గలిగిన మూర్ఛ, ఇచట రసరూపము. సాంసారికతృష్ణ, తృష్ణ ఆశ, దురాశాపిశాచి. భగవంతుని చరణారవిందములందలి ఆశ, కల్పలత. ఇచట గల ఈర్ష్య, మిథ్యాకల్పన రసమయము. కావున, వేణువును శుష్కకాష్ఠమనుట రసము.

సనాతన గోస్వామి 'వేణువును శుష్కత, నీరసత, సచ్ఛిద్రత సగంధితల ఆరోపమునందు భగవంతునకు రసము సిద్ధించును, వేణువుగూడా, ప్రసన్నమగును' అని చెప్పుదురు.

వ్రజాంగన ఇట్లనును - హే సఖి! శ్యామసుందరుడు ఎవరితోనయినను, కలసియుండి ఉండకపోయిన, సంతాప మేమియును ఉండెడిది కాదు. కాని, తన చెలికాండ్రయిన గోపాల బాలకులను 'శ్రీకృష్ణప్రభువు పరిరంభణము చేసికొందురుగాన, ఈర్ష్య కలుగుచున్నది. ఓ నేస్తమా! కుండలములయందు గల ఈ మకరి (మొసలి) జంకు లేక, శ్రీకృష్ణచంద్ర ముఖచంద్ర చుంబనము చేయును. మాల, వక్షఃస్థలమున వెలుగొందుచుండును. ఈ జడ పదార్థములకు - అనధికారులైన ఈ జడపదార్థములకు - పరమ రసామృతమూర్తియైన శ్రీకృష్ణచంద్రుని సంస్పర్శనాదులు సమస్తము ప్రాప్తించినవి. హతభాగినుల మయిన మనకు లభించ లేదు. పోనిమ్ము, గోపాలకుల విషయ మందువా, ఏదియో ఒక విధముగా సోఢవ్యము (సహింపదగినది). చూడు, ఈవేణువు, ఇది జడము. శుష్కము, కాష్ఠము, నిస్సారము, బోలుతనము గలది, సచ్ఛిద్రము, గ్రంధిసహితము, నీరసము, వేణువు, వంశి (వెదురు చెట్టుకు సంబంధించినది) ఇది ఏమి పుణ్యము చేసికొనెనో కదా, ఏమి తపస్సు, జపము, ధ్యానము చేసెనో కదా! దానివలన దీనికి (ఈ వేణువునకు) అలౌకికమైన ఈ పరమ సౌభాగ్యము లభించినది. సఖి! ఇది తెలిసినచో, మనము గూడా, ఈ వెదురువేణువు. చేసిన తపస్సుచేసి, వేణువే అయ్యెదము కదా! గోపాంగనా జన్మయందు కృతార్థత - సఫలత - లభించలేదు. ఓ సఖీ! ఈ సాధన అత్యంత దురూహ్యము. ఏలయనగా, మనకయినచో, ఉపనిషద్రూపములు వేదబుక్కులు ఉన్నవి. పుణ్యకర్మలు, జపతపము లన్నియును వేదములచేతనే ప్రకాశితములగును. అయిన, ఓ సఖీ! ఈ వేణువు మనకు గుడా దుర్జ్ఞేయమైన అద్భుతమైన ఏ కర్మను అనుష్ఠించి, ఈ సౌభాగ్యమును పొందెను!

"దామోదరాధరసుధామపి గోపికానామ్ ।"

'వేణుః' అను పులింగశబ్దమున నిర్దేశించి పూర్ణతమ పురుషోత్తమరూపములో ప్రకటమైన భగవత్సంభోగమును (భగవదనుభవమును) గోపాంగనాభావాపన్నులే పొందగలరని సూచింపబడినది. ఈ వేణువు పుమాన్ (పులింగశబ్దము) కదా! ఇది (పుంరూపములో ఉన్న ఈ వేణువు) భగవత్సంభోగమెట్లు చేయును? ఇది అనధికారి అగుటయే కాక, శుష్కము (రసహీనము) గూడ. సరసమై (రసయుక్తిమై) ఉండిన, అది వేఱు విషయము. 'వంశీ' అని చెప్పియున్న, అధికారము సూచితమై ఉండెడిది. కావుననే, తెలిసియే, అట్లు చెప్పలేదు. అయిన, ఈ వేణువు, మన శ్యామసుందరుని హస్తారవిందమునందు నిరంతరము విరాజమానమై ఉండును, ఒకప్పుడు ఉదరమునందును, మరొకప్పుడు, ముఖచంద్రునిమీదను, మరొక సమయమున, వక్షఃస్థలముమీదను విరాజమానమై ఉండును. కానిమ్ము, ఇప్పుడైనచో, 'సుధామపి భుంక్తే' అధరసుధనుగూడా అనుభవించుచున్నది. సర్వత్ర ఉండునట్టి దుస్సాహసము (ధృష్టత) చేసినది. ఈ దుస్సాహసమును చూడుము. దామోదరుడైన మన్మోహనుని అధరసుధాస్వాదనము (సంభోగము) చేయసాగినది. ఇంతవఱకు, శ్రీకృష్ణప్రభువు యొక్క ఆలింగన, స్పర్శనాదులను చేయునట్టి దుస్సాహసమే చేసినది. ఇది చాలు. కాని, ఇపుడు కొంత ముందుకు వెళ్లినది. ఓ సఖీ!

''అయం వేణుః యుష్మాకం దామోదరాధరసుధామ్ ।''

మీ వ్రజాంగనలందఱి నిధి, పరమ ధనభూతుడు నయిన దామోదరుని అమృతమయ ముఖచంద్రుని, స్వయముగా, అనగా మీ అనుమతి లేకయే, పానము చేసినది, మన శ్యామసుందరుడు శ్రీకృష్ణచంద్రుడు, ఆయన శరీరమును స్పృశించినది. మన

మన్మోహనుని సుధను మా ఆజ్ఞ లేకయే, అనుభవింపసాగినది. మనను అడుగనయినను లేదు,

"గోపికానామ్ - తదేకాశయైవ గోపికానామ్ (గుప్తారక్షణే)"

అమృతమయ ముఖచంద్రుని అధరసుధ, మన గోపికలది. ఒక్క మన్మోహనుడైన శ్యామసుందరుని సుమధురమైన అధరసుధాను భవము కొఱకే, మనము మన శరీరమును, మన ప్రాణములను రక్షించుకొనుచున్నాము. ఆ యధరసుధ అనుభవించుటకు లభించును, అనునట్టి ఆశతోనే మన శరీరమును, ప్రాణములను కాపాడుకొనుచున్నాము. లేనిచో, ఈ శరీరము, ఈ ప్రాణములు ఎప్పుడో మనను వీడి వెళ్లిపోయి యుండెడివి. సఖి ! ఆయన, మన జీవనాధారము, మన ప్రాణాధారము, మన సర్వస్వము. శ్రీకృష్ణప్రభువు మనవాడని మమకారము ఉన్నది, మన్మోహను డైన శ్యామసుందరుడు మనవాడే, ఓ చెలీ ! మనను ఏమియు అడుగనయినను లేదు, 'దామోదరాధరసుధా' అని చెప్పబడినది. మీరు మన్మోహనుని గుత్తకు తీసికొనియుంటిరా ? ఈయన, పూర్ణతమ పురుషోత్తముడు. నిఖిల విశ్వమునకు సంబంధించిన వాడు. మన ప్రణయపాశముచేతనే, బంధించబడి ఉండును. మన వ్రజేంద్రగేహిని(యశోద) ఆయనను ప్రణయపాశముతో బంధించి ఉంచెను. ఆయన, మనవాడు కాకపోయిన ఎట్లు బంధింపబడును. అందఱకు, సంబంధించినవాడైనచో, మరింత ఎక్కువగా బంధింతురు. ఎవరైనను, ఆయనను బంధించిరా ? నందరాణి, తన గారాబు బిడ్డను బంధింపసాగినపుడు, త్రాడు రెండు అంగుళ ములు తక్కువ అయ్యెను, గోకులమునందు గల రజ్జువులన్నియు ఉపయోగింపబడినవి. కాని, గోవత్సముల త్రాళ్ళు ఉపయోగింప

బడలేదు. ఆ వ్రజేంద్రగృహిణి తన గారాబుబిడ్డ సుకోమలమైన శరీరమును కఠినమైన, రజ్జువుతో ఎట్లు బంధించును? గారాబు బిడ్డడైన శ్రీకృష్ణునకు కష్టము కలిగింపనివి సుకోమలములైన, పట్టు దారములు. హృదయమునందు వాత్సల్యరససాగరము పొంగుచున్న కరుణామయి, పుత్రవత్సల అయిన ఆ తల్లి, కఠినమైన త్రాడును ఎట్లు తీసుకొనును? రెండు అంగుళములు తక్కువ అయ్యెను. పరమాత్మ ఎట్లు బద్ధుడగునని భక్తులు అందురు. కాని, పూర్తిగా బద్ధుడైనచో, విచిత్రమైన విషయము. త్రాడు తక్కువ అయినపుడు వృషభానునందిని వచ్చెను. "ఇదిగో, నా వేణీపాశము ఉన్నది." అని అనెను. ఆమె, తన వేణీబంధనమును ఇచ్చినపుడు శ్రీకృష్ణప్రభువు ఈ వేణీబంధమునందు ఉండనే ఉన్నాను అని అనెను. భగవంతుడు, మాధుర్యాధిష్ఠాత్రియొక్క ప్రణయపాశమునందు బద్ధుడై ఉండును, వృషభానునందినియొక్క, మన స్వామినియొక్క ఆ వేణీబంధముచేత శ్రీకృష్ణుడు బంధితుడై ఉండెను. మనవాడు కావుననే, బద్ధుడగును. కావున, ఆయన సుమధుర అధరసుధ మనది. ప్రాణాధారభూతమైన ఇటువంటి సుధను ఈ వేణువు అనుభవింపసాగెను. ఇంతవఱకు క్షమించితిమి. ఇక, క్షమింప జాలము, 'హే సఖ్యః!' మీరు ఏల గోపికలైరి? గోపీజన్మయందు జన్మకు సార్థక్యము లేదు. వేణుజన్మయందు సార్థకత కలదు. కావున, బయల్దేరుడు, వేణువగుటకు ప్రయత్నించుడు.

ఒక సఖి, ఇట్లనెను – మీరు వ్యర్థముగా వేణువునందు దోషారోపము చేయుచున్నారు. దామోదరుని ముఖచంద్రుడు సహజముగానే, రసోపేతుడు. ఆ వేణువు అనుభవించినచో, అది శుష్కమై పోవును.

'రసము మాత్రమే ఉండెను, సుధనంతయు అది అనుభవించెను' అని సఖి అనెను.

"అవశిష్టం రసో రసమాత్రం యథాస్యాత్తథా ।"

అథవా, సఖి ఇట్లనెను – 'శుష్కవంశీవేణువు ఎంత అనుభ వించును ? అనుభవింపనిమ్ము. మన శ్రీకృష్ణచంద్రుని అధరసుధ, అపరిమితము, అనంతము.

"అవశిష్టో రసో రాగో యస్మిన్‌తత్ ।"

ఇదిగూడా కాదు. మన శ్యామసుందరుని అధరసుధను అనుభవించి, సంతృప్తమైనది, కాని, కాదు. ఇంకను, దీని రాగము దూరము కాలేదు. ఎన్నియో దినములనుండి అధర సుధానుభవమును పొందుచున్నది. కాని, ఆలాలన, యథాతథము గానే ఉన్నది. కావున, ఆ వేణువు, మనకు సర్వదా, సపత్ని (సవతి) యైనది. మన భగవంతుని రసమునంతయు ఆస్వాదించెద మని ఇటువంటి భక్తుల భావన. భక్తులు సవతిద్వేషమును చూపిన, ఇతరులను భక్తులనుగా జేయుట ఎట్లు? ఒకవేళ, వారియందు ఆ ద్వేషము మాలికముగా ఉండియున్న, అది, తగ్గిపోవునని ఆలోచింతురు. వాస్తవమునకు సాంసారిక రసము తరిగిపోవును. కాని, ఈ పరమానంద రసామృతస్వరూపము, సచ్చిద్ఘనమైన పరబ్రహ్మ అపారము. ఎంత అనుభవించినను, ఏమియును తరిగి పోదు. ఎందరో పరమహంసలు బ్రహ్మానందరసమును అనుభ వించిరి. గాని, అది, తరిగిపోలేదు. కావున, తద్బ్రహ్మరసానుభవ భోక్త, మరొకరసభోక్తను జూచి, ఈర్ష్య చెందడు. ఎవరి భోగ్య వస్తువు సీమితమో, అతడు ఇతరుల ఉపస్థానమును కోరడు. ఇది, అగాధము. కావున, రండని, ఆహ్వానింతురు. విశేషించి, వంచితు లను జూచి, భయము నొందుదురు. ఎవరు ఈ పరమ రసామృత మూర్తిని ఆస్వాదింపలేదో, వారి పేరు తలచుకొని, కన్నీరు కార్చుదురు. ఈ జనము శ్రీకృష్ణరసవంచితమైనదనియే, శ్రీ

చైతన్యమహాప్రభువు కన్నీరుపెట్టుకొనుచుండెడివారు. శ్రీగౌరాంగ ప్రభువుకు ఉన్మాదరోగము కలదని కొందఱు అందురు. ఉన్మాద మున్నది గాని, అది మఱొక విధమైన ఉన్మాదము. ఇటువంటి ఉన్మాదము తమకుగూడా కలుగవలయునని భక్తులు కోరుదురు. అచటి వస్తుస్థితి ఎటువంటిదనిన, అది ఈర్ష్యాపూర్వకమైన మిథ్యా కల్పన. ఇది, ప్రేమకు (భక్తికి) సంబంధించిన ఒక విచిత్ర భావము – అసంతృప్తి – తృష్ణ. భక్తులకు నేడు తాము పూజ చేయుటయందే, సంతోషమైనచో, భగవంతుడు ఎట్లగుదురు ? మనము భోగము అర్పించకపోయిన, భగవంతుడు ఆకలిగొన్నవాడై ఉండునని ఆ భక్తులు ఎఱుంగుదురు. భగవంతుడు తృప్తుడయ్యె నని భావము కలిగినచో, భావము చెడిపోయినట్లే. ఇది సహృదయ హృదయవేద్యము. ఈ అపరిమిత, అగాధరసమునందుగూడా, భావమును – మన సర్వస్వభూతమైన అధరసుధను ఈ వేణువు అనుభవించుచున్నది. ఇది, ఎన్ని దినములు మనదానియందు భాగము పంచుకొనునో, తెలియదు. అథవా,

''అవశిష్టం విశిష్టం (వష్టిభాగురిరల్లోపః) న వశిష్టం
రసమాత్రం యస్మిన్ ।''

ఈ వేణువు అధరసుధాస్వాదనము ఎంత చేసినదనిన, రసము గూడా మిగలనంతగా జేసినది. నిశ్శేషముగా ఆస్వాదించినది. అథవా, శుష్కవంశీవేణువు ఉన్నది ఉన్నట్లుగానే దామోదరుని సుమధురమైన అధరసుధను ఆస్వాదించినధనుటయందు ప్రమాణ మేమికలదు ? ఏమాత్రమైనను, సరసమై ఉన్నచో, అనుభవించును. కావున, నీవు వ్యర్థముగా భ్రమపడుచున్నావు. చెప్పలేదా? చూడు! అవశిష్టమైన దీని రసము 'హ్రదిని' యందు ఉన్నది. చూడు, ఈ వేణువు సచ్ఛిద్రమైనది, అపుడు ఒకవైపు నుండి చక్కగా అనుభవించును. మఱొకవైపునుండి బయల్వెడలును. కావున, ఇది దామోదరుని అధరసుధను లజ్జావిహీనమై పానము చేయు

చుండును. ఇది (వేణువు) తృప్తిలేనిదై, ధైర్యమును వీడి, త్రాగుచునే ఉండును. అదియే, వే ణు నా ద రూ ప ము లో బహిర్గతమగుచుండును. ఈ వేణుగీత సుమధుర అధరసుధ వేణు నాదరూపములో ప్రకటమై నదులతో కలిసినది. చూడు, తద్వేణు రవ, తద్వేణుగీత పీయూషరూపములో ప్రకటమైన దామోదరుని అధరమునందలి అధరసుధను పానమొనర్చి, సరస్సులకు రోమాంచము కలుగుచున్నది. ఇదియే 'హృష్యత్త్వచః' అని చెప్ప బడినది. తదుచ్ఛిష్టరసమును పానమొనర్చి సరస్సులయందు కమలినీ, కమలములు వికసితము లగుచున్నవి - రోమాంచములు కలుగుచున్నవి. గొప్ప ఆనందోద్రేకమునందు రోమాంచములు కలుగును. అపుడు, దీని ఉచ్ఛిష్టమును పానము చేయుచున్న హ్రదిని పానము చేయుచున్నపుడు ఇది, చేసి ఉండదా? ఏమి చెప్పుచున్నావు సోదరీ! 'తరవోఽశ్రు ముముచుః'-సఖి! వృక్షముల యందు గూడా, ఆ నాదముచేతనే, మధుధారలు స్రవించసాగినవి. శ్రీకృష్ణచంద్రుడు ముఖచంద్రునిపైన, వేణువునుధరించి గీతాలాపము చేయసాగినప్పుడు, లతలయందును, వృక్షములయందును మధు ధారలు స్రవింపసాగును. దానిని ఆధారముగాజేసికొనియే వృక్షములు ఆనందాశ్రువులను కార్చుచున్నవా? అని వ్రజాంగనల ఊహ. శోకా శ్రువులు వేడిగా ఉండును. ఆనందాశ్రువులు చల్లగా ఉండును. అన్వేషించి గుర్తింపవలయును. ఆర్యజనులు పరమ రసామృత సింధువునందు మునకలు వేసి, ఆనందాశ్రువులను కార్చుదురు. అట్లే, వేణువు దామోదరుని అధరసుధను తప్పక ఆస్వాదించినది. ఏలయనగా, ఈ సరస్సులు, నదులు కమల సంయుక్తము లగు చున్నవి. మా జలముచేతనే, ఈ వంశీవేణువు సౌభాగ్యశాలి అగు చున్నదను ఆనందమే, ఇది.

"గోప్యః కిమాచరదయం కుశలం స్మ వేణుః।"

వ్రజసీమంతిని ఇట్లనును - దామోదరుని ఈ అధరసుధను ఆస్వాదింపసాగిన ఈ వేణువు ఏమి పుణ్యకర్మ చేసినదో కదా! ఇప్పటివఱకు హృదయమునందు, కరారవిందమునందును ఉండెను. కాని, ఇపుడైనచో, అధరసుధాస్వాదనము చేయుచున్నది. ఇచట, దామోదర శబ్దముచేత రాధాదామోదరుల ద్వంద్వము వివక్షితము. కాగా, 'దామోదర' శబ్దముచేత అనగా, ద్వంద్వమునందు ఒకరి నామము గ్రహించుటవలన అన్యసంబంధ జ్ఞానము కూడా కలుగును. ఈ వేణువు రాజేశ్వరి, నిత్యనికుంజేశ్వరి అయిన వృషభానునందినియొక్క ప్రియతముడు, ప్రాణధనుడు నయిన శ్రీ దామోదరునియొక్క అధరసుధను గూడా పానము చేయ నారంభించెను. కావున, మనస్వామిని, రాజేశ్వరి, నిత్య నికుంజేశ్వరి అయిన వృషభానునందినియొక్క ప్రియతముడు, ప్రాణధనుడు, మన్మోహనుడు నయిన శ్యామసుందరుని అమృతమయ ముఖచంద్రుని అధరసుధ మనదే.

ఆ అధరసుధయందు వేణువునకు అధికారము లేదు. అయినను, ఇది అనుభవించుచున్నది. మన సంపత్తిని, మన ప్రాణాధారమును, మన సర్వస్వమును ఈ వేణువు స్వయముగా స్వాతంత్ర్యముతో యథేచ్ఛగా - కొలదిగాకాదు - అడుగకయే, అనుభవించుచున్నది. మరొక గోపిక ఇట్లు అడుగుచున్నది - సఖి! ఈ వేణువు అధరసుధానుభవము చేయుచున్నదని నీవు ఎట్లు తెలిసి కొంటివి? ఇది రసహీనమైన కాష్ఠము, అధరసుధాపానము చేతనముయొక్క ధర్మముగాని, అచేతన ధర్మము కాదు. చేతను లైన ప్రాణులయందుగూడా అందఱి ధర్మము కాదు. కేవలము గోపాంగనాభావాపన్నులైనవారి ధర్మము మాత్రమే. కావున, పుంస్త్వముచేత గూడా, భోగాయోగ్యత ప్రదర్శింపబడెను. ఈ వేణువు పురుషుడు. తత్రాపి అచేతనము, కాష్ఠమయము రస

హీనము. అనగా ఒకవేళ, చేతనమైనచో, అందున గోపాంగనాభావాపన్నమైనచో సరసము, రసాక్రాంతమైనచో దామోదరుని అధర సుధానుభవయోగ్యత లభించి యుండెడిది. అట్టి పరిస్థితిలో ఈ వేణువు అధరసుధాపానము చేసినదని ఎట్లు ఊహించుచున్నావు? అపుడు, ఆమె ఇట్లనెను - 'మాతృతుల్యములైన సరస్సులకు రోమాంచము కలుగుచున్నది. రోమాంచము హర్షోద్రేకమునందు కలుగును. కావున, సరస్సులందలి ఈ రోమాంచము నిర్హేతుకము ఎట్లు కాగలుగును ? ఈ సరస్సుల జలముచేతనే, ఈ వేణువు పాలితము, పోషితమగుటయే ఈ సరస్సుల హర్షమునకు మూల్యము. లోకోత్తరమైన తత్సౌభాగ్యమును చూచి, తల్లి తాను పెంచిన, పోషించిన పిల్లవానిని సామ్రాజ్యాధిష్ఠితుడగుట చూచి, పులకావలీయుతమైన రీతిగానే, ఈ నది తన జలముచేతనే పోషింపబడిన వేణువు నేడు శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క ముఖచంద్రబింబముమీద విరాజమానమై అధరసుధాపానము చేయుచున్నది కదా, అని ఆలోచించును. అందువలన, ఈ రోమాంచముచేతనే, వేణువు అధరసుధాస్వాదనము చేయుచున్న జాడ తెలియును. కులవృద్ధులవంటి వృక్షములనుండి, లతలనుండి ప్రవహించుచున్న మధుధారలు హర్షాశ్రువులు. తమ వంశమునందు జన్మించిన వంశీవేణువు అధరసుధాపానము చేయునంతటి సౌభాగ్యశాలి అయ్యెను గదా, అని ఆ తరులతాదులు భావించు చున్నవి. అథవా, సరస్సులకు అధరసుధానుభవము ప్రాప్తము కాదు. కాని, ఇవి ఇతరుల అనుభవము చేతనే ఆనందించుచున్నవి. నినాదరూపములో పరిణతమైన దామోదరుని అధరసుధారసమును తన ఉచ్ఛిష్టముగా (ఎంగిలిగ) సరస్సులకు, వృక్షములకు వేణువు ఇచ్చినది. మన్మోహన నాదరూపములో, ప్రకటమైన ఆ రసమును అందఱును గ్రహించిరి. వేణూచ్ఛిష్టమైన రసానుభవము చేత

సరస్సులకు కలుగునట్టి రోమాంచవ్యాజముతో ఆనందము ఇది. అయిన, వేణువునకు ఎంత ఆనందము కలుగుచుండవచ్చును? కావున, మనముగూడా, గోపీజన్మను వీడి, వేణు జన్మను గ్రహింతము.

అథవా, ఈ వేణువు ఎంత దయారహితము. మన వృషభాను నందినియొక్క దామోదరుని అధరసుధను తాను అనుభవించుటయే కాక, తన కుటుంబములోనివారికి గూడా పంచుచున్నది. చూడుము, నదులు రోమాంచితములైనవి. వృక్షములయందు ఆనందాశ్రువులు జనించినవి.

అథవా, ఈ వేణువు అధరసుధను దుర్వినియోగము చేయు చున్నది. ఇతరుల సంపత్తిని, సర్వస్వమును - గ్రహించిన గ్రహించుగాక, కాని, ఇటువంటి దుర్లభ వస్తువైన సుమధుర అధర సుధారసమును ఇది, తృప్తిలేక, ఎంత పానము చేయుచున్నదనిన ఛిద్రములద్వారా ఆ రసము వినిర్గతమై సరస్సులనుగూడా ఆప్లావితము చేయుచున్నది. అనగా, అనధికారులైన ఈ సరస్సు లకు ఒసంగుచున్నదని భావము. వృషభానునందినికి, మనకు దుర్లభమైన ఆ రసమును ఈ జడ పదార్థములకు, పాషాణములకు ఒసంగుట ఎంత దయమాలిన పని. అథవా, సఖి! అవశిష్టమైన దామోదరాధరసుధను ఈ సరస్సులు జలవిహారసమయమున పానము చేసినవి. కాని, అది రసము కాదు, కేవల ద్రవ మాత్రము. అదియు ఉచ్ఛిష్టము. వేణువే, సుధాపానము చేసినది. దాని ఉచ్ఛిష్టమును, పానమొనర్చి గూడా ఈ సరస్సులకు ఇంత ఆనందము కలిగెను. ఆ సరసీతటమునందలి వృక్షములు సరసీజల పానము చేసినవి. పరంపరయా వానికి వేణూచ్ఛిష్టము లభించి నది. అథవా, వృక్షములకు ఆ అధరసుధాప్రాప్తి కలుగకపోవుట

చేత అవి రోదింపసాగినవి, చూడు. మన సజాతీయమైన వెదురు చెట్టుకు సంబంధించిన వేణువు అధరసుధాపానము చేయుచున్నది. సరస్సులకు గూడా కొంత లభించినది. హతభాగ్యులమైన మనకు ఎన్నడును లభించలేదు వృక్షములకు అధరసుధాపానము సంభవించదని చెప్పితివి కదా! అయిన, అవి అప్రాప్తియందు (లభించకపోవుటయందు) ఏల రోదనము చేయుచున్నవి. భృత్యులకు సామ్రాజ్యప్రాప్తియందు దుఃఖము కలుగునా? ఈ వృక్షములు దరిద్ర భృత్యసమానములు కదా! కావుననే, 'యథాఽర్యాః' - ఆర్యజనులవలె అని చెప్పబడినది. దామోదరుని అధరసుధారసానుభవప్రాప్తి ఆ వృక్షములకు లేకపోయినను, అవి శోకించుచున్నవి. సాధారణస్థితియందు గోపాంగనాభావప్రాప్తి లేక సుమధుర అధరసుధారసప్రాప్తి లేదు. అయినను, శ్రవణము చేత శ్రోతలు అశ్రువిమోచనము చేయుదురు. అట్లే, పరోపకారకములు, ఛాయ, ఫల, పుష్ప, కాష్ఠములతో సేవచేయునట్టివియు నయిన ఈ వృక్షములు శోకమునందు అశ్రువిమోచనము చేయుచున్నవనిన, వేణువు పరమ పుణ్యశాలి అని తెలియును.

మంచిది, సఖీ! అనుభవింపనిమ్ము, దీనిలో ఏమున్నది! అన ఇట్లు చెప్పుదురు -

"గోపికానాం అవశిష్టరసమ్ ।"

అది, అవశిష్టరసము. ఈ వేణువు దుర్వినియోగము చేయుచున్న రసము గోపాంగనల అవశిష్టరసమే అయి ఉండును. అనగా, గోపికలు ఒక్క దామోదరుని అధరసుధయందలి ఆశచేతనే, అన్య సర్వరసములను త్యజించిరి. ఆ ఆశతో వారు సర్వత్యాగము

జేసిరి. ఈ వేణువు, అట్టి అధరసుధను స్వయముగా పానము చేయుచున్నది.

ఇచట, 'రస' శబ్దమునకు రాగము, ప్రీతి అని అర్థము. వ్రజాంగనల రాగమునకు, రసమునకు ప్రీతికి విషయము ఇదియే. సేరసమైన వస్తువునందు గల రాగ - రసము

"పరం దృష్ట్వా నివర్తతే"

పూర్ణతమ పురుషోత్తముని ముఖచంద్ర దర్శనము చేసి, వెడలి పోవును. దానిని (అన్యవస్తురాగమును) మరచిపోవుదురు.

"అన్యరాగ విస్మారణం నృణామ్ ।"

మన్మోహనుడైన శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క అధరామృతము ప్రాపంచికములైన అన్యరాగములను మఱపింప జేయును. ఒక రసమును పొందక, మరొక రసమును మఱచి పోవుట ఎట్లు ? కావున, మన్మోహనుని అధరసుధయందు ఈ రసానుభవము కలిగినవారికి రసములో రసము వచ్చి చేరెను. అన్యరసము వారికి తుచ్ఛమైనది. వేణువు కూడా, నీవలెనె, వ్రతము పట్టినచో, అనగా, ఈ రసమునందలి ఆశచేత అన్య రసముల ఆశను త్యజించనిచో, ఇది మరొక పని చేయలేదు. జల పానముచేయనిచో, శుష్కతపస్విని అయినచో, నీవు అధరసుధను ప్రాణాధారముగా జేసికొనినట్లు ఆ వేణువు గూడా ప్రాణాధార ముగా జేసికొనినది. ఆ వేణువు ఎంత తపస్విని ! దానియందు ఈర్ష్యపడుట ఏల ? ఈర్ష్యపడకపోయినను, ఈ అధరసుధారసము ఈ వేణువుదే కాదు, మనదికూడా. "గోపికానామపి". దీనిలో మనకు గూడా భాగము ఉన్నది. అట్లైనచో, పంచుకొని గ్రహించ వలయును. కాని, ఈ వేణువు, మన భాగమును గూడా పంచక, స్వేచ్ఛగా అధరసుధను అనుభవించుచున్నది. ఇదియే, దోషము.

ఆ వ్రజాంగన ఇట్లనెను – 'ఇది వేణువు కాదు, వేనరాజు. ఆ వేనరాజు లక్షణము దీనియందు పూర్తిగా గోచరించును. వేనరాజు ఇట్లు అనుచుండెడివాడు –

"న దాతవ్యమ్"

"ఓ ప్రజలార! మీరు జపతపములు చేయకుడు, కేవలము నా కథాశ్రవణాదులను చేయుడు, నేనే, సర్వస్వమును." ఈ వేణువు గూడా మనందఱకు "ఏమియు చేయకుడు, కేవలము నా ధ్యానమాత్రము చేయుడు" అనియే నేర్పుచుండును. వాస్తవమునకు మన సర్వకార్యములు ఏతద్వేణు శ్రవణమాత్రముచేతనే, తీరిపోవుచున్నవి. సర్వకర్మ ధర్మానుష్ఠానములు వీడిపోయినవి. వానికి ఈ సౌభాగ్యము లభించుటకు ఆ వేణువు ఏ కుశల కర్మ చేసెను? అనునదియే ఆశ్చర్యము. ఆ వేనరాజుకంటె ఈ వేణువునందు గల విశేషమేమనిన, ఆ వేనుడు ఒక్క ముఖముతో స్వసిద్ధాంతమును ప్రచారము చేయుచుండెడివాడు. ఈ వేణువు, సప్తముఖములతో (సప్తఛిద్రములతో) స్వసిద్ధాంతమును ప్రచారము చేయును. నిజముగా, ఎవరు ఈ మోహన మంత్రమును విందురో, వారికి అన్నియూ వీడిపోవును.

"శక్ర శర్వ పరమేష్ఠి పురోగాః కశ్మలం యయు
రనిశ్చితతత్త్వాః।"

ఈ వేణువు ఏమి చెప్పుచున్నది? అని సనకాది మహామునీంద్రగణము ఆశ్చర్యచకితమగుచుండును. ఒక వ్రజాంగన, ఇట్లనెను – 'హే సఖి! అతడు వేనుడు, ఇతడు వేణువు. ఇతడు ణత్వము (ణకారము), ఉత్వము (ఉకారము) అను దుప్పటి కప్పుకొని వచ్చెను. ఒకవేళ అట్లు వచ్చియుండిన ఎవరును వినెడివారు కారు. ఏలయనగా, అతడు నాస్తికుడుగా ప్రసిద్ధుడు. అయిన,

ఓ సఖీ! ఈ వేనుడు ఇంత సమర్థుడగుటకు చేసిన పుణ్యమేమి? అలసిపోవుటగూడా లేదు, కావున నిరంతరము ఈ వేణువు అధర సుధాస్వాదము చేయుచున్నది. పోనిమ్ము, చేయునది చేసియే తీరును. శ్యామసుందరుని అధరసుధను అనుభవించుచున్నది. "అహో ధన్యావయమ్" ఒకవేళ ఎవరిచేతనైనను, పోషింపబడిన శిశువు చక్రవర్తి అయినచో వానికి ఎంత ఆనందము కలుగును! కావున, సరస్సులు, నదులు ఇట్లాలోచించును – 'జగద్వంద్యుడు, పూర్ణతముడును అయిన పురుషోత్తముని ముఖచంద్రుని సుమధుర అధరసుధాస్వాదనము చేయుచు (ఈ అధర సుధాస్వాదనము నకై వ్రజాంగనలు ఉవ్విళ్ళూరుచుందురు.) మన జలముచేత పరి పుష్టమై ఉన్నది. దాని ఆనందముచేతనే, కమలినీ కమలవ్యాజముతో రోమాంచములు కలిగినవి. వ్రజాంగన ఇట్లనును – ఓ సఖీ! వేణువును తమ జలముచేత పెంచునట్టి నదులు తాము ధన్యమయితి మని తలంచును. దీనివలన ఈ వేణువు మన ప్రాణాధారము యొక్క అనుభవమును అవశ్యము పొందుచున్నదని ఊహింపుము. ఒకవేళ, ఆ నదులపైన విశ్వాసములేనిచో, ఆ వృక్షములను చూడుము, వానియందు మధుధారలు స్రవించుచున్నవి. వెదురు చెట్టుగూడా, మనజాతికి సంబంధించినదియే కదా అని వృక్షములు ఆలోచించును. సుమధురమైన అధరసుధానుభము పొందుచున్న, సౌభాగ్యశాలియైన వేణువు మనజాతిలో జన్మించినది కదా అని ఆ వృక్షములు ఆలోచించును. ఒక వంశమునందు సత్పురుషుడు జన్మించిన, ఇరువదియొక్క తరములు తరించుసను ఆశ ఉండును. అట్లే, ఆ వృక్షములకు గూడా అట్టి ఆశ ఉండును. కావున, భగవద్భక్తులను చూచి, వారి పితృదేవతలు ప్రసన్నులై ఆనందా శ్రువులను వర్షింతురు. ఆ రీతిగానే, వృక్షములు మధుధారలను స్రవించుచున్నవి. ఇప్పటివఱకు ఓ సఖీ! క్షమించితిమి. ఇపుడు,

ఆ వేణువు 'గోప్యః' దొంగిలింపతగినది. ఈ గోపికలు మన్మోహనుని వెదకుచు తిరుగుచుందురు. అట్టి గోపికలు ఆ వేణువును అపహరింపవలయును, ఈ వేణువు అధరసుధను దుర్వినియోగము చేయుచున్నది. కావున, 'గోప్యః' - అపహరింప తగినది.

దీనిపైన శ్రీవల్లభాచార్యుడు ఇట్లు చెప్పుదురు - "వాస్తవమునకు ఈ వేణువు దామోదరుని అధరసుధాపానము చేయుచున్నదా, లేదా ? అను విషయము విచారణీయము". వ్రజాంగనలు ఇట్లందురు - హేసఖీ ! ముఖసంస్పర్శవలన మన ప్రియతముని అధరసుధాపానము ఇది చేయుచున్నదనియే విదితమగుచున్నది. మనకు ఎట్లు అధరసుధాపానము లభించుచున్నదో, ఈ వేణువునకు సైతము అట్లే లభించుచున్నది. కారణమేనిన, మనకు అధరసుధ లభించునపుడు ఈ వేణువునకు లభించదా ? ఈ వేణువు అధర సుధానుభవమును పొందియున్నచో, అది ఎట్లు పొందెను ? అను విషయము ఆలోచించుము. అయిన, మర్యాదామార్గముతో పొంద లేదను విషయము యుక్తమే. కాని, అనుగ్రహ మార్గముతో, పుష్టిమార్గముతో పొందెను. అనగా, శ్రీకృష్ణప్రభువే ఈ వేణువునకు స్వయముగా అధరసుధ నొసగెను. అట్లైన యుక్తమే. అనుగ్రహముతో ప్రభువు ఇవ్వదలచినపుడు ఈ వేణువునకు గోపాంగనా దేహప్రాప్తియు కలిగియుండును. తద్ద్వారా ఇది అధరసుధానుభవమును పొందుచుండును. కాని, ఈవేణువు పురుషుడు,(పుంలింగ శబ్దముచే చెప్పబడునది) సచ్ఛిద్రము, రసరహితము, గ్రంధియుక్తము అనుగ్రహముచేతగూడా లభింపవలయుననిన దానికై యోగ్యతను సంపాదించుకొనుట అవశ్యకము. కావున ఇది కేవలము స్పర్శమాత్రమునేచేయుచున్నదిగాని,అనుభవమును పొందుటలేదని తోచుచున్నది. వాస్తవమునకు శ్రీకృష్ణచంద్రుని భగవద్భోగ్యమైన

సుమధురమైన అధరసుధ వ్రజవనితలకు ఒసగుటకై వేణువునందు నిక్షిప్తముచేసెను, అనగా, వేణువు దర్వితో సమానమైనది. దర్వితో రసము ఇతరులకు ఈయబడును. ఆ దర్వి స్వయముగా రసగ్రాహి కాదు. వ్రజాంగనలకు పగటియందు అధరసుధ ఎట్లు లభించును ? కావున, ఈ పనిని సృష్టించెను. (వేణువాదనము చేసెను) వ్రజాంగనలకు అనుగ్రహ విశేషముచేత హృదయము నందు ప్రవేశింపజేసెను. సంప్రయోగకాలమున సంభోగమున్నట్లే విప్రయోగకాలమునందు గూడా, సమ్యగనుభవము ఉండును. కావున, వేణువునకు అధరసుధను అనుభవించునట్టి అధికారములేదు. ఇది కేవలము పాత్రమాత్రమే అయినచో, సుధానుభవము లేనిచో ఆనందరససింధువుయొక్క రసలాభము దీనికి లభించకపోవుటకు ఇది చేసికొనిన కర్మ యేమి ? తాత్పర్యమేమనిన, అధరసుధ లభించకపోవుటయందు 'కిమ్' శబ్దము ఆక్షేపార్థకము, లభించుట యందు ప్రశ్నార్థకమై ఉన్నది.

మంచిది, ఓ సఖీ ! ఇది చూడు, చివరకు అధరసుధా ప్రదానము చేయునట్టి వ్రజాంగనలకు వేణువుద్వారా ఆ అధర సుధానుభవము కలుగచేయును. వేణుచ్ఛిద్రమే, వేణువుయొక్క ముఖము దానిద్వారముననే లభించును.

"రంధ్రాన్ వేణోరధరసుధయా పూరయన్ !"

అని చెప్పియే ఉన్నారు గదా.

కావున, వ్రజాంగనలకు గూడా గల సుధాసంప్రయుక్తమైన అనుభవము వేణుచ్ఛిద్రములయందే ప్రవేశించును కదా అది, ఆ అనుభవమునుపొందకపోవుటకుగల కారణమేమి? తనముఖములోనికి వచ్చినరసమును అది ఎట్లు పానముచేయదు? అంత, ఒకవ్రజాంగన ఇట్లనెను – ఒకవేళ, అనుగ్రహమార్గముతో మన్మోహనుడైన శ్యామ

సుందరుడు స్వయముగా దానికి ఒసంగియున్నచో, నీవు ఏల మండిపడుదువు (ఈర్ష్యపడుదువు) ? అంత ఆ వ్రజాంగన ఇట్లనును - కాదు, ఈ వేణువు స్వయముగా అనుభవించుచున్నది గాని, మనోమోహనుడు ఈ వేణువునకు ఒసంగలేదు. మనకొఱకే, ఆ వేణుచ్ఛిద్రములయందు అధరసుధను నింపెను. ఇతరులకొసగు రసమును ఇతరులకు చేర్చు దర్వియే, అనుభవించునట్లే ఈ వేణువు అధరసుధను అనుభవించెను. అదియును, గుప్తముగా కాదు, ఊది ఊది అనుభవించెను.

"బృందావనం సఖి ! భువో వితనోతి కీర్తిం యద్దేవకీసుత
పదాంబుజ లబ్ధ లక్ష్మి!
గోవిందవేణు మను మత్తమయూరనృత్యం ప్రేక్ష్యాద్రి
సాన్వపరతాన్యసమస్త సత్త్వమ్॥"

వ్రజాంగనలు పరస్పరము ఇట్లనుకొందురు - హే సఖి ! ఈ బృందావనము ఈ భూమండలముయొక్క కీర్తిని విస్తరింపజేయు చున్నది. ఓ నేస్తమా ! దేవకీసుతుడు భగవంతుడు నయిన శ్రీకృష్ణ చంద్ర పరమానందకందముయొక్క మంగళమయమైన శ్రీచరణార విందశోభను ఈ బృందావనముపొందెను. అనగా స్వయముగా బృందారణ్యధామముయొక్క శోభ, మహిమ మనోవాచామ గోచరము. ఏలయనగా, బృందారణ్యధామము భగవత్స్వరూపము. భగవంతుని మహిమ అచింత్యము, అనంతము, అద్భుతమునయిన రీతిగ బృందారణ్యమహిమగూడా అచింత్యము, అనంతము, అద్భుతము. కావున తన్మహిమ ఏమి పెరుగును, కాని, దాని భూమండల శోభ విస్తృతమయ్యెను,

"బృందస్యగుణసమూహస్య, గుణిసమూహస్య అవనం
యస్మాత్ తత్।"

అని 'బృందావన' శబ్దమునకు అర్థము.

రసికబృందముయొక్క గుణబృందముయొక్క అవనము - సంత్రాణము-రక్షణము దేనివలన కలుగునో, అది బృందావనము. అనగా, బృందారణ్యధామము రసికజనులకు ఏకైక జీవనాలంబనము. దీనిపైన భావకులైన భక్తులకు అత్యున్నతమైన భావనలు కలుగును. వారు ఇట్లందురు-"మిలన్తు". బృందావనమునకు బయట కోటి కోటి చింతామణులు లభించవచ్చును. ఇంతయేల, వ్రజేంద్రనందనుడు, శ్యామసుందరుడు నయిన మన్మోహనుడు బృందారణ్యముయొక్క సీమకు బాహ్యప్రదేశమున నిలబడి స్వయముగా పిలచినను వెళ్ళవలదు". బృందావనముయొక్క బయట శ్రీహరినయినను చూడవలదని భక్తవరేణ్యులు చెప్పుదురు.

అచట వస్తువు, అంచిత్య, అనంత, పరమానందరసామృత మూర్తియైన భగవంతుడు కలడు. ఆయనయందు అల్పత్వము గాని, ఆధిక్యముగాని లేదు. ఆయన పూర్ణపురుషుడే. కాని, స్థాన భేదముచేత భిన్నభిన్న మహిమలు కలవాడై ఉండును - వంశ వృక్షమునందు వంశలోచనము, గోకర్ణమునందు గోలోచనము, గజకర్ణమునందు గజముక్తాఫలము శుక్తికయందు ముక్తాఫలము ఇత్యాది భిన్నభిన్న రూపములలో ఉండునని మనము ఇంతకు ముందు చెప్పికొనియున్నాము. మూలమునందు ఏమియును మార్పు లేదు. ఆరీతిగా శ్రీకృష్ణుడు నిఖిల రసామృత మూర్తి, ఉజ్జ్వల ఉభయవిధ శృంగారరసాత్మయే. కాని, బృందారణ్య ధామము ఆ శుక్తిక (ముత్యపుచిప్ప). అచట శ్రీకృష్ణపరమానంద కందము అధిక శోభాసమన్వితమై ఉండును. ఇతర స్థలముల

యందు ద్వారకాధీశునియందు ఐశ్వర్యము, మధురానాథునియందు బలాదులు అభివ్యక్తమగును. కాని, బృందారణ్యాధీశుడైన శ్రీకృష్ణునియందు మాధుర్యాభివ్యక్తి ఉండును. ఐశ్వర్యాదులు అనగా, ఈశ్వరత్వాది లక్షణము తిరోహితములగును, మాధుర్య భావము ఎచట ఎంత ఎక్కువగా అభివ్యక్తమగునో, అచటనే భావుకులైన భక్తులకు సరసత్వము కలుగును.

"వ్రజాంగనాబృందస్య జీవనం బృందావనమ్".

అను వ్యాఖ్యయే యుక్తము. లేనిచో. శ్రీకృష్ణప్రభువుయొక్క వియోగమునందు సంతప్తలైన వ్రజాంగనలు గోకులమునందు పడియుండి విలవిల బాధపడుచుండెడివారు. మధురానాథుని మన్మోహనుని వియోగమునందు వ్యాకులత పొందుచుండెడివారు. మధురానాథుని దర్శనమునకై మధురకు వెళ్ళెడివారు కాదా ? లేదు. వారికి వ్రజేంద్రనందనుడైన శ్యామసుందరినియందు ప్రేమ కలదు. వారు మధురానాథ, గోలోకనాథాదులను ప్రేమించుటలేదు వారు వ్రజనాథునిమాత్రమే ప్రేమించుచుండిరి. ఈ విధముగా వ్రజాంగనాబృందము యొక్క అవనము - సంత్రాణము-రక్షణము అథవా సమస్తగుణబృందముయొక్క భవనము ఎచట కలదో, అది బృందావనము. గోపాంగనలు ఇట్లు అందురు.

"జయతి తేఽధికం జన్మనా వ్రజః"

నీ జన్మవలన వైకుంఠాదిలోకములకంటె గూడ వ్రజము (గోకులము) అత్యధిక విజయము కలదయ్యెను. ఏలయనగా, వైకుంఠనాథుడైన భగవంతుని. ప్రాణేశ్వరిఅయిన కారణముచేత లక్ష్మీదేవి సేవ్యురాలు, ఆరాధ్యురాలును అయ్యెను. ఆ లక్ష్మి

దేవియే, ఈ గోకులమునందు సేవకురాలై (శ్రయతే) ఉన్నది. కావున, బృందావనమునందు సమస్త గుణముల అవనము - సంత్రాణము యుక్తమే. కావున, సమస్త మాన, మోదనాది గంభీరశక్తియొక్క ఉత్కృష్టతరములైన భావములు ఉజ్జ్వలనీల మణి మొదలగు గ్రంథములయందు వర్ణింపబడినది. సర్వభావ ములు సామస్త్యేన (మొత్తముగా) ఎచటను ఉపలబ్ధములు కావు, ఈ బృందావనమునందే సర్వభావసంత్రాణము జరుగును.

ఇచటనే, సర్వప్రేమదశలు విరాజమానములై ఉన్నవి. సాధారణముగా అణుపరిమాణము గల ప్రేమ సర్వత్ర ఉండును. చరాచరములయందు ప్రేమలేశము లేని ఏ తత్త్వమును లేదు. ఆ ప్రేమ సద్వినియోగమగుట, లేక దుర్వినియోగమగుట మరొక విషయము. ఒకరు తల్లిదండ్రులను మరొకరు భగవంతుని ప్రేమిం తురు. మరొకరు దురాచారమునందు ప్రేమ కలవారై ఉందురు. కాని, ప్రేమ సర్వత్ర ఉన్నది. రాగము లేక, ఒక పరమాణువు గూడా రెండవ పరమాణువుతో కలియదు. ఈ సంబంధము రస మూలకము కావున, ఈ రాగము లేక ప్రేమ సర్వత్ర పూర్ణముగా నిండియున్నది. సమస్త ప్రపంచము బ్రహ్మచేత జనించుటవలన సర్వత్ర బ్రహ్మభావము నిండియుండును. ఆ రీతిగానే, ఆనంద రూప బ్రహ్మనుండియే ఈ జగత్తు ఉత్పన్నమగుటవలన, ఆ ఆనందము, ప్రేమ సర్వత్ర నిండియున్నవి. అట్లు నిండియుండ వలయునుగూడా. సర్వప్రాణుల స్వస్వరూపము భగవంతుడే, ఆ భగవంతుని పొందుట అత్యంత ఆవశ్యకము. తల్లి తన పిల్లవాడు తనదగ్గఱకు వచ్చునట్లుగా వానికి సమస్త సామగ్రిని ఇచ్చును. ఈ జీవజగత్తు భగవంతునినుండి వియుక్తమైనది. మరల అది తన దగ్గఱకు వచ్చుటకై ఆ జీవజగత్తుకు భగవంతుడొసగిన సామగ్రి ప్రేమ. కావున, ఆ ప్రేమ అందఱియందును కలదు. ప్రేమ

అన్యత్ర ఉండనే ఉన్నది. ఆ ప్రేమను సాంసారిక విషయముల నుండి మరలించి భగవంతుని శ్రీచరణారవిందములయందు లగ్నము చేయుము. నారదాది మునీంద్రులయొద్ద ఒకప్పుడు తరిగిపోవుచు మరొకప్పుడు పెరుగుచుండు ప్రేమ (భక్తి) మధ్యమ పరిణామము గల ప్రేమ. విశేషదర్శనము కలుగుటయందు ఉద్రేకము జనించును. ఆ విశేషదర్శనము తరిగిపోయిన, ఉద్రేకము తరిగిపోవును ఈ మధ్యమ పరిమాణముగల ప్రేమ వ్రజాంగనలయందును పరమమహత్పరిమాణము గల ప్రేమ వృషభానునందినియందును గలదు. ఈ సమస్త దశల లక్షణము ఇచట జరుగుటవలన ఇది బృందావనము. కాశీ, ముల్లోకములకంటె విలక్షణమైనది. బృందావనము భూమికంటె భిన్నమైనది, ముక్తిని అభిలషింతువేని కాశీకి పొమ్ము. ప్రేమను వాంచింతువేని బృందావనమునకు పొమ్ము. 'కాశీ బృందావనం వినా' అని చెప్పిరి. దీనియందు సాంసారికత్వము గోచరించును. కాని వాస్తవమునకు కాదు. ఇచటగల సూర్యాదులందఱును అలౌకికులు. అట్లే బృందావనమునందు ప్రాకృతత్వము ప్రతీతమగునుగాని, అదిఅప్రాకృతము. శ్రీకృష్ణచంద్ర పరమానందకందము ప్రాకృతుడుగా గన్పట్టును గాని, వాస్తవమునకు అప్రాకృతుడు. ఇదియే, మా ధు ర్య మ హి మ. బృందావనమునందు ఇసుకపర్రలో పెరుగునట్టి ఆకులులేని పొదలు గల భూమి అనిపించునుగాని, అసాధారణప్రేమ (భక్తి)మయము. ఆ విషయము భావుకులైన భక్తులకే తెలియును. కావుననే,

''ఏతేనాభౌమత్వమపి ధ్వనితమ్।''

అని చెప్పిరి. వింధ్యాచలమునందలి ఒకభాగమైన చిత్రకూటమునకు శ్రీమద్రాఘువేంద్రుడయిన శ్రీరామచంద్రుడు ఏతెంచినందున వింధ్యాచలమహిమ అధికమైనదని కొందఱు భావింతురు. అటులనే,

భూమండలముయొక్క భాగ్యమేమని వర్ణింతుము. ఆ భూమండలములో ఏకదేశమైన బృందారణ్యధామమునందు శ్రీ వ్రజేంద్ర నందనుడు నివసించెను. కావుననే,

"ధన్యం భూమండలమ్", "బృందావనం సఖి!"

హే సఖి! 'ఇతడు దేవకీసుతుడు'. కాని, వసుదేవసుతుడు కాడు. స్త్రీసంబంధమును సూచించుటకై ఇట్లు చెప్పెను. భావమేమనిన, శ్రీకృష్ణప్రభువు మన స్త్రీలయందు దయచూపును. బృందావనము ద్వారా భూమండలమునకు శ్రీకృష్ణ ప్రభువుయొక్క శ్రీచరణారవిందముల స్పర్శ సౌభాగ్యము లభించెను. ఈ అదృష్టము వైకుంఠమునకు గూడా లేదు. ఏలయన, నిరావరణ ప్రభు చరణములు అచట లేవు. గరుడునిపై ఉండును, సింహాసనముపైన పాదత్రాణయుక్తములయియే ఉండును. ఇచటందువా, గోచారణ వ్యాజముతో, గోవుల వెనుకనే నిరావరణ చరణములతోనే తిరుగును (గోచారణలీల పూర్వము చెప్పి ఉన్నాము) కావున, భూమికి సాక్షాత్తుగా ప్రభుచరణస్పర్శ లభించినది.

"యద్దేవకీసుత పదాంబుజ లబ్ధలక్ష్మి!"

శ్రీకృష్ణచంద్ర పరమానందకంద శ్రీచరణములయందు ధ్వజ, వజ్ర, అంకుశాది చిహ్నములు కలవు. చరణచిహ్నముల సంఖ్యా విషయమున, పదునైదని కొందఱు, పదునేడని మఱికొందఱు, పదునెనిమిదని కొందఱును భిన్నభిన్నాభిప్రాయములు కలవారై ఉన్నారు ఒక్కొక్క చిహ్నమునకు అద్భుతమైన మహిమ కలదు. కమల చిహ్నధ్యానమువలన భక్తుని అతిచంచలమైన మనస్సు అను మధుపము భగవంతుని కమలమకరందపానమునందు ఆసక్తమై నిశ్చలమగును. అంబుజధ్యానముచేత తాపత్రయతప్తమైన మనస్సు

క్షణకాలము శాంతమగును. అంకుశధ్యానమువలన మత్తమనోగజము అతిశీఘ్రముగా వశమగును. వజ్రచిహ్న ధ్యానమువలన కఠినము లైన అనంత పాపపర్వతములు విదీర్ణములగును. యవచిహ్న ధ్యానము చేసినవాడు ధనధాన్య సంపన్నుడగును. ఈ విధముగా ప్రతి చిహ్నమును ధ్యానించుటవలన, భిన్నభిన్న ప్రయోజనములు లభించునని చెప్పబడినది. ఆ చిహ్నములన్నియు వ్రజ భూమియందు చిహ్నితములగును. ఏలయనగా, వ్రజ భూమి ఆర్ద్రము, కోమలము, సరసము నయిన భక్తిభూమి. శుష్క, నీరస భూమియందు ప్రభుపాదపంకజ చిహ్నములు ఎట్లు చిహ్నితము లగును ? బృందాదేవి భక్తిమతి కావుననే, ఆర్ద్రము.

వ్రజాంగనలు ఈర్ష్యను ఇట్లు ప్రకటింతురు – చూడు చెలీ ? దేవతలు భూమిని స్పృశింపనట్టివారు, ఇదియే వారి లక్షణము. సీతాలక్ష్మణసహితుడై శ్రీరామచంద్రుడు అగస్త్యాశ్రమమునకు వచ్చినపుడు, అచట తేజస్వులైనవారు వహించుచున్న ఒక రథ మును జూచెను. దానిని జూచిన లక్ష్మణుడు అడుగగా రామ చంద్రుడు ఇంద్రుని ఆగమనమును గురించి చెప్పెను. హను మంతుడు సీతాదేవిని భూమిపై జూచి, దేవతవు కానిచో నీ వెవరవు ? అని ప్రశ్నించెను. దేవతల పాదములు భూమిని తాకకపోయినచో, దేవేంద్రుని చరణములు భూమిని స్పృశించుట దుర్లభము.అపుడు, పూర్ణతమ పురుషోత్తముని చరణస్పర్శ అతి దుర్లభము – ''పురుష ఏవేదగ్ం సర్వమ్'' – విరాడాత్మ అయిన పురుషుని ఆధిభౌతిక పాదమే ఈ పృథ్వి, ఆధ్యాత్మికపాదము అతీంద్రి యము, అధిదైవికపాదము ఆనందరూపము. దీని తాత్పర్య మేమనిన, పురుషచరణస్పర్శ దుర్లభమైన స్థలమున, పురుషోత్తమ చరణసంస్పర్శ కలిగెను. ఎంత అదృష్టము ! మనమందఱము ఎంత హతభాగినులము ? ఈ బృందావనము దైత్యుల భూమి

దైత్యపత్నియైన బృందయొక్క భూమి. కాని, ఆ బృందభాగ్యము చూడుము. వాస్తవమునకు బృందావనభూమివంటిదే, మన హృదయభూమి గూడ. అది కఠోరము, ఇదిగూడా కఠినము. అచట గోవర్ధనాద్రి, ఇచట వక్షోజము; అచట గంగ, ఇచట అనురాగగంగ; అచట వనరాజి, ఇచట లోమరాజి; అచట శ్రీకృష్ణ ప్రభువు పాదస్థాపనము చేసెను, ఇచట మన హృదయమునందు చేయలేదు. ఆ బృందావనము ఎంత సౌభాగ్యశాలి! కావున, 'దేవకీసుతు'డని అందురు. ఒకవేళ, యశోదానందనుడై ఉన్నచో, ఏదియో ఒక సంబంధమును కలిపియుండెడివాడు, మనను ప్రేమించి ఉండెడివాడు, మన ఆశను సఫల మొనర్చి ఉండెడివాడు ఓమహారాజా!

"న ఖలు గోపికానందనో భవాన్"

నీవు గోపికానందనుడవు కావని మేమెఱుంగుదుము. ఒకవేళ గోపికానందనుడవై ఉండియున్న, ఇంత కాఠిన్యము ఉండెడిదికాదు. దేవకికి, మాకును ఏమి సంబంధము కలదు. ఆమె క్షత్రియాంగన ఆమె హృదయము కఠినము, ఆమె హృదయమునుండి నీవు జన్మించుటవలన ఆ కాఠిన్యమే నీ హృదయమునందు అవతరించినది. గోపికానందునుడవై ఉండియున్న గోపికల హృదయము అమాయికముగ ఉన్నట్లే, నీ హృదయముగూడా అమాయికముగా ఉండెడిది.

భగవంతుడు బృందావనమునందు పాదన్యాసము చేయును గాని, మన హృదయముపైన చేయడని ఈర్ష్యయే, తాపము ఈ రహస్యమును తెలిసికొనునట్టి అంగన అరుదుగా ఉండును. కావున, హే సఖి! (ఇచట ఏకవచనము) అన్యత్ర 'హే సఖ్యః!' (బహువచనము) అని ప్రయోగింతురు. కొందఱు ఇట్లందురు -

'ఇది ఈర్ష్య కాజాలదు. ఏలయన, గోపిక నిర్గుణ, సాత్త్విక, రాజసిక, తామసిక గుణములు కలవారియందు ఈయీర్ష్య సంభవము. మరొక పక్షము ఇట్లున్నది – 'ఈమె నిర్గుణ కావచ్చునుగాని, ఈ రసదశ ఎటువంటిదనిన, నిర్గుణయందుగూడా రససంచారము జరుగును. అథవా, దైన్యముచేత సర్వథా నిర్గుణత్వమే సూచితము'. చూడు సఖీ ! మన ఈ వ్రజభూమి అధిక సౌభాగ్యము కలది. గోపాంగనలుగా జన్మించిన మనకు లభ్యము కానిది, ఈ వ్రజభూమికి లభించినది. వారి భావమేమనిన, శ్యామసుందరుని చరణ సంపర్కముచేత బృందారణ్యమునకు శోభ కలిగినట్లే, ప్రభుచరణ సంపర్కమువలన మన హృదయమునకు శోభ కలుగును. పాద పంకజములు లేనిచోట, శోభ లేదు. కొందఱు భావుకులైన భక్తులు ఇట్లందురు -

"గోప్యః కిమాచర దయం"

అను వపనమువలన మొదట వేణుమహిమ వర్ణితమైనది. దీనివలన అది(వేణువు)సర్వాతిశాయి అగుటచేత వృషభానునందిని దుఃఖితురాలయ్యెను. కావున, ఆమెనే సంబోధించుచు ఒక వ్రజాంగన చెప్పెను. కావున, ఏకవచనము ప్రయుక్తమైనది. ఈ బృందావనము భూమండలముయొక్క విచిత్ర కీర్తిని వ్యాపింప జేయుచున్నది. దీనియందు తమయొక్క, వృషభానునందినియొక్క ఉత్కర్ష బోధితము చేసెను. బృందారణ్యధామము కేవల భూమియొక్క కీర్తినే వ్యాపింపజేయుచున్నది. స్వయముగా తన ఆనందమును ఎఱుంగదు. రసాభిజ్ఞ కాదు గావుననే, భాగ్యశాలిని కాదు. కేవలము పరోపకారమే చేయుచున్నది. కావున, వీరి భావమేమనిన అస్మదాదులు స్వయముగా శ్రీవ్రజేంద్రనందనుడైన శ్యామసుందరుని అద్భుత అనురాగరసమును ఆస్వాదించుచుదురు. బృందావన,

వ్రజభూములయందు పరస్పరము ఉపకార్యోపకారకభావము ఉన్నది. ఈ బృందావనము వలన, వ్రజభూమియొక్క మహిమ విస్తృతమగును. వ్రజభూమివలన బృందావనమునకు లక్ష్మి ప్రాప్తమగును.

"యస్మాత్ వ్రజభువః సకాశాత్ దేవకీసుత పదాంబుజాభ్యాం లబ్ధా లక్ష్మీ యేన।"

శ్రీకృష్ణప్రభువుయొక్క మంగళమయ శ్రీచరణారవిందశోభను ఆ భూమిద్వారా బృందావనము పొందినది. భూమిఆర్ద్రము, అనురాగము కలదైనపుడు, ఆ భూమిపైన భగవానుని మంగళమయ శ్రీచరణారవిందములు అంకితములగును. కావుననే, బృందావనము గూడా, పృథ్వీ యశస్సును ఉపచితమొనర్చెను (పెంపొందించెను) ఈవిధముగా పరస్పరము ఉపకార్య - ఉపకారకభావము ఉన్నది. దేవకీసుతుడని ఏలయనిరి? దీనినిగురించి శ్రీవల్లభాచార్యుడు ఇట్లు అందురు - ఈమాట చెప్పిన గోపాంగన నందగృహిణీగేహమునందే నివసించునట్టి పాలిత, పోషిత కన్య. ఇట్టిస్థితిలో శ్రీనందనందనుడు యశోదానందనుడు శ్రీకృష్ణుడని చెప్పుటలో ఆమె నందపాలిత కన్యయందు అనౌచిత్యమును చూచును. కావుననే దేవకీసుతుడు అని చెప్పెను. అథవా, నందరాణియొక్క మరొక పేరే దేవకి.

"ద్వే నామ్నీ నందభార్యాయాః యశోదా దేవకీతి చ।"

అని విష్ణుపురాణమునందు చెప్పబడినది. అయినను,

"దేవకీసుతపదాంబుజైరవలబ్ధా లక్ష్మీః యేన।"

దేవకీసుతుని దివ్యచరణములవలన బృందావనము కమల శోభవంటి శోభను పొందెనని భావము. అనగా, వికసించిన పద్మమువలె బృందావనమునందలి అద్భుతశోభ క్షణక్షణము వికసించుచుండెను. ఇందులో ఏమి ఆశ్చర్యముకలదని సఖి అనెను. శ్యామసుందరుని

మంగళమయ శ్రీచరణారవిందములు వ్యాపిమైన వైకుంఠమునందు విరాజిల్లుచుండును. అటులనే, బృందారణ్యధామమునందు విరాజిల్లుచున్నవని చెప్పుటలో ఆశ్చర్యమేమి కలదు ? వ్యాపిమైన వైకుంఠమునందు ఉండునట్టి బృందారణ్యధామము భూమండలమునందు విరాజిల్లుచున్నది. ప్రజలు దేనిని నేత్రములని చెప్పుదురో, అవి వాస్తవమునకు నేత్రగోళకములు. నేత్రేంద్రియము ఈ గోళకము వెనుక ఉండును. ఈరీతిగానే, బృందావనధామము ఉన్నది. అతీంద్రియమైన బృందావనధామము ఏ భూమియందు ఉండునో, ఆ భూమిగూడా బృందావనమని చెప్పబడును. ఈ విధముగా సర్వోపలబ్ధమైన బృందావనధామము నేత్రగోళకమువంటిది. అనగా అతీంద్రియమైన బృందావనధామము భక్తులకు ఉపాసనాగమ్యము. ఇదియే, దాని అద్భుత మహిమ. అయినచో, ఈ భూమియందు ఆ బృందావనధామము ఎట్లు ప్రకటమయ్యెను ? అనిన, భక్తిచేత ప్రకటము కాదా ? భక్తిగల స్థలమునందే భగవంతుని శ్రీచరణారవిందములు ప్రకటమగును. ఇది, యుక్తమే. భగవంతుని పాదపంకజములు కల స్థలమునందే శోభ ఉండును. మహిమ ఉండును. దీనివలననే, ఈ భూమికి ప్రతిష్ఠ. ఇచట శ్రీకృష్ణచంద్ర పరమానందకందముయొక్క చరణములే, భక్తిరూపములు అనియు, భక్తిమార్గమునందు చరణములకు ప్రాధాన్యము కలదనియు చెప్పుదురు. కావున భగవానుడు బృందావనమునందు చరణములను ప్రతిష్ఠించి, భక్తిని స్థాపించెను. చరణములను అంబుజములతో పోల్చుదురు. అంబుజములు కోమలములు, శీతలములు, తాపాపనోదకములు నయినట్లే, భక్తిగూడా తాపాపనోదక మగును. ఆ భక్తిబృందయందు స్థాపింపబడినది. కావున, విశేషభక్తి స్త్రీలయందే ప్రదర్శించెను. కావుననే, వృషభానునందిని

యందు భక్తియొక్క పరాకాష్ఠకలదు. ఈ విధముగానే, ఇచటి ప్రసంగమునందు హరిణుల, గోవుల, స్త్రీమయూరముల పుళింద స్త్రీల వర్ణనమే కలదు. వారి హృదయము అధిక కోమలము. కోమల హృదయము భగవద్వియోగజన్యమైన తీవ్రతాపముచేత త్వరగా ద్రవీభవించును. స్వభావముచేతనే కఠినమైన పదార్థము తాపముచేత ద్రవీభవించదు. కావున, ఆ స్త్రీల హృదయమునందు భగవత్సంబంధము స్థాపింపబడినచో హృదయము ద్రుతము (ద్రవీభూతము) అగును. ఇట్టైనపుడే అచట ప్రభువుయొక్క పాదపంకజస్థాపన జరుగును. ఈవిధముగా బృందారణ్యధామము నందు చరణములు అంకితములయ్యెను. చరణ చిహ్నములు స్థాయీభావాపన్నములయ్యెను.

ఎచటెచట భగవంతుని శ్రీచరణ పంకజములుండునో, ఆయా స్థలములయందు బృందారణ్యధామము ఉండుననుట భావకులైన భక్తులకు మాన్యమైన విషయమే. సర్వవ్యాపియైన వైకుంఠధామము నందే భగవంతుని అభివ్యక్తి కలుగును. కావున,

"సభగవః కస్మిన్ ప్రతిష్ఠితః స్వమహిమ్నితి హోవాచ।"

అని శ్రుతివచనము చెప్పుచున్నది. భగవంతుడు తనయందే ప్రతిష్ఠితుడై ఉన్నాడు. సర్వాధారుడు, తనకు తాను ఆధారభూతుడు, ఆధార ఆధేయములు రెండును ఏకాత్మకములు అథవా, అవ్యక్తక మునకు పైన సత్తత్త్వము కలదనియు చెప్పాడు (ఈ విషయము పూర్వము చెప్పబడినది) ఈవిధముగా బృందావనము లక్ష్మిదేవిని పొందెను, భక్తి జ్ఞానములనుగూడా పొందెను.

"గోపింపవేణు మనుమత్త మయూర నృత్యం
గోవిందః గవాం ఇంద్రః।"

భగవంతుడైన శ్రీకృష్ణుడు ఇంద్రుని మానమర్దనము చేసెను. ఇంద్రుడు కుపితుడై మూసలధారావర్షముచేత గోకులమును ప్రవాహములో కొట్టుకొనిపోవునట్లు చేయుడని, నాశనము చేయుడని ఆజ్ఞ ఒసగెను. కాని, శ్రీకృష్ణప్రభువు ఏడు దినములవఱకు గోవర్ధన ధారణము చేసి గోకులమును సంరక్షించెను. ఈ విషయము ఇంద్రునకు తెలిసెను. ఆయన, సురభి (కామధేనువు) వెంట ప్రార్థించుటకై వచ్చెను. దీని భావమేమనిన గోకులముయొక్క గోవుల యొక్క సంరక్షణముకొఱకై ప్రభువు అవతరించెను. కావున వీని పైన శ్రీకృష్ణప్రభువునకు కృప కలదు. వచ్చి, సురభి ఇట్లనెను - 'మేమందఱము మా ఈశ్వరుడైన ఇంద్రరూపముతో మిమ్ము అభిషేకింపదలంచుచున్నాము. శ్రీకృష్ణప్రభువు ప్రార్థనను అంగీకరించెను. కామధేనువు క్షీరముతో అభిషేకముచేసెను. అప్పటినుండి 'గోవింద' నామము ప్రఖ్యాతమయ్యెను. గోపాలచూడామణియైన భగవంతుడు వన్యవేషమును ధరించి గోపాల, గోపత్న్యాదులతో పరివేష్టితుడై బృందావనమునందు ప్రవేశించినట్లే, ఆ భగవంతుని మంగళమయ, అమృతమయ ముఖచంద్రదర్శనముచేత మయూరీ మయూరములు ప్రసన్నములగును అద్భుతమైన ఒక మెఱుపుతో విద్యుల్లతతో సమానమైన పీతాంబరముచేత పరివేష్టితమైననవనీల నీరదము మందమంద గర్జనముతో సమానమైన వేణునాదము చేయుచు అభివ్యక్తమయ్యెనని ఆ మయూరీ మయూరములు ఎఱుంగును. ఆయనను చూచినంతనే మయూరములు నాట్యము చేయసాగెను. ఆ పీతాంబరముయొక్క అద్భుతమైన తళుకుబెళుకుల ఆనందోల్లాసమునందు పరవశములై నాట్యము చేయును. ఒక్క మయూరము కాదు, 'మయూరాః' (మయూరములు) ఇది భక్తికి సూచన. ఈ మయూరములవలె భక్తులు గూడా, ప్రఫుల్లితులై నాట్యము చేయుదురు. వారు నాట్యము చేయుచుండగా

బృదారణ్యధామముగూడ నాట్యము చేయుచున్నదా అన్నట్లు ఉండును. ఈ స్థితిలో కపోత, హంస, కారండవాది ఇతర జంతువులు అన్నియు గోవర్ధనసానువులపై కూర్చుండి, ఆ నృత్యమును జూచి, మన్మోహనుడైన శ్యామసుందరుని మంగళమయ శరీరమును జూచి, మధుర మధురమైన వేణునాదశ్రవణము చేసి, ఉన్నవి ఉన్నట్లుగా చిత్రలిఖితములైన వానివలె ఉండిపోవును.

శ్రీవల్లభాచార్యుడు ఇట్లు అందురు– 'దీనివలన, జ్ఞానము సూచితము, మయూరములన్నియు జ్ఞానులు, భక్తులు? సాధారణముగా పశు, పక్ష్యాదులు తామసములు, జ్ఞానము సాత్త్వికము కావుననే అవన్నియు గోవర్ధన పర్వతోన్నత శిఖరముపైన నిర్భయముగా కూర్చున్నవి.

"ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః"

తాత్పర్యమేమనిన, శ్రీబృందారణ్యధామము జ్ఞానమును, భక్తిని, సమస్తమును పొందినది, కావున, ఆ బృందావనము ధన్యము సఖీ!

"బృందావనం సఖి భువో వితనోతి కీర్తిమ్।"

కొందఱు భక్తులు ఇట్లు చెప్పుదురు–

"గోవిందస్య వేణురేవ మనుః మోహన మంత్రః"

గోపాలచూడామణియైన శ్రీకృష్ణచంద్ర పరమానందకముయొక్క వేణునాదమే, మోహనమంత్రమని భావము. దానివలననే మత్తములై మయూరములు నృత్యము చేయనారంభించినవి. దానిని జూచి ఇతర ప్రాణులన్నియు నిశ్చేష్టములై తల్లీనములయ్యెను,

"మనుః-ధర్మశాస్త్రోపదేష్టా"

అని కొందఱు చెప్పుదురు. అన్య స్థలములందు గల మనువు మరొకరు కావచ్చుగాక, ఇచట గల మనువు మాత్రము వేణువే. దీని ఉపదేశము వలననే మనము కుల, లజ్జా, శీలములను అన్నిటిని వదిలివేసితిమి. 'అన్నిటిని వదలిపెట్టుము, కేవలము శ్రీకృష్ణప్రభుచరణారవిందములయందు మనస్సు లగ్నము చేయుము' అని ఆ వేణువు ఉపదేశించును. కావుననే, ప్రపంచము నందలి ప్రవాహములన్నియు, మరొక వైపునకు ఆకర్షించును, వేణునాదప్రవాహము శ్రీకృష్ణప్రభువువైపునకు ఆకర్షించును, అని చెప్పిరి. (వేణువునందు వేనరాజుయొక్క కల్పన పూర్వము చెప్ప బడినది).

"అద్రిసాన్వపరతా న్యసమస్తసత్త్వమ్।"

"అద్రిసానుషు అపరతాని సర్వాభ్యః క్రియాభ్యః
ఉపరతానిఅత్ర సమస్త సత్త్వాని।"

ఈ రీతిగా బృందారణ్యధామము ఉన్నది. కొందఱు ఇట్లందురు - 'మయూరపింఛమును ధరించిన శ్రీకృష్ణప్రభువునుజూచి, ఇతర సమస్తప్రాణులు నిశ్చేష్టములైనట్లు, మయూరములు స్తబ్ధములు ఎలాకాలేదు ? వానికి నృత్యము ఎట్లు స్ఫురించెను ? అనిన, ఇట్లు సమాధానము చెప్పుదురు - 'శ్రీకృష్ణచంద్ర పరమానందకందము దామినీపరివేష్టితమై, మందగర్జనము చేయుచు, నవనీలనీరద స్వరూపములోనే మయూరములకు ప్రకటమయ్యెను.

"మల్లానామశనిః"

అను వచనానుసారము ప్రతివానికిని, వేఱువేఱుగా శ్రీకృష్ణప్రభువు కన్పడెను. అట్లే, ఇచటగూడా మయూరములకు మేఘస్వరూప

ములో ప్రకటమగుటచేత ఆ మయూరములకు నాట్యము చేయ వలయు నని స్ఫురించెను. ఈవిధముగానే, కోకిలలకు సరస వసన్త స్వరూపము ప్రభువునందు స్ఫురించెను. అథవా, మయూరపిచ్ఛ ధారియైన శ్రీకృష్ణుడు మయూరప్రియుడు. ఆయనను జూచి మయూరములు నర్తింపసాగినవి. 'నీవు వేణువాదనము చేయుము మేము నాట్యము చేసెదము' అని ప్రార్థించినవి. ఎంత సుందర మైన దృశ్యము. మన్మోహనుడైన శ్యామసుందరుడు వేణునాదము చేయును, మయూరములు నృత్యము చేయును. 'వేణుమనుః' అను శబ్దము ఇదియే చెప్పును. వేణువునందు గాయనము, వాద నము రెండును గలవు. తదనుకూలముగా నృత్యము జరుగు చున్నది. సమస్త ఖగమృగాది సామాజికులు ద్రష్టలు, శ్రోతలు, అవి అన్నియు స్తబ్ధములైనవి. ఇపుడు వాదనముచేయు వాదకుడు సరిగా వాదనము చేసినచో, అతనియందు ప్రసన్నులై బహుమాన మీయబడును, ఆ రీతిగానే, మయూరములు భగవంతుని వేణు వాదనమునకు ప్రసన్నములై పింఛములను బహూకరించినవి. శ్రీకృష్ణప్రభువుగూడా, మహా ఆదరముతో, ఆ పింఛమును మస్తకము నందు ధరించెను, అథవా, మొదట మయూరములు దామినీపరి వేష్టిత నవనీల నీరదమని భావించి నృత్యము చేయనారంభించెను. వాని నృత్యమును జూచి, భగవంతుడు వేణువాదన మారంభించెను. తరువాత రహస్యము తెలిసెను. నవనీలనీరదమునందు గాంభీ ర్యము, శ్యామలత్వము, తాపాపనోదకత్వము, మనోహరిత్వము మొదలగు గుణములన్నియు, శ్రీకృష్ణప్రభువునందు ఉండనే ఉన్నవి. చివరకు, అది నీరదము, ఇది అమృతము, అది జల దము, ఇచట ప్రేమానందవర్షము ప్రాకృతమైన దామినికంటె

అనంతకోటిగుణితమైన, దీప్తిసంపన్నమైన పీతాంబరము, వేణు వాదనమునకు సంబంధించిన అద్భుత మనోహారిత్వము మొదలైనవి. ప్రాకృతములైన నీరదములకంటె విశేషాతిశయము అనుభూయ మానమైనప్పుడు మయూరములు గూడా స్తబ్ధములగును. ఈపక్షము నందు మొదట,

"మయూరేభ్యః అన్యాని"

మయూరములకంటె ఇతర ప్రాణులు అని అర్థము చెప్పబడెను. ఇపుడు,

"అవరతాని అన్య సమస్త తత్త్వాని"

"అవరతే అన్యే రజస్తమసీ।"

దేనియందు రజస్తమోగుణములు ఉపరతములైనవో, అని అర్థము. రజస్తమస్సులు మొత్తముగా నివృత్తములైన సమస్త సత్త్వము సంపూర్ణముగా వికసించినస్థలము శ్రీ బృందారణ్య ధామము 'బృందావనము'.

"బృందావనం సఖి భువో వితనోతి కీర్తిమ్।"

గోపాలచూడామణియైన శ్రీకృష్ణచంద్ర పరమానందకందము యొక్క వేణునాదానంతరము మత్త మయూర నృత్యము చేత ప్రేక్ష్యమైన(సుందరమైన) అద్రిసానువుపైన గల సర్వప్రాణులు నిశ్చేష్టులైరి. అనగా,

"ప్రేక్షా మర్హన్తీతి తే ప్రేక్ష్యాః।"

గోవర్ధనాద్రిశిఖరములు సాధారణముగా మనోహరములు, అందున ప్రభుసాన్నిధ్యమును పొంది, అత్యంత సుందరములైనవి. వాని

శోభలోకోత్తరముగా ఉపచితమయ్యెను. అథవా, ఆ విశేషసమయమునందు, అనగా, ఇంద్రుని పూజను నిరోధించి గోవర్ధనగిరిపూజ చేయించిన సమయమునందు, సమస్తభోగములను 'శైలోఽస్మి' అనుచు, భగవంతుడు స్వయముగా గ్రహించిన సమయమున, ఆ గోవర్ధనాద్రిశిఖరములు, లోకోత్తర సుందరములయ్యెను. కావుననే, ఇట్లనిరి –

"గోవిందవేణు మనుమత్త మయూరనృత్యం ప్రేక్ష్యాద్రి
సాన్వవరతా న్యసమస్త తత్త్వమ్॥"



# 6. చీర హరణము

"నూతన జలధరరుచయే గోపవధూటీదుకూలచోరాయ।
తస్మై కృష్ణాయ నమః సంసారమహీరుహస్య బీజాయ॥"

భగవంతుడైన శ్రీకృష్ణచంద్ర పరమానందకందము యొక్క లీలలు అద్భుతములు, అలౌకికములు. భక్తులనయినచో పరమానంద రసాత్మకములైన లీలలు ఆత్మస్వరూపులనుగానే చేయును. కాని, అవివేకులైన కుతార్కికులను ఆ లీలలు వ్యామోహమునందు గూడా వదలివేయును.

శ్రీరామచంద్రుని దర్శించినవారు, ఆయన చరిత్రలను వినినవారు నయిన జడులు వ్యామోహితులగుదురు. వివేకవంతులైన పండితులు నిరతిశయానందమును పొందుదురని అభియుక్త వచనము.

జడులను మాటయేల ? భగవంతుని దుర్గమ, సుగమ, మంగళమయ సగుణలీలలు మునులను గూడా అపుడపుడు వ్యామోహితులను జేయును. కావుననే, నిర్గుణ రూపము అతి సులభమనియు సగుణరూపమును ఎవరును ఎఱుంగరనియు, సుగమములు, దుర్గములు నయిన భగవంతుని నానావిధములైన చరిత్రలను విని విని మునీంద్రుల మనస్సులు భ్రాంతములైనవనియు మహానుభావుల కథనము.

నవనీతచౌర్యము, చీరహరణము, రాసరసము మొదలగు లీలనన్నింటిపైన అనేక శంకలు చేయబడును. ప్రాణుల క్షేమము కొఱకై మహానుభావులు సమాధానములు గూడా చెప్పుచునే

ఉందురు. అయినను, ఏమియు శ్రద్ధా విశ్వాసములు లేక కేవల శుష్కతర్కములవలన సమాధానము లభించుట కష్టము.

భగవంతుడు, భగవంతుని లీలాసంబంధమైన బుద్ధి తర్కము చేత లభించడు.

"నైషా తర్కేణ మతి రాపనేయా।"

అని శ్రుతి చెప్పుచున్నది. ఆస్తిక్యబుద్ధితో విచారించుటవలన తెలియునది ఏమనిన, భగవల్లీలలను వర్ణించిన వక్త అమలాత్ముడు పరమహంస, మహామునీంద్రుడు నయిన శ్రీశుకదేవుడు. ఆ శుక దేవునకు స్వస్వరూపభూతమైన పరమానంద రసామృత సమాస్వాదనము దక్క, దృశ్యమగు ప్రతి వస్తువు అత్యంతము అసత్కల్ప మయ్యెను. శ్రోతయైన వ్యక్తి రాజర్షియగు పరీక్షిన్మహారాజు. ఆ పరీక్షిత్తు సామ్రాజ్య, సింహాసనములను త్యజించి, గంగాతటమునందు నిర్జలవ్రతధారణము చేసి, కుశాసనముపై కూర్చుండి, ఆత్మకల్యాణముకొఱకు వ్యగ్రమైన చిత్తము కలవాడు. ఆ పరీక్షిన్మహారాజు జీవితావధి మొత్తము ఏడుదినములు మాత్రమే. మహా మహా బ్రహ్మర్షులు, రాజర్షులు, దేవర్షులు, విరాజిల్లుచున్న సమాజమునందు గ్రామ్య కథలు ఎట్లు సంచరింప జాలును?

సోసిండు, ప్రస్తుతము మనముగూడా, చీరహరణ లీలను గుఱించి విచారింతము. శ్రీమద్భాగవతమునందలి దశమస్కంధమున ఇరువది రెండవ అధ్యాయములో చీరహరణ ప్రసంగము వచ్చును. తత్పూర్వాధ్యాయమునందు భగవత్క్రీడయందు గోపాంగనల పరమ ఆసక్తి వర్ణింపబడినది. ఇపుడు, నందవ్రజ కన్యకల ఆసక్తి నిరూపింపబడును. కన్యకలు శ్రీ కృష్ణచంద్ర

పరమానందకందమైన భగవానుని వరుడుగా పొందుటకై దుర్గమ సంగమని, భగవతి అయిన కాత్యాయనీదేవియొక్క అర్చనము నందు నిమగ్నలై ఉండిరి. వీరిలో పరమానంద రసామృతమూర్తి అయిన భగవంతుని మాధుర్యాధిష్ఠాత్రి మహాశక్తియైన శ్రీ వృషభాను నందిని, ఆమెయొక్క అంశభూతలైన లలిత, విశాఖ మొదలగు వారు అటులనే అన్యాన్య నిత్యసిద్ధ వ్రజకుమారికలు గూడా సమ్మిశితలై ఉండిరి అను విషయమును జ్ఞప్తియందు ఉంచుకొన వలయును.

వారి సాధనరసవిశేష పోషణమునందు లీలావిశేష వికాసార్థ మయియే ఉన్నది. కాని, సాధనసిద్ధలయొక్క సాధన సరిగా శ్రీకృష్ణప్రాప్తి యోగ్యతాసిద్ధ్యర్థమై ఉన్నవి. యువతులైన వ్రజాంగనలు ఈ కుమారికలకంటె భిన్నలు. వారియందుగూడా అనన్య పూర్వికా, అన్యపూర్వికాది భేదములు కలవు. ఈ కుమారికలయందు గూడా, అన్యపూర్వికా, అనన్యపూర్వికా భేదముకలదు. కాని, వస్తుతః శ్రీకృష్ణునకు సంబంధించిన వ్రజయువతులందఱును, అనన్యపూర్వికలే. రసవిశేష వికాసముకొఱకై వారియందు అన్య పూర్వికాత్వ కల్పనము చేయబడెను.

మహానుభావులు వీరి భేదమును ఇట్లు చెప్పిరి — మొదట నిత్యసిద్ధలు, సిద్ధసిద్ధలు అను రెండు భేదములు కలవు. నిత్య సిద్ధలైన స్త్రీలు శ్రీకృష్ణునితోబాటే అవతరింతురు. అనేక ఉపాసనల ద్వారా, మనోరథములద్వారా, శ్రీకృష్ణానుగ్రహముచేత సిద్ధి పొందినవారు సిద్ధ స్త్రీలుఅని చెప్పబడుదురు. నిత్యసిద్ధలలోగూడా ఊఢ (వివాహిత), అనూఢ (కన్య) అని రెండు భేదములు కలవు. ఊఢయైన స్త్రీలుగూడా, తమ పతికి సంబంధించినవారు ఎన్నడును కారు. కాని, కేవలము పతియొక్క మమతాభాజనలై ఉందురు.

"న జాతు వ్రజదేవీనాం పతిభిః సహ సంగమః।"

వ్రజాంగనలకు ఎన్నడును, తమ పతులతో సమాగమము కలుగలేదు. భగవంతుని అచింత్యశక్తియైన యోగమాయవలన మాయామయులైన ఇతరులే వారి భర్తలసేవయందు ఉపస్థితులై ఉండెడివారు. కావుననే, రాసక్రీడాసమయమునందు వ్రజాంగనలు బృందారణ్య ధామమునందు ఉన్న సమయమునగూడా గోపాలకులు తమతమ భార్యలను తమ పార్శ్వమునందే ఉన్నట్లు భావించు చుండెడివారు.

"మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః" అనూఢలు కన్యలే. శ్రీకృష్ణుని ఇచ్ఛానుసారమే, నిత్య సిద్ధలయందుగూడా, ఊఢలు(వివాహితలు) అయిరి. దుర్లభత్వము ప్రతీతమగుటయే దాని ప్రయోజనము.

నాయికానాయకులయందు పరస్పర సమ్మిళనము ఎంత దుర్లభమగునో, అంత ఎక్కువుగా రసాభివ్యక్తి కలుగునని శాస్త్ర ముల అభిప్రాయము. తల్లిదండ్రులు, గురుజనులు, శాస్త్రముల యొక్క అత్యంత నిషేధమున్నచోటనే, అత్యంత దుర్లభమున్న స్థలముననే ఉత్కటమైన ప్రీతి ఉండును. ప్రవహించు స్వభావము కల జలమును ఆపుటవలన, అది ఎక్కువ వేగవంతమగును. ఆ రీతిగానే స్వాభావికమైన రాగమునకు, ప్రేమకు ఆస్పదమైన వ్యక్తి యందు స్వాభావికమైన ప్రవృత్తి కలుగును. అటువైపు ఆటంకము విఘ్నముల వలన, మనోవేగము అధికముగా పెరుగును. దుర్లభ త్వమువలన ఉత్కంఠయు అధికముగా అభివృద్ధి చెందును. కావుననే, పరకీయరతి శ్రేష్ఠమని భావింపబడును.

"యత్ర నిషేధవిశేషః యా చ మిథో దుర్లభతా తత్రైవా
సహ్యతే చేతః।"

అయినను పరకీయరతి ఘోర నరకమునకు మూలము. కావున, శాస్త్రములు పరకీయరతిని ఘోరముగా నిందించినవి. కాని, సర్వాంతరాత్మ సర్వేశ్వరుడు, సర్వపతియు నయిన భగవత్సంబంధముచేత సమస్త దోషములు భూషణములగును. కావుననే, ఇచటనే (భగవద్విషయమునందే) పరకీయరతికి వాస్తవిక సదుపయోగము కలుగును.

ఇచట, మహాకామిని తన్మయురాలై దుర్లభ జారుడైన ఉపపతియొక్క చింతనము చేయునట్లుగానే, ఒక జీవాత్మయొక్క మనస్సు, పూర్ణతముడు పురుషోత్తముడు నయిన భగవంతుని చింతనముచేసినచో అది వాని మహాభాగ్యము. మహాకాముకుడైనవాడు ఒకడు, అతిదుర్లభురాలు, తన ప్రేయసి అయిన కామినీసంయోగలాలసచేతవ్యగ్రుడైనట్లే, పరమానంద రసాత్మకుడైన భగవంతుడు వ్రజాంగనా చింతనమునందు వ్యగ్రుడైనచో, ఆ వ్రజాంగనల మహామహా సౌభాగ్యమును ఎవరు వర్ణింపగలరు ? కావుననే,

"నేష్టా యదంగిని రసే కవిభిః పరోఢా తద్గోకులాంబుజ
దృశాం కుల మన్తరేణ।"

అని మహానుభావుల కథనము. అనగా, ఏ కవులు శృంగారరసమునందు పరోఢయైన (పరకీయఅయిన) కామినిని అనభిమతముని భావించిరో, అది గోకుల కులాంగనలను వదలి, ఇతరుల విషయములో భావించిరి. అనగా, ఇచట గల నాయికానాయకు లిరువురును అలౌకికులు. ఈరీతిగానే, స్వరూపముచేత సిద్ధలైనవారుగూడా, కన్యలై కాత్యాయనీభగవతియొక్క అర్చనము ద్వారా, శ్రీకృష్ణ లీలకై సాధకభావమును పొందిరి.

వీరు కాక, శ్రుతులకు అధిష్ఠాత్రులైన మహాశక్తులు పరమ తత్త్వాన్వేషణము చేయుచు చేయుచు మహా మహా తపములాచరించిన తరువాత, శ్రీకృష్ణదర్శనము చేసినవి. అపుడు ఆ శ్రుత్యధిష్ఠాత్రలయిన మహాశక్తులు ఆ పరమ తత్త్వముతో రమణేచ్ఛను (తాదాత్మ్య సంమిలన కాంక్షను) ప్రకటము చేసినవి. అంత, శ్రీకృష్ణుడు "మీరు నా ఆరాధనద్వారా వ్రజకుమారికలు కండు, అపుడు మీ మనోరథ మీడేరును" అని చెప్పెను. ఈ విధముగా వరముపొంది, ఆ మహాశక్తులు గూడా వ్రజకుమారికలైరి. వారిలో తరువాత సాక్షాత్తుగా పరబ్రహ్మపర్యవసాయినులైన

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

ఇత్యాది శ్రుతులు 'అనన్య పూర్వికలు' లేక స్వకీయలైరి. ఈ విధముగా కర్మకాండయందు, అనన్య దేవతాతత్త్వమునందు పర్యవసితములగు శ్రుతులు పరకీయలు అయెను.

"సర్వే వేదా యత్పద మామనన్తి।"
"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః॥"

ఇత్యాది శ్రుతి స్మృతివచనానుసారము సమస్త వేదముల మహాతాత్పర్యము పరబ్రహ్మయందే కలదు. మిగిలినవన్నియు అవిచారిత రమణీయములు, లేక అవాంతర తాత్పర్యములేఅగును. ఇచట సయితము శ్రుతిరూపిణులైన గోపాంగనల అన్యసంబంధము కాల్పనికము, ముఖ్య సంబంధము మాత్రము ఆ గోపాంగనలకు భగవంతునితోనే కలదు.

వారిలో గూడ, శ్రుతిరూపలైన గోపాంగనలు వాచ్య, వాచకముల అభేదరూపముతో బ్రహ్మస్వరూపిణులే అయి ఉన్నారు. ప్రణవము (ఓంకారము) మూలవాచకము, తద్వాచ్యము పర

బ్రహ్మ, సమస్త వాఙ్మయము ఓంకారవికారము, సమస్త ప్రపంచము బ్రహ్మకార్యము. కావున, ఓంకార వికారభూతమైన సమస్త వాఙ్మయము బ్రహ్మయొక్క కార్యభూతమైన సమస్త ప్రపంచమునకు వాచకము. వాచ్య, వాచకములకు అభేదము కలుగుచుండును. కావుననే, సమస్త వాఙ్మయము వస్తుతః బ్రహ్మరూపమే.

అంతియేకాక, శ్రుతుల అవాంతర తాత్పర్యములు అన్యాన్యములయినను, వాని ప్రధాన తాత్పర్యము బ్రహ్మయందే కలదు. శబ్దమువలన రెండు విషయములు బోధితములగును .... ఒకటి జాతి, రెండు వ్యక్తి. 'త్వ తలాది' ప్రత్యయవేద్యమైన జాతి భావరూపమే అగును.

''తస్యభావ స్త్వతలౌ''

అను ప్రాణిని సూత్రానుసారము ఘటముయొక్క భావరూప జాతియే ఘటత్వము. అది, వస్తుతః ఒక భావవిశేషమునందుగల మృత్తికయే. ఈవిధముగా ఘటమునకు వాచకమై, 'ఘట' శబ్దముగూడా, మూలతః తత్కారణమైన మృత్తికనే బోధించును. ఈరీతిగానే శబ్దములన్నియు తమ అభిధేయములైన విభిన్న పదార్థములకు మూలకారణమైన పరబ్రహ్మవాచకములే. కావున, అవాంతర శ్రుతులకు గూడా ముఖ్య తాత్పర్యము పరబ్రహ్మయందే కలదు. నిశితముగా పర్యాలోచించినచో వస్తుతః, వాచ్య. వాచకములకు భేదముగూడా లేదు. ఈ వాచ్య, వాచకములు రెండును, ఒకే చేతనముయొక్క వివర్తములు. అభిధేయప్రపంచ జననానుకూల శక్త్యవచ్ఛిన్నమైన చేతనముయొక్క వివర్తమే అభిధేయము. అభిధానాత్మకప్రపంచజననానుకూల శక్త్యవచ్ఛిన్నమైన చేతనముయొక్క వివర్తము అభిధానము. ఒకే పరబ్రహ్మయందు అభిధాన అభిధేయరూపములైన అనంత తరంగములు ప్రాదుర్భవించినవి. కాని,

"తదభిన్నాభిన్నస్య తదభిన్నత్వతానియమామ్।"

అను న్యాయము ననుసరించి, తరంగాభిన్నమైన సముద్రముతో తరంగములకు అభేదము ఉన్న కారణముచేత ఆ రెంటికిని, పరస్పరము అభేదము కలదు.

ఈవిషయము ఒక తరంగమునకు తరంగాంతరముతో గల అభేదమునకు సంబంధించినది. కాని, మూలదృష్టితో అభిధానాత్మకమైన ఒక తరంగము ఏ సముద్రమునందు గలదో, అది లక్షణా వృత్తిచేత ఆ సముద్రమునే బోధించును. అభిధేయాత్మకమైన తరంగాంతరమును అభిధావృత్తిచేత బోధించును. ఏలయన, దేని శక్తియైనను, తన శక్యమునందే సఫలమగుచుండును గాని, తన కారణమునందు సఫలము కాదు. దాహకత్వ, ప్రకాశకత్వాది శక్తులు గల అగ్ని, తనకు దాహ్యములైన కాష్ఠాదులనే దగ్ధము చేయజాలును, తన స్వరూపభూతమైన అగ్నిని దహింపజాలదు. మౌలికముగా తరంగములు సముద్రముకంటె భిన్నములు కావు.

"అకారో వై సర్వా వాక్"

అను శ్రుతి ననుసరించి, సమస్త వాఙ్మయప్రపంచము, అకారము నందును, అకారము ఉకారమునందును, ఉకారము మకారము నందును, తదనంతరము సమస్త ప్రపంచము తురీయమునందును లయము చెందును.

తాత్పర్య మేమనిన, అభిధానాత్మకములైన శ్రుతులు అనన్తచైతన్యానంద సుధాసింధుతరంగ సమానములు. అవి, అభిధేయరూపములైన యన్యతరంగములచేత నుపచితములై ప్రకాశితము లగును. ఏలయన, అభిధేయములైన అర్థములు, వాని శక్యములు. శ్రుతులు తమ ఉద్గమస్థానభూతమైన పరమతత్త్వమును

లక్షణయా తెలియజేయును. ఒకానొక దృష్టివలన 'ఘట' శబ్ద వాచ్యార్థము ఘటాకారముగా పరిణమించిన మృత్తిక గూడా కావచ్చును. అయినను, లోకమునందు 'ఘట' ప ద వా చ్యా ము, 'ఘట వ్యక్తి' అనియే భావింపబడును. ఈవిధముగా అభిధానాత్మక బ్రహ్మ తరంగముయొక్క వాచ్యము, అభిధేయాత్మక బ్రహ్మ తరంగము కాని, లక్షణావృత్తిచేతనే అగును. మీమాంసకులు జాతి యందే శక్తిని అంగీకరింతురు. ఘటత్వాదికమును శక్తి అందురు. అది, ఘటభావమనియు చెప్పబడును. ఘటము కార్యము. కార్యము యొక్క భావము కారణవ్యతిరిక్తముగా ఉండదు. సమస్త భావ ముల కార్యము కారణమునందే పర్యవసితమగును. కావున, సమస్త శబ్దముల వాచ్యత, కారణపరంపరా క్రమముచేత సన్మాత్రమునందే పర్యవసితమగును. కావున, సమస్త శబ్దములకు వాచ్యుడైనవాడు పరమాత్మయే. ఈవిధముగా వాచ్య, వాచకములకు అభేదము చెప్ప నగును, సమస్త శ్రుతులును 'తత్' పదార్థముకంటె అభిన్నములే.

శ్రుతులు 'అన్యపరలు, అనన్యపరలు' అను భేదముతో రెండు విధాలుగా ఉండును. సాక్షాత్తుగా పరబ్రహ్మయందు పర్యవసానము గల శ్రుతులు అనన్యపరా శ్రుతులు.

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

అను శ్రుతి, అనన్యపరా శ్రుతులకు ఉదాహరణము. ఏ శ్రుతులకు సాక్షాత్తుగా తాత్పర్యము అన్యదేవతాదులయందు ఉండునో, కాని, పరంపరయా వాని తాత్పర్యము పరబ్రహ్మయందే ఉండునో, అట్టి శ్రుతులు అన్యపరా శ్రుతులు.

"ఇన్ద్రో యాతోఽవసి తస్య రాజా।"

ఇత్యాది శ్రుతివాక్యములు అన్యపరాశ్రుతులకు ఉదాహరణములు. వీనినే, ఊఢ లనియు, అనూఢలనియు, అథవా అనన్యపూర్విక లనియు మనము చెప్పవచ్చును. ఒకరు కేవల శ్రీకృష్ణపరాయణ లైన గోపికలు కొందఱు రెండు. శ్రీకృష్ణుడు కాక అన్యపురుషులతో వివాహమైనవారు కొందఱు అని భావము. వీరిలో గల ఈ రెండు భేదములు గూడా, కేవల ప్రతీతిమాత్రికలే గాని, వాస్తవములు కావు.

"సర్వే వేదా యత్పద మామనన్తి।"

అను శ్రుతివాక్యము ననుసరించి ఆ వాక్యములకు గల మహాతాత్ప ర్యము ఏకమాత్ర పరబ్రహ్మయందే అని తెలియనంతవఱకు వరుణాది దేవతలయందు శ్రుతులకు తాత్పర్యమని ప్రతీతమగును వాస్తవమునకు తరంగము సముద్రముకంటే భిన్నము కానట్లుగా ఘటాదులు మృత్తికకంటె భిన్నములు కానిరీతిగా, ఉపక్రమ, ఉప సంహారాది షడ్విధ లింగములచేత సమస్త శ్రుతులకు తాత్పర్యము బ్రహ్మయందే కలదు. కాని, లీలావిశేషముయొక్క వికాసార్థమై వస్తుతః అనన్యపర శ్రుతులయందు గూడా అన్యపరాత్వ ప్రతీతి కలుగును.

ఇచట శ్రీరాధికాప్రభృతి వ్రజాంగనలు పరమాత్మ అని తలంచుటయేకాక వ్రజాంగనలనే.

"యద్వాంఛయా శ్రీః లలనాఽచర త్తపః".

అని శ్రీకృష్ణ ప్రేయసులనుగా చెప్పిరి కదా? అను సందేహము కలుగును. శ్రీకృష్ణ పాదపంకజరజమునందలి కామనచేత శ్రీలల నలు తపస్సు చేయుచున్నారని భావము.

"నాయం శ్రియోఽంగజ నితాంతరతేః ప్రసాదః స్వర్యోషితాం
నలినగంధరుచాం కృతోఽన్యాః

రాసోత్సవేఽస్య భుజదండ గృహీత కంఠ్య ........."
వ్రజాంగనలకు లభించిన అనుగ్రహము లక్ష్మీదేవికిగూడా లభింప జాలదు, ఇక దేవతాంగనల విషయము చెప్పనేల ?

"దామోదర సుధామపి గోపికానాం"
దామోదరుని అధరసుధ గోపికలదే-మొదలగు వచనములవలన వ్రజాంగనలు అన్యులచేత అసంస్పృష్టుడైన భగవంతుని శుద్ధ ప్రేయసులే అని విదితమగును.

"యద్ధామార్థ సుహృత్ ప్రియాత్మతనయ ప్రాణాశయా స్త్వత్కృతే".
ఎవరి గృహ, విత్త, మిత్ర, ప్రాణములు, అంతరాత్మ సమస్తము శ్రీకృష్ణునకు సంబంధించినవే అయి ఉండెనో వారు శ్రీకృష్ణునికంటె భిన్నుడైనవానిని పతిగా ఎట్లు స్వీకరింతురు ?

"జహ్యా మసూన్ వ్రతకృశాన్ శతజన్మభిః స్యాత్।"
అని రుక్మిణివలె దృఢమైన ప్రతిజ్ఞ చేయగలరు. హే నాథ ! వ్రతముచేత కృశించిన ప్రాణములను నేను వదలిపెట్టెదను అని పై వచనముయొక్క భావము. అట్టి స్థితిలో ఆ వ్రజాంగనలకు అన్యసంబంధము ఎట్లు సంభవము ? కాని, ఇచట సమాధానము శ్రుతార్థాపత్తి ప్రమాణముచేత అనగా, శ్రుతములైన ఆ యా ప్రమాణవచనముల అర్థమును ఉపపాదనము చేయుటకై భగవంతుని దివ్యలీలాశక్తిచేతనే, అందఱకును తాదృశమైన ప్రతీతి మాత్రము కలిగినదని అంగీకరింపవలయునని తెలియవలయును. శ్రీకృష్ణ సంయోగాశచేతనే ఇటువంటి ప్రతీతి కలిగినను వ్రజాంగనలు జీవితమును రక్షించుకొనిరి. వారికి అన్యపురుషులతోటి సంబంధములేదు. కాని, వారివంటి మాయామయులైన అన్య వ్రజాంగనలతోనే ఆ భర్తలకు సంబంధము కలుగుచుండెడిది. శ్రీకృష్ణప్రేయసులైన వ్రజాంగనలు సర్వదా అసంస్పృష్టలై ఉండిరి.

"నానూయన్ ఖలు కృష్ణాయ మోహితా స్తస్య మాయయా।
మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్
వ్రజౌకసః॥"

అని చెప్పబడినది.

ఇదికూడా వారి ఉత్కంఠతు అధికము చేయుటకొఱకై ఒక లీలా విశేషమై ఉండెను. నిర్ధనుడైన ప్రాణి ధనమునుపొంది, అధిక ప్రసన్నుడగును. ఆ ధనము పోయినపుడు మిగిలిన సమస్త ప్రపంచమును మఱచియే పోవునంతటి ఆ ధనచింతలో లీనమై ఉండును. అట్లే దీనియందు వైచిత్ర్య సంపాదనార్థమయియే, పూర్వా కుమారీ భేదములేర్పడినవి.

వారు కాక దండకారణ్యనివాసులైన మునిగణములుగూడా గోపకుమారీరూపములో ఆవిర్భవించిరి. వారు గూడా భగవంతుడైన రామచంద్రుని జూచి మోహితులాయిరి. అహో ! ఖర, దూషణుల వంటి మాంస, రుధిరాశనులు, క్రూరకర్ములు, హింసాపరాయణు లును అయిన రాక్షసులు గూడా రామచంద్రుని సరసత్వమునకు మనోహరిత్వమునకు ముగ్ధులగుచుండెడివారు అనిన, వీతరాగులు అరణ్యవాసులు నయిన మునిగణములు ఆయనయందు ముగ్ధులగు టలో ఆశ్చర్యమేమి కలదు ? ఇచట రామచంద్రుడు మర్యాదా పురుషోత్తముడు. కావున, ఆయన లీలాపురుషోత్తమరూపముతో అవతరించినపుడు మీరు వ్రజకుమారికలై సాంగత్యమును పొందుడు అని వరమొసగెను. వారు గూడా వ్రజకుమారికలై కాత్యాయినీ దేవిని అర్చింపనారంభించిరి. ఈ విధముగానే కొందఱు దేవతాంగ నలు గూడా భగవత్కృపవలన సిద్ధినిపొంది భగవత్ప్రాప్తిని సాధిం చిరి. ఇటువంటివారే భౌమ వైకుంఠమునందు గల భౌమ స్త్రీలైన మఱికొందఱు అభౌమ వైకుంఠమునందు గల అభౌమాంగనలు

యుగయుగాంతరములనుండి కల్పకల్పాంతరముల నుండియు వీరందఱును పూర్ణతముడు, పురుషోత్తముడు, సర్వప్రాణిపర ప్రేమాస్పదుడు నయిన శ్రీకృష్ణసంయోగమునకై వ్యగ్రలై ఘోర తపస్సు చేయుచుండిరి. ఇపుడు వారికి వ్రజనివాసము, వ్రజ కుమారికాజన్మ ప్రాప్తమయ్యెను. వీరికి శ్రీకృష్ణదర్శనము కలుగు చున్నను, ఇంకను వీరికి శ్రీకృష్ణుడు అతి దుర్లభుడుగా ప్రతీతు డగుచున్నాడు. దుర్లభవస్తుప్రాప్తికై పరమేశ్వరినే ఆశ్రయింప వలయును. పూర్ణతమ పురుషోత్తముడు. పరబ్రహ్మయు నయిన శ్రీకృష్ణుని ప్రాప్తికై బ్రహ్మవిద్యారూపిణి అయిన కాత్యాయినీ దేవిని ఆశ్రయించుట యుక్తమే.

"మోక్షార్థిభిః మునిభి రస్తసమస్తదోషైః విద్యాఽసి సా
భగవతీ పరమా హి దేవి।"

అస్తు. సమస్త దోషములనుండి, మోక్షము నర్థించుమునులు జగన్మాతను శ్రీవిద్యారూపిణిగా అర్చింతురు. కావున వ్రజకుమారి కలు శ్రీకృష్ణప్రాప్తికై కాత్యాయనీదేవిశరణు చొచ్చిరి. లౌకిక దృష్టితోగూడా, ఇది అత్యంత, పవిత్రభావము. కులీనలైన కుమారి కలు సుందరుడైన వరుని పొందుటకై శ్రీదేవిని ఆరాధింతురు. శ్రీకృష్ణుని లోకోత్తర సౌందర్య, మాధుర్యాదిగుణగణము సకల భువన విఖ్యాతము. ఇటువంటి సుందరుడు, సర్వగుణసంపన్నుడు, సత్కులజాతుడు నయిన శ్రీకృష్ణునియందు కుమారికలకు తమ వరణముకొఱకు అభిలాష ఉండుట స్వాభావికము కావున, ఆ మనోరథమీడేరుటకై వారు చేయుచున్న కాత్యాయనీదేవీ వ్రతము, అర్చనము యుక్తమే అయియుండెను. దుర్లభమైన పదార్థమును పొందుటకై లోకమునందు దేవతారాధనము చేయబడును. ఆరీతిగానే దుర్లభుడైన శ్రీకృష్ణుని ప్రాప్తికొఱకు నంద వ్రజకుమారికలు

గూడా, కాత్యాయనీదేవియొక్క ఆరాధానమునందు నిమగ్నలైరి. భిన్న భిన్న ఫలముల కొరకై శ్రీకృష్ణుని ఆరాధనమునందు శ్రీకృష్ణప్రేమ గౌణమై ఉండును, ఫలప్రేమయే ముఖ్యముగా ఉండును. శ్రీకృష్ణునికొఱకే చేయబడు శ్రీకృష్ణుని అరాధనమునందు శ్రీకృష్ణుడే ఫలమగును. ఆయనయే సాధనముగూడా అగును. కాని, శ్రీకృష్ణప్రాప్తికై చేయునట్టి కాత్యాయనీదేవి ఆరాధనమునందు శ్రీకృష్ణుడు ఫలము మాత్రమే, ఆయనయందు సాధనత్వము ఉండదు. కేవలం శుద్ధ ఫలస్వరూపుడైన శ్రీకృష్ణునికొఱకు వ్రజ కుమారికలు చేయు కాత్యాయనీదేవీవ్రతము అద్భుతమైన కృష్ణ ప్రేమకు సాధనము.

వారు, అరుణోదయసమయమునందే కాళిందీ నిర్మలజలములో స్నానమొనర్చి, జలసమీపమునందే సికతామయమైన కాత్యాయనీ దేవి మూర్తిని చేసి, ఆ మూర్తిని పూజించుచుండెడివారు యౌవనా విర్భావమునకు పూర్వమే, శ్రీకృష్ణప్రేమ (భక్తి) యందు మోహి తలై వారు ఆయనను పతిగా ప్రేమింపసాగిరి. వ్రజకుమారికల అవయవములయందు అనంగ (మన్మథ) సంచారము అవస్థా క్రమముముతో జరిగెను. కాని, సాంగ (అవయవసహిత) శ్యామ సుందరుడు, మొట్టమొదటనే, గోప కుమారికల అవయవములందే మిటి ? అంతరాత్మయందు, అంతఃకరణమునందు, ప్రాణముల యందు, ఇంద్రియములయందు, రోమరోమమునందు ప్రవేశించెను. ఆ గోపకుమారికలు, సురభిళ పుష్పములతోను, బలులతోను, ధూప, దీపములతోను, ప్రవాళములు, ఫలములు, తండులములు మున్నగునట్టి అనేకవిధములైన ఉచ్చావచములైన ఉపహారముల తోను శ్రీకాత్యాయనీపూజ చేయుచుండిరి. ఎడనెడ, ప్రేమవశలై పూజాక్రమమును విస్మరించుచుండెడివారు. శ్రీకాత్యాయనీదేవిని

ప్రార్థించుచు, ఆ గోపకన్యలు ఇట్లనుచుండెడివారు-హే కాత్యాయని! నీవు కాత్యాయనమునివంశప్రకాశిక వయినకారణముచేత పరమధర్మ దాత్రివి. హే మహాయోగిని! నీవు అఘటిత ఘటనాపటీయసివి. కావున, దుర్లభుడైన శ్రీకృష్ణవరుని సంమిలనము గూడా, నీ కృపవలనమాకు ప్రాప్తించుగాక! హే జగదంబ! నీవే, అధీశ్వరివి, సర్వోత్కృష్ట స్వామినివి నిన్ను కాక, మేమందఱము ఎవరి శరణు జొచ్చెదము ? హే దేవి! శ్రీమన్నందగోప రాజకుమారునే, మాకు పతిగా జేయుము. ఆయనను ఆరాధించియు ఇది సిద్ధింప వచ్చును. కాని, వారు ఆ శ్రీకృష్ణదేవుని, ప్రార్థించుట రసాను కూలము కాదు. నీవు ప్రసన్నురాలవగుటకై మేము నీకు నమ స్కారము చేయుచున్నాము.

"కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి।
నందగోపసుతం దేవి పతిం మే కురు తే నమః॥"

పరమ ప్రేమోల్లాసవశలైన గోపకుమారికలు శ్రీదేవీపూజ యందు ప్రవృత్తలైరి. దీనియందు అన్యతకు వ్యాఘాతము ఉండదు. భగవత్ప్రేమగంధమునకు సంబంధించిన గంధవాహి అయిన వాయువును గూడా ప్రేమికులు స్పృశింతురు. శుద్ధ ప్రేమయే పరమ పురుషార్థము, అన్యాన్యదేవతోపాసనాదులు సాధనమాత్రములు. పరమ సాధ్యస్వరూపమైన ప్రేమప్రసంగము నందు అన్యదేవతోపాసనము గౌణమగును. ప్రేమ (భక్తి)యందు మాధుర్యభావము ప్రధానమై ఉండును. అచట ఐశ్వర్య (ఈశ్వ రత్వ) స్ఫూర్తి ఉండదు. మాధుర్యానుభవకాలమునందు ఐశ్వర్యా నుభవము కలిగిన ఆశ్చర్యము కలుగును. అహో ! ప్రేమచేతనే వ్రజాంగనలు, బ్రహ్మాదులు సైతము పొందజాలని భగవంతుని తమ వశ మొనర్చుకొనిరి. కాని, తమ స్వాభావికదృష్టితో వ్రజాం

గనలు శుద్ధమాధుర్యభావమునే సమాదరించుచుండెడివారు. ఈ కాత్యాయనీదేవ్యర్చనము శుద్ధమధుర ప్రేమవిలాసమే. కావున వారు ఆ కాత్యాయనీదేవిని 'భగవంతుని పతిగా ఒసగుము' అని కోరక, నందగోపరాజకుమారుని పతిగా కోరుదురు.

ఋషిరూపిణు లగుటవలన, వారికి ఈ మంత్రము సిద్ధించెను, తదధిష్ఠాత్రిదేవి ప్రత్యక్షమయ్యెను. కాత్యాయనీదేవి ఆధిదైవిక సంహారిణీశక్తి. కావున, భగవత్ప్రాప్తి లభించకపోవుటకు హేతుభూతమైన ప్రతిబంధమును ఆ దేవియే దూరము చేయును. భగవత్ప్రాప్తికి ప్రతిబంధకమైన దురదృష్టమును తొలగించుటకు తపస్సుగూడా సాధకము. కాని, ఆ తపస్సు ఋషిరూపిణులైన గోపకుమారికలయందు ఆజన్మసిద్ధమై ఉన్నవి. కావున, ఆధిదైవిక ప్రతిబంధమును నాశమొందించుటకు ఆధిదైవిక మహాశక్తియైన కాత్యాయనీదెవియే సమర్థురాలు. ఒకవేళ ఆధిదైవిక ప్రతిబంధకము ఉన్నచో, ఆ ప్రతిబంధకము భగవదిచ్ఛవలననే ఉండునని చెప్పబడును. అయిన తన్నివృత్తి ఎట్లగును ? కాని, ఆ మహాశక్తి మహాభాగ, అల్పభాగమైనచో, ఆ మహాశక్తికి భగవదాజ్ఞయే లభించదు. యశోదగృహమున జన్మించియుండెడిది కాదు. కావున మహాభాగ, భగవతిఅయిన కాత్యాయినీ ప్రార్థనవలన, శ్రీకృష్ణ ప్రభువు భగవతియొక్క ఇచ్ఛానుగుణముగానే తన సంకల్పము చేయును. 'హే దేవి ! నీవు ప్రభువుయొక్క జ్యేష్ఠ భగినివి; సర్వథా, నీవు మా మనోరథముల నీడేర్చుదువు. ఈ ప్రతిబంధము నావలన తొలగిపోజాలదని నీవు అన్నచో, అది యుక్తము కాదు. ఏలయనగా, నీవు మహాయోగినివి. నీవు దేవకీగర్భమునుండి బలరాముని, రోహిణీగర్భమునందు ప్రవేశపెట్టగలదానవు, అయిన, మా భగవత్ప్రాప్తికి ప్రతిబంధకమైన దురదృష్టమును ఏల దూర మొనర్పజాలవు ? ఈ ఆధిదైవిక ప్రతి

బంధకశక్తి అత్యంత బలవతి అని అందువేని, ఓ దేవీ! నీవు అధీశ్వరివి. నీవు భగవంతుని అంతరంగశక్తివి. సర్వథా, నీవు వ్రజరాజకుమారుని మాకు పతిగా నొనగూర్పగలవు. భగవంతుడు ఎవరికిని పతి కాజాలడందువేని, అదియు యుక్తము కాదు. ఏల యనగా, వ్రజరాజైన నందునకు పుత్రుడైనపుడు, మాకు పతి అగుటలో అపత్తి యేమి యుండును? నీవు దేవివి, ఏదియో ఒక అలౌకిక పద్ధతితో నయినను, నీవు ఈ పని చేయగలవు. మేము దీనికి బదులుగా నీకు కేవల నమస్కారము మాత్రము చేయ గలము'.

ఈ విధముగా నంద వ్రజకుమారికలు శ్రీకృష్ణునియందు ఆసక్తమనస్కలై భద్రకాళియైన భగవతియొక్క అర్చనము చేయుచుండెడివారు. ఉషఃకాలమునందే నిద్రనుండి మేల్కాంచి తమ తమ వర్గములందలి కుమారికలచేత ఆహ్వానింపబడి ఒకరి బాహువులపై మరొకరి బాహువులను ఆబద్ధమొనర్చి, ఉచ్చైః స్వరముతో శ్రీకృష్ణసంబంధులైన గానములనే గానము చేయుచు, ప్రతి దినము కాళిందీనదికి స్నానముచేయుటకై వెళ్లుచుండెడివారు. కొద్దికాలము చేసిన ఆరాధన వలననే, వారి మనస్సులు శ్రీకృష్ణునియందు ఆకర్షితములయ్యెను. ఇదీ గూడా వ్రతఫలమే. కాని, ఇంకను మహాఫలము అవశిష్టమే అయి ఉన్నది. పూర్ణిమనాడు ప్రతిదినము చేయుచున్నరీతిగానే, కాళిందీ తటమునకు జేరి, పూర్వము వలెనే, వస్త్రవిసర్జనము చేసి శ్రీకృష్ణుని మంగళమయ యశోగానముచేయుచు, ఆనందముతో జలవిహారము చేయసాగిరి. ఆనాడు వ్రతసమాప్తిదినము. ప్రసన్నతతో దేహాను సంధానశూన్యలై (దేహభానములేనివారై) మానసిక, వాచిక,

కాయిక తన్మయతతో శ్రీకృష్ణుని యశస్సంకీర్తనము చేయుచు, జలవిహారము చేయసాగిరి. రాసక్రీడవలె పరస్పరము బాహుబద్ధలైన గోపాంగనాగణములచే పరివేష్టితుడైన శ్రీకృష్ణుని గుణగానము చేయుచు, కాళిందియందు స్నానముచేయుచుండిరని కొందఱు భావుకభక్తులు చెప్పుదురు. కాళిందీస్నానము వలన, సర్వదోషములు దూరాపాస్తము లగును.

"కలిం ద్యతి ఖండయతి ఇతి కళిందః, తస్యాపత్యం కన్యా కాళిందీ।"

అను వ్యుత్పత్తి ననుసరించి, కళిందపర్వతమే కలిదోషాపహారకము. ఆ కళిందపర్వత కన్యయైన కాళిందియందు గూడా, ఆ గుణము లన్నియు గలవు. కావున, కాళిందీ, యమునానదీ సేవనమువలన ఆ గోపకుమారికల పరస్పర కలహములు, భగవంతునితోటి వైరస్యములు, కలికాలగతములైన దోషములు దూరములగును. అత్యంత పరిశుద్ధులైనపుడు శ్రీకృష్ణప్రాప్తియోగ్యత సిద్ధించును.

యమునానదిలో స్నానము చేసినంతనే, ప్రాణికి శ్రీకృష్ణ సంమిళనయోగ్యత కలుగునని భావుకులైన భక్తుల కథనము. ప్రాకృతమైన స్త్రీత్వ, పుంస్త్వభావవర్జితమై, శుద్ధ గోపాంగనాభావప్రాప్తియే, రసోపాసనకు మూలము. వేదాంతులవలెనె, రసికులకు గూడా మొదట 'త్వం' పదార్థమపేక్షిత మగును. స్వరూపనిష్ఠ కలిగిన అనంతరమే, నిఖిల రసామృతమూర్తి అయిన శ్రీకృష్ణ చంద్రునకు సంబంధించిన రసోపాసనకు అధికారము లభించును. ఈ భావమంతయు బహుకాల పరిశ్రమవలన సిద్ధించును. కాని, కాళిందీసేవనము వలన సహజముగానే ఈ భావము లభించును. యోగేశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు వ్రజకుమారికలు చేయు

చున్న వ్రతోద్దేశము నెఱింగి, తత్కర్మసిద్ధికొఱకే తన పరమ అంతరంగసఖులైన దామ, సుదామ, వసుదామ, కింకిణీ, గంధపుష్పాదులతో పరివృతుడై కాళిందీతటమున కేగెను. ఈ సఖులు శ్రీకృష్ణునికి సాక్షాత్తుగా అంతఃకరణరూపులే.

"భగవాం స్తదభిప్రేత్య కృష్ణో యోగేశ్వరేశ్వరః
వయస్యై రావృత స్తత్ర గత స్తత్కర్మసిద్ధయే॥"

ఈ లీల, అలౌకికము, అప్రాకృతము అను విషయమును ప్రదర్శించుట కొఱకే, ఈ శ్లోకమునందు శ్రీకృష్ణునకు 'భగవాన్, యోగేశ్వరేశ్వరః' అను విశేషణములు ప్రయుక్తములైనవి. అనగా, వ్రజకుమారికలు శుద్ధభావనతో చేసిన ఆరాధనము వలన, శ్రీకృష్ణ భగవానుడు సంతుష్టుడై వారు చేయుచున్న కర్మను ఫలప్రదమొనర్చుటకై అచట కేతెంచెను గాని, గోపికల నగ్నావయవములను చూచుటకు రాలేదు. యోగసిద్ధుడైన వ్యక్తి గూడా, ప్రత్యాహారముచేత ఇంద్రియ విజయమును పొందును. అట్టి స్థితిలో యోగేశ్వరుడు సర్వజ్ఞత్వ, సత్యసంకల్పత్వాదులకు స్వామియై ఉండును. ఆ యోగేశ్వరుని మనస్సులో ఇటువంటి కామవాసనలు జాగృతములగుట అత్యంతము అసంభవము. మహాయోగేశ్వరులు సైతము ఎవరి పాదపంకజములను సేవింతురో, ఆ యోగయోగేశ్వరుడు భగవంతుడు నయిన శ్రీకృష్ణుడు యౌవనోదయము కాని ఆ కుమారికల నగ్నశరీరమును చూడవలయునను ఆసక్తితో అచట కేగెనను దుర్భావము ఎవరి మనస్సున ఉండునో, వారికంటె అధిక హతభాగ్యులు ఎవరుందురు? తరంగమునందలి ప్రతి భాగము జలపూర్ణమైనట్లుగానే, వ్రజాంగనల అంతఃకరణమునందు, అంతరాత్మయందును, అధికముగా చెప్పనేల, రోమరోమమునందు శ్రీకృష్ణ రసము పరిపూర్ణముగా ఉన్నది అని, శ్రీనందదాసు శ్రీకృష్ణ

వ్రజాంగనల సంబంధమును వర్ణించెను. పరమానంద రసామృత సాగరముయొక్క తరంగస్థానీయులైన వ్రజాంగనలకంటె గూడా, పరమానందరస సారసర్వస్వమైన శ్రీకృష్ణుని మాధుర్యాధిష్ఠాత్రి మహాలక్ష్మి, అధిక అంతరంగభూతురాలు. అమృతము స్వయముగా, అభేదసంబంధముతో తన మధురిమను అనుభవించు రీతిగానే, నిఖిల రసామృతమూర్తియైన శ్రీకృష్ణుడు మాధుర్యాధిష్ఠాత్రి, మహాలక్ష్మియైన వృషభానునందినియొక్క అనుభవమును పొందును.

నాయికానాయక రూపముతో జీవాత్మ, పరమాత్మల సంయోగము వర్ణింపబడును. అత్యంత అభిన్నమైన, సతత సంమిలన రూపమునందు గూడా, వియోగప్రతీతి, తజ్జన్య వ్యాకులత్వాదుల ప్రతీతి కలుగును.

నందవ్రజ కుమారికల కాత్యాయనీ అర్చనమునందు నాలుగు దోషములు ఉన్నవని కొందఱు మహానుభావుల కథనము. అవి భక్తిమార్గమునందు గుణములు కావచ్చునుగాక, కాని, కర్మమార్గమునందైనచో దోషములే, కాళిందీస్నానము మౌనముగా చేయవలయును, సవస్త్రలై చేయుట యావశ్యకము. కాని, ఈ గోపకుమారికుల వస్త్రనిక్షేపపూర్వకముగా (వస్త్రములను ఒడ్డున ఉంచి) శ్రీకృష్ణ యశోగానము చేయుచు, స్నానము చేయ మొదలిడిరి. కావున, మౌనత్యాగము, వస్త్రత్యాగము అను రెండు దోషములు కలిగినవి. ఇంతియే కాక, వ్రతనియమనిష్ఠలై క్రీడించుట (జలక్రీడలు సల్పుట), దేహభానము పోవుట (దేహవిస్మరణము) గూడా, దోషమే. కర్మయందు ఏ విధమైన వ్యంగ్రత, రాకూడదనియు, చక్కగా, కర్మానుష్ఠానము జరుగవలయుననియు, కావుననే, కర్మఫలాభిసంధిరహితులై, కర్మఫలమునందు ఆసక్తిలేనివారై కర్మానుష్ఠానము చేయవలయుననియు విధింపబడినది.

ఏలయనగా, ఇట్లు జరుగుటవలన, కర్తవ్యబుద్ధితో కర్మానుష్ఠానము చేయబడును. అపుడు, ఫలాపేక్షతో గౌణత్వబుద్ధిగాని, అజాగ్రతగాని, ఉండజాలదు. కర్మఫలచింతనమువలన, ఫలాసక్తి వలన, సాధకునకు కర్మానుష్ఠానమునందు ఆవశ్యకమైన జాగరూకత ఉండదు. ఇటువంటి పరిస్థితిలో కర్మయొక్క వ్యంగ్రత అవశ్యము కలుగును.

లీలావతీ, కళావతులకు సత్యనారాయణవ్రత కథయందు ప్రేమ, విశ్వాసములు ఉన్నవి. కాని వారు భర్తయొక్క, జామాతయొక్క ఆగమనవార్తను వినినప్పుడు, లీలావతి, భర్తృసంయోగ ఔత్సుక్యమునకు వశురాలై, తన పుత్రికను పూజయందు నియోగించి, తాను పూజను మాని, భర్తను కలియవలయునని వెళ్లెను. పుత్రిక గూడా, ఆ ఉత్సుకతాకారణముచేతనే, పూజను. సమాప్తము చేసి, ప్రసాదమును స్వీకరింపకయే, వెడలిపోయెను. వ్రతమునందు వ్యంగ్రత సంక్రమించెను. అంతతోగత్వా, మరల విఘ్నము ఎదురయ్యెను.

ఇచట వ్రజకుమారికలకు గూడా, వ్రతఫలమైన శ్రీకృష్ణప్రాప్తియందలి ఉత్సుకత వలన, వ్రతనియమముల స్మృతి లేదు. జన్మజన్మాంతరములకు సంబంధించిన, కల్పాంతరములకు సంబంధించిన శ్రీకృష్ణప్రాప్తి వాంఛాప్రవాహమును నిరోధించుట ఎట్లు ? శ్రీకృష్ణుని ప్రేమోన్మాదమునందు వారు కర్మను, కర్మనియమములను విస్మరించిరి. వారు పరవశలై వస్త్రములను, స్నానమును రెంటిని త్యజించి, శ్రీకృష్ణయశోగానము చేయసాగిరి. ప్రేమోన్మాదమునందే, జలక్రీడలు సల్పుచు, దేహమును సమస్త దైహిక ప్రపంచమును మఱచిపోయిరి. ఇవన్నియు, కర్మమార్గమునందు అవశ్యము దోషములే. కాని, ప్రేమ (భక్తి) మార్గమునందైనచో,

ఇవన్నియు గుణములు. ఆరాధ్య దేవతాస్మరణమునందు, తన్మయత్వమునందును, పూజ, తత్సామగ్రి విస్మృత మగుటయే, భక్తులు పూజను సఫలము, సాంగమైనట్లు భావింతురు. కావున భక్తి సిద్ధాంతమునందలి గుణములచేత ప్రసన్నుడై, భగవంతుడు కర్మమార్గమునందలి దోషములవలన ఉత్పన్నములైన వ్యంగ్రతలను దూరీకరించుటకై ప్రకటమయ్యెను. యాజ్ఞికులు ఆ దోషములను విష్ణుస్మరణముచేత, నామోక్తిచేత, కర్మచ్ఛిద్రమును దూరమొనర్తురు.

"యస్య స్మృత్యా చ నామోక్త్యా తపో యజ్ఞక్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతమ్"॥

శ్రీకృష్ణుడు ఆ గోపాంగనలకు హితైషియైన పరమానంద రసస్వరూపుడు, యోగేశ్వరేశ్వరుడు. కావున అంతఃస్థితములైన సర్వవిధ దోషములను తొలగించుటలో సమర్థుడు. యోగేశ్వరులు యోగబలముతో అంతఃప్రవిష్టులై దోషాపనయనము చేయుదురు. అట్టి స్థితిలో యోగేశ్వరేశ్వరుని విషయము చెప్పనేల ?

కొందఱు మహానుభావులు "యోగేశ్వరేశ్వర" శబ్దమునుండి భగవంతుడు, యోగేశ్వరులకుగూడా, ఈశ్వరుడు అనియు, కావుననే ఆ అసంఖ్యాకలైన వ్రజకుమారికలయందు ప్రతి ఒకరి మనోరథము నీడేర్పగలడనియు, వ్రజకుమారికల వస్త్రములను అన్నిటిని అపహరించుటలో సమర్థుడయ్యెననియు అభిప్రాయమును వెలిబుచ్చిరి. లజ్జాత్యాగము వారికి ప్రాణత్యాగముకంటె గూడా అధిక దుష్కరము. ఆ కులకుమారికలను నీటినుండి బయటకు వచ్చునట్లు చేసి, నిరావరణముగా (నగ్నరూపంతో) నమస్కరించునట్లు చేయగల సామర్థ్యము ఆయనయందే కలదు. నిర్జన ప్రదేశములో ఆ వ్రజ

కుమారికల నిరావరణములైన సర్వాంగములను దర్శించినను, అత్యంత స్వాధీనలయిన పరమ సౌందర్యవతుల సంభోగాదులను చేయకుండుటయు యోగేశ్వరేశ్వరుడైన భగవండే చేయ గలుగును.

"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః।
జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా॥"

సమగ్ర ఐశ్వర్యము, సంపూర్ణ ధర్మము, సంపూర్ణ యశస్సు సంపూర్ణశ్రీ, సంపూర్ణజ్ఞానము, వైరాగ్యము ఎవరియందు ఉండునో, ఆయన భగవచ్ఛబ్దవాచ్యుడు. భిన్నభిన్న సాధకులకు భగవత్కృప వలన భగవత్సంబంధియే అయిన కొంత (అసమగ్రము, లేక అసంపూర్ణమునయిన) ఐశ్వర్యము, ధర్మము లభించును. ఈ స్థితియే, జ్ఞానవైరాగ్యములకు సంబంధించినదై ఉండును. సాధారణ ధర్మాత్ములైన పురుషులుగూడా, నగ్నముగాఉన్న కన్యకలను గాని, పరస్త్రీలను గాని చూడ నిచ్ఛగించరు. సంపూర్ణముగా ధర్మము విరాజిల్లునట్టి వ్యక్తులకు ఇటువంటి ఉత్సుకత ఏల జనించును? వైరాగ్యవంతుడు, జ్ఞానసంపన్నుడైన వ్యక్తి ఎవరైనను, మాయామయ విషయప్రలోభనములకు వశుడు కాజాలడు. అట్టి పరిస్థితిలో సంపూర్ణ వైరాగ్య, జ్ఞానసంపన్నుడైన భగవంతుడు వ్రజకుమారికల సుందర, నిరావరణ అవయవములను మాత్రమే చూచుటకై ఈవిధముగా ఎట్లు చేయగలడు?

కావుననే, ఇది ఆ వ్రజకుమారికల విశేషమని భక్తులు వక్కాణింతురు. భగవంతుడు తన అద్భుత మాధుర్యాది లోకోత్తర చమత్కారముతో సమగ్ర జ్ఞానవైరాగ్యవంతులైన సనకాది, శుకాది మునీంద్రుల మనస్సును ఆకర్షించెను. కావుననే, అత్యంత నిఃస్పృహులు, నిష్కాములైనను భగవంతునియందు వారందఱకు

ఆకర్షణము కలిగెను. కాని, ఈ వ్రజాంగనలు భగవంతునికంటె గూడా అధిక గుణవతులు. కావున, వారు తమ లోకోత్తర ప్రేమతో సమస్త జ్ఞానవైరాగ్యములు గల మనస్సును గూడా ఆకర్షించిరి. కావుననే, సకల జీవులు భగవంతునితో రమణము నొందుటకై సదా, ఉవ్విళ్లూరుచుందురు. ఎవరితో రమణము నొందుటకై భగవంతుడు ఉత్సుకుడై ఉండునో, వారిది అదృష్టము. ఆ వ్రజకుమారికల కర్మను సఫలమొనర్చుటకై వయస్య (మిత్ర) పరివేష్టితుడై ఏతెంచుట కేవల విశుద్ధభక్తి (ప్రేమ)యొక్క మహిమ. అతివేగ ముగా ఆ గోపకన్యల వస్త్రములను గైకొని, కదంబవృక్షముపైకి అధిరోహించెను. తన చెలికాండ్రతో గూడి నవ్వుచు, ఆ గోపకుమారిక లతో ఇట్లనెను.... "చల్లని నీటిలో ఏల కంపించుచున్నారు ? నదిలో నుండి బయల్వెడలి, ఆరిన (శుష్క) వస్త్రములను ధరింపుడు. అథవా, ఓ వ్రజ బాలికలారా ! ఈ కదంబశాఖకు ఇన్ని వస్త్రము లను ఎవరు కట్టిరి ? ఇది అంతయు మీరు ఎఱుంగుదురా ? నేను గోవులను మేపుచు, ఆ కదంబవృక్షమునందు నేడు విచిత్ర వస్త్ర సంబంధులే అయిన పుష్పములు పూచినవి, పండ్లు పండినవని దూరమునుండి చూచి, ఇపుడే ఈ వృక్షముపైకి అధిరోహించితిని. ఈ వస్త్రములు మావేయని మీరనిన, ఇది సంభవము కాదు. మీ వస్త్రములు ఇంత ఉన్నత వృక్షముపైకి ఎట్లు రాగలవు ? నీవే అపహరించి ఇంత యెత్తున ఉంచితివని అందురేని, సరియే. ఈ మాట అనుటకుగూడా సాహసించెదరా ? నందమహారాజ కుమారుడ నైన నేను చోరుడనా ? మీరు మధురయందుగల కంసుని దగ్గఱకు వెళ్ళ దలంచుచున్నారా ? ఈ వస్త్రములనే బాగుగా చూచి, ఇవి పురుషులు ధరించు వస్త్రములా ? స్త్రీలు ధరించు వస్త్రములా ? అని ప్రశ్నింతురేని, ఈ ప్రపంచమునందు మీరే స్త్రీలా, మఱొక

స్త్రీ లేదా ? ఈ నిర్జనవనమునందు గోపబాలికలమైన మేము దక్క మరొక స్త్రీ ఎవరు రాజాలును ? అని అనెదరేని సరియే.

ఓ రహఃసంచారిణీ బాలికలారా ! మీరేనా రహఃక్రీడ చేయుచున్నది ? ఓ విద్వాంసుడా ! అట్లు కాదని మేమిచటకు క్రీడించుటకై వచ్చుటలేదనియు, కదంబదేవతయగు దుర్గాదేవిని పూజించుటకై వచ్చుచున్నామనియు చెప్పుదురేని, మీరేనా దుర్గాదేవీపూజ చేయుచున్నది ? ఓ ముగ్ధలారా ! ఇచట ప్రతి అర్ధరాత్రియందు వైమానికీదేవతలు వచ్చి, దుర్గాపూజ చేయుదురు. అది సత్యమే అని చెప్పుదురేని, వారు తమ వస్త్రములను వీడి, ఏల వెళ్ళుదురు? కాని, ఓ బాలికలారా ! మీరు ఈ తత్త్వము నెఱుంగరు. నేడు మరల పూజకొఱకై వారు వస్త్రములను వీడి వెడలిపోయిరి.

వ్రజబాలికలు ఇట్లనిరి.... 'హే కృష్ణ ! నీవే ఈ రహస్యము నెఱుంగవు, ఈ వస్త్రములు మాకు సంబంధించినవే.

అంత శ్రీకృష్ణుడిట్లనెను... 'వ్రజబాలికలారా ! ఈ వస్త్రములు నిజముగా మీవే అయినచో, రండు మీ మీ వస్త్రములను గుర్తించి, విశ్వాసముకొఱకై శపథముచేసి గైకొనుడు. అందఱును కలసి రండు, లేక ఇరువురు, ముగ్గురుకలసి రండు. అథవా, ఒక్కొక్కరే రండు. కలసివచ్చుటలో, సమూహమునందు భవతియైన ఒకతె ఎక్కువ వస్త్రములను గూడా తీసికొనవచ్చును. మీరు రానిచో మీకు వస్త్రములు లభింపవు. నేను కపటిని, నేను అవిశ్వసనీయుడను అని భావింతురేని, నేను శపథపూర్వకముగా చెప్పుచున్నాను. మీరందఱును వ్రతానుష్ఠానముల వలన కృశించి ఉన్నారు. నేను పరిహాసము చేయుటలేదు. తపస్వినులైన మీ

యందు దయా, భక్తి, ధర్మభయము గూడా ఉన్నవి. నన్ను మిథ్యావాది అని భావించి, విశ్వసింపకపోయినను, యుక్తము కాదు. ఏలన, నేను ఈ వయస్సువఱకు ఈ జన్మలో అసత్యమును నదియే ఎఱుంగను. ఈ విషయమును ఈ బాలకులందఱును ఎఱుంగుదురు. దూరమునుండియే, వస్త్రములను ఈ నీటిలోనికి విసరివేయుమనుటగాని, ఈ బాలకులద్వారా పంపుమనుటగాని, ఉచితము కాదు. ఏలయనగా, ఈ వస్త్రములు మీకు సంబంధించినవో, లేక ఇతరులకు సంబంధించినవో తెలియదు. ధార్మికులైన వారు ఇతరుల వస్తువులను గోటిమొనతోగూడా స్పృశింపరు. కావున, మీరే వచ్చి, మీ మీ వస్త్రములను గుర్తించి, తీసికొనుడు. మేము, ఇతరుల వస్తువులను గ్రహించము, ఒసగము, స్పృశింపము. 'మేము, సత్కుల కుమారికలము, నీ దగ్గఱకు వచ్చుటకు భయపడు చున్నాము' అని తలంచుచుండిరేని, మొదట మీలో, ఒక సాధారణ బాలిక రావచ్చును. అపుడు, ఆమెపట్ల ఏమియైనను అత్యాచారము జరిగినట్లు మీరు చూచిన, ఎవరును ఇచటకు రావలదు. అథవా, మీరందఱును కలసి రండు, అపుడు ఏమియును భయము ఉండదు కదా! ఓ సుమధ్యమలారా! వచ్చుటకు మీరేల సంకోచించు చున్నారు? వ్రజాంగనలారా! నేను వెళ్లి మహారాజుతో చెప్పెదను అని అందురేని, అదంతయు, నిరర్థకము. ఎందుచేతననిన, మీరు ఇప్పటికిని నగ్నముగానే ఉన్నారు. ఇట్టి స్థితిలో కంసుని దగ్గఱకును వెళ్లజాలరు, నందమహారాజ సమీపమునకును వెళ్లలేరు. మీ దగ్గఱ మరొకడెవరును లేడు. అట్టి పరిస్థితిలో మీరు మహారాజు దగ్గఱకు ఎట్లు వెళ్లగలుగుదురు? మీరు మిమ్ము, నా దాసురాండ్రని భావించిన, నా ఆజ్ఞాపాలనము చేసెదమందురేని, ఇచటకు వచ్చి, మీ మీ వస్త్రములను తీసికొనుడు."

భగవంతుని ఈ పరిహాసవచనములను విని, వ్రజకుమారికలు కృష్ణాకృష్టచేతస్కులై శీతల జలమునందు ఆకంఠమగ్నలై ప్రేమార్తిపురఃసరముగా 'హే అంగః' అని సంబోధించుచు ఇట్లనిరి-

''మాఽనయం భోః కృథా స్త్వాం తు నందగోపసుతం ప్రియమ్।
జానీమోఽంగ! వ్రజశ్లాఘ్యం దేహి వాసాంసి వేపితాః ॥''

అనగా, ఇట్లు అన్యాయము చేయవలదు. మేము నిన్ను వ్రజశిరోమణి ప్రియతముడు నయిన నందమహారాపుత్రుడవని అనుకొనుచున్నాము. మేము చలితో వణకి పోవుచున్నాము, మా వస్త్రముల నిమ్ము' అని భావము.

ఇట్లు పలికి, అందఱును ప్రేమసాగరమునందు నిమజ్జితలైరి. ప్రియతముని ప్రేమాలాపమునందు మనోలయమయ్యెను. బాహ్య దృష్టితో ఒకరు మరొకరిని జూచుచు, గోపకుమారికలు ఇట్లు అనసాగిరి-'ఓసి కమలేక్షణా! శ్యామసుందరుడు నిన్ను పిలచుచున్నాడు.' మరొక బాలిక, ఇట్లనెను-'ఓసి సుధాముఖీ! నీవే వెళ్లుము, ఆయనకు సుధాపానము చేయింపుము.' ఈ విధముగా పరిహాసము చేసికొనుచు ఉండిరిగాని, జలమునుండి బయటకు రాలేదు. శ్రీకృష్ణుని రహస్యమయములైన వచనములను విని, వ్రజకుమారికలు రసావిష్టలైరి. ఆ స్థితిలోనే, వారికి ఆంతర దృష్టితోనే శ్రీకృష్ణసంబంధము ప్రాప్తమయ్యెను. బాహ్యజ్ఞానము కలిగినంతనే, లజ్జితలై ప్రత్యక్షముగా శ్రీకృష్ణ సంబంధము కలిగినదని భావించి, సంవాదము కొఱకై వారు ఒకరిని మరొకరు వీక్షించుకొనసాగిరి. అన్యోన్య జ్ఞానము లేకపోవుటచేత, కౌతుకమయమైన రసాస్వాదనము చేయుచు నవ్వసాగిరి. వారు ఇట్లు అనసాగిరి-''ఓ సఖీ! ప్రియతములైన శ్రీకృష్ణుడు లేక జీవించియుండుట అసంభవమే అయినపుడు,

మన్మోహనుని అభిప్రాయమునే పాలింపుడు, లజ్జను వదలిపెట్టుడు.''
అంతియే, హస్తములతో అవయవములను ఆచ్ఛాదనము చేసి
కొనుచు జలమునుండి బయల్వెడలిరి.

ప్రియతముని సంబంధముచేత తీవ్రాతితీవ్రమైన దుఃఖము
గూడా పరమానందమయముగా అనిపించుటయే, ప్రేమ (భక్తి)
యొక్క విశేషము. వేశ్యకే కాదు, ఒకసాధ్వి, సతీమణిఅయిన
పతివ్రతకు సర్వాధికమైన కష్టము లజ్జాత్యాగమునందే ఉండును.
ప్రాణములను పరిత్యజించుట, వారికి సరళమైనది, లజ్జాత్యాగము
అతి దుష్కరము. కాని, శ్రీకృష్ణప్రేమ (భక్తి) యందు శ్రీకృష్ణ
సంబంధము వలన, ఆ లజ్జాత్యాగమును గూడా వారు సహింప
గలిగిరి. మహానుభావులు ఈ విషయమునగూడా ఆ గోపబాలికల
మహత్త్వమును సంకీర్తించిరి.

''ఆసా మహో చరణ రేణు జుషా మహం స్యాం బృందావనే
కిమపి గుల్మ లతౌషధీనామ్ ।
యా దుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా భేజుః
ముకున్ద పదవీం శ్రుతిభి ర్విమృగ్యామ్ ॥''

ఉద్ధవుడు ఇట్లు చెప్పెను–''అహో! ఈ వ్రజాంగనల పాద
పంకజ రజస్సును సేవించునట్టి బృందావనమునందలి గుల్మములు,
లతలు, ఔషధులలో ఏదియో యొకదానిని నేను గూడా అయ్యె
దను. ఏలయనగా, వీరు త్యజించుటకు వీలులేని స్వజనమును,
ఆర్యమార్గమును వదలి శ్రుతివిమృగ్యుడయిన (వేదములచే అన్వే
షింపబడునట్టి) ముకుందుని పదవీసేవనము చేసిరి అని భావము.

ఇచట, స్వైరిణులగు వేశ్యలవలె వీరికి లజ్జాత్యాగము,
ఆర్యధర్మత్యాగము సుగమము కాదు. దుర్వ్యసనములు కలవానికి

దుర్వ్యసనముల త్యాగము అతి కష్టము. తల్లిదండ్రుల, గురుజనుల ఉపదేశములు. శాస్త్రోపదేశములు తాము వీడిపోవలయునని అభిలషించినను, వీడవు. ఆ రీతిగానే, సుదృఢ చిత్తలైన వ్రజాంగనలకు ఆర్యధర్మమునందు వీడరాని నిష్ఠ ఉండెను. స్వైరిణులకు ఆర్యధర్మముతో సంబంధమే ఉండదు. అపుడు, ఆ ఆర్య ధర్మము వారికి దుస్త్యజము ఏల అగును? కాని, ఇచట గోపకుమారికల విషయమున, ఆర్యధర్మము అత్యంతము దుస్త్యజమై ఉండెను, కావుననే, ఆ ఆర్యధర్మమును వదలి, శ్రీకృష్ణుని సేవించుటయందు లోకోత్తరమైన మహాత్మ్యము కలదు. ఆర్యపథమును సురక్షితముగా ఉంచుకొని శ్రీకృష్ణుని సేవించుకొనువారికంటె గూడా ఈ గోప బాలికల మహాత్మ్యము అధికమైనది. కావుననే స్వకర్మానుష్ఠానము చేయుచు, భగవంతుని ఆరాధించుట ప్రథమకోటికి చెందినది!

"స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః।"

అయినను, అంతకంటెగూడా ఉన్నతమైన శ్రేణి మఱొకటి కలదు. అచట సర్వకర్మ సంన్యాస మొనర్చి ఏకమాత్ర భగవత్పరాయణత్వము కలుగును.

"నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసే నాధిగచ్ఛతి।"
"అజ్ఞాయైవం గుణాన్ దోషాన్ మయాఽదిష్టానపి స్వకాన్।
ధర్మాన్ సంత్యజ్య యః సర్వాన్ మాం భజేత్ స హి
సత్తమః॥"

అని భాగవతవచనము. ఇచట గమనింపదగిన విషయమేమనిన, దుస్త్యజ్యమైన త్యాగమువలననే, వ్రజాంగనల దివ్యమహిమ. విశేషమేమనిన, ఎవరికైనను, దురాచారము, దుర్విచారము, తద్భావనాజన్యమైన దుర్వ్యసనము త్యజింపరానిదై ఉండును.

కాని, ఇచట్లైనచో ఆర్యపథమే త్యజించుట దుస్తరము. ఆర్యపథమున సంచరించుటచేవిశృంఖలమార్గము పరిత్యజింపబడును. ఆర్యపథము త్యజింపరానిదగుటయే, ధర్మనిష్ఠయొక్క అద్భుత మహిమ. వేశ్యలకు ఆర్యమార్గము త్యజింపరానిదగునా? ఎవరు ఎవరిని, స్పృశింపనైనను స్పృశించలేదో, వారికి ఆ ధర్మము దుస్త్యజము ఎట్లగును? కావుననే, వేదములు మొట్టమొదట, శ్రౌత, స్మార్తకర్మానుష్ఠానరూపమైన ఆర్యమార్గమును ఆశ్రయించుటద్వారా, విశృంఖలపథరూపమైన కామ్యకర్మజ్ఞానత్యాగమును ఆదేశించినవి. దురాచారికి, దురాచారసంబంధమైన దుర్వ్యసనము కలుగును, తరువాత మాతాపితరులు, గురుజనులు, శాస్త్రిములు శతశః నిషేధించినను, ఆ దుర్వ్యసనములనుండి నివృత్తి దుస్తరమగును. ఏ ప్రాణి, మాతాపితరుల, గురుజనుల ఆదేశానుసారము వేదాది సచ్ఛాస్త్రోక్త ధర్మములను సేవింపసాగునో తరువాత మెల్లమెల్లగా, విశృంఖలతకు సంబంధించిన వానియొక్క సమస్త సంస్కారములు (వాసనలు) వీడిపోవును, సద్ధర్మమునకు సంబంధించిన సంస్కారములు సుప్రతిష్ఠితములగును. చివరకు దానికి సద్ధర్మసంస్కారవ్యసనమే కలుగును. ఆ సంస్కారము గాఢా వీడిపోవుట దుష్కరమగును. మొట్టమొదట పాశవిక కర్మలకు ప్రాధాన్యము ఉన్నంతవఱకు సత్కర్మలయందు ప్రవృత్తి కలుగుట దుష్కరమగును. కావుననే, కర్మల ప్రశంసనము చేసి ఆ కర్మలు విధింపబడును. కాని, సత్కర్మానుష్ఠానముద్వారా దుష్కర్మపరిత్యాగమొనర్చి, సత్కర్మనిష్ఠాగత సంస్కారములు సుదృఢములయినపుడు, నైష్కర్మ్యప్రాప్తికై, లేక నిదిధ్యాసనాది తత్పరత్వసంపాదనకై, ఆ సత్కర్మలను పరిత్యజించుట అభీష్టమై ఉన్నది.

ఏతదర్థమే (నైష్కర్మ్యసిద్ధికొఱకే) కర్మత్యాగము అభీష్టమగును. త్యాగము కొఱకే అచటచట కర్మనింద కూడా చేయబడును.

"ప్లవా హ్యేతేఽదృఢా యజ్ఞరూపాః।"

ఒక పదార్థమును సంకీర్తించుట, తద్గ్రహణముకొఱకే చేయబడును తత్పదార్థనింద తత్త్యాగముకొఱకే చేయబడును. ఇది సర్వసమ్మతమైన నియమము. విశృంఖలత, పాశవికత స్వాభావికము. శ్రౌత, స్మార్తశృంఖలానిబద్ధమైన చేష్ట దుర్లభము. రాగప్రాప్తమైన ద్రవ్య, క్రియావినింద ద్వారా నిషేధమొనర్చి, స్వతః అప్రాప్తమగు ధర్మము ప్రశంసాపురఃసరముగా విధింపబడును.

వ్రజాంగనలు, పూర్ణమైన స్వధర్మనిష్ఠద్వారా పాశవికభావనలచేత అత్యంతాసంస్పృష్టలుగా ఉండిరి. వారి స్వధర్మనిష్ఠ అత్యంత దృఢమైనది. దుర్వ్యసనపరునకు దుర్వ్యసనము దుస్త్యజమైనరీతిగానే వ్రజాంగనలకు ధర్మనిష్ఠ, ఆర్యధర్మము త్యజింపరానిది. శ్రీకృష్ణుడు తన అమృతమయ ముఖచంద్రుని పైన వేణువును ధరించి సుమధురమైన అధరసుధతో పూరించి, వేణువాదనము చేసినపుడు, వ్రజాంగనలు తమ జాతిధర్మ, వర్ణధర్మ, ఆశ్రమధర్మ, కులధర్మములయందు నిమగ్నలై ఉండిరి. ఒకామె, గోదోహనము చేయుచుండెను, మరొక గోపాంగన పతిశుశ్రూషాలగ్నచిత్తయై ఉండెను, అన్యగోపకాంత తన శిశువునకు పయఃపానము చేయించుచున్నది. గోపాంగనలు తమ అభిరుచినిబట్టి కర్మత్యాగము చేయలేదు. కాని, శ్రీకృష్ణచంద్రముఖ నిర్గతమైన వేణుగీతపీయూష సంపర్కముచేత వ్రజాంగనల హృదయస్థమైన ప్రేమ (భక్తి) మహార్ణవము ఉద్వేలితము కాగా, వారు తమను నిలద్రొక్కికొన

జాలరైరి. తీవ్రమైన గంగాప్రవాహమునందు మునకలిడి శతథా రక్షించుకొనుటకై ప్రయత్నించినను, ప్రాణి ప్రవాహమున బడి కొట్టుకొనిపోవుటయే జరుగును. ఆ చందముగానే వేణుగీతశ్రవణము చేత సముద్భూతమైన ప్రేమప్రవాహమునందు వ్రజాంగనలు ప్రవాహమున బడి కొట్టుకొనిపోయిరి. శతథా రక్షించుకొనుటకు ప్రయత్నించినను, వారు శ్రీబృందారణ్యధామవర్తి వ్రజచంద్రుడును అయిన శ్రీకృష్ణుని సన్నిధికి చేరిరి. గ్రహగృహీతుడైన వ్యక్తి స్వవశమున ఉండడు. అ రీతిగానే, శ్రీకృష్ణగ్రహగృహీతాత్మలైన ఆ వ్రజాంగనలు అస్వతంత్రలైరి.

"నిశమ్య గీతం తదనంగవర్ధనం వ్రజస్త్రియః కృష్ణగృహీత మానసాః।"

దీనివలన వ్రజాంగనల ఆర్యధర్మనిష్ఠ ఎంత అవిచలమైనదో విదితమగును. పాశవికమైన చేష్ట ఆ వ్రజాంగనలను వశము చేసికొనలేకపోవుటయే కాదు, స్పృశింపనైనను స్పృశింపజాలదు. కాని లోకోత్తరమైన శ్రీకృష్ణభక్తియే (ప్రేమయే), స్వజన త్యాగము, స్వధర్మత్యాగముద్వారా సంన్యసించుటకు వివశమొనర్చెను. ఒకానొక కర్మనిష్ఠుడు, కర్మాచరణమునకు మహాఫలభూతమైన భగవత్సాక్షాత్కారముకొఱకే, సర్వకర్మసంన్యాసము చేయును. ఆ విధముగానే, సర్వధర్మములకు ఫలభూతమైన శ్రీకృష్ణప్రేమ (భక్తి) కొఱకే వ్రజాంగనలు సర్వధర్మసంన్యాసము చేసిరి.

ఒక త్యాగము పతనమునకు మూలమైనచో మరొక త్యాగము పరమ కళ్యాణమునకు మూలభూతమగును. ఒకానొక వ్యభిచారికై (జీవునకై) ఒక స్త్రీ తన ఆర్యధర్మమును త్యాగముచేయుట మహాపాపము. కాని, పరమాత్మయైన శ్రీకృష్ణుని కొఱకై ఆర్యధర్మమును సైతము సంన్యసించుట యుక్తమే. సాధ్యప్రాప్తి కలిగినపుడు,

సాధన సంన్యాసము చేయుట స్వాభావికమే. కామ, క్రోధ, లోభ వశుడై స్వవిహిత కర్మలను సంన్యసించుట పాపము. కాని సర్వ చేష్టావివర్జితమైన నిర్వికల్ప సమాధిద్వారా బ్రహ్మసాక్షాత్కారము నకై సర్వకర్మ సంన్యాసముయుక్తమే. వివేకవంతులైన మహాను భావులు కర్మయే, కర్మసంన్యాసము ద్వారా నైష్కర్యమునకు మూలమని చెప్పిరి.

"వేదోక్తమేవ కుర్వాణో నిఃసంగోఽర్పిత మీశ్వరే।
నైష్కర్మ్యసిద్ధిం లభతే రోచనార్థా ఫలశ్రుతిః॥

ధర్మమునకై, దేశమునకై, శరణాగతరక్షణకై ప్రాణము లను అర్పించుట అత్యంత మహత్త్వోపేతము. కాని, కామినీ కాంచన ములకై చౌర్య, వ్యభిచారాదుల ద్వారా ప్రాణత్యాగము చేయు టలో మహత్త్వ మేమియును లేకపోవుటయేకాక, మహాపాపమునకు మూలముగూడా అగును. సరిగా ఆవిధముగానే, సర్వకర్మలచేత సమర్హణీయుడైన (చక్కగా పూజింపదగిన)భగవంతుని నిమిత్తమై సర్వకర్మత్యాగము 'సంన్యాస' శబ్దముచేత అదరణీయ మగును. అన్యములైన లౌకికవస్తువులకై ఆర్యధర్మ త్యాగము మహా పాపము.

త్యజించుటకు దుస్తరములైన దుర్వ్యసనములను పాశవిక కర్మలను దూరాపాస్తము చేయుటకు దుస్త్యజమైన ధర్మనిష్ఠ అపేక్షితమగును. ఆ దుస్త్యజ అధర్మత్యాగమునకై దుర్నివారమైన బ్రహ్మనిష్ఠ, భగవదనురాగము అపేక్షితమగును. వ్రజాంగనల యొక్క శ్రీకృష్ణభక్తి (ప్రేమ) దుస్త్యజమైనది. సర్వత్యాగము నకు మూలమిదియే. కాని, ప్రీతత్త్యాగమునకు ఎచటను సాధనమే

లేదు. యోగులు, మునులు విషయములనుండి మనస్సును మర లించి శ్రీకృష్ణునియందు సంలగ్నము చేయదలంతురు. అట్లే, వ్రజాంగనలు శ్రీకృష్ణునినుండి మనస్సును నివృత్తము చేయగోరుదురు. గ్రహగృహీతాత్మ గ్రహమునుండి తనను ముక్తమొనర్చు కొనగోరునట్లే, కృష్ణగ్రహగృహీతాత్మలైన వ్రజాంగనలు శ్రీకృష్ణు నుండి తమను తాము ముక్తము చేసికొనదలంతురు. ముముక్షువైన వ్యక్తి, విషయములయందు దోషానుసంధానము చేయురీతిగానే ఆ వ్రజాంగనలు శ్రీకృష్ణునియందు దోషానుసంధానము చేయుదురు.

"మృగయురివ కపీన్ద్రం వివ్యధే లుబ్ధధర్మా
స్త్రియమకృతవిరూపాం స్త్రీజితః కామయానామ్।
బలిమపి బలిమత్త్వా వేష్టయద్ ధ్వాంక్షవద్య
స్తదలమసితసఖ్యై ర్దుస్త్యజ స్తత్కథార్థః॥

హే సఖి! శ్రీకృష్ణుడు అన్యాన్యజన్మలలో సైతము కపటియే ఆయన, రామావతారమునందు సీతాప్రేమనిమిత్తమై వ్యాధునివలె దాగికొని కపీంద్రుడైన వాలిని వధించెను. కామానురాగిణియైన శూర్పణఖయొక్క చెవులను, ముక్కును ఖండించి విరూపనుజేసెను. వామనావతారమునందు బలిచక్రవర్తి పూజను గైకొని, ఆయనను బంధించి పాతాళమునకు పంపెను. కాకి, విస్తరియాకునందు తిని, ఆ విస్తరిని సచ్ఛిద్రము చేయును. ఓ సఖీ! ఈయన పరిస్థితి యును అట్లే ఉండును. హే సఖి! శ్యామలములు, పీతములు నయిన రెక్కలుగలది, మధురఝుంకారముచేయునది, బింబోష్ఠము కలదియు నగు భ్రమరము సరస పుష్పపరాగ రసాస్వాదనము చేసి తరువాత దానిని వదలివేయును. ఆ రీతిగానే, పీతాంబరధారి, బింబాధరోష్ఠము కలవాడు, మధురాలాపియు నయిన శ్యామసుంద

రుడుగూడా, ప్రయోజనము ఉన్నంతవఱకు ప్రేమించి మనను వదలివేసెను. హే సఖి! అసితవర్ణము కలవారి (నల్లనివారిని) స్నేహము (సాంగత్యము) ఎన్నడు జేయరాదు. మనముగూడా మహేంద్రమణిహారములను, కంకణములను (చేతిగాజులను) మృగమదమును (కస్తూరిని), నీలాంబరమును త్యజించివేయుదము. కేశముల కాలిమను తొలగించుటకై ఆ కేశములపైన ధూళిధారణము చేయుదము. కాని, సఖీ! ఇంత దోషానుసంధానము చేసినను, మనోమోహనుడైన శ్రీకృష్ణుని మధురమూర్తిని ఒక్కక్షణకాలముగూడా విస్తరింపజాలకున్నాము. ఆయన చేయు లీలలు, హాసవిలాసములు క్రీడలు విస్తృతము లగుటలేదు.

ఒకమారు ఒక గోపాంగన, శ్రీకృష్ణప్రేమనిమగ్నయై మూర్ఛిత అయ్యెను. ఒక సఖి, అత్తరు, పన్నీరు, వ్యజనము మొదలైనవానితో ఉపచారము చేయుచుండెను. ఇంతలో మఱొక చెలికత్తె వచ్చి. శ్రీకృష్ణలీలలను గానము చేయసాగెను. శ్రీకృష్ణ నామము వినినంతనే, మొదటి సఖి ఇట్లనెను....

"సత్యజ సఖి తదుదస్తం యది సుఖలవమపి సమీహసే
సఖ్యాః॥
స్మారయ కిమపి తదితర ద్విస్మారయ హన్త మోహనం
మనసః॥"

"హే సఖి! నీవు నీ ఈ చెలికత్తెకు కొలదిగనైనను శాంతిని కలుగజేయుదలంచినచో శ్రీకృష్ణోదంతమును ఇచటకుగొనిరావలదు, మరొక విషయమును ఏదైనను స్మరింపుము. ఓ చెలీ! మనోమోహనుడైన ఆ శ్యామసుందరుని విస్మరించునట్లుగా జేయుము".

అహో ! యోగీంద్రులు బాహ్య విషయముల నుండి మనస్సును ప్రత్యావర్తితము చేసి (మరలించి) ఏ శ్రీకృష్ణుని యందు సంలగ్నము చేయనభిలషింతురో, ఈ బాల, ఆ శ్రీకృష్ణుని నుండియే మనస్సును నివర్తింప జేసి, విషయములయందు లగ్నము చేయగోరుచున్నది. యోగీంద్రగణము ఒక్కక్షణకాలము తమ మనస్సునందు ఎవరి స్ఫూర్తిని గోరుచుందురో, ఆ శ్రీకృష్ణ చంద్ర పరమానందకందమునే ఈ ముగ్ధ తన మనస్సునుండి దూరము చేయదలంచుచున్నది.

"ప్రత్యాహృత్య మునిః క్షణం విషయతో యస్మిన్ మనో
ధిత్సతి।
బాలాఽసౌ విషయేషు ధిత్సతి మనః ప్రత్యాహరన్తీ తతః॥
యస్య స్ఫూర్తిలవాయ హన్త హృదయం యోగీ
సముత్కంఠతే।
ముగ్ధేయం కిల పశ్య తస్య హృదయా న్నిష్క్రాన్తి
మాకాంక్షతి॥"

ఇతరులకు దుష్ప్రాపమైన బ్రహ్మనిష్ఠయే, ఈ గోపాంగన లకు దుస్త్యాజ్యమై ఉన్నది. దుస్త్యజములైన ఇతర విషములు గూడా త్యజింపబడవచ్చును. కాని, ఇది అంతిమ దుస్త్యజమైన విషయము. భగవంతునికంటె త్యజింపదగిన మాధుర్యము ఎచట సంభవమగును ? లోకైషణా, పుత్రైషణా, విత్తైషణావినిర్ముక్తుడు, బ్రహ్మనిష్ఠుడు నయిన సర్వకర్మసంన్యాసికి కర్మత్యాగము భూషణమే గాని దోషము కాదు ఆ రీతిగానే, శ్రీకృష్ణప్రేమోన్మాదము నందు లోకమునకు వేదములకు అతీతలైన వ్రజాంగనలకు లజ్జా త్యాగము, ఆర్యధర్మత్యాగము అలంకారమే గాని, దోషము కాదు. ముఖ్యపతిప్రాప్తియందు పతియొక్క ప్రతిమను పూజించుట

త్యాగము చేయుట, అథవా, ముఖ్య విష్ణుప్రాప్తియందు విష్ణు ప్రతిమాపూజనము త్యాగముచేయుట దోషము కాదు. ఆ చందము గానే, పరమారాధ్యుడు, పరమ పతి, భగవంతుడు నయిన శ్రీకృష్ణుని ప్రాప్తియందు వ్రజాంగనలకు ఆర్యధర్మ త్యాగము భూషణమే అయి ఉన్నది,

కర్మోపాసనల వలన, మలవిక్షేపనివృత్తిద్వారా జ్ఞానముచేత బ్రహ్మస్ఫురణము కలుగును. బ్రహ్మస్ఫురణము కలిగినపుడు, సర్వచేష్టావివర్జితుడై బ్రహ్మనిష్ఠను సంపాదింపవలసియుండును. ఆ సమయమున కర్మ, ఉపాసన - ఏ విధమైన ప్రయత్నమైనను, ఆ బ్రహ్మనిష్ఠయందు ప్రతిబంధకమగుటచేత త్యాజ్యమే అగును. కావుననే...

"తత్రైకాగ్రం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్।"

అని చెప్పిరి. అనగా ఆ బ్రహ్మయందు మనస్సును ఏకాగ్రమొనర్చి, అన్యవిషయమును ఏదియును చింతింపజనదని భావము.

భగవదనుభవమునందు, భగవత్సేవయందు ఏది ఎంతవఱకు ఉపయుక్తమో, అంతవఱకును అది గ్రాహ్యమే అయి ఉన్నది. అదియే, భగవదుపాసనకు ప్రతిబంధకమైనపుడు, దానిని నిస్సంకోచముగా త్యజింపనగును. భగవత్ప్రాప్తికొఱకు, ధర్మ దేశరక్షణాదులకొఱకు ప్రాణత్యాగము త్యాగమగును. పర స్త్రీ గమనము కొఱకు, పరధనాపహరణముకొఱకు చేయు ప్రాణత్యాగముకూడ త్యాగమే. కాని, ఒకటి పుణ్యరూపము, మరొకటి పాపరూపమని విస్పష్టము.

సారాంశ మేమనిన, పతిశుశ్రూష, పాతివ్రత్యము, లజ్జమున్నగు సమస్త ఆర్యధర్మముల పరమ లక్ష్యము, సకల ప్రాణు

లకు నిరతిశయుడు, నిరుపాధికుడు, పరప్రేమాస్పదుడు, సర్వా రాధ్యుడు, సర్వపతియు నయిన శ్రీకృష్ణభగవానుని ప్రాప్తి సిద్ధించుటయే ఈ భగవత్ప్రాప్తికి ఏది ఎంతవఱకు అనుకూలముగా ఉండునో, అంతవఱకే అది ఆదరణీయము. కాని, అదియే ఆ పరమధ్యేయప్రాప్తికి ప్రతిబంధకము కాసాగినచో దానిని త్యజించుటయే శ్రేష్ఠము.

కావున, నందవ్రజ కుమారికలుగూడా, శ్రీకృష్ణప్రేమకు (భక్తికి) వ్యతిరేకముగా లజ్జాత్యాగము చేసి, శ్రీ కృష్ణుని సంముఖమునకు వచ్చిరి. వారు పరస్పరము ఈ విధముగా ఆలోచించిరి... "హే సఖి ! శ్రీకృష్ణసంమిలనముయొక్క ఆశ ఛేదింపరానిదిగా ఉన్నది. ఆ ఆశ, మరణజన్యమైన బాధకంటెగూడా వందరెట్లు అధికమైన లజ్జాత్యాగ కష్టమును సహించియు ప్రాణవియోగము జరుగనిచ్చుటలేదు. ఓ చెలీ ! మన ప్రియతముడు మొండిపట్టుపల కలవాడు. ఆయన తన పట్టుదలను వీడడు. ఇంతలోనే ఎవరైనను వచ్చినచో మనమందఱము విడంబనాంభుదిలో మునిగిపోయెదము. కావున ప్రియతముని మొండిపట్టుదలను దూరముగా ఉంచుము. లజ్జను త్యజించుము. ఓ సఖీ ! కనులు మూసికొని సర్వత్ర వ్యాపించియున్న గాఢాంధకారముతోనే మన అవయవములను గుప్తము చేసికొని శ్రీకృష్ణుని ఎదుటకు బయలుదేరుడు." ఇట్లు ఆలోచించి, ఆ వ్రజాంగనలు తమ అవయవములను చేతులతో కప్పుకొని శ్రీకృష్ణుని సమ్ముఖమునకు వచ్చిరి. శ్రీకృష్ణుడుగూడా వారి ధృఢభక్తిని, దివ్యత్యాగమును చూచి, వారి శుద్ధభావముల వలన ప్రసన్నుడై ఇట్లు ఆలోచించెను .... ఆశ్చర్యము ! మీరు దుష్కరమైన త్యాగము చేసిరి. కులాంగనలకు స్వభావసిద్ధము, దుస్త్యజము నయిన లజ్జను గూడా వీరు గడ్డిపోచవలె త్యజించిరి.

కానిమ్ము ఇపుడు వీరిని ఇంకను పరీక్షింపవలయును. వీరు ఆ పరీక్షలో ఉత్తీర్ణలైనచో వీరి వస్త్రములే కాదు, వస్త్రములతోపాటు నన్నుగూడా నేను సమర్పించుకొనవలయును. అంతియే. ఇట్లు నిశ్చయించుకొని శ్రీకృష్ణుడు ఇట్లు పలికెను. (శ్రీకృష్ణభగవానుడు ఆ వ్రజకుమారికల పరిశుద్ధమైన భావముచేత ప్రసన్నుడయ్యెను గాని వారి గుహ్యాంగదర్శనముచేత ప్రసన్నుడు కాలేదు.)

"శుద్ధభావప్రసాదితః స్కంధే విధాయ వాసాంసి ప్రీతః
ప్రోవాచ సస్మితమ్।"

అక్షతయోనులైన ఆ కుమారికలను చూచెను. అథవా,

"ఆహతాః తిరస్కృతాః వీక్ష్య"

తిరస్కృతలైనవారిని చూచెను. అనేకములైన అవమానములచేత గూడా భగ్నమనస్కలు కాని వ్రజాంగనలను జూచి ప్రసన్నుడయ్యెను. వారి వస్త్రములను తన భుజముపైన ధరించి (వారి అధోవస్త్రములను తన ఉత్తమాంగముపైన ధరించి భక్తిపరవశతను ప్రదర్శించెను) ఇట్లనెను.... "మీరు వివస్త్రలై నీటిలో స్నానము చేసిరి. దీనివలన దేవతావమానము జరిగెను. మీరు చేసిన వ్రతము భగ్నమైపోవును. అయ్యో! మీరు ఎంత కష్టము సహించి వ్రతమాచరించిరో కదా! అయినను ఆ వ్రతము భగ్నమైనచో ఎంత విడంబనా విషయము. కానిండు ఇపుడు మీరు ఆ అపరాధము యొక్క శాంతికై శిరసుపైన అంజలి ఘటించి, నమస్కరించి, మీ అధోవస్త్రములను (కట్టుచీరలను) గైకొనుడు."

శ్రీకృష్ణుని ఈ వచనమును విని సరళ స్వభావముగల వ్రజబాలికలు వివస్త్రలై స్నానము చేయుట వలన వ్రతభంగమగునని భావించి, తద్వ్రతపూర్తికామనతో శ్రీకృష్ణునకు చేతులెత్తి నమస్క

రించిరి. సమస్త కర్మల వ్యంగతను శ్రీకృష్ణుడు దూర మొనర్చును.

"యస్య స్మృత్యా చ నామోక్త్యా తపోయజ్ఞ క్రియాదిషు।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే తమచ్యుతమ్॥"

ఎవరి స్మరణము, నామోచ్చారణము వలన తపస్సు, యజ్ఞ క్రియల న్యూనత నశించి, అవి సంపూర్ణములగునో, అచ్యుతుడైన ఆ భగవానునికి చేయు వందనము కర్మల వ్యంగతను తప్పక నాశ మొందించును. ఇచటగూడా శుద్ధభావముతో శ్రీకృష్ణప్రాప్తికై చేయ బడిన వ్రతమునందలి వ్యంగతను నివారించుటకయియే, వ్రజాంగ నలు శ్రీకృష్ణుని ఆజ్ఞను శిరసావహించిరనునది స్పష్టము. మహా మహా త్యాగము లొనర్చియు, కఠోరాతికఠోరములైన కష్టములను సహించియు వ్రజకుమారికలు తమ వ్రతసాంగత్వమును అభిల షించుదురు.

శ్రీకృష్ణుడు చేతులు జోడించి నమస్కరించుడని చెప్పినపుడు వ్రజాంగనలు క్రిదనే అంజలిబంధము చేసిరి. అంత శ్రీకృష్ణుడు శిరసుపైన చేసిన యంజలిబంధమే ప్రణామమగునని చెప్పెను. వారు ఒక చేతిలో ఆచ్ఛాదనీయమైన గుహ్యాంగమును ఆచ్ఛాదిత మొనర్చి ఒకచేతిని శిరస్సుపైన ఉంచుకొని, ప్రణామము చేసిరి. అపుడు శ్రీకృష్ణుడు ఒక హస్తముతో చేయు ప్రణామముగూడా అశాస్త్రీయ మనెను. అంత వారు నిశ్చల నిష్కపటభావముతో శ్రీకృష్ణుని సర్వాంతరాత్మ, సర్వేశ్వరుడని భావించి వ్రతపూర్తికై ప్రణామము చేసిరి.

వస్తుతః జీవుడు భగవంతుని సంముఖమున నిరావరణుడు నిష్కపటియును అగుటకు అనేక విధములుగా త్రోసిపుచ్చును. కాని

భగవంతుడు ఎవరిపై దయచూపునో వారిని ఏదియో ఒకవిధముగా తన సంముఖమునకు అవశ్యము తెచ్చుకొనును. ఇది ప్రభువు యొక్క విచిత్ర లీల. 'ప్రభువు తన సమ్ముఖమునకు నన్ను చేర్చుకొనుగాక, ఆయనయందు నా మనస్సు ఆసక్తమై ఉండు గాక'' అని మహా మహా మునీంద్రబృందములు వెంపరలాడు చుందురు. ఎవరిపై ప్రభువునకు కృప కలుగునో, వానికి కోరిక లేకపోయినను, అతడు శతధా త్రోసిపుచ్చినను భగవంతుడు వానిని తనవైపునకు ఆకర్షించుకొనును. కావుననే, భక్తజనులు కృష్ణావేశ మును గ్రహావేశ మనిరి. బలిచక్రవర్తిగూడా ఇట్లనెను.... 'హే నాథ ! నీవు మాయందఱకు పరోక్ష గురవువు. మాకు ఇచ్ఛలేక పోయినను బలాత్కారముగా నీ సంముఖమునకు గైకొందువు. ఏలయన, సర్వవ్యవధానశూన్య నిరావరణుడుకాక, జీవుడు కృత కృత్యుడు కాజాలడు'.

పరమానంద రసామృతసింధువైన భగవంతుని తరంగస్థానీ యులు, ఆ భగవంతుని చిదానందమయ శక్తులే జీవులు. వారే, భగవంతుని అంతరంగ పరాప్రకృతి లేక 'శక్తి' పదముచే వ్యపదేశ్యులగుదురు.

''ప్రకృతిం విద్ధి మే పరామ్।''
''జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్।''

తరంగమునకు బాహ్యాభ్యంతరములయందును, మధ్యభాగమున లేక అంశ అంశమున జలము నిండియున్నపుడు, మహాసాగరము నందు తరంగమునకు ఏమి వ్యవధానము (తెర) ఉండును ? ఆ విధముగానే చిదానందమయములైన జీవశక్తుల బాహ్యాభ్యంతర

ము ాయందు, సర్వత్ర పరమానందరసామృతమూర్తియైన భగవంతుడు వ్యాపించి ఉన్నాడు. అపుడు ఆ భగవంతునినుండి జీవులకు గోప్యమైనది ఏమి ఉండును ? విశ్వమునందలి స్థూల, సూక్ష్మ, కారణ శరీరత్రయమునకు సంబంధించిన గందరగోళములకు (కల్లోలములకు) అన్నింటికి కారణభూతుడు, భాసకుడు నయిన సాక్షినుండి ఏమి గుప్తముగా ఉండజాలును ? ప్రాణుల మనోబుద్ధి, అహంకారములకు సంబంధించిన సమస్త సద్భావనలకు దుర్భావనలకు ఎవరు సాక్షియై ఉన్నాడో, పిపీలికల (చీమల) మనోవృత్తులకు సైతము సర్వథా జ్ఞాతయై ఉన్నాడో, ఆయనకు గోప్యమైనది ఏమి ఉండును ? అయినను, అనాది, అనిర్వచనీయ మోహినీశక్తి ప్రభావముచేత మోహితములైన ఆ శక్తులు భగవంతునినుండి తమ అవయవములను ఆవృతము లొనర్చుకొనుటకు అభిలషింతురు, ఆయనవలన లజ్జపడుదురు. వారే వ్రజాంగనలు, సర్వాంతరాత్మ, సర్వసాక్షియే శ్రీకృష్ణుడు.

'చైతన్యాభాసోపేతము'లైన బుద్ధి వృత్తులను గూడా, వ్రజాంగనలని చెప్పవచ్చును. వానికి ప్రకాశస్వరూపుడు సాక్షి శ్రీకృష్ణుడు. సాక్షియొక్క అంతరంగతను తెలిసికొనలేకపోవుట వలన, ఆయననుండి గుప్తముగా ఉండుటకు ప్రయత్నము జరుగును. సాభాస మనోమయ వృత్తిరూపలైన శ్రుతులుగూడా వ్రజాంగనలు. ఆ శ్రుతుల తాత్పర్యము లేక హృదయము ఏ పరమ తత్త్వమునందు నిహితమై ఉన్నదో, అ పరమానందరసామృత మూర్తియైన భగవంతునికి, ఆ శ్రుతులకు ఏమి అంతరము కలదు? జలమునందు శీతలత్వమువలె, అమృతమునందు మధురత్వము వలె శ్రీకృష్ణచంద్రునియందు వృషభానునందిని అయిన రాధిక ఉన్నది. పరమానందరసామృతమూర్తియైన శ్రీకృష్ణ చంద్రుని మాధుర్యాధిష్ఠాత్రి మహాలక్ష్మియే రాధిక.

వేదాంతులు గుణ - గుణి తాదాత్మ్యమును అంగీకరించిరి. కావుననే, పృథివిగంధాత్మికయే. కర్పూరమునకు, తద్గంధమునకు గల తాదాత్మ్యము స్పష్టమే. ఈ దృష్టితో అమృతమునకు, తన్మాధుర్యమునకు, పరమానందరసామృతసింధువునకు, తన్మాధుర్యాధిష్ఠాత్రిశక్తికి అభేదమే. కావుననే, భావుకులైన భక్తులు శ్రీకృష్ణహృదయవర్తిని, మహాభావస్వరూపిణిఅయిన రాధను, ఆమె హృదయవర్తి మూర్తీభవించిన శృంగారరసస్వరూపుడైన శ్రీకృష్ణుని అంగీకరించిరి. కావుననే, మహాభావపరివేష్ఠిత మూర్తీభూతశృంగార రసరూపముగానే భావుకులైన భక్తులు రాధాకృష్ణులను దర్శింతురు. శ్రీకృష్ణాంగవర్తియైన పీతాంబరము, వివిధములైన ఆభూషణములును రాధ, వ్రజాంగనలే. రాధాదేవి శరీరమునందు కస్తూరి, మహేంద్రనీలమణి, హారములు, నీలాంబరరూపములో శ్రీకృష్ణుడే అయి ఉన్నవి.

> "శ్రవసోః కువలయ మక్ష్ణో రంజన మురసో మహేంద్ర
> మణిదామ।
> బృందావన తరుణీనాం మండన మఖిలం హరి ర్జయతి॥"

బృందావనతరుణులైన వ్రజాంగనల కర్ణములయందు కువలయములు (కలువలు), నేత్రములయందు అంజనము, ఉరమునందు (హృదయమునందు) మహేంద్రనీలమణిమాల, అధికముగాచెప్పనేల, సమస్త మండనము (భూషణాలంకారము) శ్రీకృష్ణుడే. ఈవిధముగా ఆలోచించినపుడు, సర్వప్రాణులకు నిరతిశయ, నిరుపాధిక, పరమ ప్రేమాస్పదుడు, ప్రత్యక్ చైతన్యాభిన్నుడు నయిన భగవంతునినుండి గోప్యమగు విషయమే పొసగదు. స్థూలదృష్టితో చూచినను, ఎంత అసూర్యంపశ్య, సాధ్వి, సతి, పతివ్రతఅయినను, ఆమె తన అవయవములను వాయువు

చేత అసంస్పృష్టములుగా ఉంచుకొన గలదా ? ఆమె గుహ్యాతి గుహ్యమైన అవయవమునకు జలస్పర్శ కలుగదా ? తేజస్సు, వాయువు, అథవా ఆకాశముచేత ఏ స్త్రీ తన అవయవములను గోప్యములుగాను, అసంస్పృష్టములుగాను ఉంచుకొనగలుగును ? కావున, స్వీయ పతికంటె భిన్నుడైన అన్యపురుషుని వలననే, ఆచ్ఛాదితము చేయబడునని యే చెప్పవలయును.

స్థితి ఈవిధముగా ఉండగా, ఆకాశమునకు సైతము కారణము అహంతత్త్వము. ఆ అహంతత్త్వమునకు గూడా కారణము మహత్తత్త్వము, ఆ మహత్తత్త్వమునకు కారణము అవ్యక్తతత్త్వము ఆ అవ్యక్తతత్త్వమునకు గూడ కారణము, లేక అధిష్ఠానము సత్తత్త్వము అన్నిటికంటె అంతరంగమైనది. అపుడు సర్వాంతరంగభూతుడు, సర్వాంతరాత్మ, స్వప్రకాశము, సర్వావభాసకము నయిన ఆ సత్తత్త్వముచేత వ్యవహితము, అదృష్టము నయిన వస్తువు ఏమి ఉండజాలును ? విశ్వమునందు సత్తచేత, స్ఫూర్తిచేత అనాలింగితమైన ఏ అణువుగూడా, ఏ పరమాణువుగూడా ఉండదు అపుడు వ్రజాంగన లేక ఒకానొక సాధ్వియైన స్త్రీ అథవా ఒకానొక చిదానందమయ జీవశక్తి, అధికముగా చెప్పనేల, ఏ తత్త్వమైనను స్వప్రకాశస్వరూపుడు, సదానందఘనుడు నయిన శ్రీకృష్ణుని చేత అనాలింగితము, అసంయుక్తము ఎట్లు కాజాలును ?

ఎవరైనను జలము, తేజస్సు, వాయువు, ఆకాశముచేత గూడా తమను తాము అస్పృష్టముగా ఉంచుకొనజాలనపుడు, అతడు ఆకాశ వాయ్వాదులన్నింటికి పరమ కారణముచేత, అధిష్ఠానము చేత లేక ప్రకాశకముచేత తనను ఎట్లు అసంస్పృష్టముగా ఉంచుకొనజాలును ? భోక్తతో భోగ్యముయొక్క తాదాత్మ్యమే భోగము.

"సవితా గోభీ రసం భుంక్తే।"

సూర్యుడు తన కిరణములచేత రసమును (జలమును) అనుభవించును. ఇచటగూడా రశ్ములద్వారా సూర్యునితో రసముయొక్క అభేదాపత్తియే భోగము. భోక్త, భోగ్యమును తనతో తాదాత్మ్యమొనరించుకొనును. అనుకూల, ప్రతికూల విషయములయొక్క తజ్జన్యమైన సుఖ, దుఃఖములయొక్క సాక్షాత్కారమే, భోగమని చెప్పబడును. ఈ సాక్షాత్కారము జడములైన మనో, బుద్ధి, అహంకారాదులచేత అసంభవము. కావున స్వప్రకాశమైన చైతన్యముచేతనే సమస్త విషయసాక్షాత్కారము లేక భోగము సంపన్నమగును. కావుననే, బౌద్ధమైన (బుద్ధి సంబంధమైన) బోధకంటె భిన్నమైన ఒక పౌరుషేయ బోధను (జ్ఞానమును) అంగీకరింపవలసిన అపేక్ష కలుగును. జపాకుసుమాదులద్వారా లోహిత స్ఫటికమునందు ప్రతిబింబించిన పురుషునియందుగూడా ఆ లౌహిత్యము (ఎఱ్ఱదనము)యొక్క భానమే కలుగును. ఆ విధముగానే శ్రోత్రాది ఇంద్రియములచేత ప్రత్యుపస్థాపితములైన శబ్ద, స్పర్శాది విషయాకారాకారిత వృత్తిమదంతఃకరణముయొక్క ఆరోపిత సంబంధముచేత చిదాత్మయందు గూడా, విషయాకారత్వము ఏర్పడును. జపాకుసుమముయొక్క ఉపాధిచేత స్ఫటికము లోహితాకారమును పొందినట్లు చిదాత్మయందు విషయాకారత్వము కలుగును. లోహిత స్ఫటికము తనయందు ప్రతిబింబించిన పురుషునియందు గూడా లౌహిత్యాకారమును (ఎఱ్ఱని ఆకారమును) సమర్పించినట్లుగానే, ఇంద్రియములద్వారా విషయాకారాకారితమైన వృత్తిమదంతఃకరణము గూడా, స్వప్రతిబింబిత చైతన్యమునందు తన విషయాకారత్వమును సమర్పించును.

ఈవిధముగా, అసంగుడైన పురుషునియందు పరంపరయా విషయసంబంధము, ప్రకాశకత్వము, లేక భోక్తృత్వము ఏర్పడును. సర్వవిషయములయొక్క ముఖ్య భోక్తృత్వము చిదాత్మయందే పొసగును. అట్లుగాక, సమస్త కాంతాస్పర్శాది సుఖముయొక్క ముఖ్యభోక్త కూడా అంతరాత్మయైన శ్రీకృష్ణుడే అయిఉన్నాడు. ఇంద్రియములు, మనోబుద్ధ్యాదులు భోగసాధనములు. సమిష్టి మనస్సుయొక్క అభిమానియైన చంద్రుడు సమస్తభోగములకు సాధనభూతుడు. ఇంతఅయినను సర్వదర్శనమునందు, సర్వస్పర్శయందు సాధకుడై కూడా, ఆ చంద్రుడు వ్యష్టి అభిమానశూన్యుడగుట వలన, అప్రత్యవాయియై (ప్రాపరహితుడై) ఉన్నాడు. ఆరీతిగానే సమష్టి అంతరాత్మ, భగవంతుడునయిన శ్రీకృష్ణుడు సర్వభోక్తయైనను అప్రత్యవాయియే అయిఉన్నాడు. సమస్త మనస్సులకు అభిమానియగు దేవతయగుటచేత చంద్రుని స్పర్శవలన ఏ సాధ్వియొక్క పాతివ్రత్యమైనను భ్రంశముకాదు. ఆరీతిగానే సర్వాంతరాత్మయైన శ్రీకృష్ణుని సంస్పర్శ; ఎవరి పాతివ్రత్యమునకు గూడా వ్యాపాదకము (నాశకము) కాదు.

"గోపీనాం తత్పతీనాం చ సర్వేషామేవ దేహినామ్।
యోఽంతశ్చరతి సోఽధ్యక్షః క్రీడనే నేహ దోషభాక్॥"

గోపికలకు, వారి భర్తలకు, సర్వప్రాణులకు అంతరాత్మయైన ఆ శ్రీకృష్ణుడు సర్వాధ్యక్షుడు, సర్వథా నిర్లేపుడు, నిర్దోషుడే అయి ఉండును.

భోక్తనుండి భోగ్యముయొక్క అత్యంత అవ్యవధానము భోగమని చెప్పబడును. చిదాత్మయైన భోక్తకు విషయములతో ఇంద్రియ మనోబుద్ధులద్వారా అవ్యవధానము ఉండును. భగవంతునియొక్క చిదానందమయ జీవశక్తులకు ఆ భగవంతునితో

స్వాభావికము, ఆత్యంతికము నయిన అవ్యవధానము కలదు. భ్రమరము పుష్పపరాగము యొక్క రసాస్వాదనము చేయును. కాని, ఈ సంబంధము, లేక అవ్యవధానము కృత్రిమము. పుష్పమునందే తన సౌగంధ్య, పరాగ రసాస్వాదన శక్తి ఉన్నపుడే పూర్ణభోగము, రసాస్వాదనము సుసంగతమగును. కాని, ఇచట పరమానంద రసామృతమూర్తి, భగవంతుడు నయిన శ్రీకృష్ణుడే తన మాధుర్యమును (మాధుర్యాధిష్ఠాత్రియైన వృషభానునందినిని) ఆస్వాదించును.

రాధయొక్క అంశభూతలు, లేక చిదానందమయ జీవశక్తుల యొక్క తాదాత్మ్యముతో సమ్మిళన అనుభవాదులు సంపన్నములగును. మహాసాగరమునందు తరంగము లుండురీతిగానే, భగవంతునియందు జీవుల భావము ఉన్నది. కాని, తరంగమునకు సముద్రముతో స్వాభావిక సంబంధము ఉండును (తరంగము ఉన్నంతవఱకు ఆ తరంగముతో సముద్ర సంబంధము కూడా అనివార్యము). అటులనే, భగవంతునితో జీవుని సంబంధము కూడా, అకృత్రిమము, స్వాభావికమే అయిఉన్నది, కావుననే, ఏ స్త్రీకైనను ముఖ్యపతి భగవంతుడే అని భావుకులైన భక్తుల కథనము. ఏ జీవునితో నయినను, ఆ జీవుని సంబంధము స్థిరమైనది కాదు. సమస్త తరంగములు సముద్రమునకు పరతంత్రములైనట్లుగానే, సకల జీవులు భగవంతునకు పరతంత్రులై ఉందురు.

ఈ విధముగా పారతంత్ర్యరూపమైన స్త్రీత్వము సర్వ జీవుల యందును గలదు. జీవభావమునశించి, పరమాత్మభావప్రాప్తి కలిగినపుడే, పూర్ణ స్వాతంత్ర్యము, పుంస్త్వము ప్రాప్తమగును. ఆరీతిగా, ఏ స్త్రీకైనను ఆమె అఖండ, అనంత భగవంతునే, తన పతిగా చేసికొనినపుడే, అఖండ సౌభాగ్యము, పాతివ్రత్యము

ఉండును. కర్మానుసారముగా జీవుల సంబంధ విచ్ఛేదము కలిగి తీరును. కావున, అఖండ సంబంధము లేకపోవుటవలన, సౌభాగ్యము పాతివ్రత్యము అఖండముగా ఉండజాలదు. కావుననే, అనంత, అఖండ, నిత్య, సహజ సంబంధియైన భగవంతుడే, సర్వులకు ముఖ్య పతి, ఆయనతోటి సంబంధమును కలిగిఉండుటయే ముఖ్యము. ఇతర పతి (లోకమున పరిణయము చేసికొనిన పతి) ఆ ముఖ్యపతియొక్క ప్రతిమయే. ముఖ్యపరమ పతి ప్రాప్తియందు ప్రతిమకు గౌణత్వము ఉండుట స్వాభావికము. సాలిగ్రామ ప్రతిమాపూజనము ముఖ్య విష్ణుప్రాప్తికి సాధనము. ఆవిధముగానే లౌకిక పతిపూజనము, ముఖ్యపతియైన భగవంతుని ప్రాప్తికి సాధనము. కావుననే, కన్యాదాన సంకల్పము ఈ విధముగా ఉండును.

"విష్ణురూపాయ వరాయ లక్ష్మీరూపా మిమాం కన్యా మహం సంప్రదదే।"

కావుననే, అత్యంత శ్రద్ధతో సాధనమును అవశ్యము ఆదరింపవలయును. అజ్ఞానులదృష్టితో వ్యభిచారిణులు. కాని, పరమ పతివ్రతలైన వ్రజాంగనల ముఖ్య పరమ పతియైన భగవంతునియందు అద్భుతమైన నిష్ఠను జూచియే, అరుంధతీప్రభృతి సతీబృందము ఆ వ్రజాంగనలముందు వినతశిరస్కమగును.

"శ్రద్ధారజ్య దరుంధతీ ముఖ సతీబృందేన వంద్యా హి తాః।"

ఒకానొక సమయమున రాసక్రీడ చేయుచు, చేయుచు, శ్రీకృష్ణుడు లీలావిశేషార్థమై ఒక నికుంజములో దాగికొనెను. అన్వేషించుచు, వ్రజాంగనలు అచట కేగిరి. అపుడు, గుప్తముగా ఉండవలయుసను భావముతోనే శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణరూపమును ధరించెను. కాని, శ్రీమన్నారాయణుని అద్భుత ఐశ్వర్య, సౌందర్య

మాధుర్యపూర్ణమైన రూపముచేత వ్రజాంగనలు ఆకర్షితులు కాలేదు. వారు శ్రద్ధాభక్తులతో ప్రణామము చేసి, ఇట్లు అభ్యర్థన చేయ సాగిరి.... 'హే భగవాన్ ! నీవు మాయందు దయ వహించి, మా మనోమోహనుడు, శ్యామసుందరుడు నయిన వ్రజేంద్రనందనునితో మాకు సంమిలనము కలుగజేయుడు. ఒక జీవుడు ఎంత పాతివ్రత్య ధర్మ సంపన్నుడైనను, ఈశ్వరసంబంధమైన ఐశ్వర్యమాధుర్యము లందు, ఆ జీవునకు ఆకర్షణము కలుగుట స్వాభావికము. కాని, వ్రజాంగనల అద్భుత, అఖండ, అనన్యనిష్ఠ, అరుంధతి మొదలగు సతీమణుల మనస్సునుగూడా నిజముగా ఆ శ్చ ర్య చ కి త ము చేయును.

కానిండు, ఈవిధముగా అవనతలైన వ్రజాంగనలను జూచి పరమ కరుణమూర్తియైన శ్రీకృష్ణభగవానుడు ఆ వ్రతాంగనల శుద్ధభావమువలన ప్రసన్నుడై, వారికి వస్త్రముల నిచ్చివేసెను. వస్త్రములతోబాటు అద్భుతమైన బ్రాహ్మీసంస్పర్శ నొసగెను, లేక తననే అర్పించుకొనెను. అహో ! వారు ఎంత దృ ఢ ము గా ప్రలంభము (వంచనము) చేయబడిరి ! వారు ఎంత లజ్జావిహీనలు చేయబడిరి ! వారు ఎంత ప్రస్తోమనము (ప్రవాదము) చేయబడిరి వారు ఎంత క్రీడనకములుగా (ఆటబొమ్మలుగా) చేయబడిరి ! వారి వస్త్రములు అపహరింపబడినవి ! అయినను, ఆ వ్రజాంగనలు శ్రీకృష్ణునియందు దోషబుద్ధిని చేయలేదు. వారు ప్రియతముడైన మనోమోహనుని సాంగత్యము వలన పరమ ప్రసన్నలైరి. వారు తమ వస్త్రములను ధరించి, ప్రేష్ఠ సంగమమునకై సజ్జితలై శ్రీకృష్ణాకర్షిత మనస్కలయిన కారణముచేత నిశ్చలలు, చిత్రలిఖితలవలె అయిరి.

మొదట వ్రజాంగనలచేత త్యజింపబడిన లజ్జ, శ్రీకృష్ణుని శరణుజొచ్చెను. చివఱకు, శ్రీకృష్ణుని బలము పొంది, మరల ఆ లజ్జ నేత్రమార్గములనుండియే వ్రజాంగనలను జేరెను. ఏ పదార్థమైనను, అహంతా మమతా పూర్వకముగా సేవించుటవలననే, బంధకమగును. భగవంతునకు సమర్పించివేయుట వలన, అపుడు అదియే భగవంతునకు ప్రసాదమై నిర్గుణమగును...

"మత్ప్రసాదా దస్తే నిర్గుణమ్।"

చివఱకు రాగ, తృష్ణా, మోహాది రాజస, తామస భావములు అత్యంత త్యాజ్యములు, నింద్యములైనను, భగవంతుని సంబంధము వలన, వానికి గూడా, సర్వాధికమైన మూల్యము ఉండును.

"తావద్రాగాదయః స్తేనా స్తావత్కారాగృహం గృహమ్।
తావ న్మోహోఽంఘ్రినిగడో యావ త్కృష్ణ న తే జనాః॥"

ప్రాణి, భగవద్భక్తుడు కానంతవఱకే, రాగాదులు స్వరూపసుఖాపహారకు లగుటవలన, చోరులు, గృహము కారాగారము మోహము గొప్ప సంబంధకము. శ్రీకృష్ణునియందు అనురాగము కలవానికి శ్రీకృష్ణునియందే రాగము ఉండును. శ్రీకృష్ణునియందే మోహముండును, ............ భక్తుని గృహముకూడా భగవదాలయమగుటవలన నిర్గుణమే.

విషయవైరాగ్యమే, వైరాగ్యము, వైరాగ్య వైరాగ్యము అభీష్టము కాదు. ఆరీతిగానే, జ్ఞానవైరాగ్యములకు ఫలభూతుడైన భగవంతునిపట్ల వైరాగ్యముగూడా సంగతము కాదు. కావుననే, సనకాదులు, శుకాదులవంటి అమలాత్ములు, పరమహంసలు, మహామునీంద్రులు సహస్రాది జ్ఞానవైరాగ్యములను సమర్పించి, భగ

వంతుని శ్రీచరణములయందు రాగమును, లేక తృష్ణను అభ్యర్థన చేయుదురు.

"కామం భవః స్వవృజినై ర్నిరయేషు నః స్యాత్ చేతోఽలి
వద్యది నుతే పదయో రమేత।
వాచశ్చ న స్తులసివ ద్యది తేఽంఘ్రిశోభాః పూర్యేతతే
గుణగణై ర్యది కర్ణరంధ్రః॥"

శ్రీసనకాదులు ఇట్లు ప్రార్థింతురు.... "హే నాథ! నీ శ్రీచరణములయందు భ్రమరములవలె మనస్సు ఆసక్తమగుచో, నీ గుణగణములతో శ్రవణకుహరములు నిరంతరము పూరితములగుచో, మా కర్మానుసారము నరకములలో జన్మించినను, ఏమియును చింత లేదు. "కావున, భగవత్సంబంధమువలన తృష్ణా, రాగములకు గూడా, అద్భుతమైన మహత్త్వము కలుగును. భగవంతునియందు మోహము, భగవంతునియందు రాగము, తత్సంగమ తృష్ణ, ఎవరో ఒక పరమ సౌభాగ్యశాలికి మాత్రమే లభించును. ఒకానొక భావుక భక్తుడు ఇట్లనెను ....

"కృష్ణభావ రసభావితా మతిః క్రీయతాం యది కుతోఽపి
లభ్యతే।
తత్ర మూల్యమపి లౌల్య మేకలం జన్మకోటిసుకృతై ర్న
లభ్యతే॥",

శ్రీకృష్ణప్రేమరస భక్తిభావితమతి దుర్లభము. అది లభించగలిగినచో, దానిని క్రయ మొనర్చుటయే, జీవన సాఫల్యము. కాని, దాని మూల్యముగూడా, కేవల లౌల్యము (వ్యాకులత). అదియు, కోట్లాది జన్మల సంకల్పమువలన ఒకానొక సౌభాగశాలికి మాత్రమే లభించును. భగవత్ప్రాప్తియందు, ప్రాణికి అవిద్యా,

లజ్జా, అహంకారాదులే వ్యవధానములు. తనను భగవంతునికంటె భిన్నునిగా భావించి, ఆ భగవంతునినుండి తనను గుప్తముగా ఉంచుకొనుటకు, ఆవృతము చేసికొని ఉంచుకొనుటకు ప్రయత్నము చేయబడును. స్వస్వరూపమైన అవిద్య, అపనీతము చేయబడినపుడు, వ్రజాంగనలు అహంకారమునుండి, లజ్జనుండి తమను గుప్తము చేసికొనదలంచుచుండిరి, కాని, సర్వవ్యాపకుడు, సర్వప్రకాశకుడు, సర్వసాక్షి, సర్వాంతరాత్మయును అయిన భగవానుడు దీనిని గూడా అనుచితమని భావించెను. సర్వథా నిరావరణలు, నిశ్చలలుకండు అని పట్టుపట్టెను. భగవంతుని సంకల్పము వలన వ్రజాంగనలు ఆవిధముగానే ఒనర్చిరి.

అత్యంత నిరావరణలై శుద్ధభావముతో రెండు చేతులతో మూర్ధాంజలిబంధన పురఃసరముగా ప్రణామము చేసిరి. భగవంతుడు వారి శుద్ధ భావముచేత ప్రసన్నుడై అనుగ్రహించి. లజ్జాది సమస్తావరణములను తిరిగి ఒసగెను. కాని, అవి ఇపుడు భగవత్ప్రసాదములైనవి.

జీవుని మోహినీ అవిద్యకూడా, భగవత్ప్రసాదమై వైష్ణవీ మాయ అగును. భగవల్లీలయందు ఉపయోగకరమైన భేదమును సమర్థించున దగుటవలన, భగవంతుడు భక్తులయందు వైష్ణవీ మాయను సంచరింపజేయును. నందరాణియైన యశోద తన గారాబు బిడ్డయైన శ్రీకృష్ణుని ముఖమునందు సమస్త విశ్వమును జూచి, "అరే! ఇతడు పూర్ణ పరబ్రహ్మ, పరమాత్మ; నేను మోహవశనై ఇతడిని పుత్రుడని భావించుచున్నాను" అని ఆమెకు జ్ఞానోదయమయ్యెను. అంతియే, అప్పుడే భగవంతుడు ఈ ఐశ్వర్య (ఈశ్వరత్వ) జ్ఞానము లీలా విశేషమునకు బాధకమగునని చూచెను.

వాత్సల్యభావ మాధుర్యము విలక్షణమైనది. ఐశ్వర్యజ్ఞానము ఉండుటవలన, ప్రతి ప్రవృత్తియందును భయ సంకోచములు ఉండును. నిస్సంకోచము, నిర్భరము, మమతాపురఃసరము నయిన వాత్సల్యరసమునందు ఐశ్వర్యము (ఈశ్వరభావము) బాధకమే అగును. కావుననే,

"వ్యతనో ద్వైష్ణవీం మాయాం పుత్రస్నేహమయీం విభుః।"

భగవంతుడు పుత్రస్నేహమయమైన మాయను, శుద్ధ వాత్సల్య రసము అభివృద్ధమగునట్లుగా వ్యాపింపజేసెను.

మొదట భగవంతుడు భజించువారికి భక్తి నొసగును, ముక్తి నొసగడు. ఏలయన, ముక్తియందు భక్తుడు భగవత్స్వరూపు డగును. కాని, భక్తియందైనచో, భక్తుడు భగవంతుని తన వశము చేసికొనును. భక్తిమహిమ వలననే భగవంతుడు యశోదాదేవి హస్తమునందలి వేత్రము (బెత్తము) వలన, ఉలూఖల (రోలు) బంధనము వలన భయభీతుడై రోదించును. "అమ్మా! నేను మృద్భక్షణము చేయలేదు" అని అసత్యముగూడా పలుకును.

"అస్త్వేవ మంగ భగవాన్ భజతాం ముకుందో
ముక్తిం దదాతి కర్హిచిత్ స్మ న భక్తియోగమ్।"

అయినను, భగవంతుడు భక్తి ఒసగినపుడు, తిరిగి తన లీలకు ఆటంకము కలుగనీయ దలంచడు. ఐశ్వర్యబోధ కలిగినపుడు వైష్ణవమాయచేత మరల, దానిని (ఐశ్వర్యమును) గుప్తమొనర్చి లీలాసుఖమును ఆస్వాదించును, ఆస్వాదింపజేయును.

"గోప్యాదదే త్వయి కృతాగసి దామ తావద్
యా తే దశాశ్రుకలిలాంజన సంభ్రమాక్షమ్"

వక్త్రం నినీయ భయభావనయా స్థితస్య సా మాం
విమోహయతి భీరపి యద్బిభేతి॥''

మాధుర్యాధిష్ఠాత్రియైన మహాశక్తియొక్క మహిమ ఇదియే! ఆవిడ ఉన్నచోటున, ఐశ్వర్యము (ఈశ్వరత్వము) గుప్తమగును. స్వతంత్రుడైన భగవంతుడు సయితము భక్తపరతంత్రుడగును. పరమ నిర్భయకాలమునకు (మృత్యువునకు)గూడా కాలరూపుడైన భగవంతుడు గూడా భయభీతుడగును. అనంత జీవులకు మోక్ష ప్రదాత యగు భగవంతుడు గూడా, ప్రణయపాశబద్ధుడగును. ఇచట, పూజనీయత, సమాధి అనాదరణీయమగును, సేతుధారకుడే, ఇచట భగ్న సేతువగును.

వస్తుతః, ప్రకృతి, ప్రాకృత ప్రపంచసంబంధమైన విధినిషేధ ప్రపంచమునకు అతీతుడు, రసమయుడు నయిన భగవంతుని యందు ఉండకపోవుట సహజమే. అయినను, ఎవరు స్వాభావిక మైన కామ, కర్మ, జ్ఞానరూపమైన మృత్యువును తరింపవలయునో వారికి భగవంతుని మర్యాదామయ, సేతుధారక స్వరూపమే అపేక్షితమగును. భగవదవతారభూతులైన నరనారాయణుల చరిత్రము, ఋషభదేవుని చరిత్రము బ్రహ్మచారులకు, గృహస్థులకు అనుకరణీయమైన రీతిగానే, సంసారసాగరమును దాటదలచినవానికి శ్రీకృష్ణచరితము గూడా అనుకరణీయము. ఈ శ్రీ కృష్ణ చరితము కేవల చింతనముచేతనే పాపనాశకము.

కావుననే, భావుకులైన భక్తులు తత్త్వబోధానంతరము గూడా భక్తికొఱకు ద్వైతప్రతీతిని అంగీకరింతురు. కావున, పూర్ణనిరావరణ మైన, రసమయమైన ఆవరణము భగవంతునికి, భక్తునికి ఇరువురకును అభీష్టమగును.

"ద్వైతమోహాయ బోధాత్ ప్రాక్ జాతే బోధే మనీషయా।
భక్త్యర్థం కల్పితం ద్వైత మద్వైతాదపి సుందరమ్॥"

నిరావరణరూపముతో ప్రత్యక్ చైతన్యాభిన్నమైన పరబ్రహ్మ సాక్షాత్కారమునకు పూర్వము ద్వైతము కేవలము మోహముకొఱకే అయిఉన్నది. కాని, భక్తికొఱకు భావితమైన ద్వైతము అద్వైతము కంటె గూడా సుందరమైనది.

"పారమార్థిక మద్వైతం ద్వైతం భజనహేతవే।
తాదృశీ యది భక్తిః స్యాత్ సా తు ముక్తిశతాధికా॥"

అద్వైతము పారమార్థికము, భజన (సేవ)కొఱకు ద్వైతము. ఈ విధమైన భక్తి, ముక్తిశతముకంటె శ్రేష్ఠమైనది.

ఈ విధముగా ప్రేమతత్త్వజ్ఞుడు (భక్తితత్త్వవేత్త) భగవంతునితో ఆత్మాభేదమును తెలిసియు ఆహార్యభేదభావముతో భగవంతుని సేవించును.

"ప్రియతమహృదయే వా ఖేలతు ప్రేమరీత్యా
పదయుగ పరిచర్యాం ప్రేయసీ వా విధత్తామ్।
విహరతు విదితార్థో నిర్వికల్పే సమాధౌ
నను భజనవిధౌ వా తుల్యమేతద్ద్వయం స్యాత్॥"

ప్రేయసి, ప్రేమావేశమునందు తన ప్రియతముని వక్షఃస్థలము పైన క్రీడించుగాక, జాగ్రతగా ప్రియతముని పాదసరోజముల సపర్య (సేవ) చేయుగాక, ఆమెకు అన్నియు సుసంగతములే. ఆ రీతిగానే తత్త్వనిష్ఠుడైన జ్ఞాని, అభేదభావముతో సమాధినిష్ఠుడై ఉండినను, లేక భేదభావముతో భగవత్సేవయందు నిమగ్నుడై ఉన్నను, వానికి రెండును శోభాదాయకములే. అయినను, రసికులు ఇట్లు చెప్పెదురు...

"ఐశ్వేశ్వరోఽపి సుధియా గలితేఽపి భేదే భావేన భక్తి
సహితేన సమర్చనీయః।

ప్రాణేశ్వర శ్చతురయా మిలితేఽపి చిత్తే చేలాంచల
వ్యవహితేన నిరీక్షణీయః॥"

భగవంతునితో భక్తుని భేదభావము నశించినపుడుగూడా, సుధీజనులు భేదభావముతోనే వ్యవహారకాలమున భగవంతుని సపర్య చేయవల యును. తన ప్రియతముడైన ప్రాణేశ్వరునితో ఏ విధమైన దాప రికము (గోప్యభావము) లేక, భేదభావము లేకపోయినను, ప్రియు రాలు తన మేలిముసుగు చాటునుండియే క్రీగంటి చూపులతో తన ప్రియతముని చూచును. ఎంత సుందరమైన భావము! జానకీదేవి గ్రామీణస్త్రీలు ప్రశ్నించినపుడు, తన మరిదియైన లక్ష్మణునిగురించి వర్ణించి. తన ప్రాణేశ్వరుని ఎంత మధుర మనోహర సుందర పద్ధతితో సూచించును. ఇది కవిశబ్దములచేతనే వర్ణనీయముగాని, మరొక రీతిగా వర్ణింపనలవికాదు.

ఆవరణము, లజ్జ, అహంకారము సమస్తమును గ్రహించి వానిని తనతో సంబంధితమొనర్చి, శ్రీకృష్ణుడు మరల వ్రజాంగ నలకు ఒసగెను. భగవత్సంబంధము గల ఆవరణము, లజ్జా, అహం కారములు అతిసరసములై ఉండును. ఇది నిరహంకారాదులఫలమై ఉండును. భగవద్దత్తమైన, భగవత్సంబంధమైన మోహము, భగ వంతుడొసగిన సర్వపదార్థములు సరసములు, మంగళమయములు. ఆవరణము, లజ్జ, అహంకారములేని శృంగార రసమాధుర్యమే నశించును. ఈ శృంగారరసమునందు నాయిక ఎంత ఎక్కువగా ఆవరణ, లజ్జా, అహంకార సహితమై ఉండునో, అంత అధికముగా దానియందు దుర్లభత్వము వ్యక్తమగును. అంత ఎక్కువగానే అత్యంతాధిక రసాభివ్యక్తి కలుగును. నాయికయొక్క శోభ, లజ్జ,

అభిమానము, ఆవరణములయందు కలదు. ఇట్టి స్థితిలో శ్రీకృష్ణుని ప్రేయసులైన వ్రజాంగనలయందు ఇవిఅన్నియు ఆ వ శ్య ము ఉండవలయును.

శ్రీ వృషభానునందిని భావోద్గారములు వినుడు....

"దురాపజనవర్తినీ రతిరపత్రపా భూయసీ।
వపుః పరవశం జనుః పరమిదం కులీనాన్వయే॥

గురూక్తివిషవర్షణైర్మతి రతీవ దౌఃస్థ్యం గతా।
న జీవతి తథాఽపి కిం పరమ దుర్భరోఽయం జనః॥"

ఆహా! దురాపమైన (దుర్లభమైన) జనమునందు రతి (ప్రేమ) లజ్జయొక్క ప్రాబల్యము, పరవశమైన శరీరము, కులీనవంశము నందు జన్మ, అంతియేకాదు గురుజనుల విషయములైన వచనముల వలన బుద్ధి ఎక్కువగా వికలముగుచుండును. అహా! అయినను ఈ పరమ దుర్భర ప్రాణి జీవించుట లేదా? కాని, ఈ భావము లన్నియు శ్రీకృష్ణరతి వర్ధకములు. అభిమానినులైన నాయికల దర్పము, మానముగూడా రసమే. వృషభానుకిశోరియొక్క అభి మానలీల ప్రసిద్ధమే. ఈ విధముగా మొదట భగవత్సమ్మిలనము నందు ఏవి ప్రతిబంధకములు, వ్యవధానములై ఉండునో, అవియే ఇపుడు రసస్వరూపకములు, రసవర్ధకములును అయినవి. నిఖిల రసామృతమూర్తియైన శ్రీకృష్ణుని హస్తాదిఅవయవములచే చక్కగా స్పృశింపబడిన వస్త్రములు రసాత్మకములయ్యెను. ఆ వస్త్రములను ధరించుటవలన, వ్రజాంగనలకు శ్రీకృష్ణావయవసంస్పర్శజన్య మైన సుఖము లభించెను. ఆ వ్రజాంగనల ప్రతి అ వ య వ ము నందును రోమరోమమునందును, ఇంద్రియములయందును,

ప్రాణములయందును, అంతఃకరణమునందును, అంతరాత్మ యందును సర్వత్ర శ్రీకృష్ణరస సంచారము జరిగెను. వ్రజ బాలికలు రసపూర్ణలయిరి.

అప్రాకృత రసస్వరూపుడైన శ్రీకృష్ణుని సౌందర్య, మాధుర్య సౌరస్య, సౌగంధ్యాది గుణములు ప్రాకృతములైన అవయవములతోను, ఇంద్రియములతోను, అంతఃకరణములతోను అనుభవింపబడజాలవు. అప్రాకృత రసస్వరూపుడైన శ్రీకృష్ణుని అనుభూతి పొందుటకు రసాత్మకములైన శరీరేంద్రియాదులు అపేక్షితములగును. ఇంతియేకాక, రసాత్మకుడైన శ్రీకృష్ణుని రమణము కూడా రసాత్మకుడైన జీవునియందే సంభవమగును. శ్రీకృష్ణుడు ఆత్మరతుడు. కావున, వ్రజాంగనలు రసాత్మక శ్రీకృష్ణమయులు కానంతవరకును, ఆ వ్రజాంగనలు శ్రీకృష్ణుని రమణమునకు యోగ్యత కలవారు కాజాలరు. శ్రీకృష్ణావయవముల చేత సంస్పృష్టములైన వస్త్రముల సంసర్గమువలన వ్రజాంగనలకు ప్రాకృత భావనివృత్తి, శ్రీకృష్ణభావప్రాప్తి కలిగెను. అభివ్యక్త మైన అగ్ని సంబంధముచేత అభివ్యక్తముకాని అగ్ని గల కాష్ఠము నందు గూడా అగ్ని అభివ్యక్తమగును. అగ్ని సర్వత్ర వ్యాపకమై ఉన్నది. కేవలము అభివ్యక్తమగుటయే విశేషమై ఉండును. ఆ విధముగానే....

"రసో వై సః", "సర్వం ఖల్విదం బ్రహ్మ"

ఇత్యాది వచనములననుసరించి, రసాత్మకమైన బ్రహ్మస్వరూపమే సమస్తమని ప్రసిద్ధము. కేవలము అనాది, అనిర్వాచ్య, అవిద్యామయ నామరూపముల ద్వారా ఆ బ్రహ్మతత్త్వము — ఆ రస స్వరూపము – ఆవృతమై ఉండును. నిరావరణ, రసాత్మక బ్రహ్మ మైన శ్రీకృష్ణుని సంబంధముచేత సమస్తపదార్థములు నిరావరణ

ములు, రసాత్మకములు, శ్రీకృష్ణమయములు అగును. అంతియే, ఈవిధముగా. శ్రీకృష్ణస్పర్శవలన, వ్రజాంగనల వస్త్రములు నిరావరణ స్వరూపములయ్యెను. అపుడు వానిని ధరించుటవలన వ్రజాంగనలయందు గూడా రసాత్మకత్వము వచ్చెను.

లోకమునందు గూడా, ప్రియసంస్పృష్టమైన పుష్పమాల, వస్త్రము మున్నగువానిని ప్రేమికుడు, అత్యంతానురాగముతో హృదయమునకు, నేత్రములకు హత్తుకొనును. శ్రీకృష్ణసంస్పృష్టమైన వస్త్రములను ధరించి, వ్రజాంగనలు రసాక్రాంతలైరి. శ్రీకృష్ణ-బలమును పొంది, లజ్జ, నేత్రములద్వారా వారియందు మరల ప్రవేశించెను. శ్రీకృష్ణుడు వస్త్రములతోపాటు తననుగూడా ఒసగెను. కాని, వారి మనస్సును అపహరించెను. కావున, ప్రేష్ఠసంగముకొఱకు అత్యంత లాలసాయుక్తులై వారు వ్రజమునకు వెళ్లజాలకపోయిరి. పరమానంద రసాత్మకుడైన శ్రీకృష్ణుని సమ్మిశన, సంస్పర్శ, సంభోగ, తాదాత్మ్యప్రాప్తికొఱకు లాలసారహితులైనవారి జీవనము నిజముగా వ్యర్థము. ఆ విషయము నటుండనిండు, శ్రీకృష్ణుడు ఆ వ్రజాంగనల సంకల్పమును తెలిసికొనెను అనగా, తన పాదస్పర్శాభిలాష చేతనే, ఈవ్రజబాలికలు వ్రతము నాచరించిరని తెలిసికొనెను. అపుడు, శ్రీకృష్ణుడు భక్తపరతంత్రుడై గోపాంగనయొక్క ప్రేమరజ్జువుచేత బంధితుడై దామోదరుడయ్యెను. ప్రేమపాశగృహీతుడై శ్రీకృష్ణుడు ఇట్లు పలికెను... ఓ సాధ్వులారా ! మీయందలి సంకల్పమును నేను తెలిసికొంటిని, నేను మీ సంకల్పమును ఆమోదించితిని, మీ సంకల్పము సఫలమగుటకు యోగ్యమైనది. నాయందు ఎవరి మనస్సు, బుద్ధి నివిష్టములై ఉండునో, వారి కామనలు (కోరికలు), కామనలు కాక, కేవల రసరూపములే అగును. భర్జితమైన (వేయించిన) క్వథితమైన (          ) ధాన్యమునుండి అంకురము ఉత్పన్నము కాదు.

ఆరీతిగానే, మద్విషయకమైన (నేను విషయముగా గల) కామము సంసారహేతువు కాదు. కాని, భర్జిత, లేక క్వథిత బీజము విశిష్ట స్వాదయుక్తమై ఉండుటవలన, ఆస్వాదనీయమగు రీతిగానే, మద్విషయకమైన కామము రసాత్మకమగుట వలన, రసికులకు అస్వాదనీయమై ఉండును. ఇపుడు, మీరు వ్రజమునకు వెళ్లుడు. ఏ ఉద్దేశముతో మీరు ఆర్యను (కాత్యాయనీ దేవిని) అర్చించితిరో ఆ అర్చనము ఈ రాత్రులయందు సఫలమగును".

''మయేమా రంస్యథ క్షపాః।''

ఆ క్షణమే వ్రజాంగనల మనోరథపూర్తి చేయవలయుననీ చెప్ప బడుచున్నను, గంభీరముగా ఆలోచించినచో, పూర్వకథనానుసార ముగా ఆత్మరతుడైన భగవంతుని రమణము ఆత్మయందే సిద్ధిం చును. కావున, వ్రజాంగనలయందు పూర్ణరసాత్మకత కలుగనంత వఱకు వారియందు భగవద్రమణము అసంభవము.

ప్రాణి భగవదర్చన స్మరణములను ఆరంభించిన సమయము నుండియే, ప్రాణియందలి ప్రాకృతభావము నాశమొంద నారం భించును. భగవత్స్వరూపభూతమైన రసాత్మకత కలుగును. వ్రజ కుమారికలు యుగయుగములనుండి శ్రీకృష్ణప్రాప్తికై జప, తపో ధ్యానములు చేయుచుండిరి. అధికాంశములయందు వారి ప్రాకృ తత్వము వినష్టమయ్యెను. అప్రాకృతమైన రసరూపత్వము కూడా వారియందు అనేకాంశములలో కలిగెను. అది, ఇంకను అపరిపూర్ణము గానే ఉండెను. భగవత్సంమిళనమునకు సంబంధించిన ఉత్కట ఉత్కంఠ, ధ్యానమయసంమిళనము, పరిరంభణాదిజన్యమైన రసా స్వాదనము వలన రసమయములైన దేహేంద్రియ, మనోబుద్ధులు పరిపుష్టములగును. వియోగజన్యమైన దుఃఖముయొక్క తీవ్ర తాపమువలన దేహేంద్రియ, మనోబుద్ధ్యాదులకు తాపము కలుగును

కాని, ఉత్కంఠ, వియోగముగూడా ఏ వస్తువును కలియుట యసంభవమో, ఆ వస్తువునందు జనించదు.

అతి సులభమైన పదార్థమునందు గూడా ఉత్కంఠ జనింపదు. దుర్లభమైన వస్తువునందు సైతము అసంభవమనెడి బుద్ధితో ప్రేమ తక్కువగా ఉండును. ఎవరికి సామ్రాజ్యాదులు లభించుట అసంభవముగా ప్రతీతమగునో, వారికి సామ్రాజ్యాదులపట్ల ఉత్కంఠ, లేక ప్రయత్నము ఏమియును ఉండదు.

ఒక దీనురాలైన బిచ్చగత్తెకు చక్రవర్తిని కలియుట అసంభవము. కావున, ఆమెకు తదుత్కంఠ ఉండదు. జీవుడు గూడా తనను కర్త, భోక్త, సుఖి, దుఃఖి, మహాపాపి అని తలచి, భగవంతుని అనంత బ్రహ్మాండ నాయకుడని భావించియు, ఆ భగవంతునితో సాయుజ్యము అసంభవమని భావించినచో, వానికి తత్సాయుజ్యోత్కంఠయు ఉండదు, తన్నిమిత్తమై ఉత్కట ప్రయత్నము గూడా ఉండదు. కావుననే, ఆ జీవుడు భగవత్సాయుజ్యవంచితుడై ఉండును.

భగవత్సంమిలనోత్కంఠయే భక్తి. భక్తికలిగినంతనే భగవంతునితో సాంగత్యము కనుగును. కావుననే,

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం
పరిషస్వజాతే।"

అనుచు, శ్రుతిమాత, భగవంతుని చిదానంద రసమయులైన జీవశక్తులకు భగవంత్సంమిలన సౌలభ్యమును ప్రదర్శించుచున్నది. 'మీ ఇరువురును సుపర్ణులు, మీరిరువురకును సహజమైన సౌఖ్యము కలదు, మీరిరువురును నిత్యసంబంధితులు, ఒక స్థానమునందు ఉందురు. నీవు భగవంతునకు సంబంధించినవాడవు. భగవంతుడు

నీకు సంబంధించినవాడు. భగవంతుడు త్వత్సంమిలనమునకై ప్రతీక్షించుచున్నాడు. నీవు శ్రద్ధాభక్తులతో ఒక్కమారు భగవంతుని మంగళమయమైన నామోచ్చారణము చేయుము. సమస్త పాప తాపములనుండి ముక్తుడవై భగవత్ప్రాప్తికి యోగ్యుడ వగుదువు.

ఈవిధముగా, చిదానందమయ జీవశక్తులకు ప్రభుసాంగత్య సంభావన, ఉత్కంఠ, ఉత్సుకత ఉండును. ఎపుడైనను సులభ మని భావించి, అజాగ్రత జరుగసాగినపుడు "దూరాత్సుదూరే" అని, ఆ ప్రభుసాంగత్యము దుర్లభమనియు చెప్పబడును. జప, తప, దేవతారాధనాదుల ద్వారా జీవశక్తికి శుద్ధ జిజ్ఞాస, ప్రేప్స (పొందవలయునని కోరిక) కలుగును. వ్రజాంగనలకు గూడా కాత్యాయనీదేవియొక్క సమర్చనముద్వారా వరముపొంది భగవత్సమ్మిలనముయొక్క సంభావన, ఉత్కటమైన ఉత్కంఠ కలిగెను కాని, ఇంకను ఉత్సుకత, ఉత్కంఠయొక్క అపేక్ష కలదు. కావుననే, భగవంతుడు ఇంకను కొంత అవధిని నిర్దేశించుచున్నాడు అత్యంత బుభుక్షువు (భోజనము చేయవలయునను కోరికగలవాని) ఎదుట ఎపుడు మధురము, మనోహరమునయిన పక్వాన్నము ఉపస్థితమై ఉండునో, తల్లాభముయొక్క సంభావన ఉండునో, అపుడు ఉత్సుకతకు మేరయే ఉండదు.

వ్రజాంగనలకు శ్రీకృష్ణుని అవయవములచేత సంస్పృష్టమైన వస్త్రములద్వారా శ్రీకృష్ణాంగస్పర్శయొక్క రసాస్వాదము కలుగుటవలన, అత్యధికమైన ఆకర్షణము కలిగెను. ఏ రసమైనను అనుభవించనంతవఱకు, దాని ఆకర్షణము ఉండదు. బ్రహ్మరసమునకు సంబంధించియు ఇదియే స్థితి. నారదునకు గూడా, ఒక్కక్షణ కాలము భగవత్స్వరూప మాధుర్యానుభవము కలిగినపుడు ఆయనకు విచిత్రమైన లాలస, వ్యాకులత కలిగెను.

"ధ్యాయత శ్చరణాంభోజం భావనిర్జిత చేతసః।
ఆనందాశ్రుకలాక్షస్య హృద్యాస్సీ న్మే శనై ర్హరిః॥"

అపుడు అనేకవిధములుగా ప్రార్థించినను భగవంతుడు నిమ్నోదాహృతవచనమునే చెప్పెను.

"సకృద్యద్దర్శితం రూప మేతత్ కామయ తేఽనఘ।"

ఒకమారు నీకు స్వరూపమాధుర్యానుభవమును నీ ఈ ఉత్కటమైన కామన కొఱకే కలిగించితిని. ఉత్కటమైన కామనచేతనే ప్రాణి యొక్క సమస్త పాపతాపములు నశించును. కావుననే, భావుకులైన భక్తులు ఇట్లనిరి...

"న వై జనో జాతు కథంచన వ్రజే న్ముకుంద సేవ్యం
భవదంగసంసృతిమ్।
స్మరన్ ముకున్దాం ఘ్ర్యుపగూహనం పునర్విహాతు మిచ్ఛేత్
న రసగ్రహో యతః॥"

ముకున్దసేవకుడు ఇతరులవలె ఎన్నడును సంసారమున బడడు. అతడు ముకుందుని శ్రీచరణముల ఉపగూహనము (ఆలింగనము) చేయుచును, తత్సంస్పర్శ సౌగంధ్యామృత రసమును ఆస్వాదించుచు, ఆ చరణపంకజమును ఎన్నడును వీడదలచడు. వ్రజాంగనలకు శ్రీకృష్ణుని శరీరదర్శనము, అమృతమయమైన ముఖచంద్రికాదర్శనము కలిగెను. ఆ శ్రీకృష్ణుని వ చ నా మృ త ము యొక్క హాసపరిహాసముల యొక్క ఆస్వాదనము కలిగెను. వస్త్రములద్వారా పరంపరయా శ్రీకృష్ణాంగసంస్పర్శ కూడా లభించెను. కావున, సర్వాత్మనా శ్రీకృష్ణునివైపునకు వారికి ఆకర్షణము కలిగెను. వరప్రాప్తివలన శ్రీకృష్ణునిసంస్పర్శ క లు గ ట యు సంభవించెను.

ఇపుడు వారి ఉత్సుకత, ఉత్కంఠ వారికి ప్రతి క్షణము యుగమువలె, కల్పమువలె అనిపించసాగెను. ఇపుడు, ఒక్కొక్క క్షణముయొక్క విలంబము వారికి అసహనీయమయ్యెను. ఒక్కొక్క క్షణకాల వియోగజన్యమైన తీవ్రతాపము వలన వారి అవిద్య, కామము, కర్మ, హృదయగ్రంధి అధికముగా చెప్పనేల, గుణమయములైన అన్నమయాది పంచకోశములు తాపమొందసాగెను. క్షణిక సంయోగకల్పనాజన్యమైన లోకోత్తరసుఖముచేత రసమయస్వరూపము పరిపుష్టముకాసాగెను. ఈ కార్యము పూర్తియైనపుడు రాస క్రీడ కొఱకు వేణుగీతపీయూషముచేత వారిని ఆకర్షించి, వారితో విలాసాదిరమణము జరిగెను. కొంతమంది వ్రజాంగనలకు ప్రాకృత పంచకోశములయొక్క రసాత్మక స్వరూపముయొక్క దాహము అప్పటివఱకును కలుగలేదు. శ్రీకృష్ణుని వేణునాదము విని వారు శ్రీబృందారణ్యధామమువైపునకు బయలుదేరినపుడు వారి తండ్రులు, సోదరులు, భర్తలు మున్నగువారు వారిని నిరోధించి గృహములో బంధించిరి. వారు ఏ విధముగా బయటకు రాజాలరయ్యిరి. అపుడు, అచటనే కనులుమూసుకొని శ్రీకృష్ణధ్యానము చేయసాగిరి.

దుస్సహ ప్రేష్ఠ విరహజన్యమైన తీవ్రతాపమునుచూచి సమస్త అశుభకర్మలు కంపించిపోయెను. అచ్యుతుని ధ్యానము వలన ప్రాప్తమైన ఆశ్లేషజన్యమైన ఆనందమును జూచి పుణ్యములన్నియు సంకుచితములై దుర్బలములయ్యెను. అనగా, ఆ పాపపుణ్యములు ఇట్లు ఆలోచించినవి .... పాపములన్నియుకలిసి గూడా, ఈ వ్రజాంగనలకు శ్రీకృష్ణవియోగమునందలి ఒక్కక్షణమునందు కలుగు తాపమువంటి కష్టమును కలిగింపజాలవు. వ్రజాంగనలకు శ్రీకృష్ణుని ధ్యానమువలన ప్రాప్తించిన పరిరంభణముయొక్క

ఒక్క క్షణమున కలుగు ఆనందమును పుణ్యములన్నియు కలిసి కోటికల్పములకు గూడా అట్టి ఆనందమును ఈయజాలవు. తీవ్ర తాపమువలన గుణమయమైన త్రివిధ శరీరమును (స్థూల, సూక్ష్మ, కారణ శరీర త్రయమును) అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశపంచకమును దగ్ధమొనర్చి, ఆ వ్రజాంగనలు ధ్యానప్రాప్త ఆశ్లేషరస దివ్యస్వరూప సంపన్నలై శ్రీకృష్ణుని పొందిరి. కావుననే నిర్గుణమైన భగవద్భక్తి సిద్ధికంటె గూడా శ్రేష్ఠము, సర్వకోశదాహకము అని చెప్పబడినది.

"అనిమిత్తా భాగవతీ భక్తిః సిద్ధే ర్గరీయసీ।
జరయత్యాశు యా కోశం నిగీర్ణ మనలో యథా॥"

నిర్వ్యాజమైన భాగవతభక్తి సిద్ధికంటె గూడా శ్రేష్ఠమైనది. భుజించిన అన్నమును జఠరాగ్ని జీర్ణింపజేయురీతిగానే ఆ అనిమిత్త భక్తి పంచకోశములను దగ్ధము చేయును.

"అత స్తత్తను ర్న తదా సోఽశ్నుతే దివమ్।"

వియోగజన్యమైన ఈ తీవ్రతాపము చేతనే, ఎవరి స్థూల, సూక్ష్మ కారణ శరీరములు మూడును తప్తములు కావో, అతడు అమృతమయుడయిన శ్రీకృష్ణుని రసానుభవమును పొందజాలడు.

కావున, ఉత్కంఠ కొఱకు తాపవృద్ధికొఱకును ఒక సంవత్సర కాలము గడువు ఈయబడెను. దీనివలన శ్రీకృష్ణుడు కాముకుడు కాడనియు స్పష్టమగుచున్నది. కాముకు డెవరైనను దుర్లభ పరమ

సుందర నగ్న కామినులను స్వాధీనలను పొంది క్షణకాలమైనను ధైర్యమువహింపజాలడు, అట్టిస్థితిలో ఒక సంవత్సరకాలావధిని ఆ కాముకుడు ఎట్లు నిర్ధేశింపగలడు ? ఈ పని యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మాత్రమే చేయగలడు. జలక్రీడాపరాయణలైన నగ్న వ్రజసుందరులను స్వాధీనలగాను, పరమానురాగిణులు గాను, ప్రేష్ఠసంగమ సజ్జితలనుగాను ఒనర్చి తాను పరమ నిర్వికారుడుగా ఉండియే స్పర్శకొఱకు ఒక సంవత్సర కాలావధిని నియత మొన ర్చుట యోగేశ్వరుడైన శ్రీకృష్ణునకే తగియున్నది.

దీనివలన కేవలము బ్రాహ్మసంస్పర్శనము అభిలషించునట్టి వ్రజకుమారికలయొక్క కామనామాత్రమును భగవంతుడు పూర్తి చేసెను.

"యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్।"

వారి యోగ్యత పరిపక్వమగుట కొఱకే

"మయేమా రంస్యథక్షపాః"

అని వరదాన మొసగెను.

"ఇమాః క్షపాః" అను పదప్రయోగము వలన ఆ రాత్రులు ప్రత్యక్షములని తెలియుచున్నది. భగవంతుడు అంగుళీనిర్దేశము చేయుచు ఈ రాత్రులయందు మీరు నాతో రమింపుడని చెప్పు చున్నాడు. భవిష్యకాలరాత్రులు ప్రత్యక్షమగుట అసంభవమైనను, రాజుయొక్క దానస్వభావమును తెలిసి అమాత్యుడు దానము చేయదగు వస్తువును ఆ క్షణమునందే ఎదుట ఉంచినట్లుగానే, శ్రీకృష్ణుని దానస్వభావమును తెలిసియే యోగమాయ ఆ రాత్రు

లను అభిమానించు శక్తులను ప్రత్యక్షముగా ఉంచెనని విదితమగుచున్నది. ప్రత్యక్షముగా కన్పట్టు ఆ రాత్రులవైపు వ్రేలుతో నిర్దేశము చేయుచు శ్రీకృష్ణుడు మీరందఱు ఈ రాత్రులయందు నాతో రమణ మొనర్చెదరు అని చెప్పుచున్నాడు.

అనంత, అఖండ, బ్రాహ్మ రసానుభవము పరిచ్ఛిన్నములగు రాత్రులయందు కలుగజాలదు, కావున, నాలుగు జాములుగల ఒకే రాత్రియందు అనంతకోటి దివ్య బ్రాహ్మీ రాత్రులను ప్రవేశబెట్టి ఈ రాసలీల శ్రీకృష్ణరమణసంపన్న మగును. విలక్షణలైన ఆ వ్రజాంగనలకు శ్రీకృష్ణరసప్రదా్రత్రి యగు ఆ రాత్రి పరమ రసమయము, 'రాసపంచాధ్యాయి' ఆరంభమునందే ఈ విషయము స్మరింపబడెను....

"భగవానపి తా రాత్రీః శరదోత్ఫుల్ల మల్లికాః।
వీక్ష్య రన్తుం మనశ్చక్రే యోగమాయా ముపాశ్రితః॥"

శ్రీకృష్ణుడు, ఆయనలీలలు. లీలాసమయము, ధామము అన్నియు భగవత్స్వరూపములే అగును. కావుననే, 'ఇమాః', 'తాః' మొదలగు పదముల వలన, వాని విలక్షణత్వము, తత్ పదార్థత్వము మున్నగునవి తెలియును.

ఈవిధముగా శ్రీకృష్ణునివలన వరము పొంది భగవంతుని ఆజ్ఞానుసారము వ్రజాంగనలు భగవంతుని చరణాంభోజ చింతనము చేయుచు అతికష్టముతో వ్రజమునకు బోయిరి.

"తాఃతథాఽవనతా దృష్ట్వా భగవాన్ దేవకీసుతః।
వాసాంసి తాభ్యః ప్రాయచ్ఛత్ కరుణ స్నేహ తోషితః॥

దృఢం ప్రలబ్ధాః త్రపయా చ హాపితాః ప్రస్తోభితాః
క్రీడనవచ్చ కారితాః।

వస్త్రాణిచైవ అపహృతాన్యథాఽప్య ముం తా నాభ్యసూయన్
ప్రియసంగతినిర్వృతాః॥

పరిధాయ స్వవాసాంసి ప్రేష్ఠసంగమసజ్జితాః॥
గృహీతచిత్తా నో చ్చేలుః తస్మిన్ లజ్జాయితేక్షణాః।
తాసాం విజ్ఞాయ భగవాన్ స్వపాదస్పర్శకామ్యయా।
ధృతవ్రతానాం సంకల్పమాహ దామోదరోఽబలాః।
సంకల్పో విదితః సాధ్వ్యో భవతీనాం మదర్చనే।
మయాఽనుమోదితః సోఽసౌ సత్యో భవితు మర్హతి।
న మయ్యావేశితధియాంకామః కామాయ కల్పతే।
భర్జితా క్వథితా ధానాః ప్రాయో బీజాయ నేష్యతే।
యాతాఽబలా వ్రజం సిద్ధా మయేమా రంస్యథ క్షపాః
యదుద్దిశ్య వ్రతమిదం చేరు రార్యార్చనం సతీః।"

శ్రీ శుక ఉవాచ :

"ఇత్యాదిష్టా భగవతా లబ్ధకామాః కుమారికాః।
ధ్యాయన్త్యః తత్పదాంభోజం కృచ్ఛ్రాత్ నివివిశుః
వ్రజమ్॥"

కావుననే, సర్వభోక్త అయిన అగ్నివలె ఎవరును సర్వభక్షకుడు కాజాలడు. రుద్రునివలె కాలకూటభక్షణము ఎవడును చేయజాలడు. శ్రీకృష్ణునివలె గోవర్ధనపర్వతోద్ధరణము ఎవడును చేయ

జాలడు. ఆవిధముగానే చీరహరణము రాసలీలను సైతము ఎవడును ఆచరింపజాలడు. మూర్ఖత్వముతో ఎవడైనను చేసినచో అవశ్యము అతడు సత్వనాశన మగును. శ్రేష్ఠులయొక్క శాస్త్రవిరుద్ధాచరణములను ఎన్నడును అనుకరింపజనదు. కావుననే,

"యాని మేఽనవద్యాని తాని త్వయోపాస్యాని, నో ఇతరాణి।"

అని శ్రుతి ఆదేశించుచున్నది. ఒకే కార్యము ఒకరికి అదోషావహమై యుండును. మరొకరికి శాస్త్రవిరుద్ధము సావద్యమై (దోషావహమై) ఉండును. ఋషభదేవునకు అవధూతచర్య యుక్తమే. కాని ఇతరులకు ఆ చర్యయే అనుచితము. ఆరీతిగానే కృష్ణలీల కృష్ణుని కొఱకే అయి ఉన్నది, ఇతరులకొఱకు కాదు. ఇతరులైనచో గ్రహింపదగిన ఉపదేశమేమనిన, అహో ! శ్రీకృష్ణుడు ఇటువంటి పరమ సౌందర్యవతులు, నగ్న వ్రజబాలికల దర్శనము వలన నిర్వికారుడు అక్షుబ్ధ (వ్యాకులపాటులేని) మనస్కుడై ఉండెను. మనముగూడా ఇటువంటి దృఢమైన బ్రహ్మచర్యమును, మానసిక స్థైర్యమును, ఏకాగ్రతను సంపాదింపవనగును.